

రాధాకృష్ణులు

= చిత్రకారుడు : శ్రీ గుఱ్ఱం మల్లయ్య =

[శ్రీ రంగనాథన్ ఐ. సి. యస్. గారి సౌజన్యముతో]

# ప్రస్తావన

భారతేతిహాసము ననుసరించి సృష్ట్యాదిని దేవాసుర సంహారము; త్రేతాయుగమున రామరావణ యుద్ధము; ద్వాపరమున కురుక్షేత్ర సంగ్రామము; కలిలో పై మూడింటిని తలపింపజేయునది ఈక్షణము మన మందరము వీక్షించుచున్న ప్రపంచమహా సమరము. చరిత్ర కనువిచ్చినది మొదలు, క్రీస్తుశకము ఇరువదియవ శతాబ్దమున జరిగినంతటి పరిణామము అంతకు ముం దెన్నడును జరిగియుండలేదు. ఇరువది సంవత్సరముల వ్యవధిలో యావత్ప్రపంచము నట్టుడికించిన మహాయుద్ధములను రెండిటిని మానవకోటి అంతకుముం దెన్నడుగాని చూచియెరుగదు. ఆధ్యాత్మికభావన లంతరించి, భౌతిక శక్తులు ప్రబలమైన తరి ప్రపంచమునం దిట్టి సంఘర్షణ మనివార్యమను వేత్తలమాట రిత్తకాదని వర్తమాన పరిస్థితులు రుజువుచేయుచున్నవి. పాశ్చాత్యలోకమున భౌతికశాస్త్రవిజ్ఞానము పరిఢవిల్లినది. ఈ విజ్ఞాన ప్రాభవముచేత మానవుడు ప్రకృతిని పిడికిటబట్ట జూచినాడు. భూమ్యంతరిక్షముల నేకముజేయుటకు యత్నించినాడు. భౌతిక సంపదల నపరిమితముగ పెంపొందించినాడు. ఆధునిక శాస్త్రవిజ్ఞానమున కసాధ్యమన్నది లేదను భ్రమను కల్పించినాడు. వీనినన్నిటిని సాధింపజాలెనుగాని సుఖమును, శాంతినిమాత్రము కోల్పోయినాడు. అరిషడ్వర్గమునకు దాసుడైనాడు. ఆత్మపదార్థమునకు దూరుడైనాడు. నిత్యానిత్య వివేచనము, సత్యప్రియత్వము, స్వార్థరాహిత్యము లంతరించి, హింసాసూయాది పాశవిక ప్రవృత్తులు ఉత్కటముగ ప్రవర్తిల్లుటనుబట్టి మానవుడు దానవుడుగా ప్రత్యక్షమగుచున్నాడు. మానవునియందు దీయాసురికసంపదను బహుముఖముల ప్రదర్శించిన ప్రముఖవ్యక్తులలో హిట్లరు, ముసోలినీలు అగ్రగణ్యులు. ఈనియంత లిరువురిలో రోమకసామ్రాజ్యమును పునరుద్ధరింపజూచిన ముసోలినీ వెలుగుమాసినది. ఇంచుమించు ప్రపంచమాతని విస్మరించినది. హిట్లరు మాత్ర మింకనూ కొనప్రాణములతో పెనగులాడుచున్నాడు. ప్రపంచాధిపత్యమునకై ఈ యుభయులు పడినపాట్లను ప్రపంచ మేనాటికిని మరువజాలదు. లోకమును ఇంతటి మహాసంక్షోభమునకు లోనుజేసిన ఈ వ్యక్తుల నికృష్టజీవితము తక్కిన పాశ్చాత్యజాతులకు నీతిగ అవునా?

విశ్వవ్యాప్తమై, అపార ధన, మాన, ప్రాణవినాశమునకు హేతుభూతమైన ఈ యాహవఫలితముగ పాశ్చాత్యపండితులు కొందరిలో కర్తవ్యతాజిజ్ఞాస జనించినమాట వాస్తవము. బుద్ధిని అంతర్ముఖముచేసుకొని వీరలు ఆత్మపరిశీలనకు గడంగుచున్నారు. ఇంతదనుక తాము నమ్మిన నాగరకత ఉత్తమ నాగరకతయేనా? తాము విశ్వసించిన విజ్ఞానము ఆత్మసుఖమునకుగాని, విశ్వశ్రేయమునకుగాని సాధనమేనా? ఈ జిజ్ఞాస, ఈ వివేచన, ఈ మీమాంస వృద్ధి అయినకొద్ది పాశ్చాత్యులలో భావపరివర్తనము కలుగుట ముమ్మాటికి నిశ్చయము. కాని, పాశ్చాత్యలోకమున ఇట్టి జిజ్ఞాసువులూ, ఇట్టి భావుకులూ చుక్కలలో చంద్రునివలె ఎక్కడనో యొక్కరున్నారుగాని యెక్కువ లేరు. తక్కిన పాశ్చాత్యప్రపంచ మీ తత్వమును తలకెక్కించుకొన జూడదు.

## చతుస్స్వాతంత్ర్యములు.

అక్షరాజ్యముల నోడించుటకుగాను అమెరికా, బ్రిటను, రష్యా లేకీభవించినవి. అట్లయ్యును, శత్రుపరాజయమువరకే గాని తదనంతర మీ యైకమత్యము స్థిరముగ నిలచు సూచనలు కనుపించుట లేదు. పోలెండు విషయములో రష్యా పట్టుదల బ్రిటను అమెరికాలకు రుచించలేదు. భవిష్యత్ప్రపంచ వ్యవస్థకు సంబంధించిన అనేక సమస్యలను గురించి బ్రిటను అమెరికాల మధ్య అవిశ్వాసము నానాటికి బలపడుచున్నది. ప్రజాస్వామ్య

సంరక్షణము, చిన్న రాజ్యముల ప్రాణరక్షణము, దుష్ట శిక్షణము మున్నగు మహోన్నత లక్ష్యములు బ్రిటను అమెరికాలను యుద్ధమునకు ప్రేరేచినవి. అంతే కాదు. బ్రిటిషు ప్రభుత్వము తరపున విన్‌స్టన్ చర్చిలును, అమెరికా సంయుక్తరాష్ట్రముల పక్షమున నిన్న మొన్న టివరకు అధ్యక్షుడై యుండిన కీ. శే. రూజ్వెల్టును సర్వమానవకోటికి చతుర్విధ స్వాతంత్ర్యములను ప్రతిపాదించు అట్లాంటికు ప్రణాళికకు సృష్టికర్తలు. భారత ఋషి ప్రోక్తములగు చతుర్విధ పురుషార్థములవలె, చర్చిల్ రూజ్వెల్టులు సూత్రీకరించిన చతుర్విధ స్వాతంత్ర్యములు మానవాభ్యుదయమునకును, జగత్కల్యాణమునకును, అత్యావశ్యకమైనవనుట కేమాత్రమును సందియము లేదు. అందుచేతనే వారు వీరను భేదము లేక యావత్ప్రపంచవాసులకు నీప్రణాళిక యన్వయించునని రూజ్వెల్టు అధ్యక్షు డాడిన మాటలకు విశ్వమంతయు తలయూపినది. పాలితప్రజాహృదయము పల్లవించినది. స్వాతంత్ర్యాభిమానులందరు సెబాసనిరి. సామ్రాజ్యవాదులకు మాత్రము సింహస్వప్నమైనది. మిత్రరాజ్యముల పెద్దలు తాము చెప్పిన సుద్దులకు బద్ధులై యుండినచో నేటి ప్రపంచ సరణి వేరొక తీరున నడచియుండెడిది. కాని, వలసరాజ్యముల విషయములో బ్రిటిషువారి దృక్పథ మిసుమంతైనను మారలేదు. అట్లాంటికు ప్రణాళిక ఇండియాకు అనువర్తించదనియును, తమకుగల దానిలో అవగింజప్రమాణమైనను తాము కోల్పోవుటకు సిద్ధముగ లేమనియును, బ్రిటిషు సామ్రాజ్యమును దివాలాతీయించుటకు తాను ప్రధానామాత్యపదవి నంగీకరించ లేదనియును మోమోటమి లేక మనసునందున్న మాటలను వెలిబుచ్చి, చర్చిలు పాలితప్రజల స్వాతంత్ర్యోత్సాహమును చల్లార్చినాడు. చర్చిలువలె రూజ్వెల్టు అంతపచ్చిగ చెప్పకున్నను, అట్లాంటికు సూచనలు ఆదర్శప్రాయములేగాని, తత్క్షణాచరణయోగ్యములు కావని ఛావుకబురు చల్లగ చెప్పినాడు. సహజముగ ధీరోదార గుణసంపన్నుడయ్యును, అధ్యక్షుడు రూజ్వెల్టు అనేక సంకటములకును, ధర్మసందేహములకును లోబడి బ్రిటిషుప్రధానిమాట కెదురాడలేక పోయియుండవచ్చును. కాని, ఆపాటి యుదారవంతుని సైతము తలవనితలంపుగ ప్రపంచ మిటీవల కోల్పోవుట కడుంగడు విచారకరము.

రష్యనుసైన్యములు బెర్లిను నగరమును ప్రవేశించినవార్త లప్పుడే వినుపించుచున్నవి. ఎంతప్రచండముగ పోరాడినను సోవియటు సైన్యవాహినులను జర్మనులు దీర్ఘకాలము నిలువరించలేరు. బెర్లినుపతనముతో జర్మనుల గుండె చలించుట నిశ్చయము. అందుచేత, ఐరోపా యుద్ధసమాప్తి వారములలోగాని, కనీస మొకటి రెండు మాసములలోగాని జరుగునని విషయజ్ఞులు నుడివినమాటలు నిజమగుట సంభవము. జపానుతోడి యుద్ధమింక మిగిలియుండినను, జర్మను యుద్ధసమాప్తితో ఐరోపాఖండమునం దనేక రాజ్యాంగసమస్య లుదయించుట నిక్కము.

## నూతనప్రపంచవ్యవస్థ

నూతన ప్రపంచవ్యవస్థను నిర్ణయించుటకును, సుస్థిరశాంతి సంస్థాపనమునకును శాన్‌ఫ్రాన్సిస్కో నగరమున మిత్రపక్షమునకు జెందిన నానా రాజ్యసమావేశ మిప్పట్టున జరుగుచున్నది. మిత్రులలో ప్రధానభాగస్వాములైన రష్యా, అమెరికాలు రెండును బ్రిటనుతోబాటు ఈ సమావేశమునందు పాల్గొనుట విశేషమని చెప్పవచ్చు. కాని, గాంధిమహాత్ము డీ మధ్య ప్రకటించినట్లు శాన్‌ఫ్రాన్సిస్కో సభయందు నిర్మింపబడబోవు నూతన ప్రపంచ వ్యవస్థను భయసందియము లప్పుడే చుట్టుముట్టి యున్నవి. ప్రధానరాజ్యములైన అమెరికా, బ్రిటను, రష్యాల మధ్యనే అన్యోన్య విశ్వాసమింతవరకు ప్రత్యక్షము కానప్పుడు తక్కిన రాజ్యముల విషయము చెప్పబని లేదు. ఐరోపా విషయములో చర్చిలు అవలంబించుచున్న విధానమును గురించి అభ్యుదయకాంక్షులగు బ్రిటిషు ప్రజల అభిమత మేమని 'పి. యం.' అను అమెరికా పత్రిక అడిగిన ప్రశ్నకు సమాధానముగ బ్రిటిషు కార్మిక పక్ష ప్రముఖుడును, విఖ్యాత ఆర్థిక, రాజయవేత్తయునగు ప్రొఫెసర్ కీ హెరాల్డు లాస్కీగా రిట్లనుచున్నారు :

"పూర్వ సాంప్రదాయమునకు చెందిన ఐరోపాఖండ వ్యవస్థను యథాతథముగ నిలబెట్టుటకుగాను చర్చిలు చేయుచున్న ప్రయత్నములవల్ల అభ్యుదయకాంక్షులగు బ్రిటిషు ప్రజలలో ఆందోళన జనించినది. దినదిన ప్రవర్ధమానమగుచున్న సోవియటు రష్యా ప్రతిష్ఠా, ప్రాబల్యముల నుండి మధ్యప్రాచ్యమును, భారతదేశమును తప్పించుటకుగాను చర్చిలు నిర్మించుచున్న సామ్రాజ్యవ్యూహముగ దీనిని పరిగణించుచున్నారు. గ్రీసులో రాజు పక్షమునకు చెందినవారిని బలపరచుట ద్వారా బ్రిటిషు టోరీవర్గమువారికి వారు ఋణపడియుండెదరనియు, మునుముందు మధ్య ప్రాచ్యమున సోవియటు ప్రాబల్యము నరికట్టుటకు తోడ్పడగలరనియు చర్చిలు ఆశించుచుండవచ్చును. అట్లాంటికు ప్రణాళికను చర్చిలు స్వయముగ తన చేతులతో ఛేదించివైచినాడు. మ్యూనిక్ ఒడంబడిక సందర్భములో బ్రిటను సంపాదించుకొనిన అపయశస్సుకు నేడు చర్చిలు మంత్రి గడించిన దుష్కీర్తి ఏ మాత్రమును తక్కువైనదికాదు. చర్చిలు గతించుచున్న ప్రపంచమునకు చెందిన వ్యక్తియేగాని ప్రభవించుటకు పరితపించుచున్న భవిష్యత్ప్రపంచమునకు చెందినవాడు కాడని అనుదినము తన చేతలవల్లి ఋజువుచేసుకొనుచున్నాడు."

అమెరికాయొక్క లక్ష్య లక్షణ వైరుధ్యమును గురించీ, అధ్యక్షుడు రూజ్వెల్టు ఆదర్శములను గురించి గూడ ప్రొఫెసరులాస్కీ ఈ క్రింది విధముగ ఆశ్చర్యమును, ఆశాభంగమును వెలిబుచ్చుచున్నాడు :

"బ్రిటిషు దేశములోనున్న మా కనేకులకు అమెరికా దేశము గోవో, వ్యాఘ్రమో తెలియుటలేదు. ప్రపంచ మింతవరకు కని విని యెరుగని అసమాన సైనికబల సహాయము గలిగిన ఆర్థిక సామ్రాజ్యతత్వమును అమెరికా వరించబోవుచున్నట్లు కనుపించుచున్నది. ఈ విధానమువలన మరొక పురుషాంతరము లోపలనే మూడవ ప్రపంచ సంగ్రామము తప్ప....అమెరికను అధ్యక్షులలో అబ్రహాంలింకనుకు పిమ్మట ప్రజాసామాన్యము యొక్క క్షేమమును కోరినవారిలో రూజ్వెల్టువంటివారు లేరు. అట్టి వ్యక్తి ధర్మమునకు దూరుడగుట సంతాపకరము."

భవిష్యద్వ్యాపార, ప్రాజాపత్యముల విషయమై బ్రిటనును గురించి ఆమెరికాకును, అమెరికానుగురించి బ్రిటనుకును ఇట్టి అనుమానము లుండుటలో ఆశ్చర్యము లేదు. ఆధునిక యంత్ర పరిశ్రమలకు అవసరమైన ముడిపదార్థములకై బ్రిటను పరదేశముల నాశ్రయింపక విధిలేదు. బొగ్గు ఒక్కటి తప్ప సమస్త వస్తు సంపద ఇతర దేశములనుంచి ఇంగ్లాండు దిగుమతి చేసుకొనవలసినదే. తమ కర్మాగారములలో తయారగు సరకులను విదేశముల కెగుమతి చేసిననే గాని ఈ ముడిపదార్థములను ఆంగ్లేయులు తమ దేశములోనికి దిగుమతి చేసుకొనుటకు వీలుండదు. యుద్ధమునకు పూర్వము బ్రిటిషువారికి గల ఎగుమతి వ్యాపారములో ప్రస్తుతము నూటికి 75 వంతులు నిలిచిపోయినది. ప్రపంచములోకెల్ల గొప్ప పెట్టుబడిదారీ ప్రభుత్వముగ నెగడబడిన బ్రిటను ప్రస్తుతము అన్ని రాజ్యములకంటె ఎక్కుడు ఋణగ్రస్థమై యుండుట విధి విలసితము గావచ్చును. కాని, అందుచేతనే ఈ యధమస్థితినుండి కోలుకొని, యుద్ధాత్పూర్వము తనకుండిన ప్రపంచాధిక్యతను పునరుద్ధరించుకొనుటకు బ్రిటను సర్వవిధముల ప్రయత్నించుట కూడ సహజము.

## వలసరాజ్య సమస్య

నూతన ప్రపంచ వ్యవస్థగాని, భవిష్యచ్ఛాంతి భద్రతలుగాని చాలవరకు యుద్ధానంతరము వలస రాజ్యములందలి స్థితిగతులపైనను, వలస రాజ్యాధిపతులవలంబించునట్టి విధానములమీదను ఆధారపడియుండు ననుటకు సందేహము లేదు. ఈ యుద్ధమారంభమైన ఐదారు సంవత్సరములలోపల వలసరాజ్యములు ఆర్థికముగను, పారిశ్రామికముగను అనేక మార్పులకు లోనైనవి. వలస రాజ్య ప్రజలపట్ల శతాబ్దముల తరబడి పాలకులవలంబించుచు వచ్చిన పురాతన విధానము లెంత పనికిమాలినవో, ఎంతటి లోపభూయిష్టములో నేటి సంగ్రామమే ఋజువుచేసినది. 'ఫార్చ్యూను' అను అమెరికను పత్రిక ప్రస్తుత యుద్ధానుభవములను గురించి ౧౯౪౪ అక్టోబరు మాసమునందిట్లు వ్రాసినది :

"ఈ సంగ్రామములో వలసరాజ్యములు కలిగిన సామ్రాజ్యములు కూలిపోయినవి. సామ్రాజ్యములు తమ పరిపాలనలో నున్న వలసరాజ్యములను సంరక్షించలేవనియు, వలసరాజ్య ప్రజలు శత్రువుల నెదిర్చి ఆత్మరక్షణచేసికొనజాలరనియు ఇందువలన స్పష్టపడుట లేదా ?"

పసిఫికు రణరంగమున జపాను నోడించి, జపాను ఆక్రమణయందున్న వలస రాజ్యములను చెఱవిడిపించి, చివరకీ వలస రాజ్య ప్రజలను వారి పాతయజమానుల చేతులకు ఒప్పజెప్పుటకేనా అమెరికా దూరప్రాచ్య యుద్ధభారమునంతను వహించుట ? అని అమెరికను పత్రికలు, ప్రజలు కొందరు ప్రశ్నించుచున్నారు. తమ యొడిలో పడగలిగిన దేమియు లేకపోగా, పైపెచ్చు అనవసరముగ వలస రాజ్య పాలితప్రజల నిష్ఠురమునకు తూటా మొందులకు గురికావలెనని అమెరికను లభిప్రాయ

పనుటలో అబ్బురములేదు. దూరప్రాచ్యమున మిత్రరాజ్యములవా రనుసరించు వలసరాజ్య విధానముతో అమెరికా ఎంతమాత్ర మేకీభవింపరాదనియును, యుద్ధమునకు పూర్వ మములనందుండిన వలసరాజ్య వ్యవస్థను పునరుద్ధరించుటకు అమెరికావారు తమ సైన్యముల నీ యుద్ధములో వినియోగించుట తగనిపని యనియును, దూరప్రాచ్య సమస్యలలో చిరకాలానుభవము గలిగిన ఓవెన్ లెట్టిమూరను ప్రవీణు డిటీవల వ్రాసియున్నాడు. వలస రాజ్య పాలనమువలన తక్కిన వారందరికంటె నెక్కువ లాభము ననుభవించుచున్న బ్రిటీషు సామ్రాజ్యవాదుల కీ మాటలెంత యరుచికరములో మన మూహింపవచ్చును. వలసరాజ్య పరిపాలన మేయొక్కరి స్వత్వముగా నుండక అంతర్జాతీయ సంస్థ యధీనమునకు లోబడి యుండవలెననెడి సూచనను లార్డు హెయిలీ మొదలైన బ్రిటిషు నాయకులప్పుడే ఆక్షేపించినారు. వలసరాజ్యములకు స్వాతంత్ర్యమొసంగుటయు బ్రిటిషు రాజ్యాంగవేత్తలకుసమ్మతము కాదు. వలస రాజ్యములలో బ్రిటిషు ఆధిపత్య మెడతెగక కొనసాగునట్లును, ఎన్నటికేని అధినివేశ ప్రతిపత్తినిమాత్ర మనుగ్రహించునట్లును హెయిలీ ప్రభువు సూచించియున్నాడు. దీనినిబట్టి, వలసరాజ్యప్రజల నుద్ధరించుట కెట్టి సంస్కరణలను బ్రిటిషుపార్లమెంటు తలపెట్టినప్పటికిని, వలసరాజ్యములను తమచేతులనుండి జారవిడుచుటకు బ్రిటిషు రాజ్యాంగవేత్తలెంతమాత్రమును అంగీకరించరని తేటపడుచున్నది. ఆసియా, ఆఫ్రికాఖండములందలి వలస రాజ్యప్రజలు పాశ్చాత్యజాతులకు బానిసలై యుండునంతవరకు,ప్రపంచమున శాంతియనునట్టిది అసంభవము.

## సామ్రాజ్యములకు స్వస్తి

బ్రిటిషు సామ్రాజ్య మంతటిలోను భారతదేశమునకు సాటి మరొకటి లేదు. భారతస్వాతంత్ర్యాశయము పట్ల అమెరికావారు చూపెడి సానుభూతి యంతయు స్వార్థవిరహితము గాకపోవచ్చును. బ్రిటనుతో బాటు తాముకూడ భారతవాణిజ్య లాభమును కాంక్షించి అమెరికనులు కొందరు భారతస్వాతంత్ర్యోద్యమమును బలపరచుచుండవచ్చును. కాని, స్వార్థరహితబుద్ధితో భారతప్రజాశయములను ఆదరించువా రమెరికాలో యనేకులున్నారని అంగీకరించక తప్పదు. పెరల్ బక్, లూయిఫిషరు, విలియం ఫిలిప్సు, కీ. శే. వెండెల్ విల్కీ మొదలైనవా రిట్టివారు. వీరొక్క ఇండియాను గురించి మాత్రమే కాదు. ప్రపంచమునందుండు పరాధీన జాతులందరి పక్షమునను పాటుబడుచున్నారు. ఆసియాఖండ మిదివరకు కనుమూసియుండినను, ప్రస్తుతము జాగ్రదవస్థయందున్నది. పదునెనిమిది, పందొమ్మిదవ శతాబ్దములలో వలె నీ యిరువదియవ శతాబ్దమున పాశ్చాత్యులు ప్రాచ్యజాతుల నణచియుంచుటసంభవము. ఈ యుద్ధముతో సామ్రాజ్యములన్నియు అంతర్ధానమగును. ఇండియా సంపూర్ణస్వాతంత్ర్యమనుభవించును. బ్రిటిషుసామ్రాజ్యమేగాదు, ఫ్రెంచి, బెల్జియం, డచ్చి సామ్రాజ్యము లన్నిటికిగూడ సింతటితో స్వస్తి. ప్రపంచ మిటుపైని అంతర్జాతీయ పరస్పర సహకారముపై నాధారపడక గత్యంతరము లేదని వీరిమతము.

## భారతపరిస్థితి

బర్మాలో చాలా భాగము పునరాక్రమింపబడుటచేత యుద్ధము భారత సరిహద్దులకు దూరమైనది. ప్రత్యక్షముగా భారతదేశమం దెచ్చటను యుద్ధము జరుగుటలేదు; నిశ్చయమే. కాని, యుద్ధమువలన కలిగెడి కష్టనిష్ఠురముల నన్నిటిని భారతీయులు భరించుచునే యున్నారు. ఆహారపదార్థములకును, కట్టుబట్టలకు సైతము ప్రజలు అంతులేని అవస్థలపాలగుచున్నారు. ప్రతివస్తువునకును కంట్రోలు. ప్రతివ్యాపారమునకును కట్టుబాటు. అధికారవర్గములలో మోసము మితిమీరినది. లంచగొండితనము లావైనది. ప్రజారోగ్యము క్షీణించినది. అంటుజాడ్యములు దేశమందంతటను ప్రబలినవి. వైద్యసహాయ మమగుటలేదు. వీనికి తోడు పన్నులభార మతిశయించినది. ప్రధాన రాష్ట్రములలో నామమాత్ర ప్రజాపరిపాలనమైనను శూన్యము. అసంఖ్యాకములైన ఆర్డినెన్సులచే దేశమింకను ఆపాదమస్త

కము బంధించబడియే యున్నది. యుద్ధపరిస్థితి యందు కొంత మార్పు కలిగినప్పటికిని, భారత ప్రజాశయముల పట్ల బ్రిటిషువైఖరి ఆవంతయేని మారలేదు. జవహర్‌లాల్, అజాద్, పట్టాభి, పటేల్, రాజేంద్రబాబు మొదలైన కాంగ్రెసు నాయకులింకను కారాగారములందు మ్రగ్గుచునే యున్నారు. కాంగ్రెసు సంస్థలపై నిషేధ మెప్పటివలెనే యున్నది. ప్రభుత్వము ప్రజానురాగమును సంపూర్ణముగ కోల్పోయినదనుటకు భారతశాసనసభలో ప్రభుత్వమునకు వాటిల్లిన పరాజయ పరంపరయే సాక్ష్యము. భారత శాసనసభ ఎన్నుకొనబడి ఏడేండ్లు దాటినది. ప్రజాభిప్రాయ మందు ప్రతిబింబించుటకు ఆటంకము లనేకము. అయినప్పటికిని, ప్రతివిషయములోను భారత ప్రభుత్వము ప్రజాప్రతినిధులచే యోడింపబడి, పరాభవము పాలైనది. భారతప్రభుత్వము పక్షమున శాన్‌ఫ్రాన్సిస్కో మహాసభకు ప్రతినిధులుగ నియమింపబడిన సర్ ఫెరోజ్‌ఖానునూనుగారు భారతదేశము అధినివేశ స్వాతంత్ర్యము నిదివరకే అనుభవించుచున్నదని ప్రగల్భములాడి భారతదేశమునందే గాక, యావత్ప్రపంచములోను పరిహాసభాజనులైనారు. బ్రిటిషు ప్రభుత్వము చేతి కీలుబొమ్మలే గాని, భారత జాతికి వీ రెంత మాత్రమును ప్రతినిధులుగారని సర్వప్రపంచమును గుర్తించినది.

## ముస్లింలీగు దౌర్బల్యము

కాంగ్రెసు ముస్లిం లీగులసఖ్యత నాశించి గాంధి మహాత్ముడు లీగునాయకుడైన జిన్నాగారితో సంప్రదింపులు జరిపినాడు. లీగునాయకుని 'ససేమిరా' వైఖరి వలన గాంధిజీ సమాధాన ప్రయత్నము విఫలమైనది. కాని, అదిమొదలుకొని దేశమున ముస్లింలీగు బల ముడిగి పోసాగినది. పంజాబులో ఫక్తు ముస్లింలీగు ప్రభుత్వమును స్థాపించుటకు జిన్నాగారి ప్రయత్నములు ఫలించలేదు. సింధుమంత్రివర్గ మనేక అంతర్నాటకములాడి యాడి, తుదకు కాంగ్రెసు ఆశ్రయముపై మనుగడ గడపుచున్నది. ఆస్సాములో ముస్లింలీగు స్వతస్సిద్ధమైన బలమును కోలుపోయి కాంగ్రెసుతో చేతులు కలిపినది. ముస్లింలీగుకు పెట్టనికోటగా పరిగణింపబడుచు వచ్చిన బెంగాలు రాష్ట్రమునందు సైతము లీగు ప్రభుత్వ మంతరించినది. అన్నిటికంటె ముఖ్యముగ, కేవల ముస్లిం ప్రాంతమైన సరిహద్దురాష్ట్రములో ముస్లింలీగు ఓడిపోయినది. కాంగ్రెసు తిరిగి అధికారములోనికి వచ్చినది. కాంగ్రెసువారే గాదు, దేశమున మరేపక్షము వారు గాని దేశవిభజన కంగీకరించుట లేదు. నిష్పక్షనాయకులచే నేర్పరుపబడిన సప్రూసమాధాన సంఘమువారు సైతము పాకిస్థానమును ఆచరణయోగ్యముగ పాటించలేదు. మహమ్మదీయులలోనే అహ్రారులు, మజ్లీలు మొదలైన వారు జిన్నాగారి నాయకత్వమును గాని, ముస్లింలీగు సిద్ధాంతములను గాని అంగీకరించ మనుచున్నారు. ఇందువలన, పై కెంత బింకముగ మాటాడుచున్నను, జిన్నాగారు తమ పెంకెతనమును వదలక విధి లేదు.

రాజప్రతినిధి వేవెల్‌ప్రభువు లండను ప్రయాణముతో భారత రాజకీయ ప్రతిష్ఠంభనాపరిష్కారమును గురించి అనేకమైన ఊహలు బయలుదేరినవి. వేవెలు ప్రభువు ఇండియాకు తిరిగి వచ్చుటతోడనే భారత స్వాతంత్ర్యమును గురించి, యుద్ధము ముగియువరకు తాత్కాలిక ప్రభుత్వనిర్మాణమును గురించి, ఒకప్రధానమైన ప్రకటన చేయగలడనియును, అందుకు ముందు కాంగ్రెసు నాయకుల విడుదల జరుగగల దనియును కొంద రుద్దేశించుచున్నారు. దీని నిజానిజములు అచిరకాలములోనే బయటపడగలవు. భారత స్వాతంత్ర్యమును నిరోధించు నంతవరకు అంతర్జాతీయ సమాఖ్యయందు బ్రిటిషు ప్రభుత్వమునకు అపయశము తప్ప దని బ్రిటిషు రాజ్యాంగవేత్త లీ సరికి కొంతవరకైన గ్రహించి యుండవలెను. ఇంగ్లండుకంటె నాలుగు వేలేండ్ల ప్రాచీనతమమైన చరిత్రను గలిగి, ఉత్తమములైన రెండుమతములకు పుట్టినిల్లయి, కళలకు విజ్ఞానమునకాదిపీఠమై, సర్వసంపత్సమృద్ధి కవకాశములు గలిగి ప్రపంచ జనాభాయందు ఐదవభాగ మున్న భారత

దేశము పరాధీనమై యుండువరకు ప్రపంచమున శాంతి సంస్థాపన అసంభవ మని బ్రిటిషు ప్రభుత్వ మెంత త్వరలో గుర్తించిన భారత దేశమునకే గాక యావత్ప్రపంచమునకుకూడ అంత మేలు.

భారత దేశము నావరించిన ఆర్థిక, రాజకీయ మాంద్యము ఆంధ్రరాష్ట్రమునందును బహుభంగుల ప్రత్యక్షమైనది. ఉత్తరవిశాఖయందు కాటకపరిస్థితు లీనాటికిని తీవ్రరూపమును దాల్చియున్నవి. యుద్ధానంతర పథకములపట్ల ఉత్సాహమును ప్రకటించుచున్న రాష్ట్రప్రభుత్వము ప్రస్తుతము దేశమున ప్రజలఅన్నవస్త్రములకు లోటులేకుండజూచుట ముఖ్యధర్మము. కస్తూరిబా నిధి సేకరణమున ఆంధ్రరాష్ట్రము తక్కిన రాష్ట్రములతోబాటు సమధికోత్సాహమును చూపినది. స్టేటు కౌన్సిలు ఎన్నికయందును, ఇటీవల కేంద్రశాసన సభ్యత్వవరణమునందును ఆంధ్రరాష్ట్రము కాంగ్రెసు అభ్యర్థులను గెలిపించి, పూర్వార్జితమైన తన జాతీయ ప్రతిష్ఠను కాపాడుకొనినది. ఆంధ్రకాంగ్రెసు నాయకుల విడుదలతో రాష్ట్రమందు నిర్మాణకార్యోత్సాహ మతిశయించినది. ఇందరు కాంగ్రెసు నాయకుల విడుదల వలన ప్రభుత్వమువారి యుద్ధప్రయత్నముల కేమాత్రమును భంగము వాటిల్లనప్పుడు, పట్టాభి, ప్రకాశం ప్రభృతులను చెఱ విడిపింపకుండుటలో ప్రభుత్వమువారి వైఖరి దురవగాహము.

ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకును భారత రాజ్యాంగ పరిష్కారమునకును ఒకవిధముగ అవినాభావ సంబంధ మేర్పరుపబడినది. కాని, ఈ లోపుగా ఆంధ్రదేశము యొక్క సర్వతోముఖాభివృద్ధికి తోడుపడగల సంస్కరణలను అమలుజరుపుట ప్రభుత్వమువారి విధాయకము. ప్రస్తుతము మదరాసు ప్రభుత్వమునందు అడ్వైజరులుగా నున్న శ్రీ శాంతి వెంకటరామమూర్తి పంతులుగారి భగీరథప్రయత్నమువలన తుంగభద్ర ప్రాజెక్టు ఈనాటికి కార్యరూపము దాల్చినది. పోలవరము, గండికోట, మాచ్ ఖండు ప్రాజెక్టులకింక విఘ్నేశ్వరపూజ యైనను జరుగలేదు. నాగార్జునకొండ శిల్పసంపదను భారత ప్రభుత్వము తొలుత ఆంధ్రభూమినుంచి తొలగింపజూచినది. ఆంధ్ర దేశమంతయు అట్టుడికినట్టుడికినది. విశ్వప్రయత్నము చేసిన పిమ్మటగాని ప్రభుత్వమువారు తమ ప్రయత్నమును విరమించుకొనలేదు. ఎన్నియో సంవత్సరములనుండి ఆందోళనచేయుచుండినను ఆంధ్రుల కింతవరకు ప్రత్యేక రేడియో కేంద్ర మేర్పడి యుండలేదు. ఆంధ్రరాష్ట్రమే యుండినచో ఆంధ్రుల మొరలింతటియరణ్యరోదనములుగ పరిణమించెడివి కావు. కావున రాష్ట్రసంపాదన విషయమై ఆంధ్రులప్రమత్తులై ప్రవర్తించవలె ననియు, రాష్ట్రనిర్మాణము జరుగువరకు తమ హక్కులను సంరక్షించుకొనుటకు నిరంతరాందోళనను జరుపవలె ననియు కోరుచున్నాము. పార్థివసంవత్సరము శాంతిదాయకమై; నిఖిలవసుమతీ ప్రజకు సుఖసంధాయకము కావలెనని ఆశించుచున్నాము.

'లోకాః సమస్తాః సుఖినోభవన్తు.'



# PRECISION

PRECISION is the watch-word of efficiency in scientific apparatus. The Andhra Scientific Company, Ltd. have always put Precision and perfection in the various processes of manufacturing scientific instruments, which they offer to the public.

All apparatus made and sold by the Andhra Scientific Company, are already very popular all over India, because the Andhra Scientific Company believes in Precision, perfection and moderate prices.

ASCO

**THE SEAL OF *Accuracy-workmanship-quality***

## THE ANDHRA SCIENTIFIC COMPANY LTD.

HEAD OFFICE & WORKS
MASULIPATAM.

BLACKER'S ROAD, MOUNT ROAD
MADRAS.

NO. 1.
NICOL ROAD, BALLARD ESTATE, BOMBAY.

# కేంద్రీకరణ వికేంద్రీకరణములు

## ( Centralisation & Decentralisation )

రాజ్యాంగ వ్యవహారాలనూ, ఆర్థిక వ్యవహారాలనూ నడుపుటలో కేంద్రీకరణం, వికేంద్రీకరణం అనునవి మనం అనుసరించ తగిన విధానాలు. కొన్ని సందర్భములలో కేంద్రీకరణ విధానం, మరికొన్నిటిలో వికేంద్రీకరణవిధానం లాభకారిగా ఉండ వచ్చును. ఏ రాజ్యాంగమందును, ఏ ఆర్థిక పద్ధతియందును సంపూర్ణముగా ఈ రెండు విధానాలలో ఒక్కదానినిమాత్రమే అనుస రించడమనేది లేదు. అన్ని దేశాలలో, అన్ని కాలాలలో ఈ రెండు విధానాలూ మిశ్రితంగా ఉండేవి. ఒక్కొక్కప్పుడు ఒక్కదానికిన్ని, మరొకప్పుడు మరొకదానికిన్ని ప్రాధాన్యం ఉండడంమాత్రం కనిపిస్తున్నది.

ఒకేచోటగాని, ఒకేసంస్థలోగాని, ఒకే వ్యక్తియందుగాని అన్నిటినీ చేర్చడానికి కేంద్రీకరణ మని పేరు. రాజ్యాంగంలో ఈ చేర్చడమంటే అధికారాన్ని చేర్చడ మన్నమాట. ఆర్థికవ్యవహారాలలో ఈ చేర్చడమంటే పదార్థముల ఉత్పత్తిని చేర్చడ మన్నమాట. వ్యక్తులపై చలాయింపబడు అధికారమంతా ఒకేసంస్థలో చేర్చబడిన యెడల అధికారకేంద్రీకరణవిధానం ఏర్పడు తుంది. పలుసంస్థలలో చేర్చబడినయెడల అధికార వికేంద్రీకరణం ఏర్పడుతుంది. అదే విధంగా మన అనుభవానికి కావలసిన వస్తు సముదాయమంతా ఏదోఒక ప్రదేశంలో మాత్రమే ఉత్పత్తికావడం జరిగినయెడల ఆర్థిక కేంద్రీకరణమున్నూ, అనేకప్రదేశా లలో ఉత్పత్తిఅయినయెడల ఆర్థికవికేంద్రీ కరణమున్నూ ఏర్పడుతవి.

### - అధికార స్వరూపం -

ఈ రెండువిధానాల గుణాగుణములను విమర్శించుటకు పూర్వము "అధికారం", "ఆర్థికం" అనువాటియొక్క స్వరూప స్వభావాలను నిర్ణయించుట అత్యావశ్యకం.

అధికారమనేది సముదాయజీవితానికి—సామాజిక జీవితానికి—లక్షణం. ఈ రెండింటికీ అవినాభావసంబంధం. "అధికారం" అనేది లేనిదీ సముదాయజీవితం సాధ్యం కాదు; సముదాయ జీవితం లేనప్పుడు "అధికారం"కూడా ఉండదు.

ఇతరులను తన ఇష్టానుసారంగా నడుచునట్లు చేయగల శక్తికి "అధికారం" అని పేరు. "నాకు అతనిపై అధికారం ఉన్నది" అంటే అతనికి ఇష్టం ఉన్నా లేకపోయినా నేను చెప్పినట్లు అతడు ప్రవర్తిస్తున్నాడన్న మాట. నాకు వానిపై అధికారం ఉన్నదన్నా, వాడు నాఅధీనంలో ఉన్నాడన్నా అర్థం ఒక్కటే. "అధికారం", "అధీనం" అనునవి అన్యోన్యాశ్రయాలు. ఎవడుగాని ఏకాకిగా ఉన్నప్పుడు వీటికి అవకాశం లేదు. కొందరు ఒక సముదాయంగా (Group) ఏర్పడ్డప్పుడే అధికారానికీ, అధీనానికీ అవసరం కలుగుతుంది. పిల్లలను తమ ఇష్టప్రకారం నడిచేటట్లు చేయగల శక్తి తల్లితండ్రులకు ఉండడంచేత పిల్లలపై తల్లితండ్రులకు అధికారం ఉన్నదని చెప్పడం తటస్థిస్తున్నది. ఒక్కొక్కప్పుడు పిల్లలు చెప్పినట్లు తల్లిదండ్రులు ప్రవర్తిస్తూంటారు. అట్టి సమయాలలో అధికారం పిల్లలది; అధీనం తల్లితండ్రులది. గురువులకు శిష్యులపైనను, యజమానులకు నౌకరుల పైనను, పరిపాలకులకు ప్రజలపైనను అధికారమున్నదని మనం మామూలుగా చెప్పడం అందరికీ తెలిసినవిషయమే.

సముదాయజీవితం మానవజీవితాని కొక లక్షణం. కుటుంబం, కులం, వర్ణం, తెగ, జాతి, మతసంఘం, వృత్తిసంఘం, వినోద సంఘం మొదలైన రకరకములగు సముదాయ ములతో మనుష్యుడు సంబంధం కలవాడై ఉన్నాడు. గ్రామం, జిల్లా, రాష్ట్రం, దేశం ఇవికూడ సముదాయ జీవితాన్ని సూచించే మాటలు. మనమందరం వీటిలో అన్నిటికో, కొన్నిటికో చేరినవారముగా ఉన్నాం. వీటిమూలంగా ఏర్పడ్డ సంబంధాల సమూహమే మన ఒక్కొక్కరి జీవితం. ప్రతిరోజూనా మనం ఒంటరిగా ఉండేకాలం చాలా తక్కువ. ఇతరులతో కలిసి గడప వలసిన కాలమే ఎక్కువ.

సముదాయానికీ సముదాయానికీ గల భేదం వాటి ఉద్దేశాలనుబట్టి కలుగుతున్నది. ప్రతిసముదాయానికీ- మనం ఎరిగినా ఎరగక పోయినా- ఏవోకొన్ని ఉద్దేశాలు ఉన్నవి. సంతానోత్పత్తి, కలిగిన సంతానాన్ని ప్రాజ్ఞత వచ్చువరకు పెంచి పోషించుట - ఇదే కుటుంబం అనే సముదాయం యొక్క ఉద్దేశం. భార్యాభర్తలు, తల్లి తండ్రులు, పిల్లలు కలిసిన ఈ

= శ్రీ =
మామిడిపూడి
వెంకటరంగయ్య

సముదాయం ఈ ఉద్దేశాన్ని నెరవేర్చుకోవడంలోనే కాలం గడుపుచుండుట. ఎవరెవరు ఏవృత్తులను అనుసరించవలసిందీ, ఏ విధంగా ఆ వృత్తులను జరపవలసిందీ నిర్ణయించే ఉద్దేశంతో ఏర్పడ్డ సముదాయమే వర్ణం. శిష్యులకు మతాన్నీ, ధర్మాన్నీ ఉపదేశించే ఉద్దేశంతో ఏర్పడ్డ సముదాయమే మతపీఠం. ఇదేవిధంగా ప్రతి సముదాయంయొక్క ఉద్దేశా లేవో మనం కనుగొనవచ్చును. క్రొత్త ఉద్దేశాలను కొనసాగించుకోవలసివచ్చినప్పుడు క్రొత్త సముదాయాలూ, సంఘాలూ స్థాపితం కావడం మనం చూస్తున్నాం. కూలీల సంఘాలు, వర్తకసంఘాలు, క్లబ్బులు, క్రీడా సమాజాలు మొదలైనవి ఈకాలంలో ఎన్నో స్థాపింపబడి ఉన్నవి.

ప్రతిమనుష్యుడూ అనేకసముదాయాలతో సంబంధం కలవాడైయున్నాడు. దీనికి కారణం అతని ఉద్దేశాలు పలురకములుగా ఉండడమే. ఏ ఉద్దేశాన్నికూడా మనుష్యుడు ఒంటరిగాసాధించలేకున్నాడు. ఇతరుల సహాయం అతనికి అవసరం. మానవ జీవితమంతా అన్యోన్యాశ్రయం అని చెప్పడంలో ఉండే సత్యం ఇదే. స్వయంసంపూర్ణత్వంతో ఎవడూ పుట్టడు; ఎంతటి అభివృద్ధి గాంచినా స్వయంసంపూర్ణత్వం ఎవడికీ లభించదు.

"మనమంతా ఒకటి" అని అంటుంటాం. నిజంగా అనేకులు ఒకరుకావడం సాధ్యంకాని పని. ఎవడి శరీరం వాడిదే; ఎవడి మనస్సు వాడిదే; ఎవడి ఆత్మ వాడిదే; ఎవడి సుఖదుఃఖాలు, సంతోషాలు, విచారాలు వాడివే. అలాటప్పుడు "అందరూ ఒకటి" అని చెప్పడంలో ఉండే అర్థం ఏమిటి? ఈ ఏకత్వం ఏకోద్దేశంవల్ల ఏర్పడే సంబంధం. ఒకే ఉద్దేశం కలవారు దానిమూలాన ఆ ఉద్దేశానికి సంబంధించినంతవరకూ ఒకరవుతున్నారు. దేశంలో ఐకమత్యం లేదని మనం అప్పుడప్పుడూ విచారిస్తుంటాం. ఈ మాటకు "అందరూ సాధించగోరే ఉద్దేశం ఒకటైనాకూడా ఏర్పడలే"దని అర్థం.

సముదాయజీవితానికి అధికారం ప్రధాన లక్షణం. ఇష్టం లేకపోయినా ఇతరులు చెప్పిన ప్రకారం నడుచుకోవలసిన స్థితి ప్రతిసముదాయంలోతప్పక ఏర్పడుతున్నది. ఉద్దేశాన్ని గురించి సభ్యులలో అభిప్రాయభేదా లుండవు. ఏకోద్దేశం కలవారు కావడంచేతనే గదా అనేకులు ఒక సంఘంగానూ, సముదాయంగానూ ఏర్పడుతుండడం? కాని ఉద్దేశాన్ని నెరవేర్చుకొనుటలో మనం ఉపయోగించదగ్గ ఉపాయాలు, సాధనాలు ఎన్నో ఉండును. పిల్లలను పెంచి పెద్దవారిని చేయడమనేది కుటుంబంయొక్క ఉద్దేశం. ఈ విషయంలో భార్యాభర్తలకు ఏలాటి భేదం ఉండదు. కాని ఆ ఉద్దేశం నెరవేరడంలో భార్య పుష్టికరమైన ఆహారపదార్థాలకై ఎక్కువ ద్రవ్యము వినియోగింపగోరవచ్చును; భర్త దుస్తులపై ఎక్కువ ద్రవ్యము ఖర్చుపెట్ట గోరవచ్చును. భార్యకు ఇంగ్లీషువిద్యపై వ్యామోహమున్న, భర్తకు మాతృభాషపై వ్యామోహమున్న ఉండవచ్చును. ఈలాటి అభిప్రాయభేదములు కలిగినప్పుడు కొసకు భార్య చెప్పినట్లు భర్తయో, భర్త చెప్పినట్లు భార్యయో నడుచుకొనుట కిష్టపడినగాని సంసారం సాగదు; కుటుంబంయొక్క ఉద్దేశం నెరవేరదు. వీరి మధ్యన జరుగు వాదోపవాదాలకు హద్దు ఏర్పడవలెను. ఎల్లకాలం ఎవరి వాదమే వారిది కావడం, ఒకరు చెప్పినట్లు రెండవవారు వినకపోవడం సంభవిస్తే పిల్లలను పెంచడం, పెద్దవారిని చేయడం జరగదు. ఏ ఉద్దేశం సాధించడానికి కుటుంబం అనే సముదాయం ఏర్పడ్డదో అది అసాధ్యం కావడమే ఫలితం అవుతుంది. గనుక ఎవరో ఒకరు అధికారం వహించవలసి ఉంటుంది. అన్ని సముదాయాలలోకూడా ఇంతే. ఉద్దేశంపట్ల ఏకీభావం ఉన్నా, ఉద్దేశాన్ని సాధించడానికి ఉపయోగింపతగ్గ సాధనాల విషయంలో అభిప్రాయభేదాలు ఉండక తప్పదు. గనుక, సముదాయ వ్యవహారాలను నడుపుటలో ఎవరో ఒకరు చెప్పినట్లు తక్కినవారు ప్రవర్తించుటకు సంసిద్ధులు కావలసి యున్నది. అంటే "అధికారులు, అధీనులు" అనే భేదం ప్రతీసముదాయంలోకూడా ఏర్పడకతప్పదు. ఎల్లప్పుడూ ఒకరే అధికారులుగా ఉండవలసిన జరూరు లేదు. కాని వాదాన్ని, అభిప్రాయభేదాన్ని ఉపసంహరించి అధికారరీత్యా పనులను చక్కబెట్టుట కవకాశమున్నగాని ఏ సముదాయమూ వ్యవహరించుట సాధ్యముకాని పని. వాదోపవాదాలు జరిగినతర్వాత అధికసంఖ్యాకులు (Majority) చెప్పిన మోస్తరుగా అల్పసంఖ్యాకులు (Minority) నడుచుకొనవలెననిగాని, శిష్టులు చెప్పినట్లు తక్కినవారు నడుచుకొనవలెననిగాని, పెద్దలు చెప్పినట్లు పిన్నలు నడుచుకొనవలెననిగాని ఒక ఏర్పాటు ఉండవలెను. ఈలాటి ఏర్పాటు ఏదో ఒకటి ఉండవలసిన జరూరు ఎందుకు కలుగుచున్నదో అందరికీ తెలిసిన విషయమే. వాదం, పదిమందితో ఆలోచన—ఇదంతా ఏదో ఒక కార్యరూపాన్ని ధరించవలసి ఉంది. కార్యం, ఆచరణ ప్రధానం. కాలమంతాకూడా ఆలోచనలో గడపడం ఉద్దేశం కాదు. ఏదో ఒక పని చేయవలసివచ్చినప్పుడు ఆలోచనకు కొంత హద్దుతప్పదు. అధికసంఖ్యాకులుగాని, శిష్టులుగాని, పెద్దలుగాని సత్యాన్నీ, న్యాయాన్నీ పరిపూర్ణంగా గ్రహించారనే కారణాన్ని బట్టికాదు ఇతరులు వారు చెప్పినట్లు వినడం. ఈ చెప్పేవారుకూడా పొరబడవచ్చును. కాని ఎవరో ఒకరు చెప్పినట్లు వింటేనే గాని పనిచేయడానికి వీలుండదు. పని చేయడం ప్రధానం. గనుక అధికార రీత్యా ఏదో ఒక కార్యక్రమం ఏర్పరచవలసిన అవసరం కలుగుతున్నది. సముదాయ జీవితానికిన్నీ, అధికారానికిన్ని అవినాభావ సంబంధం ఉన్నదని చెప్పడంలో ఇదే అర్థం.

తన ఇష్టానుసారంగా ఇంకొకడు ప్రవర్తించేటట్లు చేయడంలో- అంటే ఇతరులపై అధికారం చలాయించడంలో; ఇత

కులను లొంగదీయడంలో—అనేక ఉపాయాలను ఉపయోగించవచ్చు. ప్రేమ, గౌరవం, బోధ, హేతువాదం, యుక్తి, దానం, భయం, దండం — ఇవన్నీ ఈ ఉపాయాలలో చేరతవి. తల్లిదండ్రులు పిల్లలను ప్రేమద్వారా వశం చేసుకొనుచున్నారు. పామరులపై పండితులకు గల అధికారానికి గౌరవం సాధనం. గురువులకు శిష్యులపై గల అధికారానికి "బోధ" కారణం. యజమానులకు నౌకరులపై గల అధికారానికి "దానం", "కూలి" కారణం. దుర్మార్గులకు సన్మార్గులపై గల అధికారానికి "భయం" కారణం. ఈ భేదాలనుబట్టి అధికారాన్ని రెండువిధములుగా విభాగం చేయవచ్చును. దండమే (శిక్ష) ఆధారంగా గల అధికారం—అనగా దండాధికారం; దండం, శిక్ష అనేవి ఆధారం కాని అధికారం — అనగా దండేతరాధికారం. ప్రతిసముదాయంలోనూ ఈ రెండు రకములైన అధికారాలూ అమలులో ఉండును. కాని కొన్నిట్లో దండేతరాధికారం ప్రధానంగాను, మరికొన్నిట్లో దండాధికారమే ప్రధానంగాను ఉండును. ఐచ్ఛిక (Voluntary) సంఘములలో దండేతరాధికారమే కనుపించుచుండును. నిర్బంధ సంఘములలో (Compulsory) దండాధికారము కనుపించుచుండును. ఇష్టం ఉన్నా లేకపోయినా ఏసంఘములో మనం సభ్యులుగాఉండవలసియున్నదో అవినిర్బంధ సంఘములు; మనకు ఇష్టం ఉన్నప్పుడు సభ్యులుగా ఉండడమూ, ఇష్టము తప్పినప్పుడు మానుకోవడమూ ఏ సంఘంలో వీలగునో అది ఐచ్ఛికసంఘం. క్లబ్బులు, కూలీలసంఘాలు, నాటకసమాజాలు, విద్యాశాలలు—ఇవన్నీ ఐచ్ఛికములు. విడాకులకు వీలులేని కుటుంబం, వర్ణం, రాజ్యం—ఈలాటివి నిర్బంధ సంఘాలు. ఒకప్పుడు నిర్బంధంగా ఉండినవి మరొకప్పుడు ఐచ్ఛికాలు కావచ్చును. (కుటుంబం, మతసంఘాలు అనేకదేశాలలో ఇట్టి మార్పును పొందినవి.) ఒకప్పుడు ఐచ్ఛికంగా ఉండినవి మరొకప్పుడు నిర్బంధములుగా మారవచ్చును. (కొన్ని దేశాలలో కూలీలసంఘాలు ఈ స్థితిలోకి వచ్చియున్నవి.)

ప్రస్తుత కాలంలో నిర్బంధసంఘాలన్నిటిలో అగ్రస్థానం వహించింది "రాజ్యం" అని చెప్పవచ్చును. పరిపాలకులు, ప్రజలు అను వారితో కూడిన సముదాయమునకు రాజ్యం అని పేరు. ఈ సముదాయంలోని అధికారం దండాధికారం. సామ, దాన, భేదోపాయాలను పరిపాలకులు ఉపయోగించెదరు కాని, ఈ ఉపాయాలు పనిచేయనప్పుడు దండమును ప్రయోగించి వారు ఇతరులను తమ అధీనము దుంచుకొనుచున్నారు. ఆయుధపాణులగు సైనికులు, పోలీసులు, కోర్టులు, కారాగారాలు, శిక్షాస్మృతులు—ఇవి రాజ్యానికి బాహ్యచిహ్నములు. ఇవన్నీ దండాధికారమును ప్రకటించునట్టివి. ప్రభుత్వము వహించిన దండాధికారానికి మితిమేరలు లేవు. ప్రాణహాని, మానహాని, అర్థహాని—ఎట్టి శిక్షను విధించుటకూ ప్రభుత్వం వారు సంసిద్ధులు. దండధరులందరూ యమధర్మరాజులు.

తక్కిన సముదాయాలవలెనే రాజ్యానికికూడా కొన్ని ఉద్దేశములు కలవు. వాటిని సాధించుటకు ఏర్పడ్డ సముదాయమే ఇది. ఈ ఉద్దేశములలో ప్రధానములైనవి (౧) రక్షణ, (౨) శాంతి, (౩) యోగక్షేమాభివృద్ధి. విదేశప్రభువులు దండెత్తి దేశముపై పడకుండునట్లు రక్షించుట పరిపాలకుల విధులలో మొదటిది. దండెత్తి వచ్చినవారిని పారదోలుటకు దండోపాయమే ప్రధానసాధనము. ఇదేవిధముగ దేశములోపల దుర్మార్గులనేకులు శాంతికి భంగముకలిగించుచు సన్మార్గులను కష్టములపాలు, నష్టములపాలు చేయుచుందురు. అట్టి దుర్మార్గులను దండమును ధరించి శిక్షించవలసి ఉన్నది. బాహ్యశత్రువులనుండియు, దుర్మార్గులగు అంతఃశత్రువులనుండియు ప్రజలను రక్షించుటకు దండముతప్ప మార్గాంతరము లేకపోవుటచేత రాజ్యానికి దండధారణము ప్రధానచిహ్నము. కొన్ని సందర్భములలో ప్రజల యోగక్షేమమును వృద్ధిచేయుటకుకూడ దండాధికారము ఉపకరించుచున్నది.

అధికారస్వరూపము, దాని ఆవశ్యకత, అధికార విభేదములు, రాజ్యాధికార లక్షణము ఇప్పటికి స్పష్టమైనవి. ఈ అంశముల సహాయముచేత కేంద్రీకరణ వికేంద్రీకరణ విధానములలోని లోపాలోపములను గుర్తెరుగవలసి ఉన్నది.

## – అధికార వికేంద్రీకరణం –

ఈ సందర్భములో రెండు ప్రశ్నములకు సమాధానం చెప్పవలెను. (౧) సముదాయజీవితంలో వ్యక్తిపై వహించవలసిన అధికారమంతా—దండాధికారం, దండేతరాధికారం—ప్రభుత్వమందు కేంద్రీకరింపబడవలెనా? లేక కొన్ని అధికారాలు మాత్రం ప్రభుత్వమందును, తక్కినవి ప్రభుత్వేతర సంస్థలందును విక్షిప్తమగుట మంచిదా? ఇది మొదటిప్రశ్న. (౨) ప్రభుత్వమందు సంక్రమించు అధికారము ఒకే కేంద్రమునుండి చలాయింపబడవలెనా, లేక పలుకేంద్రములనుండియా? అనగా, దేశమందు ప్రభుత్వం వారు జరుపు వ్యవహారములన్నీ ఒకే కేంద్రమునుండి జరుపబడవలెనా, లేక కొన్ని వ్యవహారములు కేంద్ర ప్రభుత్వమువలనను, కొన్ని రాష్ట్ర ప్రభుత్వములవలనను. కొన్ని స్థానిక ప్రభుత్వములవలనను జరుపబడుట మంచిదా? ఇది రెండవ ప్రశ్న.

వేదాంతులలో ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతముల విషయమున నెంతటి తీవ్రభేదము లున్నవో ప్రస్తుతకాలపు రాజ్యాంగవేత్తలలో ఈవిషయములను గురించి అంతటి తీవ్రభేదము లున్నవి. కొందరు కేంద్రీకరణవాదులు; కొందరు వికేంద్రీకరణవాదులు; కొందరు మిశ్రవాదులు. వాదం ఏలాటిదైనా ఆచరణలోమాత్రం దేశాలన్నిట్లో కూడ మిశ్రపద్ధతే ఆచరణలో ఉన్నది. కొన్నిటియందు కేంద్రీకరణానికిన్ని, మరికొన్నిటియందు వికేంద్రీకరణానికిన్ని ప్రాధాన్యాన్ని కల్పించి ఉన్నారనిమాత్రము చెప్పవచ్చును. ఈ వివాదాలలో ఈ

క్రిందివిషయములను ప్రత్యేకముగా గమనించ వలసియున్నది.

(౧) అధికారమంతా—అనగా వ్యక్తిజీవితం, సముదాయజీవితం అంతా—ప్రభుత్వపు వశీకరణం కావడం, అనగా అన్ని పనులూ భయపెట్టి చేయించడమని అర్థం. దండింపు అనే భయ మొక్కటే మానవప్రవర్తనకు మూలాధారంకావడం మనం వాంఛించతగ్గ వ్యవస్థ కాకూడదు. సామంచేత, దానంచేత చేయించతగ్గ పనులు ఎన్నో ఉన్నవి. ఎల్లప్పుడూ భయపడుచుండు వ్యక్తుల జీవితం దుఃఖభాజనమై కారాగారబద్ధుల జీవితమువలె ఉండును. తప్పనిసరియైన పనుల విషయములోనే నిర్బంధము ఉచితసాధనము. కాని, సంఘంలో జరగవలసిన పనులన్ని అట్టివికావు. కొన్ని జరుగకపోయినను ప్రమాదము లేదు. అందరూ ఒకేవిధమైన ఆహారాన్ని తినడం గాని, ఒకేవిధమైన దుస్తులు వేసుకోవడం గాని, ఒకేమతం అవలంబించడంగాని అవసరంకాదు. ఈలాటి వ్యవహారాలు ఇంకను ఎన్నో ఉన్నవి. వీటినన్నిటిని వ్యక్తుల స్వేచ్ఛకు వదలుట మంచిమార్గము. భయోపేతజీవనం కోరువారు కేంద్రీకరణవాదులు; భయరహితజీవనం అపేక్షించేవారు వికేంద్రీకరణవాదులు.

(౨) ప్రతిపనీ ప్రభుత్వంవారు దండిస్తారనే భయంచేత చేయడం సంభవిస్తే మానవజీవితం కపటంతో కూడుకొన్న దవుతుంది. దండంమూలంగా బాహ్యాచర్యలను సవరించుటకు అవకాశం కలుగునేగాని ఆంతరంగికభావాలను సర్దుబాటుచేయుటకు వీలుండదు. అందరినీ, పసువులను దొడ్డిలోకి తోలునట్లు, దేవాలయాలలోకి తోలవచ్చునుగాని భక్తితో పూజించునట్లు చేయుట దుస్సాధ్యం. భావం, భావానికి అనుగుణమైన ప్రవర్తన—త్రికరణశుద్ధి అని మనపూర్వులు చెప్పువారు—ఇదీ మనం కోరతగ్గది. నిష్కాపట్యజీవనం ఇదే. అట్టి వ్యక్తు లున్నప్పుడే ఒకరి నొకరు నమ్మడం జరుగుతుంది. మోసం, కపటం దేశంలో ప్రబలంకావడానికి అధికారమంతా ప్రభుత్వంలో కేంద్రీకరణం కావడం ఒక ప్రబల కారణం. బాహ్యాచర్యలుగాక ఆంతరంగికభావాలూ, ఉద్దేశాలూ ప్రధానమైన విషయాలన్నీ ప్రభుత్వాధికారుల వశము కాగూడదు.

(౩) అన్నివ్యవహారాలూ ప్రభుత్వంలో కేంద్రీకరణం కావడంవల్ల ఉద్యోగస్థుల సంఖ్య, వారి ప్రాబల్యం అత్యధికమై, దానిమూలంగా ప్రజలకు ఎన్నో బాధలు కలుగగలవు. ఇదివరకు తాము చెయ్యాని పనిని ఇప్పుడు ప్రభుత్వంవారు చేస్తున్నారంటే ప్రభుత్వోద్యోగస్థుల సంఖ్య హెచ్చిందన్న మాట. ఉద్యోగస్థుల స్వభావం మనకు తెలిసిందే. అధికజీతాలు పుచ్చుకోవడం, పనిని తగ్గించుకోవడం, ముఖాముఖీగా ప్రజలతో మాట్లాడి వారి కష్టసుఖాలను గమనించుటకు బదులు ప్రతి స్వల్పవిషయాన్నీ ఉత్తర ప్రత్యుత్తరములద్వారా వ్రాతమూలంగా పరిష్కారం చేయడం, సమస్తాల అభిప్రాయాల ననుసరించి అధికారులు మెలగడం, లంచగొండితనం వ్యాపించడం -- ఇదంతా సర్వసాధారణం. ఉద్యోగస్థులు ఖర్చుపెట్టు ద్రవ్యం వారి సొంత ద్రవ్యం కాదు. పన్నుల మూలంగా ప్రజలవద్దనుండి సంపాదించిన ద్రవ్యం. సొంత ద్రవ్యాన్ని ఖర్చుపెట్టడంలో చూపునట్టి శ్రద్ధ, పొదుపు ఇతరుల ద్రవ్యాన్ని ఖర్చుపెట్టడంలో చూపుట అరుదు. పదిరూపాయలతో సామాన్యగృహస్థుడు చేయు పనికి ఉద్యోగస్థులు నాలుగైదురెట్లు ఎక్కువగా ఖర్చుపెట్టడం మామూలు.

(౪) రాజ్యం అనే సముదాయానికీ, తక్కిన సముదాయాలకూ ఉండే భేదాలలో ఒకటి ఈ సందర్భంలో గమనించవలసి ఉన్నది. దేశంలో ఉండేవారందరూ రాజ్యం అనే సముదాయంలో నిర్బంధంగా చేరిఉన్నారు. చేరనివాడు ఒక్కడుకూడ లేడు. తక్కిన సముదాయాలలో ఎవరో కొందరుమాత్రమే చేరిఉన్నారు. గనుక దేశంలో ఉన్నవారందరికీ చెందిన వ్యవహారాలను మాత్రమే ప్రభుత్వాధికారులు పరిష్కరించడం సబబు. కొద్దిమందికిమాత్రమే చెందిన వ్యవహారాలలో వారు జోక్యం కలుగజేసుకోవడం ఉచితం కాదు. అనగా ఏ పనులను చేయడంవల్లగాని, చేయకపోవడంవల్లగాని దేశంలోని ప్రజలందరికీ లాభనష్టాలు కలుగునో అట్టి పనుల విషయంలోనే ప్రభుత్వంవారు జోక్యం పుచ్చుకోవడమున్నూ, తక్కినవాటిని తక్కిన సముదాయాల వశంచేయడమున్నూ మంచిపద్ధతి.

(౫) మానవజీవితానికి జంతు జీవితానికి గల భేదంకూడా ఈ సందర్భంలో మనం గుర్తించవలెను. జంతువులకు స్వేచ్ఛాభిలాష లేదు. మనుష్యుడు నడుపునట్లు నడుచుట వాటికి నైజము. మనుష్యునిలో స్వాతంత్ర్యాభిలాష ఉన్నది. తన ఇష్టప్రకారం నడుచుకోవడంవల్ల ఒక విధమైన ఆనందం, సంతోషం అతడు అనుభవిస్తున్నాడు. తాను సొంతంగా చేసే పనుల విషయంలో ఒకవిధమైన గర్వం, తృప్తి చూపిస్తున్నాడు. కొత్తవిషయాలను, పద్ధతులను కనిపెట్టుటయందు ఉత్సాహం కలవాడుగా ఉన్నాడు. సృష్టిశక్తి, నిర్మాణశక్తి అతనికి కలదు. ఈ శక్తులను ఉపయోగించుటకు అతడు ఉత్సాహపడుచుండును. ఇట్టి స్వభావం కలవాడగుటచేతనే ప్రతిమనుష్యుడూ స్వేచ్ఛను కోరుతున్నాడు. ప్రభుత్వాధికారానికి అన్నివ్యవహారాలూ లోబడడం, మనుష్యుడు చేసే ప్రతిపనీ అధికారుల అనుజ్ఞల ననుసరించి చేయడం—ఈవిధానమే ప్రాబల్యం గాంచినయెడల మానవజీవితం జంతుజీవితంవలెనే ఉండును. మనుష్యులు ఉత్కృష్టమైన మానవజీవితమును వదలి పరాధీనమైన జంతుజీవిత విధానమును స్వీకరించుట తగనిపని. కేంద్రీకరణంవల్ల ఈ ప్రమాదము తప్పక సంభవించును.

(౬) ప్రస్తుతకాలమున కొన్ని దేశములలో-జర్మనీ, ఇటలీ, స్పెయిన్, పోలెండు మొదలైన దేశములలో-ప్రాబల్యముగాంచిన రాజ్యాంగవిధాన మిట్టిదే. రషియాలోని కమ్యూనిస్టు సిద్ధాంతంకూడ ఈలాటిదే. మానవజీవితానికి సంబంధించిన వ్యవహారము

లన్నిటిపై-మతము, నీతి, విద్య, విజ్ఞానము, వినోదము, ఆహారము, విహారము, వివాహము, సంతానము మొదలగువాటిపై ప్రభుత్వమునకు అధికారముసంపూర్ణముగా నుండవలెననుటయే నియంతృ ప్రభుత్వవిధానముల లక్షణము. ఈ విషయములోనే వీటికిని, ప్రజా ప్రభుత్వ విధానానికిని ప్రధాన మైన భేదము. ప్రజల ఇష్టమువచ్చినట్లు వ్యవహరించుకొనవలసిన వ్యవహారాలు అనేకము లున్న వనిన్ని, అట్టి వాటిపై ప్రభుత్వం అధికారం వహించకూడదనిన్ని ప్రజాప్రభుత్వవాదుల వాదము. అన్ని వ్యవహారములూ ప్రభుత్వమువారి అధీనమం దుండవలె ననుట నియంతృ ప్రభుత్వవాదుల వాదము.

(౭) మనదేశపు ప్రాచీన సంప్రదాయము వికేంద్రీకరణమే. రాజులు, ప్రభుత్వాలూ ఉండినా, మానవజీవితములోని వ్యవహారములలో అనేకములు కుటుంబము, కులము, వర్ణము మొదలైన సముదాయముల ద్వారానే పరిష్కరింపబడు చుండేవి. వివాహధర్మములు, వృత్తిధర్మములు, విద్య, కులకట్టుబాట్లు వీటినన్నిటినీ నిర్ణయించే అధికారమూ, వీటికి భిన్నంగా నడిచిన వారిని శిక్షించే అధికారమూ కులపెద్ద చేతులలో ఉండేది. వ్యాపారానికి సంబంధించిన ఏర్పాటు లన్నిటినీ వర్తకశ్రేష్ఠులు చేసుకొనుచుండువారు. ఏయే వృత్తులలో పనిచేయువారు ఆయావృత్తులకు సంబంధించిన మంచిచెడ్డలను నిర్ణయించుకొనుచుండువారు. ఎక్కడ ఏలోపం ఉన్నా దానిని సవరించు బాధ్యత ప్రభుత్వమువారి దను ఈకాలపు అభిప్రాయము ఆకాలమున ఉండినది కాదు.

(౮) అధికారమంతా ప్రభుత్వమందు కేంద్రీకృతంకావడం ప్రమాదకరమని అనుకొనుటకు ఇంకను ఎన్నో కారణాలు ఉన్నవి. సామాన్యముగా అధికారాన్ని సముదాయోద్దేశాలను కొనసాగించుటకుగాక స్వలాభంకొరకు వినియోగించుకోవడం అధికారుల స్వభావము. అధికార దుర్వినియోగ మన్న మాటకు ఇదే అర్థము. మన దేశంలోని జనసామాన్యులు విద్యావంతులు కాకపోవుటచేతను, అధికారులని ఎక్కువగా భయపడువా రగుట చేతను అధికార దుర్వినియోగమునకు యెక్కువ అవకాశ మున్నది. అధికార మదము అనేకులలో కనిపించుట సర్వ సాధారణము. మదించినవాడు తన మదము వలన ఇతరులకు కలుగు కష్టనష్టములను గమనించడు. సర్వాధికారము ప్రభుత్వమందు సంక్రమించినయెడల ఈ "అధికార మదము"నకును, "అధికార దుర్వినియోగము"నకును అంతము, హద్దు ఉండవు. నిరంకుశ ప్రభుత్వము మూలమున కలుగు అపచారము లన్నియు ఇందుమూలమున కలుగును. గనుక అధికారమంతయు ప్రభుత్వములో కేంద్రీకరింపబడుట వాంఛనీయము కాదు. వికేంద్రీకరణ సిద్ధాంతమే అనుసరణీయమని చెప్పదగియున్నది.

## – రాజ్యాంగ వికేంద్రీకరణం –

మానవజీవితానికి సంబంధించిన వ్యవహారములలో కొన్నిమాత్రమే ప్రభుత్వము వారి అధీనమం దుండతగ్గవనియు, తక్కినవి ఇతరసముదాయములయొక్కయో, వ్యక్తులయొక్కయో అధీనమం దుండతగ్గవనియు పై విమర్శవలన తేలినది. ప్రభుత్వమువారి అధీనమం దుండతగ్గ వ్యవహారములన్నియు ఒక కేంద్రప్రభుత్వపరిపాలనకు లోబడి పరిపాలింపబడుట మంచిదా, లేక వాటి విషయములోకూడ వికేంద్రీకరణానికి అవకాశ మున్నదా అనే ప్రశ్నకు సమాధానం చెప్పవలసి ఉన్నది.

ప్రస్తుతము మన దేశపు పరిస్థితులను గురించి ఆలోచించిన యెడల మనపైన ప్రభుత్వమువారు వహించిన అధికారము నాలుగు కేంద్రములనుండి ప్రవహించుచున్నదని చెప్పవచ్చును. ఒకటి ఇంగ్లండులో నుండు పార్లమెంటు, దాని అధీనంలో ఉన్న ఇండియామంత్రి; రెండు ఢిల్లీలో ఉండు కేంద్రప్రభుత్వము; మూడు రాష్ట్రములోని ప్రభుత్వము; నాలుగు మునిసిపాలిటీ, జిల్లాబోర్డులతో కూడిన స్థానికప్రభుత్వము. ఈ నాలుగు సంస్థల మధ్యను మన దేశములోని రాజ్యాధికారమంతయు విక్షిప్తమైయున్నది. స్థూలంగా చూచినయెడల అధికారము వికేంద్రీకృతమైనట్లు అగుపడును.

అధికారిస్థానములు అనేకము లున్నంత మాత్రాన రాజ్యాంగవిధానం వికేంద్రీకృతమైనదని చెప్పుటకు వీలులేదు. కేంద్రీకృత వికేంద్రీకృతములు ఈ స్థానములకు గల పరస్పర సంబంధములనుబట్టి నిర్ణయమగును. యజమానునికీ, నౌకరికీ ఉన్న సంబంధమే ఈ స్థానముల కున్నయెడల రాజ్యాంగము కేంద్రీకృతమైన దని చెప్పవలసి వచ్చును. అట్లుగాక సమానహోదాలతో ఈ సంస్థలు పనిచేయుచున్న యెడల రాజ్యాంగము వికేంద్రీకృతమైన దని చెప్పదగును.

ఒకప్పుడు మన రాజ్యాంగమంతా కూడా పరిపూర్ణంగా కేంద్రీకృతమై ఉండేది. ఇండియామంత్రిఆజ్ఞలకులోబడి ఢిల్లీలోని ప్రభుత్వము, రాష్ట్రములలోని ప్రభుత్వములు నడుచుకొను చుండెడివి. టెలిగ్రాఫు ద్వారా సమాచారములు పంపుటకు వీలుకలిగిన కాలమునందుండినన్ని, దానితోపాటు పొగయోడలద్వారా రాకపోకల సౌకర్యము హెచ్చినప్పటినుండియు ఢిల్లీ ప్రభుత్వముపైన ఇండియామంత్రికి గల అధికారము మరింత వృద్ధిపొందెను. అంటే అధికారమంతా అతనిలో (అనగా ఇంగ్లండులో) కేంద్రీకృతమవుతూ వచ్చెను. ప్రతి స్వల్ప విషయంలోనూ అతని సలహా, అతని ఆజ్ఞ అవసరము కాసాగెను. కాని ఈ విధానంలోని లోపాలు రానురాను స్పష్టమయ్యెను. ఎచ్చటో ఆరువేల మైళ్ల దూరమం దుండి, ఇండియాయొక్క నిజపరిస్థితులను గురించిన యథార్థజ్ఞానములేక, దేశాన్ని పరిపాలించ ప్రయత్నించడం ప్రజలకు నష్టకర మన్న మాట స్పష్టమయ్యెను. ఈ విధానంమూలాన వ్యవహార పరిష్కారములు చాలా ఆలస్యమగుచువచ్చెను. ప్రభుత్వంవారు చేయు

చట్టములు, చట్టములను అమలులో నుంచు విధానములు ప్రజల పరిస్థితులను, ఆచారములను, సాంప్రదాయములను అనుసరించి ఉండవలెను. సహ సామాన్యసిద్ధాంతమునకు విరుద్ధముగా పరిపాలన జరుగుచుండెను.

ఇదేవిధముగా ఇండియాలోని అధికారమంతయు ఢిల్లీలోని కేంద్రప్రభుత్వ అధీనములో ఉండెను. దానియొక్క అనుజ్ఞ లేనిదే రాష్ట్రములలోని ప్రభుత్వంవారు ఏపనులను చేయడానికీ వీలులేకుండెను. పన్నులు వేయునప్పుడును, వసూలైన ధనమును ఖర్చుపెట్టునప్పుడును, చట్టములు చేయునప్పుడును, వాటిని అమలులో ఉంచునప్పుడును, ప్రజల కష్టసుఖములను విచారించు నప్పుడును, కష్టములను తొలగించునప్పుడును రాష్ట్రప్రభుత్వంవారికి ఏలాటి అధికారమూ ఉండెడిదికాదు. ప్రతివ్యవహారమునకు — ఎంత స్వల్పమైన దైనప్పటికిని— కేంద్రప్రభుత్వంవారి ఆమోదము పొందవలసియుండెను. రాష్ట్రప్రభుత్వమువారు పేరునకు ప్రభుత్వము వహించినను నిజముగా కేంద్రప్రభుత్వపు తాబేదార్లుగా నుండిరి.

ఇట్టి కేంద్రీకృతమువలన ప్రజలకు అనేక కష్టనష్టములు కలుగుచు వచ్చెను. మన దేశము విస్తీర్ణమందు చాలా గొప్పది. ఒక రాష్ట్రములోని పరిస్థితులకును, మరొకదానిలోని పరిస్థితులకును చాలా భేదము కలదు. వ్యవసాయవిధానములలోను, పరిశ్రమల విషయములలోను, రాకపోకల సౌకర్యములలోను, ఇతర ఆర్థిక అంశములలోను, ప్రజల ఆచార వ్యవహారములలోనూ ఈ భేదం కనుపిస్తున్నది. కొన్ని రాష్ట్రములు వెనుకబడినట్టివి; కొన్ని అభివృద్ధిగాంచినవి. ఇట్టి భేదము లున్నప్పుడు ఏ రాష్ట్రమునకు తగినట్లుగా ఆ రాష్ట్రమును పాలించడం, పన్నులు వేయడం, ఖర్చుపెట్టడం జరగడం సబబుగాని అన్నిరాష్ట్రాలనూ ఒకే కేంద్రమునుండి ఒకే పద్ధతిని అనుసరించి పాలించడం మంచిదికాదు. కేంద్రంలో ఉన్న అధికారులకు రాష్ట్రములనుగురించిన వివరములు తెలియవు. ఏమీ తెలియనివారు తెలిసినవారికి మార్గదర్శులు కావడం ప్రమాదకరం. కేంద్రీకృత ప్రభుత్వం అట్టి స్థితిలో ఉండేది. తొందరగా జరుగవలసిన పనులు ఆలస్యంగా జరుగుచుండేవి. ప్రజలు ఏవిషయాన్ని గురించి అయినా రాష్ట్రప్రభువుల ఎదుట మొరపెట్టుకొన్నప్పుడు వారి మొరలను ఆలకించి వారి ఇబ్బందులను తొలగించుటకు కేంద్రప్రభుత్వమువారి ఆమోదం కావలసియుండడంచేత వారిమొరలు మొరలుగానే ఉండేవి. ప్రజలకు అత్యంత దూరంలో పరిపాలకులు ఉండడంచేతే కలుగు కష్టములనన్నిటినీ అనుభవించవలసిన పరిస్థితి ఉండెను.

ఈ కష్టములను గమనించి క్రమక్రమంగా కేంద్రప్రభుత్వంవారు రాష్ట్రప్రభుత్వంవారిపైన తమకు గల అధికారాన్ని తగ్గించుకొనసాగిరి. దేశములో అంతా ఒకేవిధంగా వ్యవహరించవలసిన వ్యవహారములను మాత్రము — అనగా దేశరక్షణ, దానికి కావలసిన సిబ్బంది, విదేశములతోటి వ్యాపారము, దానికి సంబంధించిన సుంకములు, రైల్వేలు, పోస్టు, టెలిగ్రాఫు, చెలామణి, బ్యాంకీలు, శిక్షాస్మృతి మొదలైనవి— తమ అధీనంలో ఉంచుకొన్నారు. ఈవిషయాలలో రాష్ట్రానికి రాష్ట్రానికి భేదం ఉండడం నష్టకరం గనుక వీటిని కేంద్రీకృతం చేశారు. తక్కిన వ్యవహారాల విషయంలో—శాంతి, భద్రత, పోలీసు, పరిశ్రమలు, వ్యవసాయము, విద్య, జలాధారాలు, సహకారము, యోగక్షేమాభివృద్ధి సాధనములు మొదలైనవి — రాష్ట్రప్రభుత్వాలకు స్వాతంత్ర్యం కల్పించారు. గనుక ప్రస్తుతం మన ప్రభుత్వవిధానం వికేంద్రీకృత విధానం. ఫెడరల్ విధానము వికేంద్రీకృత విధానఫలితము. ప్రతిరాష్ట్రప్రభుత్వమూ కొన్ని విషయములలో సర్వస్వాతంత్ర్యం కలది అయినది. ఒకప్పుడు కేంద్రీకృతముగా ఉండిన బ్రిటిషుఇండియారాజ్యాంగవిధానం ౧౯౧౯ తర్వాత వికేంద్రీకృత మేవిధముగ అయినదో తెలుసుకొనుట చాలా అవశ్యము. ఆ పరివర్తనం గతముప్ఫైనలభైసంవత్సరాల మధ్యన జరిగినది.

“ఏప్రదేశానికి సంబంధించిన వ్యవహారాలు ఆప్రదేశంలోనే ఫైసలుకావడం మంచిది” అనే సూత్రమే వికేంద్రీకృత సిద్ధాంతానికి మూలాధారం. అట్టి వాటిని ఆ ప్రదేశానికి చెందక, దానికి బాహ్యంగా దూరంలో ఉండేవారు ఫైసలుచేయడం ప్రమాదకరం. ఈ సూత్రాన్ని ఆచరణలో పెట్టునప్పుడు కొన్ని విషయములను గమనించవలెను. ఏవ్యవహారాలు ఒక ప్రదేశానికి సంబంధించినవి, ఏవి అన్నిప్రదేశాలకు—అనగా దేశమునకంతకూ— సంబంధించినవి అని విభాగంచేయడం ఒక ప్రధానవిషయం. ఈ విభాగం చక్కగా జరిగినయెడల వికేంద్రీకరణం బాగుగా పనిచేయును.

గ్రామములలోనివారు గ్రామవ్యవహారాలను, జిల్లాలలోని వారు జిల్లావిషయాలను, పట్టణములలోనివారు పట్టణవిషయాలను స్వతంత్రంగా వ్యవహరించుపద్ధతికి స్థానికస్వపరిపాలనపద్ధతి అని పేరు. ఈ పద్ధతికూడ వికేంద్రీకరణసిద్ధాంతములో ఒక భాగము. ఇట్టిపద్ధతిలో రెండుమూడు సుగుణము లున్నవి. స్థానికప్రజలకు రాజకీయవ్యవహారములలో పాల్గొనుటకున్నూ, తమ స్థితిగతులను స్వయంగా బాగుచేసుకొనుటకున్నూ అవకాశం కలుగుతుంది. లోపా లున్నప్పుడు వాటికి తామే కారణమనిన్నీ, వాటిని పోగొట్టుటకు స్వప్రయత్నము కావలసిఉన్నదనిన్నీ వారు గ్రహిస్తారు. లోపాలను సవరించే భారం ఇతరులపై వెయ్యడం మానుతారు. పనులు జరగడానికి కావలసిన ద్రవ్యాన్ని పన్నుల మూలంగా వసూలుచేయుటకు సిద్ధపడుతారు. తాము చెల్లించిన పన్నులు తమ గ్రామసౌకర్యానికై ఖర్చుపెట్టబడుననే నమ్మకం వారికి ఉండును. ఇట్టి వికేంద్రీకరణంవల్ల ప్రజలు చైతన్యం కలవారై, రాజకీయములందు ఉత్సాహం చూపెదరు. గనుక వికేంద్రీకరణం ఎంతవరకు జరుగు

టకు వీలున్నంతవరకు జరుపుట ఉత్తమమార్గం. అధికారం ఎంత విభజితమైతే అంత మంచిది.

## — ఆర్థిక వికేంద్రీకరణం —

వికేంద్రీకరణసిద్ధాంతం రాజకీయాలలో ఎంత ప్రధానమో ఆర్థికవ్యవహారాలలో కూడ అంత ప్రధానము. రవాణాసౌకర్యాలు—రోడ్లు, రైళ్లు, బస్సులు, పొగయోడలు, ఆకాశవిమానాలు—స్వల్పముగా ఉన్న కాలాలలో ఆర్థికవ్యవహారాలన్నీ వికేంద్రీకృతములై ఉండేవి. అంటే మనకు కావలసిన ఆహారపదార్థాలు, బట్టలు, గృహపరికరములు, ఇతరపదార్థాలు మన గ్రామంలోనూ, దానికి సమీపప్రదేశాలలోనూ తయారయ్యేవి. సామాన్యంగా ప్రతిగ్రామమూ స్వయంపోషకంగా ఉండేది. ఏవో కొన్ని పదార్థాలను మాత్రము — ఉప్పు, ఇనుము మొదలైనవి — ఇతర ప్రదేశాలనుండి తెచ్చుకొనేవారు.

కాని ఇటీవలికాలంలో ఇదంతా మారిపోయింది. దూరప్రదేశాలనుండి మనకు కావలసిన పదార్థాలలో అనేకములను తెచ్చుకొనుటకు మనం అలవాటుపడ్డాం. అనేక గ్రామాలలో వ్యవసాయం జరుగుతున్నా ఆహారపదార్థాలను పండించుటకు బదులు విదేశముల కెగుమతిచేసి విశేషద్రవ్యలాభం సంపాదించుట కవకాశం గల వేరుశనగ, పొగాకు, జనుము, నూనెగింజలు మొదలైన వ్యాపారపంటలను పండించడం అలవాటు అయిపోయినది. వీటిని అమ్మి, ఆ పైకంతో దూరప్రదేశాలనుండి ఆహారపదార్థాలను కొని తెచ్చుకోవడం మామూలైనది. వికేంద్రీకరణం పోయి కేంద్రీకరణం వచ్చింది. ఆహారపదార్థాల నన్నిటిని ఏవో కొన్ని ప్రదేశాలలోమాత్రము పండించుట, తక్కిన పదార్థాలను మరికొన్ని ప్రదేశాలలో పండించుట—ఈ విభజనవిధానమే కేంద్రీకరణం. ఒక్కొక్క ప్రదేశంలో ఒకరకమైన పంటలు. వాటిని అక్కడ పండించి, ఆ పంటలను ఎక్కడెక్కడ ఉపయోగించవలసి ఉన్నదో అక్కడికి రవాణాచేయడం ప్రస్తుతకాలానికి లక్షణం. అనగా ఉత్పత్తి అంతా కేంద్రీకృతం అయిందన్నమాట. ఉత్పత్తిచేయబడ్డ పదార్థం అనుభవదార్లకు లభ్యంకావడానికి ఎందరో వర్తకులు, వ్యాపారంచేసేవారు, రవాణాచేసేవారు అవసరం అయ్యారు. పూర్వకాలంలో ప్రతిగ్రామమందును సాలెవాండ్రు, కమ్మర్లు, కుమ్మర్లు, కంసాలులు, జోళ్లుకుట్టేవారు—అన్నిరకాలవస్తువులను తయారుచేసేవారు—ఉండేవారు. ఇప్పుడిదంతా మారిపోయింది. పెద్దపెద్ద పట్ణాలలో మిల్లులందు తయారైన బట్టలను గ్రామాలకు తేవడం మామూలైంది. అనగా వస్త్రముల ఉత్పత్తి అంతా చాలావరకు పట్ణాలలో కేంద్రీకృతమైన దన్నమాట. ఈ పట్ణాలన్నీ మన దేశంలోనివి కావు. ఇంగ్లండు, అమెరికా, జపాన్, జర్మనీ మొదలైన దేశములలోని నగరములలో ఉత్పత్తి అయినవాటిని మనం మన గ్రామములకు తెచ్చుకొనుచున్నాము. మన కుమ్మర్లు తయారుచేసిన కుండలను కొనడం మాని, దూరంలో ఉండు దేశాలలోను, పట్ణాలలోను తయారైన పింగాణిసామానులను, ఇత్తడి కంచు మొదలైన లోహపు పాత్రలను కొనుచున్నాము. ఫ్యాక్టరీలలో తయారైన చెప్పులను కొనడం అలవాటు కావడంచేత గ్రామంలోని చర్మకారుల వృత్తికి భంగం కలిగింది. తక్కిన పాటకపు జనం విషయంలోకూడా ఇదే జరిగింది. ఏ గ్రామానికి ఆ గ్రామం స్వయంపోషకంగా ఉన్న విధానం మాన్పించి, దూర ప్రదేశాలనుండి మనకు కావలసిన వస్తుసామగ్రిని తెచ్చుకోవడం మనకు ప్రస్తుతం అలవాటు అయినది.

వర్తకవ్యాపారసౌకర్యాలు పెరగడం; యంత్రములద్వారా పదార్థాలను చౌకగా తయారుచేయుటకు అవకాశాలు వృద్ధి కావడం; చౌకధర లొక్కటే ప్రధాన విషయంగా మనం ఎంచడం; కూలివాండ్రకు తక్కువ కూలీలను ఇచ్చినీ, వారికి కావలసిన సౌకర్యాల నన్నిటినీ కల్పించుటకు కావలసిన ద్రవ్యమును ఖర్చుపెట్టకుండాను ఫ్యాక్టరీ యజమానులు వస్తువులను చౌకగా తయారుచేయుచున్నారన్న జ్ఞానం మనకు లేకపోవడం; ఫ్యాక్టరీలూ మిల్లులూ అన్నీ ఒకేపట్ణంలో కేంద్రీకృతం కావడంవల్ల పట్ణాలు జనసమ్మర్దం కలవై, ప్రజల ఆరోగ్యానికి, నీతికి భంగకరము లవుచున్నవను ఆలోచన మనకు లేకపోవడం; వాంఛలను పెంచుకొని, అనుభవించు పదార్థములను వృద్ధిచేసుకోవడమే నాగరికతకు చిహ్నమని మనం అనుకోవడం—ఇదంతా కూడా అర్థోత్పత్తి కేంద్రీకృతం కావడానికి హేతువులు. లాభసంపాదన ఒక్కటే మనకు ఈకాలంలో ప్రధానోద్దేశంగా ఏర్పడ్డది. అలా లాభాన్ని సంపాదించడంలో దయ, దాక్షిణ్యం, సత్యం, సౌహార్ద్రం—ఈ గుణాలన్నీ అప్రధానాలుగా ఎంచుతున్నాం. ఉత్పత్తిదార్ల లాభం ఒక్కదానినే అపేక్షించడం, అనుభవదార్లు చౌకతనం ఒక్కదానిని మాత్రమే అపేక్షించడం మనకు అలవాటు అయినది. లాభానికీ, చౌకదనానికీ ధనం ఒక్కటే మానంగా మనం భావిస్తున్నాం. ఈలాంటి పరిస్థితుల వలన ఆర్థిక వ్యవహారములు కేంద్రీకృతం కావడం సంభవించింది. పరిస్థితులలో మార్పు, మనుష్యుని మనోవైఖరియందు మార్పు—ఈమార్పులను అనుసరించి పూర్వ కాలపు గ్రామపద్ధతి మారడం, అందుచేత ఆర్థిక వికేంద్రీకరణ విధానం అదృశ్యం కావడం—ఇదంతా జరిగింది.

గ్రామాలను పునరుద్ధరించడమనేది చాలా అవశ్యమని మహాత్మాగాంధీగారున్నూ, వారి శిష్యులున్నూ ఉద్బోధం చేస్తున్నారు. వీలైనంతవరకు ప్రతిగ్రామం స్వయంపోషకం కావలెననేది వారి ఆశయం. యంత్రములు, మిల్లులు, ఫ్యాక్టరీలు—వీటిని తగ్గించడమున్నూ, ఏవో కొన్ని పదార్థములను తయారుచేయడానికి మాత్రమే వాటిని ఉపయోగించడమున్నూ వారి పునర్నిర్మాణ ప్రణాళికకు లక్షణం. అనగా వారు వికేంద్రీకరణవాదులు.

ఆర్థిక వికేంద్రీకరణం ఎంతవరకు సాధ్యము, ఎంతవరకు కాదు అనే విషయాన్ని విమర్శించుటకు ప్రస్తుతం అవకాశం లేదు. యంత్రాలను వాడడం పొరబాటా? వాటి మూలంగా నష్టాలేగాని లాభాలు లేవా? ప్రాచీనకాలపు గ్రామపద్ధతిని పునః ప్రతిష్ఠాపనచేయడం వీలయ్యేదేనా? ఈ సమస్యలన్నిటికీ సమాధానం మనం ఆలోచించవలసి ఉన్నది.

కేంద్రీకరణం అంటే ఏమిటో, వికేంద్రీకరణం అంటే ఏమిటో తెలియచేయడం మాత్రమే ఈవ్యాసంయొక్క ఉద్దేశం. ఏ పద్ధతిలోకూడా లాభాలుమాత్రమే కనుపించడం లేదు. నష్టాలుకూడా ఉన్నవి. ఒకొక్కొక్కసందర్భంలో, ఒకొక్కొక్క వ్యవహారంలో ఒకపద్ధతిన్నీ, మరొక సందర్భంలో రెండవపద్ధతిన్నీ ఆచరణయోగ్యం. ఇట్టి విశాలదృష్టితో ఈ సిద్ధాంతాలను విమర్శించడం ఉత్తమమార్గం. సత్యం అంతా ఒకే సిద్ధాంతంలో ఉన్నదనుకోవడం పొరబాటు.

---

# లోకము

= శ్రీ మేడవరపు సత్యనారాయణశాస్త్రి =

౧

దెసదెస సుగంధ మెడనెడ విసరివిసరి
కొసరి వడ్డించు చంపకప్రసవ మనిన
నెమ్మిలేదయ్యెఁ బో-తలది మ్మదేల ?
షట్పద! నితాంతదౌర్భాగ్యసరణిగాక.

౨

మఱియ కొకవేళ నెవ్వరో ముద్దరాండ్రు
సికధరించినమాత్రఁ జంపకలతాంత!
సరిపడదు నీదు పొలకువ సకలకుసుమ
సారసర్వస్వవిదున కాషట్పదునకు.

౩

చాలుఁజాలు నిఁకఁ జంపక! వగవకు,
మీశ్వరాజ్ఞ మూల మిన్నిటికిని ;
బాప! మంతెకాక పగలేల మీ? కెల
దేఁటిలోటా? నీదు నీటులోటా ?

౪

కలదనుము పూజనార్హత, కలదటనుము
పరిమళమ్మును, గలదను పసదనమ్ము ;
సరసుఁ డెలదేఁటి మేటిమెచ్చమి నొకంట
విఫల మనవచ్చు జగతి గంధఫలిబ్రతుకు.

౫

అగుదువో రసలుబ్ధుఁడ, వగుదుగాక
విశ్వసుమతారతమ్యసంవిన్మహోమ
నీవి; వైనను జంపకద్వేష మొకటి
వాటిలెఁగదోయి! తీఱని లోటు తేఁటి!

౬

వాడు లేటికిఁ జంపక! వాకొనకువె
మధుప! పెద్దల రిర్వు, రిమ్మాట వినుఁడు ;
రసికుని పొగడ్తఁ గనని దుర్జాతి యేల ?
పుడమి గుణము గ్రహింపని పుట్టువేల ?

౭

ప్రకృతివైరాన నెవ్వఁడో పశువు నింద
వఱుపనీ - గుణవంతుల పరువు సెడదు ;
షట్పదనిరాకృతము, వధూజనమనోజ్ఞ
కర్ణపూరీకృతము చంపకమ్ము సాక్షి.

౮

ప్రకృతిసౌభాగ్యసీమఁ జంపకముఁ జూచి
సహృదయుల కెల్లనెల్ల పుష్పంధయుండె
యీసడించు నదేటికో యెవ్వఁ డెఱుఁగు ?
భిన్నరుచి లోక మని యూరకున్నఁగాక.

---



మీ అభిమాన
ప్రదర్శనశాల
యందు
ప్రదర్శింప
బడుచున్నది !
చూడుడు !

---

తారాగణం:

కన్నాంబ
పుష్పవల్లి
కోటిరత్నం
శేషమాంబ
అద్దంకి
సి. యస్. ఆర్.
బందా
రఘురామయ్య
పారుపల్లి సుబ్బారావు
సత్యనారాయణ
ఆరణి.

ఫొటోగ్రఫీ:
కమల్ ఘోష్.

*

కళ:
శేఖర్.

*

సౌండ్:
రంగారావు.

*

స్టూడియో:
జెమినీ.

"చ్రమియా రిలీజ్."

Distributors for ANDHRA, CEDED & NIZAMS.

MADRAS — BEZWADA — SECUNDERABAD — GUNTAKAL.

FOR TAMILNAD & MYSORE: **NARSU PICTURES CIRCUIT, MADRAS.**





# నమస్తే

## హృదయపూర్వక ఉగాది అభినందనములు

నాకు అమూల్యమైన సహాయాన్నీ, ప్రోత్సాహాన్నీ యిచ్చిన మిత్రులకు, హితచింతకులకు, కళాప్రియులకు నూతనవత్సరము శుభసౌభాగ్యప్రదమై యొప్పుగాక యని అభిలషిస్తున్నాను. సినిమా కళకు మీ ఆశీర్వాద బలంతో నేను చేయగలిగిన కొద్ది సేవకు ఆమోదానందాలు వెలిబుచ్చే మీరు త్వరలో వేసవిలో విడుదల కానున్న సంగీతచిత్రం "త్యాగయ్య"ను ప్రోత్సహించి మీ హితకాంక్షను ఆదరమును నాపై బరపెదరు గాక.

మీ విధేయుడు,

**వి. నాగయ్య,**

సినిమా నటుడు.

# నాగార్జునకొండ శిల్పములు

## స్త్రీపురుషవిలాస విన్యాసములు

చిత్రకారుడు :

శ్రీ గుఱ్ఱం మల్లయ్య







నాగార్జునకొండ శిల్పములు - స్త్రీపురుషవిలాస విన్యాసములు









# ఉపశ్రుతి

❀

శ్రీ ప్రయాగ కోదండరామశాస్త్రి

బౌద్ధ భిక్షుకు వాక్కున బయలు వడిన
స్వరము స్వరమై విపంచికి పట్టు వడియె;
పరమ కరుణారసము జాలు వారి, బీట
వారిన తెనుంగు నాడు తొల్కారు గురిసె—

౨

వీణ తీగలు రసమయా వేశమునను
పర మెరుంగని మమతలో మురిసి పోయె;
శాంతి సంగీతములు దిగ్దిగంతములను
తరపి వెన్నెల వన్నెలై మురిసి పోయె —

౩

కంటికిని రెప్పకును మధ్య గాచి యున్న
బుద్ధ భగవానుని పవిత్ర మూర్తి లోన
విశ్వ సందర్శనము జెంది, ప్రేమ గీతి
కే విపంచి యుపశ్రుతు లీన లేదు? —

౪

ఎవ్వని చూపులో ప్రతిఫలించిన దీ యసమానతా భరం,
బెవ్వని లోన నీరయిన దీ మత మౌఢ్యపు చట్టబండయే,
ఎవ్వని వాక్కులో ప్రతి నదించిన దీ ప్రళయోన్ముఖాముఖం,
బెవ్వని బాటలోన పయనించిన దభ్యుదయాంధ్ర మంతయున్—

౫

ఎవని పదమ్ము నంటి స్రవియించిన దాత్మలలో దయారసం,
బెవని పదమ్ము నంటి వికసించిన దిందు కళా విలాస, మిం
కెవని పదమ్ము నంటి విలసిల్లిన దెల్ల జగత్తు, బుద్ధుడా
ప్రవిమల మూర్తి - నూతన విభాత విభా విభ వాను భావుడున్—

౬

దీపిక లెత్తినాడు, జగతీ తమస్సుల వెలిగించినాడు; ప్రో
ద్దీపితమైన జాతి ప్రగతిస్థితి సూత్ర్న కళా జగత్తులో
రూపము లెత్తినాడు, తన రూపములో నొక శాంత్య లోకి కో
ద్దీపనగన్న జాతి ప్రగతి స్థితికిః గతి యాద్యో నెయ్యేక —

౭

కదలు చున్నట్టి కాల చక్రంపు కోర
నమలి మ్రింగిన నీ వికాసమును; మరల
కాల వాహినిలో కళల్ గలిసిపోయి,
వెలుగు లే పశ్చిమాశనో విశ్రమించె —

౮

కటిక సాంప్రదాయంపు చీకటుల లోన
నొడ లెరుంగక నిదురించు చున్న యెడల
మనల మేల్కొల్పి, స్వాతంత్ర్యమునకు గాంధి
మాల్కొలిపినాడు; చైతన్య మొల్కినాడు! —

౯

ధనిక దౌర్జన్య జన్య నిదాఘమునను
నీరసములు నిర్జీవముల్ నీరసమ్ము
లైన వీణలు వాని దయా రసార్ద్రి
దృక్కు లందు తంత్రులు సవరించు కొనియె —

౧౦

బుద్ధ దేవుని కరుణా ప్రపూర్ణ మైన
శాంత్యహింసా ప్రబోధ మా శాంతములకు
పంచి పెట్టిన కరుణా తపస్వి, భార
తీయ హృదయస్థ దివ్య దీధితి యతండు —

౧౧

అతడు లోకపు కడగండ్ల కడలి బడలి
ముతుక కొల్లాయి గుడ్డలో ముడిగి నాడు;
అతడు సాతంత్ర్య శాంతుల కంది పొంది
విశ్వ విజ్ఞాన వీథిలో వెలిగినాడు! —

౧౨

అతని మృదులాతి మృదుల హృదంతరమున
పలలిత భావన మ్మంకురించి నదియొ,
అల లలలు గాను రేగి తీగెలు గదల్చి
అదె విపంచీ ప్రపంచితంబై రహించె —

సుప్రసిద్ధమైన కొన్ని

# కేరళ సబ్బులు

| | |
|---|---|
| వెల్లింగటన్ సబ్బు | - సువాసన సబ్బులరాణి. |
| చందన సబ్బు | - చల్లగా, హాయిగా, పరిమళభరితముగా నుండును. |
| వేప సబ్బు | - వేపనూనె కలిసినది - నిజమైన చర్మపోషణి. |
| గులాబి సబ్బు | - తియ్యని పరిమళముతో అప్పుడే కోసితెచ్చిన పువ్వులను స్ఫురింపజేయుచుండును. |
| లవెండర్, కోల్‌టార్, శాండల్ బాత్‌లెట్, ,, బాత్ (పెద్దది), ,, చిన్నది | వివిధ అభిరుచులకు అనుగుణ్యముగ వివిధములగు సువాసనలు కలిగిన ఉత్తమ టాయిలెటు సబ్బులు. |
| ఫామిలీ సబ్బు | - ధర స్వల్పము, కుటుంబపు ఉపయోగమునకు తగినది. |
| షేవింగ్ సబ్బు | - బేక్‌లైటు హోల్డరులతోను అందమగు డొప్పలతోను దొరకును - క్షౌరపు సౌఖ్యమును ప్రశస్తముగ ప్రసాదించును. రీ ఫిల్లులు దొరకును. |
| షాంపూ సబ్బు | - కేశములను పరిశుభ్ర పరచుటకు ఉత్తమమైనది. |
| వెజిటాల్ సబ్బు | - పరిశుద్ధమగు వనస్పతి తైలపు సబ్బు. ఉప్పునీటిలో కూడ బాగా నురుగిచ్చును. ప్రయాణములలో ప్రశస్తముగా ఉపయోగించును. |
| వాష్‌వెల్ సబ్బు | - బట్టలకు ఉత్తమమైనది. పేరునుబట్టీ, గుణమునుబట్టీ బాగుగా ఉతుకును. |
| కోల్‌టార్ (కార్బాలిక్) సబ్బు | అంటువ్యాధుల రానీయదు, క్రిమిసంహారిణి - వైద్యశాలకు, స్నానమునకు ప్రశస్తమైనది. |
| లీఫ్ సబ్బు | - పల్చని ఖరీదైన బట్టలను ఉతుకుటకు ఆదర్శప్రాయమైనది. చిన్న తుండ్లుగా దొరకును. |
| డెంటిఫ్రిస్ | - దంతముల పరిపూర్ణ పరిశుద్ధతకు ఒక నూతనవిశేషము, అందమైన బేక్‌లైట్ భరణిలలో దొరకును. రీ ఫిల్లులు దొరకును. |

**- చెరుపుచేసే ఇతరవాటిని నిరాకరించండి -**

పశువులను చంపు సబ్బులు, టెక్స్టయిలు సబ్బులు, మెత్తటి సబ్బులు, సగ్రపుజీను సబ్బులు మొదలైనవి కూడా తయారుచేయబడుచున్నవి.

# కేరళ సోప్ ఇన్‌స్టిట్యూటు, కాలికట్.

# పేరు

## ఒకవిషయము





# కనిపెట్టి వేలకొలది శిశువులను రక్షించిరి



ఇతర శాఖలలో వలె వైద్యమునందును మానవకోటికి ఆరోగ్యమునకును, క్షేమమునకును అత్యావసరముగు విషయములలో ప్రత్యేకకృషి చేయుటలో తమ జీవితమంతయు సర్పించినవారున్నారు. వైద్యశాస్త్రాభివృద్ధికి ఎవరికృషి అమూల్యమైనదో, అట్టి ఈ 'అమృత వ్యక్తుల' పట్టికకి జగత్ప్రసిద్ధమైన "లివర్ క్యూరు" ను కనిపెట్టిన శ్రీ జమ్మి వెంకటరమణయ్యగారి పేరు చేర్చవచ్చును.

ఈ మందు రాకపూర్వము బిడ్డలకడుపులో బల్ల పెరిగినచో అది ఏ వైద్య, పద్ధతిచేగాని నివారింప సాధ్యముకానిదిగ పరిగణింపబడుచుండెను. జమ్మివారి లివర్ క్యూర్ వైద్య ప్రపంచమున అవతరించిన నాటి ఈ ౩౬ సంవత్సరముల నుంచి వేలకొలది బిడ్డలను ఈ భయంకర వ్యాధినుంచి రక్షించినది.



మిక్కిలి ముదిరిపోయిన లివరు, స్ప్లీను జబ్బులుకూడా ఈ మహత్తర ఔషధమునకు లొంగినవని ప్రతిచోటను పేరొందిన వైద్యులు మిక్కిలి ప్రశంసించియున్నారు. అయినను వ్యాధియొక్క ప్రథమచిహ్నములు కనుపడినవెంటనే ఉపయోగించుటయే మిక్కిలి క్షేమకరము.

బిడ్డల లివరు, స్ప్లీనువ్యాధుల లక్షణములు, చికిత్సను తెల్పుపత్రములు కోరినవారికి పంపబడును.

**జమ్మి వెంకటరమణయ్య అండ్ సన్సు,**

1/1, బ్రాడీస్ రోడ్డు, మైలాపూరు, మద్రాసు.

బొంబాయి, కలకత్తా, లక్నో, బెంగుళూరు, తిరుచినాపల్లిలలోకూడా ఆఫీసులు కలవు.

## జమ్మివెంకటరమణయ్యాగారి

# లివర్ క్యూర్



మానవేతర జీవలోకములోని ఇతర సర్వ్వ ములెట్లుగను డెట్టివో మనకు తెలియదు. మన కును, వాటికిని మధ్య పెద్ద తెర ఒకటి ఉన్నది. ఆ తెరను చీల్చి ఆ సర్వ్వములను తెలుసుకొనడాని ప్రయత్నములు జరుగు చూనే ఉన్నవిగాని వాటి మర్మము విస్పష్ట ముగా గోచరించకున్నది.

మనకు మానవధర్మము ప్రస్తుత విచారణీ యాంశము. మానవుడు కేవల మానవసంఘము మధ్యనేకాక ఇతర ప్రాణ్యప్రాణి సంఘముల మధ్య జీవితమును గడుపుచున్నాడు. తక్కిన వాటికంటె మానవునికి మనస్సు అనేది ఒకటి అధికముగా ఉన్నది. తక్కినవాటి కట్టి మనస్సు ఉన్నదో లేదో తెలియదు. కొన్ని పోలికలవల్ల ఉన్నట్టే ఊహకు పొడగట్టుతుంది. కాని, అది యెట్టిదో, ఎట్టి పరిణామము కలదో తెలుసుకొనే స్థితిలో లేము.

మనస్సు విషయాధీనము. విషయము లింద్రియ గ్రాహ్యములు. ఇంద్రియాధిగతము లైన విషయములను గురించి ఆలోచించే శక్తి మనస్సున కున్నది. బాహ్యప్రపంచము లోని చరాచర వస్తువులకున్ను, మనస్సు కున్ను సన్నికర్షము కలిగినప్పుడాబాహ్య ప్రపంచ స్వరూపమును మనస్సు నిర్ణయించు కొంటుంది. ఆప్రపంచము తనకు రక్ష కమా, అపాయకరమా అని ఆలోచించు కొంటుంది. ఆత్మరక్షణమున కనుకూల మైనదానిని తనదిగా చేసుకొన ప్రయత్ని స్తుంది. దానిని సాధించలేనప్పుడు దాని కధీ నమై, విధేయమై ప్రవర్తిస్తుంది. తన కపా యకరమైనదాని నెదిరించి సాధించుకొం టుంది. అట్లు సాధింపలేనప్పుడు దాని ననేక విధములుగా తృప్తిపరుస్తూ దానినుండి దూర ముగా నుండ ప్రయత్నిస్తుంది. తన ఆలో చన కందని విషయములను గురించి రెండు విధములుగాను ప్రవర్తించుకొంటుంది. ఎట్లు ప్రవర్తించినా తుదకు ఆత్మరక్షణమే దాని ప్రవర్తనకు ప్రధానసూత్రము. ఆత్మసంతా నాభివృద్ధియే ద్వితీయసూత్రము. ఈ రెండు సూత్రములకును సంబంధించని మానవప్రవర్త

## శ్రీ చిలుకూరి నారాయణరావు

### ౧. తప్పు

'తప్పు' అనే పదము వైదిక,సంస్కృత 'దభ్' శబ్దభవము. దీనికి మహారాష్ట్రీ ప్రాకృతములో 'దభ్భో', అపభ్రంశప్రాకృత ములో 'దబ్బు', పైశాచీ ప్రాకృతములో 'తప్పు' అని రూపములు.

'తప్పు' అనే పదమే పోలినీషియను భాషలలోను, తూర్పుదీవులు, ఆస్ట్రేలియా భాషలలోను 'తబు' అనే రూపముతో కన బడుతున్నది.

ప్రతీ మానవుడున్ను ఆచారాధీనుడు. సంఘమును విడిచి అతడు ప్రత్యేకముగా జీవించలేడు. కొబట్టి తానున్న సంఘపు కట్టుబొట్లకు లోబడి అతడు ప్రవర్తించ వలెను.

మానవసమూహము సంఘముల సమూ హము. ప్రత్యేక మానవు డెట్లు వ్యక్తియో, అతనికి సంబంధించిన ప్రత్యేకసంఘమున్ను ప్రత్యేకవ్యక్తియే. మానవసంఘము ప్రత్యేక సంఘములకు భిన్నముగా ఉండదు. వాటి సమష్టియే మానవసంఘము.

చిన్న సంఘములు పెద్ద సంఘముగా కలియవచ్చును. కాని, ప్రతీ చిన్న సంఘ మున్ను తన వ్యక్తిత్వమును విడిచిపెట్టదు. ఆ చిన్నసంఘపు వ్యక్తిత్వమే అందులోని ప్రత్యేకమానవుని వ్యక్తిత్వమున్ను. ప్రత్యేక మానవుని వ్యక్తిత్వమునకున్ను, ఆతడున్న చిన్నసంఘపు వ్యక్తిత్వమునకున్ను అభేదము. తుట్టతుదకు ప్రత్యేక వ్యక్తులున్న చిన్న సంఘమునకే ప్రాధాన్యము. అది అంతర్భూ తమై ఉన్న పెద్దసంఘపు కట్టుబొట్లు సామా న్యము లౌతవి. చిన్నసంఘములలో విశేష ముగా ఉన్న కట్టుబొట్లే తుదకు మానవుని సంఘముతో బంధించేవి.

ఆ చిన్న సంఘములోను కులముల కట్టు బొట్లు విశేషబంధములను కల్పిస్తవి. కుల బంధములకంటె వంశబంధము లింకా దృఢ ములైనవి. కొబట్టి మానవధర్మములు

౧. ప్రత్యేకవ్యక్తుల దేహపోషణధర్మములు, ౨. వారి వంశముల విశేషధర్మములు, ౩. వారి కులముల విశేషధర్మములు, ౪. వారి చిన్న సంఘముల విశేషధర్మములు, ౫. ఆ చిన్న సంఘము లంతర్భూతములై ఉన్న పెద్దసంఘ ముల విశేషధర్మములు, ౬. తుదకు సాధా రణ మానవధర్మములు అని ఒకదాని ధర్మము లొకదానికి లోబడి, తక్కినవాటిని అతి క్రమించకుండా ఉంటవి.

మానవధర్మము లేవైనా తుట్టతుదకు తక్కిన జంతుజాలమునకు వలెనే ఆత్మరక్ష ణము ప్రధాన సూత్రముగాను, ఆత్మసంతా నాభివృద్ధి ద్వితీయసూత్రముగాను ఏర్పడి ఉంటవి.

నము లేదు. నాటికీ, నేటికీ, ఎప్పటికీ ప్రాణిసంసారమున కివే మూలసూత్రములు.

బాహ్యప్రపంచస్వరూపము నిర్ణయించుకోలేని అవస్థలో మానవుని కన్నీ అనుమానాలే. అనుమానము కలిగినప్పు డెట్లు సంచరించవలెనో తెలియక ముందు కీడెంచి తరువాత మేలెంచుకొనడము మనఃస్వభావము. కాబట్టి కీడు నాశంకించుకొని ఆ అజ్ఞాత ప్రపంచముపట్ల ఎట్లు సంచరించుకోవలెనో, ఎట్లు సంచరించకూడదో కొన్ని అనుభవముల నాధారముగా చేసుకొని విధినిషేధములను కల్పించుకొనడము మనస్సుకు సహజము. ఈ విధినిషేధములే మానవుల సామాన్య విశేషాచారములను ఏర్పరించేవి.

ఆచారముపట్ల విధినిషేధాలు సమస్త మానవసంఘములలోను ఉన్నవి. కాని, విధికిన్ని, నిషేధానికిన్ని గల సంబంధము నేర్పరించడము కష్టము. సూక్ష్మముగా ఆలోచిస్తే నిషేధము విధికి వ్యాఖ్యానప్రాయమైనట్లు తోస్తుంది. 'సత్యం వద', 'ధర్మం చర' అనేవి విధులు. 'అసత్యం మావద', 'అధర్మం మాచర' అనేవి నిషేధాలు. కాని, సత్యమంటే ఏమిటో, ధర్మమంటే ఏమిటో తెలియకుంటే అసత్యము, అధర్మము అనేవికూడా బోధపడవు. కాబట్టి, ఇది అసత్యము, ఇది అధర్మము అని ప్రత్యేక ప్రత్యేకముగా వివరించి వాటిని నిషేధించవలసి ఉంటుంది. ఈప్రత్యేక వివరణములే నిషేధములు.

కాబట్టి విధులు లోకములో సాధారణముగా కొంచెముగా కనిపిస్తవి. ఒకొక్క విధికి నిషేధము లనేకములుగా వుంటవి. విధుల ననుసరించి నడుచుకొంటూ ఉన్నంతకాలము మెప్పూ లేదు; అనుసరించినందువల్ల బహుమానమూ లేదు. సంఘములో గౌరవము, మనస్సుకు గోచరముకాని స్వర్గప్రాప్తి అనే ప్రయోజనా లుంటే ఉండవచ్చును. విధిని పరిపాలిస్తూ ఉన్నంతవరకు సంఘము వ్యక్తిని గురించి ఎక్కువ జోక్యము కలిగించుకోదు. కాని తదతిక్రమణము కొంచెము జరిగినా ఊరుకోదు. ఆక్షేపిస్తుంది; అతిక్రమించిన వాటిని చూచి దూరముగా ఉంచుతుంది; దండిస్తుంది; ఒకప్పుడు చంపివేస్తుంది. వాని వల్ల గోత్రముసంఘమునకు కీడు కలుగకుండా రక్షించుకొంటుంది.

ఈ విధినిషేధాలు ప్రపంచములో మానవుడు పుట్టిననాటినుంచిన్ని ప్రతి సంఘములోనూ ఉన్నవే. వీటివల్లనే వాటి నాగరికత, సంస్కృతి ఏర్పడుతుంది. వాటి ననుసరించే ఆ నాగరికతా సంస్కృతుల స్వరూపమును మన మేర్పరుచుకోగలుగుతాము.

సామాన్యముగా విధులకంటె నిషేధాలే లోకములో ఎక్కువగా ఉన్నా దృష్టి నాకర్షించేవి నిషేధాలే. నిషిద్ధాచారానుసరణమే దండనపాత్ర మవుతుంది. ప్రతీ వ్యక్తిన్ని తక్కిన వ్యక్తుల అతిక్రమణములను నిరంతరము గుర్తిస్తూ ఎప్పటికప్పుడు సంఘమునకు తెలియజేస్తూ ఉంటాడు. ప్రతీ మాటకూ, ప్రతీ నడతకూ ప్రాధాన్యమునిచ్చి, పట్టింపుచేసి, దండించి, సంఘము వ్యక్తిని తనలో నిలుపుకొన ప్రయత్నిస్తుంది. తనకు వీలుకానప్పుడు వ్యక్తిని బహిష్కరిస్తుంది. లేదా ఉదముట్టిస్తుంది.

సంఘ మెంత చిన్నదయితే నిషేధా లంత ఎక్కువగా ఉంటవి. కాబట్టి, ప్రత్యేక చిన్న సంఘాల నిషేధాల నన్నిటినీ ఒకచోట చేర్చితే వాటి సంఖ్య అనంత మౌతుంది. వాటిలో ఒకదాని కొకటి విరుద్ధములు కావచ్చును. 'అంటే తప్పు, అనకుంటే తప్పు, రాము' అంటే బూతుమాట. ఒకటే పనిని చేస్తే తప్పు, చేయకుంటే తప్పు. కాలమును బట్టి, దేశమును బట్టి, పాత్రమునుబట్టి, ఇతర విషయములను బట్టి తప్పులు కానివి కూడా తప్పు లవుతవి. ఇవికాక కొన్ని పనులు చేస్తే తప్పు. మరికొన్ని చేయకుంటే తప్పు. ఏ తప్పుకయినా ప్రత్యవాయ ముంటుంది. దీనికే 'కరణే ప్రత్యవాయము, అకరణే ప్రత్యవాయము' అంటారు. ఇదంతా ఆలోచిస్తే ఏది ఒప్పో నిర్ణయించడ మసాధ్యమవుతుంది. ప్రతీదానికిన్ని ఏదో ఒక తప్పు మాత్రము కనబడుతూనే ఉంటుంది.

నిషేధా లనేకవిధములుగా ఉంటవి. కొన్ని మతమునకు సంబంధించినవి. ఒక దేవుడో, ఒక ప్రవక్తో, ఒక ఋషియో ఆజ్ఞాపించినందువల్ల ఏర్పడేవి ఈ వర్గములో చేరుతవి. కొన్ని నీతికి సంబంధించినవి. కొన్నిటికి కారణముల నూహించుకోవచ్చును. కాని, కొన్నిటికి కారణములు కనబడవు. ఆ నిషేధాని కానిషేధమే కారణము. 'ఎందుచేత?' అని ప్రశ్నించడాని కెవ్వరికిన్ని అధికారము లేదు. ఆ నిషేధా లెందుకు పుట్టినవో ఎవ్వరికీ తెలియదు. తెలుసుకొనడమున్ను కష్టము. అది తప్పు గనుక తప్పు. అంతే. ఆయా సంఘములవారు వాటి కారణముల నడుగరు. సహజముగా అనుసరిస్తారు. అనుసరించని వారిని దండిస్తారు. అనుసరించక పోతే దండన తనంతట తానే కలిగితీరుతుందని విశ్వసిస్తారు. ఇటువంటి నిషేధాలను గురించి పాశ్చాత్యపండితులు చాలా పరిశోధన చేసినారు. వాటి తత్త్వమును తెలుసుకొనడాని కనేక విధములుగా ప్రయత్నిస్తున్నారు. దేశదేశాలలోను గల ఇట్టి నిషేధములను ఒకచోట చేర్చుతున్నారు. వర్గీకరిస్తున్నారు. వాటి కారణములను తెలుసుకొన పరిశోధనలు చేస్తున్నారు. ఆ నిషేధములకు మూలాధారమయిన మనస్తత్వమును గురించి తెలుసుకొన నపేక్షిస్తున్నారు. ఈ 'తప్పుల శాస్త్ర'మును గురించి పాశ్చాత్యదేశాలలో వేలకొలది గ్రంథాలు బయలుదేరినవి.

ఈ పరిశోధనలన్నీ మిక్కిలి అనాగరికులయిన, నాగరికతాగంధమే లేని ఆటవిక జాతులలో పరిగణింపబడే తప్పులను గురించే జరుగుతున్నవి. ఆ మొదటి అవస్థకు పోయి విచారిస్తే వీటి తత్త్వము గోచరిస్తుందేమో అనే ఆశే దీనికి కారణము. కాని, ఇట్టి తప్పులు అనాగరికజాతులలోనే కాక నాగరకజాతులలోను చరిత్రప్రసిద్ధములుగా కనబడుతున్నవి. ఆ యా దేశవాఙ్మయములను బట్టి తెలుసుకొన వీలుపడుతున్నవి. 'తప్పు'కు పర్యాయపదమైన పోలినీషియనుమాట 'తబు' అనేదానికి సంబంధించిననిషేధములు ప్రపంచమందంతటా ఉన్నవి. ప్రాచీన రోమకదేశ

ములో ఇట్టివాటిని 'సేసర్' (sacer) అనేవారు. గ్రీకులు 'అగోస్' (agos) అనేవారు. అమెరికా, ఆఫ్రికా, ఉత్తర, మధ్య ఆసియా మొదలయిన దేశాలలోని ఆయా సంఘములవారిలో ఇట్టి తప్పుల కఠినముగా ప్రచారమున్నది. 'తబు' అనేది 'తప్పు'తో సంబంధించిన పదమైనా ఇట్టి ప్రత్యేకమైన తప్పులకుమాత్రె మనవర్తింపచేసి ఇంగ్లీషువారు టాబూ (Taboo) అనే పదమును తమ భాషలోనికి తీసుకొని ఆ అర్థములో వాడుకొంటున్నారు.

'తబు' అనే పదమునకు 1. పవిత్రమైన, దైవనివేదితమైన- అనిన్నీ, 2. అపాయకరమైన, నిషిద్ధమైన, మైల అయిన-అనిన్నీ రెండు అర్థము లున్నవి. ఏట్లయినా ఇది ఆయా వస్తువులను గురించిన నిషేధములను గురించే తెలియజేస్తుంది. కొన్ని ఉదాహరణ లిస్తే ఇట్టి నిషేధాల స్వభావము తెలుస్తుంది.

కొన్ని కులాలలో ఇండ్లకు ఈతాకులు కప్పకూడదు. కొన్నికులాలవారు కొన్ని రకాల పక్షులను, జంతువులను చంపకూడదు. పల్లెటూళ్లలోనికి ఒక యింటి అల్లుడు పోతే అందరున్ను 'మా'అల్లుడు వచ్చినాడంటారు. మా అమ్మాయిని 'కాకినాడ'కు ఇచ్చినామంటారు. 'నీ భార్య ఆరోగ్యముగా ఉన్నదా' అనడానికి 'మనవాళ్లు బాగున్నారా?' అని అడుగుతారు. ఇంటివారి పేళ్లు ఇతరులతో చెప్పకూడదు. దగ్గరి బంధువులను పేళ్లతో పిలువకూడదు. తన సొంతతండ్రి కానివానిని కూడా 'నాయనా' అని పిలుస్తారు. తన్ను కన్నది కాకున్నా ఇతరస్త్రీని 'అమ్మా' అని పిలుస్తారు. అట్లే అన్నదమ్ముల వరుసలు, అక్కచెల్లెళ్ల వరుసలు, అత్తమామల వరుసలు, బావమరదుల వరుసలు, కొడుకువరుసలు కూడాను. సగోత్ర వివాహాలు కూడదు. అసవర్ణ వివాహాలు కూడదు. సమాన ప్రవర వివాహాలు కూడదు. మాతృద్రోహము మహాపాతకము. కొన్ని కులాలలో పెండ్లిఅయిన అక్కచెల్లెళ్లు అత్తవారింట ఉన్నప్పుడు అన్నదమ్ములు చూడపోయినప్పుడు [illegible] నాటిలో [illegible]కూడదు. వారికి [illegible] భోజనాదికము జరుగవలెను. పెద్దలు అన్నను పేరుతో పిలువకూడదు. అల్లుడు వస్తే అత్త లేచి వెళ్లిపోవలెను. ఆషాఢమాసములో అత్త, అల్లుడూ ఒక్కయింటిలో ఉండకూడదు. అట్లే ఆ మాసములో అత్త, కోడలూ ఒకయింటిలో ఉండకూడదు. మగడూ, పెండ్లామూ 'ఏమే? ఆఁ' 'ఏమోయ్' అనే పిల్చుకోవలెను గాని ఎక్కువ చనవుగా మాట్లాడుకోకూడదు. చక్రవర్తిగారు ప్రయాణమైతే వెంట ఒక నల్లపిల్లి కూడా ఉండాలి. అత్తను తాకకూడదు. ప్రభువులకు ఎదురుగా పోకూడదు. దేవునికిగాని, దేవతకుగాని స్వయముగా పూజచేయకూడదు. పూజారి ఒకడు కావలెను. రాజుగారికి మనవిని మంత్రిద్వారానే తెలియచేసుకోవలెను. ఎరుకుల, యానాది మొదలయిన జాతులలో ప్రసవింపబోయే స్త్రీని ఊరిబయట గుడిసెలో ఉంచవలెను. ప్రసవించిన తరువాత కొన్ని సంస్కారాలు జరిగేవరకు తల్లిని బిడ్డను ఇంటిలోనికి తేకూడదు. నిప్పును నోటితో ఊదకూడదు. దీపమును చేతితో ఆర్పకూడదు. రోటిమీద కూర్చోకూడదు. చేపలో కూర్చొని తుమ్మకూడదు. దేవుని దర్శనము చేసుకొని కొంతసేపు దేవళములో కూర్చొనిదే బయటికి రాకూడదు. విష్ణువిగ్రహమునకు గల్లేడుపువ్వులతో పూజ చేయకూడదు. జాతాశౌచ మృతాశౌచము గలవారిని తాకకూడదు. తాకినవారికి, తాకినవారిని తాకినవారికి- ఈరీతిగా అందరికీ మైలవస్తుంది. చేట బోర్లించకూడదు. పూజారివాని పంక్తిని భోంచేయకూడదు. శవమును దాటకూడదు. నిచ్చెనను చేర వేయనిదే నేలమీద ఉంచకూడదు. తుమ్ముతూ ఉంటే బయలుదేరకూడదు. శవమువద్ద ఏడ్పు రాకున్నా ఏడ్వవలెను. కూలిచ్చి అయినా ఏడ్పించవలెను తర్పణము విడుస్తూ ఏడువకూడదు. తద్దినమువద్ద ఏడువకూడదు. తననీడ నొకరు త్రొక్కనివ్వకూడదు. ఒకరి అడుగుజాడలో తన అడుగు పడనివ్వకూడదు. అమృతము పుచ్చుకోనిదే లేవకూడదు. చచ్చిన శవమును బయటవేయవలెను. మంచముమీద చచ్చిపోనీయకూడదు. ఆశీర్వదిస్తూ తలమీద చేయిపెట్టవలెను. విధవ ఆశీర్వదించకూడదు. రాజదృష్టి తనమీద పడకూడదు. ఆదివారమునాడు ఉసిరికను ఏవిధముగాను ఉపయోగించకూడదు. ఇట్లే జాతాశౌచము, మృతాశౌచము, స్పర్శాశౌచము, దృష్టిదోషము, దిగదుడుపులు, బలులు, క్షౌరము, దెయ్యాలు, దేవతలు, యజ్ఞములు, ప్రాయశ్చిత్తాలు, ఉపవాసాలు, వ్రతాలు, ముట్టుదోషము, శకునాలు, స్వప్నాలు, ఉపగ్రహులు, పక్షులు, జంతువులు, చెట్లు మొదలయిన వాటినిగురించిన సంప్రదాయాలు, ఇవీ అవీ ఏమిటి, ఎక్కడచూచినా నిషేధాలు, తప్పులు తండోపతండాలుగా కనబడుతూనే ఉంటవి.

వీటి తత్త్వమును తెలుసుకోవాలంటే పాశ్చాత్యశాస్త్రజ్ఞు లవలంబించిన పద్ధతుల ననుసరించి పరిశోధనలు సాగించాలి. ఈ విషయమై భారతవర్షములో ఎట్టి కృషిన్నీ ఇంతవరకూ జరుగలేదు. 'తప్పుల శాస్త్రము' అని ఎవరున్ను హేళన చేయనక్కరలేదు. 'తప్పులశాస్త్రము' ఏర్పడితేగాని 'ఒప్పుల శాస్త్రము' ఏర్పడడానికి వీలులేదు. ఆధునిక కాలములో 'తప్పు' అనేది లేకుండా ఉండే స్థితి అతిశీఘ్రముగా ఏర్పడుతున్నది. 'ఒప్పు' ఏదో తెలియని వ్యవస్థకూడా వచ్చిపడుతున్నది. కారణము తెలియనిదాని ననుసరిస్తే మూఢవిశ్వాసమని ఉపేక్షించే కాలము వచ్చినది. అయినా ఈ మూఢవిశ్వాసాలు మనకు అస్థిగతములై నిలిచిపోయినవి. బయటికి బడాయిగా మాట్లాడినా ఆ సమయము వచ్చినప్పుడు మనస్సులో లడాయి తప్పదు. తుదకు నిషేధమును పాటించడమున్ను తప్పదు. ఈ తప్పులకు కారణాలేవో ఉండక పోతవా అన్నంతమాత్రముచేతనూ కార్యములేదు. కారణము లేని కార్య ముండదన్నమాట సత్యమే. కాని, ఆ కారణమేమిటో తెలుసుకొనడమే శాస్త్రజ్ఞ లక్షణము.

మన మా కారణములను నరకక తెలుసుకొనవచ్చును; తెలుసుకోలేక పోవచ్చును. కాని, పరిశోధనము, అన్వేషణము, నిరంతర ప్రయత్నము- వీటిని శాస్త్రదృష్టి కల వారు విడిచిపెట్టకూడదు.

ఈ దృష్టితోనే 'కూడదు' అని ఆంధ్ర లోకములో ఉండే నిషేధాల నన్నిటినీ ఒకచోట చేర్చ నారంభించినాను. ఇందుతో వాటిలో కొన్నిటిని ప్రకటిస్తున్నాను. అవన్నీ పాశ్చాత్యశాస్త్రజ్ఞులు తప్పులని పరిశోధించే 'తబు'లు కావు. ఏవి 'తబు'లో, ఏవి కావో, అవి 'తబు'లుగా ఏర్పడడానికి కారణా లేవో, అట్టి వానితో ఇతర దేశాలలో ఉండే 'తబు' లేవో, వాటికి కారణాలేవో ముందర ఆ నిషేధములను సంగ్రహించిన తరువాత చేయవలసిన పని. ఆంధ్రదేశములో ప్రత్యేకముగా తప్పులుగా పరిగణింపబడేవాటిని ఆయా సంఘములకు సంబంధించినవాటిని నాకు పంపిస్తే తప్పుల నిఘంటువులో చేర్చుకొని ప్రకటిస్తాను. నాకు పంపినా, పంపకపోయినా, ఈ విషయమై కృషి జరుగవలసిఉన్నదని పాఠకులు గ్రహిస్తే అదే నాకు పదివేలు.

## ౨. కూడదు

అక్ష, ఆరగ్వధ, కార్పాస, కరవీర, కరంజక సమిధలను హోమమునకు వాడకూడదు.

అగ్నిని దాటకూడదు.

అగ్నిహోత్రమును నోటితో ఊదకూడదు.

అడవిలోనికి చేత కట్టెలేకుండా పోకూడదు.

అడవిలో పోతూ మాట్లాడకూడదు.

అత్తవారి అడుగకూడదు.

అన్నము, బట్ట అంగడిలో కొని ఉపయోగించకూడదు.

అపత్నీకుడు పురోహితుడుగా ఉండకూడదు.

అపత్నీకుని బ్రాహ్మణార్థానికి పిలువకూడదు.

'అభద్రో' మనకూడదు. (భద్ర మనవలెను.)

అభిఘరించనిదీ భోంచేయకూడదు.

అమావాస్యనాడు క్షౌరము చేసుకోకూడదు.

అమృతము పుచ్చుకొనిదే భోజనమువద్ద నుంచి లేవకూడదు.

అమృతము పుచ్చుకొని మళ్లీ తినకూడదు.

అమ్మవారి గుడిలో పడుకోకూడదు.

అమ్మవారు ఊళ్లో ఉన్నప్పుడు ఇంటిలో నూనెతో పిండివంటలు చేయకూడదు; ఇళ్లముంజూరులో వేపాకుకొమ్మలు దోపకుండా ఉండకూడదు; ఇంటిముందు గోడమీద బొమ్మలు వ్రాయకుండా ఉండకూడదు.

అమ్మవారున్న ఇంటి చెత్తను వీథిలో వేయకూడదు.

అమ్మవారున్న ఇంటి వా రాయిల్లు విడువరాదు.

అగటిపండు తిని నిద్ర.త్ర సకూడదు.

అరణ్యకాండమును తప్పించకుండా రామాయణము చదువకూడదు.

అరణ్యపర్వమును తప్పించకుండా భారతము చదువకూడదు.

అలంకరించుకొని పడుకోకూడదు.

అలికినచోట ముగ్గువేయకుండా విడువకూడదు.

అష్టమీ, చతుర్దశీ, పూర్ణిమా, అమావాస్యా, రవిసంక్రాంతి దినములలో తైలాభ్యంగము చేసుకోకూడదు.

అస్తమిస్తూఉన్న సూర్యుని చూడకూడదు.

ఆగ్నేయములో బావి త్రవ్వకూడదు.

ఆచమించనిదీ భోంచేయకూడదు.

ఆచార్య, ఆచార్యపుత్రుడు, ఆచార్యభార్య, దీక్షితుడు, గురువు, పిత, మాత, మాతులుడు, హితైషి, విద్వాంసుడు, మామ, పినతల్లి, మగడు- వీరి పేళ్లు నుచ్చరించకూడదు.

ఆడదానిని ఉత్తసున్న మడుగకూడదు.

ఆడది పరపురుషునికి సున్న మివ్వకూడదు.

ఆడవాళ్లు గుమ్మడికాయ తరుగకూడదు.

ఆది, మంగళ, శుక్రవారములలోను, మధ్యాహ్నము, రాత్రి, సంధ్యలలోను రావిచెట్టు మొదటికి పోకూడదు.

ఆదివారమునాడు ఉసిరిక నుపయోగించకూడదు.

ఆలుమగల మధ్యనుంచి పోకూడదు.

ఆవు నమ్మినప్పుడు పలుపు (కన్నె)నివ్వకూడదు.

ఆవును కట్టిన పలుపు (కన్నె, త్రాడు)ను దాటకూడదు.

ఆషాఢమాసములో అత్తా, అల్లుడూ ఒకచోట ఉండకూడదు.

ఆషాఢమాసములో అత్తా, కోడలూ ఒకచోట ఉండకూడదు.

ఇంటి ఆవరణలో కాకులు గుంపుగా అర్వగూడదు.

ఇంటి ఆవరణలో తీతుపపిట్ట అర్వగూడదు.

ఇంటికి ఈతాకు కప్పగూడదు.

ఇంటికి ఐమూల ఉండగూడదు.

ఇంటికి దగ్గరగా చింతచెట్టు ఉండగూడదు.

ఇంటికి నడుమ స్తంభ ముండగూడదు.

ఇంటికి బేసిదూలము లుండగూడదు.

ఇంటి కెదురుగా సందు ఉండగూడదు.

ఇంటి పెరటిలో మునగచెట్లుండగూడదు.

ఇంటిమధ్య బావి ఉండగూడదు.

ఇంటిముందర వెలగచెట్టు ఉండగూడదు.

ఇంటి ముందర స్తంభ ముండగూడదు.

ఇంటిలో ఏదుబందిముల్లు ఉంచగూడదు.

ఇంటిలోనికి వెళ్లేటప్పుడు దూలముక్రిందికి నడువగూడదు.

ఇంటిలో పలుకురాయి ఉండగూడదు.

ఇంటిలో మూడుద్వారాలు ఒక్కవరుసలో ఉండగూడదు.

ఇంటి స్తంభముల వరుస తప్పగూడదు.

ఇద్దరికి మధ్యగా నిప్పు తీసుకపోగూడదు.

ఇద్దరు బ్రాహ్మణుల మధ్యనుంచి పోగూడదు.

'ఇంద్రధనుస్సు' అనగూడదు. 'మణిధనుస్సు' అనవలెను.

ఇనుమును, బంగారమును ఒక చోట ఉంచగూడదు.

ఈనిన ఆవు మొదటిపాలు ఇతరుల కివ్వనిదే ఉపయోగించగూడదు.

ఉత్త ఉయ్యాల ఊచగూడదు.

ఉత్త ఏలకకాయలు నమలగూడదు.

ఉత్తరమువైపు తలపెట్టుకొని పడుకో కూడదు.

ఉత్తవక్కలు నమలకూడదు.

ఉదయపు ఎండను లనకు పసులనీయ కూడదు.

ఉప్పు ఎరువిచ్చి అడుగకూడదు.

ఉప్పు చేతిలో వేయ (వేయించుకో) కూడదు.

ఉప్పు క్రింద చల్లకూడదు.

ఎటు వెళ్లుతున్నావు, ఎక్కడికి వెళ్లుతున్నావు అని అడుగకూడదు.

ఎండ కెదురుగా పోకూడదు.

ఎడమకాలితో (క్రొత్తఅల్లుడు, కోడలు) ఇంటిలో ప్రవేశించకూడదు.

ఎదురుగా నిప్పు తీసుకపోకూడదు.

ఎద్దును, ఎనుమును ఒక్కకాడికి కట్ట కూడదు.

ఏలకుల పొడివేసిన పాలు త్రాగగూడదు.

ఐమూలమంచముమీద పడుకోగూడదు.

ఐమూలయింటిలో వాసము చేయగూడదు.

ఒకరి అడుగుజాడలో తన అడుగు పెట్టగూడదు.

ఒకరి నీడ తనమీద పడనీయగూడదు.

ఒక్క మంచముమీద మూడు (ఏడు) గోత్రాలవారు కూర్చోగూడదు.

ఒంటికి నూనె పూసుకొని ఏమిన్నీ తినగూడదు.

కడిగిన పాత్రలను బోర్లించకుండాఉంచగూడదు.

కడుపుతో ఉన్నవాళ్లు కూరలు తరుగగూడదు.

'కపాలము' అనగూడదు. ('భగాలము' అనవలెను.)

కప్పను చంపగూడదు.

కామదహనము నాడు పిల్లలు పల్లెర్లకు తప్పుపట్టగూడదు.

కాలితో పీటలు, కుర్చీలు మొదలయిన వాటిని లాగగూడదు.

కాలిన కుండలో నీళ్లుపోయగూడదు.

క్రీనీడలో కూర్చోగూడదు; నిలుచోగూడదు.

క్రొత్తకుండకు సున్నము తగిలించనిదే ఇంటిలోనికి తేగూడదు.

క్రొత్తకుండను తడుపనిదే ఉపయోగించగూడదు.

క్రొత్తకుండను ముందటి వాకిలినుంచి తేగూడదు.

గాడిదలచేత దున్నించగూడదు.

గుమ్మముమీద కూర్చొని తుమ్మగూడదు.

'గొడ్డుటావు' అనకూడదు. 'ధేనుభవ్య' అనవలెను.

గొర్రెల (మేకల) మందమధ్యనుంచి పోగూడదు.

గోడకు పూసిన సున్నమును తాంబూలమున కుపయోగించగూడదు.

గ్రహణమప్పుడు నీళ్లమీదను, వండిన పదార్థములమీదను దర్భలు వేయకుండ ఉంచగూడదు.

చచ్చిన పథ్నాలుగోనాడు బంధువు లింటిలో ఉండగూడదు.

చచ్చిన పథ్నాలుగోనాడు బంధువులు వెళ్లుతూ, వెళ్లుతున్నామని చెప్పగూడదు.

చచ్చినా డనకూడదు. (స్వర్గస్థుడైనా డనవలెను.)

చిన్నవారినుంచి డబ్బు చేతిలో వేయించుకోగూడదు.

చేట, జల్లెడ, దాగరు బోర్లించగూడదు.

చేటతోను, చేతితోను, బట్టతోను, నోటితోను, పిడకతోను అగ్గిని విసరగూడదు.

చేటను దాటగూడదు.

చేటలో కూర్చొని తుమ్మకూడదు.

చేటలో నిప్పులు చెరగగూడదు.

రాత్రిచంద్రుని చూడగూడదు.

తడిసిబట్టనీళ్లను పిండుపడనీయకూడదు.

పెద్దానికి వంకాయకూర వండకూడదు.

తనకు తానే క్షౌరము చేసుకోగూడదు.

తనపిడ నాకరు త్రొక్కనీయగూడదు.

తన యింటిలో తూర్పుతల; మామయింటిలో దక్షిణపుతల; మార్గమధ్యములో పడమటితల; ఉత్తరపుతలగా ఎన్నడూ పడుకోగూడదు.

తమలపాకు వేసుకోనిదే వక్క వేసుకోగూడదు.

తాటి, రావిచెట్ల నీడను దాటగూడదు.

తొడమీద కంచము (గిన్నె) పెట్టుకొని తినగూడదు.

దీపమారిన దనకూడదు. (కొండెక్కినది, ఘనమైనది అనవలెను.)

దీపమును చేతితో ఆర్పగూడదు

దీపమును నోటితో ఊదగూడదు.

దేవస్థానములో దేవుని దర్శనము చేసిన తరువాత ఒకసారి కూర్చోకుండా బయటికి రాగూడదు.

దేవాలయమున కెదురుగా ఇల్లు కట్టగూడదు.

దోసకాయ తిని నీళ్లు త్రాగగూడదు.

దోసిలితో నీళ్లు త్రాగగూడదు.

నందికొమ్ముల సందున మొదట చూడనిదీ లింగదర్శనము చేయకూడదు.

నలుగురిలో ఆవులించకూడదు.

నాగవల్లి అయిన మరునాడు పెండ్లియింటిలో బంధువులు ఉండగూడదు.

నిచ్చెన దేనికైనా చేరవేయకుండా ఉంచగూడదు.

నిప్పును దాటగూడదు.

నీటిలో నీడ చూచుకోగూడదు.

నూనె అప్పుఇచ్చి పుచ్చుకొన్నప్పుడు తక్కువ అనగూడదు.

నోటిలో బియ్యపు గింజలు వేసుకొని నమలగూడదు.

పగలు సెనగలు తినగూడదు.

పదార్థముల నొడిలో పెట్టుకొని తినగూడదు.

పరిగడుపున ముట్టునీళ్లది చంటిబిడ్డను చూడగూడదు.

పర్వదినాలలో సముద్రమును తాకగూడదు.

పసుపు, కుంకుమ, బియ్యము అయిపోనవి (లేవు) అనగూడదు. (నిండుకొన్నవి అనవలెను.)

పసుపుకుంకుమల నెరువీయగూడదు.

పసుపూ, సున్నమూ ఒకచోట ఉంచగూడదు.

పాడ్యమి చంద్రుని చూడగూడదు.

పాదముమీద పాదము వేసి తోమగూడదు.

పిల్లి ఉండేచోట చేట కొట్టగూడదు.

పీటలను గోడలకు పలకల చేరవేయగూడదు.

పెండ్లి అయిన తరువాత చైత్రమాసములో పుట్టింట ఉండగూడదు. పుష్యమాసములో అత్తింట ఉండగూడదు.

పెండ్లి పదహారుదినములదాకా పెండ్లి పందిరి తీయగూడదు.

పెద్దగుమ్మడికాయ, పెరిగినదుంపలు, శ్రీఫలము, కళింగము, ఉసిరిక వీటిని పాడ్యమినాడు తినగూడదు.

పెళ్లిళ్లలో మత్స్య కన్నము పెట్టి గారెలు చేయగూడదు.

పేడను దాటగూడదు.

ప్రయాణమైన తొమ్మిదోనాడు గమ్యస్థానము చేరగూడదు.

ప్రయాణమైన తొమ్మిదోనాడు తిరిగి యింటికి రాగూడదు.

ప్రాచిపని చేయనిదే ప్రొయ్యిలో అగ్గి వేయగూడదు.

ప్రొయ్యిమీద కూర్చోగూడదు.

ప్రొయ్యిలో నిప్పులు ఆర్పగూడదు.

బంగారమును నేలమీద పెట్టగూడదు.

బంతిపూజును (కొడిని) దాటగూడదు.

బియ్యము నమలగూడదు.

బేసి ఆకులు, పరివక్కలు ఇవ్వగూడదు.

భారతము పద్దెనిమిది పర్వములు ఇంటిలో ఉంచగూడదు.

భార్యను పేరుతో పిలువగూడదు.

భార్యపేరు నితరులకు చెప్పకూడదు.

భోంచేసి స్నానము చేయకూడదు.

మంగళవారమునాడు చింకిగుడ్డలు కుట్టగూడదు.

మగని పేరు చెప్పగూడదు.

మగవాళ్లు దీప మార్పగూడదు.

మంచముకాళ్ల కడ దిక్కున తల పెట్టుకొని పడుకోగూడదు.

మంచముకాళ్ల కడ దిక్కున నేయగూడదు.

మంచముమీద కూర్చొని భోంచేయగూడదు.

మంచముమీద చచ్చిపోనీయగూడదు.

మంచముమీద నిప్పు పెట్టగూడదు.

మంచాలక్రింద నిప్పుల కుంపటి ఉంచగూడదు.

మజ్జిగలో పాలుపోయగూడదు.

మరొక వస్తు వున్నదనవలెను గాని, అడిగిన వస్తువు లేదనగూడదు.

మర్రిఆకులో భోంచేయగూడదు.

ముఖక్షౌరము మాత్రము చేసుకోగూడదు.

ముగ్గురు బ్రాహ్మలు కలిసిపోగూడదు.

ముట్టుది ముట్టుదానిని ముట్టుకోగూడదు.

ముట్టునీళ్లనాడు కాటుక, బొట్టు పెట్టుకోగూడదు.

ముట్టునీళ్లు పోసుకొని చంటిబిడ్డలున్న యిండ్లకు పోగూడదు.

ముట్టునీళ్లు పోసుకొని చింతపండు నోటిలో వేసుకోనిదే చంటిబిడ్డను ముట్టుకోగూడదు.

ముట్టునీళ్లు పోసుకొన్ననాడు వంట చేయగూడదు.

ముఱ్ఱుపాలు త్రాగగూడదు.

మూడుజాతుల కట్టెతో మంచము చేయగూడదు.

మూడువాకిళ్లు ఎదురెదురుగా ఉండగూడదు.

మూసిన తలుపు తనంతట తెరవగూడదు.

మొలత్రాడు లేకుండా ఉండకూడదు.

మోదుగాకులలో తినకూడదు.

యక్షనాగాలయములలోను, కుమారస్వామి ఆలయములోను నిద్రించకూడదు.

రంగుబట్ట కట్టుకోకూడదు.

రాగిపాత్రలో పాలు త్రాగకూడదు; పోయకూడదు.

రాత్రి ఇంటిలో ఈల వేయకూడదు.

రాత్రి 'ఎలుకలు' అనగూడదు. ('సోములు' అనవలెను.)

రాత్రి 'కోతి' అనగూడదు; (అంటే చెవి గిల్లుకోవలెను.)

రాత్రి తేనె తినగూడదు.

రాత్రి నువ్వులు కలిసిన ఏ పదార్థమును తినగూడదు.

రాత్రి పసుపు, కుంకుమ, మజ్జిగ, సున్నము, తమలపాకులు పరులకు ఇవ్వగూడదు.

రాత్రి పువ్వులు కోయగూడదు.

రాత్రిపూట 'ఉప్పు' అనకూడదు. (సముద్రము, ఏక, విస్తరికొస అనవలెను.)

రాత్రిపూట కసవూడ్చి బయట వేయగూడదు.

రాత్రిపూట గింజలు, నీళ్లు, అన్నము, అగ్గి, పాలు, ధాన్యము, ఔషధములు ఇతరుల కివ్వకూడదు.

రాత్రిపూట పెరుగటుకులు తినకూడదు.

రాత్రిపూట పేడ ఎత్తకూడదు.

రాత్రిపూట బయటినుంచి నీళ్లు తేగూడదు.

రాత్రి పెరుగు తినకూడదు.

రాత్రి మంచము నేయకూడదు.

రాత్రి వెలగపండు తినకూడదు.

రాళ్ల సున్నమును తాంబూలములో ఉపయోగించగూడదు.

రోకలిని క్రింద పరుండబెట్టగూడదు.

రోటిని, సన్నెకంటిని, పుస్తకమును కాలితో తాకగూడదు.

రోటిమీద కూర్చొని తుమ్మగూడదు.

రోటిమీద కూర్చోగూడదు.

లవంగమును పై మొగ్గతో తినగూడదు.

'లేదు' అనకూడదు. (మరొకటి ఉన్నదనవలెను.)

వంకాయ, సొరకాయ, బూడిదగుమ్మడికాయ, పొట్లకాయ తద్దినాలకు పెట్టగూడదు.

వక్కలు చూచి ఊదనిదీ నోటిలో వేసు కోగూడదు.

వంటకోసము మరొకయింటి నిప్పు తీసుక రాగూడదు.

వంటప్రొయ్యిని అలుకనిదే నిప్పు వేయ గూడదు.

వంటప్రొయ్యిని కిరసనూనె వేసి ముట్టించ గూడదు.

వండిన గిన్నెలో నుంచే వడ్డించగూడదు.

వండిన పాత్రలో భోంచేయగూడదు.

వధూవరుల మధ్యనుంచి పోగూడదు.

వరి వేళ్లు నమలగూడదు.

విదియ (శుక్ల) చంద్రుని చూడగూడదు.

వీధిలో (గ్రామములో) ఒకయింట శవ మున్నప్పుడు ప్రొయ్యిలో నిప్పు వేయ గూడదు.

వెల్లకిల పరుండగూడదు.

'శనివారము' అనగూడదు (మందవార మనవలెను.)

శవము వస్తూవుంటే ఎదురుగా పో గూడదు.

శివనిర్మాల్యము నుపయోగించగూడదు.

శివప్రసాదము నుపయోగించగూడదు.

శివాలయమునకు ముందు, విష్ణ్వాలయము నకు వెనుక, కుమారస్వామిఆలయమునకు ప్రక్కల, దేవీ ఆలయమునకు ఏప్రక్కను ఇల్లు కట్టగూడదు.

శుక్రవారమునాడు క్రొత్త కుండలను కొనగూడదు.

శ్రాద్ధ, జన్మ, వివాహ, వ్రత, ఉపవాస దినాలలో తైలాభ్యంగము చేయగూడదు.

శ్రాద్ధపువంటలలో ఇంగువ, కరివేపాకు వాడగూడదు.

సంధ్యాకాలములో గోమూత్రము పట్ట గూడదు.

సంపుటములుగా వున్న ఏ గ్రంథమును పూర్తిగా ఇంటిలో ఉంచగూడదు.

స్త్రీలను పేరుతో పిలువగూడదు.

స్మశానము దాటివచ్చినతరువాత తిరిగి వెను కకు చూడగూడదు.

స్మశానములో ఉదకకుంభమును పగుల గొట్టి వెనుకకు చూడగూడదు.



# మంత్రములు :: యంత్రములు :: తంత్రములు

శ్రీ మల్లాది
సూర్యనారాయణశాస్త్రి

"మన్యత ఇతి మన్త్రః"—దేనిచే నద్దిష్టార్థము తెలియఁబడునో, దేనిచే నిష్టదేవత స్తుతింపఁబడునో, లేక ధ్యానింపఁబడునో, అది మంత్రము. ఈ యర్థమునే "మన్త్రో దేవాదిసాధనః" అన్న యభిజ్ఞవచనము తెలుపుచున్నది. మంత్రమందలి విషయ మెంత మహనీయమో, ఎంత పావనమో, ఆ శబ్దముకూడ నంత పవిత్రము. మంత్ర మన్న మాట చెవిని బడినంతనే యెట్టివాని హృదయమందైన నం దేదో మహత్త్వ మున్న దన్న పవిత్రభావ మేర్పడు ననుట నిజము. అది యట్టిదే. మంత్రము భరతఖండముపాలిటి మహా భాగ్యము; పరమేశ్వరప్రసాదము; ప్రాచీనార్యుల పావనజీవన నిదానము; పూర్వమహర్షుల జ్ఞాననేత్రమునకు గోచరించిన శబ్ద బ్రహ్మము; భారతీయవిద్యల కోంకారము; సకలప్రపంచ సారస్వతములకు శ్రీకారము. అదే ఋగ్యజుస్సామాత్మకము. అదే సనాత్మర్గవర్తనులు, ఇహపరచింతనులు నైన సనాతనుల శాశ్వత మైన సిరి. ఇందుకుఁ దైత్తిరీయోక్తి.

"అహే బుధ్నియ మన్త్రం మే గోపాయ
య మృషయ స్త్రైవిదా విదుః,
ఋచ స్సామాని యజూంషి
సా హి శ్రీ రమృతా సతామ్"

ఇది యిట్లు మూఁడుసంహితలకు మొత్తముగా పే రైనను, అందలి యొక్కొక్క ఋక్కును, ఒక్కొక్క వాక్యమును "మంత్ర శబ్దవాచ్యమే. అట్లే, అథర్వవేదమునకును, బహువిధదేవతోపాసనార్థము లయిన యందలి వాక్యములకును మంత్ర మనెడి సంజ్ఞయే వ్యవహరింపఁబడినది. తరువాత గోప్యమును, జప్యమును, వాంఛితార్థసాధకము నైన వర్ణము, లేక వర్ణసముదాయము మంత్రమనెడి యర్థమును, పిదప రహస్యాలోచనాద్యర్థములును సిద్ధము లైనవి.

వేదము యజ్ఞాదికర్మపర మనుట సత్యమే కాని, జ్ఞానసాధనములును, ఉపాసనార్థములు నైన మంత్రము లం దనేకములు కలవు. అందుచేతనే వేదము కర్మకాండము, జ్ఞానకాండము, ఉపాసనాకాండము నని త్రివిధముగా నున్న దని పూజ్యు లనిరి. చిత్తశాంతిదాయకము లై ముక్తిహేతువు లైన గాయత్రీ శివ విష్ణు సూర్యాదిదేవతోపాసనమంత్రములు త్రయీసిద్ధములు. ఆ మహామంత్రము లెన్ని వేల సంవత్సరములుగా, నెన్ని యుగములుగా భారతీయార్యపరంపరకుఁ గాణాచిగా వచ్చుచున్నవో యూహింపఁ జాలము. ఆ మంత్రములు కేవల మాముష్మికచింతతో నాయా దేవతల యనుగ్రహమునకు జపింపఁదగిన వను మాట సత్యమైనను, తత్తద్దేవతానుగ్రహమున మహిమయు, నైహిక సుఖమును గూడఁ బ్రాచీను లార్జింపకపోలేదు. ఇందుకు వేదములలో నెన్నో యితిహాసములు కలవు.* ఆ నాఁటి మంత్రవేత్తల మహిమ లనంతములు.

మంత్రానుష్ఠానమువల్ల మహామహిమ యార్జించియే యా నాఁటి తపోధనులు సర్వవర్ణములవారి గౌరవమునకుఁ బాత్రు లైరి. రాజమహారాజులకు గురువులు, పురోహితులు, మంత్రులునై సంఘము సుఖముగాఁ బ్రవర్తించునట్లు చేయఁగలిగిరి. మంత్ర మన నథర్వ

* చూ: మదీయ సంస్కృతవాఙ్మయచరిత్ర, ప్ర. భా. ౩౩-౫౮.

# హరనాథ్ ఆయిల్ ఎక్స్‌పెల్లర్



మాన్యుఫాక్చరరు:

## ది పంజాబ్ ఆయిల్ ఎక్స్‌పెల్లర్ కంపెనీ, లాహోరు.

★

మద్రాసు, నైజాం, మైసూరు రాష్ట్రములకు సోల్ డిస్ట్రిబ్యూటరు:

# కుసుమహరనాథ్ ఇంజనీరింగు కంపెనీ బెజవాడ.

ప్రొప్రయిటరు: చుండూరు సీతారామయ్య.

---

## బ్రాంచి: హర్‌గోపాల్ అండ్ కంపెనీ.

ఇంజనీర్లు, ఎక్స్‌పెల్లరు సప్లయర్లు:

పాలూర్ స్ట్రీట్, ఓల్డు అనార్కలి, లాహోరు.

వేదముని కూడ నర్థ మని యింతకు మున్నె చదివితిమిగదా! ప్రయోగోపసంహారములతో నందలి మంత్రములకు వశపఱుచుకొన్న వారు మంత్రు లనఁబడిరి. అట్టి యథర్వవేత్తయే రాజునకు వ్యాజ విగమంత్రులలో నొకఁడై రాజునకును, రాజ్యమునకును శత్రుబాధ కలుగకుండ రక్షించుచుండెడివాఁ డన్నవిషయము సంహితా పురాణప్రసిద్ధము. ఇది యాథర్వణము వ్యాప్తికి వచ్చినప్పటిమాట. అంతకు ముందే మహామంత్రి జపనిష్ఠాగరులు, తపస్విశ్రేష్ఠులు, వశ్య వాక్కులు నైన బ్రహ్మర్షులు మహారాజులకు గురువులై, నిజాశ్రమ వాసులై, నిష్కాములై వారి పరిపాలనము నిష్కంటకముగా, నిరుపద్రవముగాఁ గొనసాగునట్లు వేయికన్నులతోఁ జూచుచుండెడివా రనుటకు దశరథజనకమహారాజాదుల గురువు లగు వసిష్ఠశతానందాదుల చర్యలే నిదర్శనము. కావున మంత్రము, జపము, తపము, వాని సిద్ధియు నార్యుల కనాదిసిద్ధము లనుట వాస్తవము. ప్రభుమంత్రోత్సాహశక్తులలోని మంత్రశక్తికి రాజాస్థానములోని యథర్వవేత్త యగు మంత్రిమంత్రశక్తి యనిదే మొదటి యర్థ మనుట నిజము. ఆ వైదికమంత్రములును, మంత్రసిద్ధగురుపరంపరా సంప్రదాయలబ్ధ లౌకికమంత్రములు నాధారములుగా, భరతఖండమున వ్యాపించిన మతవిద్యలలో నొకటియై వెలసినది తంత్రవిద్య. సంహితాగమయామలాది సంజ్ఞల విలసిల్లిన యా తాంత్రికవిద్యలలో నంత ర్యాఖ్యత మైనదే మంత్రశాస్త్రము.

ఐహికాముష్మికసాధక మైన యుపాయము తంత్రము. దాని నావిష్కరించునది తంత్రవిద్య. వేదాంత శాస్త్రమువలెనే యిది యును జిజ్ఞాసువులకు ముక్తిమార్గ ముపదేశింప నవతరించిన దైనను, షడ్దర్శనములవలెనే తంత్రములును భిన్నమార్గములు త్రొక్కినవి. ఇందు శ్రీమన్నారాయణుఁడే పరమేశ్వరుఁడు - పరమశివుఁడే పరబ్రహ్మము - పరాశక్తియే జగదాధారము అను మూఁడు మతములు ముఖ్యములు. సాంఖ్యాదులు తత్త్వము లిరువదినాలు గనఁగా నివి ముప్పదియాఱన్నవి. "షట్త్రింశద్వాస మేతద్వై తత్త్వచక్రం సమీరిత" మ్మని శక్తిత్రయపరీక్షా పరమానందాది తంత్రములు వాటిని నిరూపించినవి. జీవేశ్వరతత్త్వవివేకమే వీటి పరమావధి యైనను తన్నియమాచరణ మసిధారావ్రతమువంటిది. వేదవిహిత మైన గాయత్రీహరిహరాదిదేవతారాధన మిందు సవిశేషముగాఁ గనవచ్చుటంబట్టి యీవిద్య వైదికమతసమ్మత మనవలసివచ్చినది గాని, యిందలి దేవతారాధన విధానబాహుళ్యమును బట్టి యిది యొక స్వతంత్రవిద్యయే యని చెప్పవచ్చును. ఇందుకుఁ దంత్రవిద్య శ్రద్ధేయ మనియు, అశ్రద్ధేయ మనియు రెండుమతము లాదిని వెలువడుటయే ప్రమాణము. ఇందుకుఁ బ్రమాణవచనములు కొన్ని:—

వేదమార్గము విడిచి వేఱుత్రోవ పట్టినవాఁడు చేతిలోని పాయసము పాఱవైచి మోచేయి నాకినవాఁ డగు నని సూతసంహిత. వైదికమార్గము విడిచి తంత్రమంత్రదీక్ష నవలంబించి యీగతిపాలయితి మని నరకవాసులు విచారించినట్లగ్ని పురాణము. పాషండులు,



జగదీశ్వరి - పరాశక్తి

తాంత్రికులు, నాస్తికు లితీర్థము సమీపింపఁజాల రని పద్మ పురాణము. ఇట్లీవిద్యను గొన్ని గ్రంథములు నిరసించినను, గొన్ని కొన్నియెడల స్తుతింపకపోలేదు. దీనిని నిరసించిన సూతసంహితయే మఱియొకచోట వైదికుల కవ్యవధానముగా లభించు నీశ్వరాను గ్రహము తాంత్రికులకు వ్యవధానముగా లభించు నని యొకవిధ మైన సమ్మతి చూపినది. తాంత్రికమార్గము ననుసరించి బ్రాహ్మణ క్షత్రియబాలురకుఁ బ్రదోషపూజ యుపదేశించినది బ్రహ్మోత్తర ఖండము. సర్వేశ్వరుఁడు తంత్రాగమప్రియుఁ డన్నది భాగవతము. భగవంతుఁడు వేదవేదాంతములంబోలెఁ దంత్రాగముచేతను వేద్యుఁడే యన్నది భారతము. కావుననే షణ్మతోద్ధారకుఁడు, జగద్గురువు నగు శంకరభగవత్పాదులు వైదికతాంత్రిక మంత్రములకు సమన్వయము కలిగించి తమ మానసపూజలో—

> "మంత్రాం స్తాంత్రికవైదికాన్ పరిపఠన్
> సానంద మత్యాదరాత్
> స్నానం తే పరికల్పయామి జనని!
> స్నేహా త్త్వ మంగీకురు"

అని తాంత్రికమంత్రముల సమర్థతను బ్రకటించియున్నారు. వేదవేదాంతముల కున్న ప్రాధాన్యము దీనికిఁ దొలుత లేకపోయినను, తరువాత నిది ముక్తిసాధనశాస్త్రములలో నొకటిగాఁ జేరిన దనుటకు శ్రీశంకరాచార్యులు మంత్రశాస్త్రము నాదరించి తదుక్త మైన శ్రీచక్రపూజ నాచరించి జగదీశ్వరీపీఠములు భరతఖండము నలు గడలఁ బ్రతిష్ఠించుటయే తార్కాణము.

తంత్రము సంహిత మంత్రశాస్త్ర మన్న పేర గ్రంథ ముద యింప నారంభించి సుమారు రెండువేల సంవత్సరము లయియుం

నును గాని, అందలి ప్రధానపురుషులను, తదారాధన విధానమును, దానికి సంబంధించిన విజ్ఞానమును బురాతన మైనదే. అది కేదారేశ్వర బదరీనారాయణ ప్రతిష్ఠలకుఁ బూర్వమే యాచార్యమహర్షుల హృదయసీమల నంకురించినది. చిత్తశుద్ధికి యజ్ఞాదికర్మలును, ఆత్మజ్ఞానమునకు వేదాంతవిచారణయు సాధనము లైనను, అహం బ్రహ్మ స్మృతి విజ్ఞానము జిజ్ఞాసువున కనేకజన్మ పరంపరాసాధ్య మగు నప్పు విషయ మెఱింగిన యా మహనీయులు, మనస్సు నొకచో నిలిపి పరమేశ్వరధ్యానము చేయుటయు, ఇష్టదేవతావిగ్రహారాధనమును తరించుటకు సులభమార్గము లగు నని సంకల్పించిరి. ఉపాసకుల యుపయోగమునకు నిరూపించిన యీ భగవద్రూపకల్పనమునెడ నమ్మహాత్ములకు వేదములలోని యీశ్వరరూప వర్ణనములే తోడ్పడిన వనుట నిజము. ఆవాక్యములు కొన్ని:—

"సహస్రశీర్షా పురుషః, సహస్రాక్షః స్సహస్రపాత్"
"సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమ్"
"య ఏషో ఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషః"
"కృత్తిం వసాన ఆచర పినాకం బిభ్రదాగహి!"
"తా మగ్నివర్ణాం...దుర్గాం దేవీగ్ం శరణమహం ప్రపద్యే"
"హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజతస్రజామ్"

కావున నీ విద్య ప్రాచీనగురుపరంపరాసంప్రదాయసిద్ధ మనుట తెల్లము.

మంత్రము, యంత్రము, తంత్రము నిందు ప్రధానములు. మంత్రములు బీజాక్షరరూపములు. అకారాదిక్షకారాంత వర్ణములును, సంయుక్తాక్షరములును బీజములు. వాని కలయికచే నేర్పడినవి "సప్తకోటిమహామంత్రా శ్శివవక్త్ర్రా ద్వినిర్గతాః" అను స్కాంద వచనమున నేడుకోట్లని తెలియుచున్నది. కొన్ని మంత్రముల నాయాదేవతల నామము లుండును. కొన్నింటఁ దద్దేవతాకము లైన బీజములు మాత్రమే యుండును. ఇఁక మంత్రాధిష్ఠాన దేవత లందుమా, లెక్క లేదు. విష్ణురుద్ర సంజ్ఞలు ఋగ్వేదాదులందున్నవి. వారి మహత్త్వములు నందు వేఱుగానే యున్నవి. తరువాత నిందు విష్ణువు శ్రీమన్నారాయణ వాసుదేవ జగన్నాథ జనార్దన నృసింహాదినామములను, రుద్రుఁడీశ్వర విశ్వేశ్వర మహాకాళేశ్వర త్ర్యంబకేశ్వరాది సంజ్ఞలను విలసిల్లిరి. పరబ్రహ్మ ప్రతిబింబ మైన మూలప్రకృతి పరాశక్తి. ఆమె శ్రీ లక్ష్మీ కాళీ బాలా త్రిపురసుందరీ దుర్గా శ్యామలా రాజేశ్వరీ లలితాదిసంజ్ఞల విలసిల్లినది. అట్లు విలసిల్లిన యొక్కొక్క సంజ్ఞ కొక్కొక్క మంత్రము వేఱు పడినట్లే తజ్జపహోమార్చనాదులును వే ఱయినవి. అందుకుఁ దగినట్లు భక్తుల యభీష్టములును, తత్సిద్ధులును వే ఱయినవి.

ఒక్కొక్క దేవతకు, తన్మహత్త్వప్రతిపాదకము లైన బీజాక్షరములతోడి యంత్రము విహితము. తపోనిష్ఠుఁ డామంత్రమును ధదేకదీక్షతో జపించి జపించి యా తపశ్శక్తి నాయంత్రమున నావహింపఁజేయును. ఆ యంత్రమును తదాగమోక్త విధానమున వర్తించుటయే తంత్రము. అట్లారాధింపఁబడిన యా దేవత యా భక్తుల కభీష్ట మొసఁగును. ఆ యంత్రమునే యొక క్షేత్రమునఁ బ్రతిష్ఠించి దానిపై నభీష్టదేవతా విగ్రహమును బ్రతిష్ఠించుట యాగమోక్త విగ్రహారాధన తంత్రము. కేదార బదరీ కాశీ కాళహస్తి భీమేశ్వర మహాకాళేశ్వర శ్రీశైల శ్రీపర్వత జగన్నాథాది క్షేత్రములందు ప్రతిష్ఠింపఁబడిన యాయా దేవతామూర్తులు కొన్ని వేల సంవత్సరములుగా భక్తుల నాకర్షించుచున్నవిగదా! అది యావిగ్రహముల మహిమ కాదు, ఆక్షేత్రముల మహిమ కాదు; అది యంతయు నాయా మంత్ర సిద్ధము లయిన యంత్రముల మహత్త్వ మనుట నిశ్చయము. మంత్రతపశ్శక్తి నేవస్తువు నం దావహింపఁజేసినను, అది యసాధారణ, మమేయము నయిన ప్రభావము చూపుననుట సత్యము. సనాతన తపోధనులు తమ తపశ్శక్తి దారపోసి కనుఁగొన్న యస్త్రములు సామాన్య మానవబుద్ధి కతీతమైన మహత్త్వము చూపిన వనుట యితిహాసప్రసిద్ధము గదా! వాని కాశక్తి యెట్లు వచ్చినది? మంత్రశక్తివల్లనే. దానినే భవభూతి యిట్లు స్మరింపఁజేసినాఁడు:

"బ్రహ్మాదయో బ్రహ్మహితాయ తప్త్వా
పరస్సహస్రం శరద స్తపాంసి,
ఏతా న్యదర్శన్ గురవః పురాణాః (అస్త్రాణి)
స్వా న్యేవ తేజాంసి తపోమయాని"

సమరాంగణముల నద్భుతమహిమలు చూపిన బ్రహ్మనారాయణ పాశుపత సంమోహన జృంభకాస్త్రాదుల యజేయశక్తి యంతయుఁ దపశ్శక్తి యనుట విదితము. మంత్రయంత్రమహత్త్వ మిట్లు రెండు మాటలలోఁ దెలియునది కాదు. ఆ శాస్త్రమందలి రహస్యము తెలిసినఁగాని తృప్తి కలుగదు.

తంత్రవాఙ్మయము పరిశీలింపఁగాఁ బాంచరాత్రమతశాఖ క్రీ. పూ. పదునాల్గవ శతాబ్దివఱకును, శైవమతశాఖ యంతకంటె నొకటి రెండు శతాబ్దులు వెనుకటివఱకును బోయిన సూచనలు గనవచ్చును. పాద్మసంహితలో ౧౦౮ వైష్ణవతంత్రములు పేర్కొనఁబడినవి. కాదిమతంత్రమునుబట్టి శైవతంత్రము లఱువదినాలుగు లెక్కకు వచ్చినవి. అందలి రుద్రయామలమహాతంత్రములో శక్తిగణపత్యాదిపూజావిధులును, వరివస్యారహస్యములును తన్మయత్వము గలిగించునట్లు వర్ణింపఁబడినవి. శైవభేదము లయిన గాణాపత్య కాపాలికాదిమతములు శైవమహాతంత్రమునందు విశదీకరింపఁబడినవి. ఇట్లు వెలసి లోకమున వ్యాపించిన తాంత్రికమతములలో విశేషవ్యాప్తికి వచ్చి శిష్టుల యాదరము గాంచి నేఁటికి నాసేతుహిమాచలము వ్యవహారమున నెక్కువగాఁ గనవచ్చునది శాక్తము.

మూలప్రకృతి పరాశక్తి బ్రహ్మరూప చిదానంద పరబ్రహ్మరూప. ఆమెనుండి మహత్తత్త్వాదు లావిర్భవించినవి. మూలప్రకృతి యగుదాని వికృతులు మహాకాళీ త్రిపురసుందరీ రక్తవర్ణా బాలభైరవీ

విద్య లనువారు. ఆ ప్రకృతి ప్రపంచమూలము ; తన్మాయా రూపధారి ప్రపంచాత్ముఁడు శివుఁడు.

> "యదా సా పరమా శక్తిః స్వేచ్ఛయా విశ్వరూపిణీ"
> "న శివేన వినా దేవీ న దేవ్యా చ వినా శివః"
> "శివశక్తి రితి హ్యేకం తత్త్వ మాహు ర్మనీషిణః"

ఇత్యాదిగా శక్తిసంగమతంత్ర కౌముకలావిలాసాది గ్రంథము లీశక్తిస్వరూపము నెంతయో ప్రశంసించియున్నవి.

శక్త్యారాధనమున కేర్పడిన యంత్రము శ్రీచక్ర మనఁబడును. నవయోన్యాత్మక మైన శ్రీచక్రములోని మధ్యభాగ మైన బిందు తత్త్వము పరాశక్తి స్వరూపము. * వామకేశ్వర మహానిర్వాణాది తంత్రము లీచక్రము పరాశక్తి పరమశివుల యభేదరూప మైన పరబ్రహ్మ మని వర్ణించియున్నవి.

శ్రీ విద్యోపాసన మతిదుష్కరము, మహానియమబద్ధము. మంత్రతంత్రోక్తమైన పరిపూర్ణ విధానముతో నాశక్తి నారాధించిన దీక్షాసిద్ధులకు ముక్తి కరతలామలక మనుట సత్యమే. కాని నిష్కామ బుద్ధితో, నిరంతరదీక్షతోఁ జేయవలసిన యీదారాధన విధానము చూచి నచో నొసలు జలదరించును. అయినను మనోనిగ్రహముతో దేవి నారాధించి కృతార్థు లయిన సాధకులయు పూర్వము లేకపోలేదు. ఇప్పటికూడ శ్రీవిద్యోపాసనము, శ్రీచక్రపూజయు నందందు జేయు మనుజులు గలవు.

సర్ జాన్ వుడ్రాఫ్ అనెడి పాశ్చాత్య విద్వాంసుడు తంత్రశాస్త్రము సక్రమముగా నభ్యసించి శక్తి - శాక్తము, వర్ణమాల అను గ్రంథములు రచియించియు, తంత్రరాజ మహాతంత్ర నిర్వాణాదికృతు లనువదించియు ప్రకటించి యీశాస్త్రమునకు ఖండాంతరములందు వ్యాప్తి కలిగించియున్నాఁడు.

ఆ స్తికతంత్రమంత్రశాస్త్రము ననుకరించి యర్వాచీనబౌద్ధులు కూడ దేవతారాధనమున నభీష్టసిద్ధిగాంచుచు వజ్రయాన సహజ యాన కాలచక్రయాన రూపమైన సారస్వతము నావిష్కరించి యున్నారు. వాని టిబెటన్ భాషానువాదము లింకను సజీవములై యున్నవని సాధనమాలా ప్రకాశకులు వ్రాసియున్నారు.

మంత్రశాస్త్రము ముక్తిమార్గములలో నొకటి యనుట నిరాక్షేపము. మంత్రానుష్ఠాన మిష్టార్థప్రద మనుట యంతకంటెను నిరాక్షేపము. అట్టి నిష్ఠాపరులు కోటి కొక రైన నిపు డున్నారో లేరో కాని పురాతన మైన యొక విద్వదభిప్రాయము మాత్ర మిట్లున్నది:

> "దైవాధీనం జగ త్సర్వం, మంత్రాధీనం తు దైవతమ్,
> తన్మంత్రో బ్రాహ్మణాధీనః, బ్రాహ్మణో మమ దైవతమ్"

---

* చూ : సంస్కృత వాఙ్మయ చరిత్ర, ద్వితీయభాగము, పుట ౮౭-౮౦.

---

# చాటుమరందము

= శ్రీ కవికొండల వేంకటరావు =

— వసంతునివింత —

చిగురుల గుజ్జు కెంజిగుల చెల్వు మొకానొక వింత, యందులన్
సొగసుగ డాగు కోయిలవినోదపు బాటొకవింత, దానినిన్
దగ నలువంకలన్ బఱపి డాసెదు పయ్యెర యొక్కవింత,-తా
నొగి నవి యెల్ల కూర్చుకొని యొప్పు వసంత మదెంత వింతయో!

— వశము —

కొమ్మమనోహరప్రణయకోపమునం దొకవేళ నిన్ను దా
నెమ్మెయి నేద్ది వైవ గణియించెదొ కొట్టె నటంచు, నాదుపు
ష్పమ్ములు వైవ దాకె ననజాలవు సూ! యని తెల్పుకైవడిన్
కొమ్మల బూవులన్ విసరి కొమ్మను నీవశుళమ్ము మిత్రమా!

— హాలికుడు —

తన వృక్షంబు లోనంగు వాయువుల నత్యంతంబుగన్ బీల్చుచున్,
తన యూ విష్టు పాలనేతులను నత్యంతంబుగన్ ద్రావుచున్,
తనచేనందున బండు సస్యముల నత్యంతంబు భోగించుచున్,
మనుచుండున్ గద హాలికుండు తన గ్రామంబందు సంతృప్తితోన్.

— కొంగకొలకులు —

తమ సౌందర్యము దామె దిద్దుకొన నత్యాసక్తి కొండల్ కడున్
గమనీయంపు గొలంకులన్ గొలకులన్ గావించుకోబోలెడిన్;
విమలంబైన జలంబునం దెటుల గంభీరంపు రూపంబు ల
ద్దమునందుంబలె జూడనయ్యెడినో యత్యంతంబు స్పష్టంబుగా!

— ఊడ్చిన చేలు —

ఈదరినుండి యాదరికి నెల్లెడ నొక్కగతిన్ జెలంగుచున్
మోదముగూర్చు సస్యములు పొల్చెడు, వీచు మహానిలంబునన్
నాదమొనర్చుచున్—గనఘనంబగు భంగములన్ గలంగు నీ
లోదధినైల్యమున్ విడిచి యొప్పగ బచ్చన పూనెనో యనన్.

— కళింగల —

సిరము స్వీయగర్భమున నిల్పుచు నక్కఱవచ్చు వేళలన్
పైరుల కెల్లెడన్ సరిగ బంచుచు సార్థకమౌచునుండె గా
సారము చూడుడీ యనుచు జాటెడిరీతి కళింగ లెప్పుడున్
హోరని మ్రోగు మ్రోతల సముద్ధతి గ్రేలుచు గ్రాలుచుండెడిన్.

— తుమ్మెద : సంపెంగపువ్వు —

తనకును జిక్కనంచు గను దక్కుచు తాఱుచు భీతిసెందుచున్
మనమున సంశయింపడుచు మాటికి దుమ్మెద చంపకమ్ముచు
ట్టును దిరుగాడుచున్ సలిపెడున్ గద యత్నము! నిష్ఫలంబుసూ!
గుణవతులైనవార లల కూళలకున్ గనుపట్టువారలే?

— కాకములు —

తమకంటెన్ నలుపైన రాత్రికిని యాత్మన్ భీతిలంగన్ గులా
యములన్ డాగెడుబోలు, కాకము లదే యారాత్రియున్ సూర్యతే
జమునన్ బోవుచునుండుటన్ గనుచు స్వేచ్ఛన్ బైటకున్ వచ్చి వే
బ్రమదంబొందుచు గావుకావని కడున్ రావంబులన్ సల్పెడున్.

[నాటిక]

# వైకుంఠపాళి

గంగాధరం—ఎవరది? మన్మథరావా? ఎప్పుడు నా సంగీతమేమిటి?

మన్మథరావు—మాయింటి ప్రక్క ఒక అమ్మాయి వుంది. ఆ అమ్మాయికి పదహారేండ్లు. ఆ అమ్మాయి అల్లా వాయిస్తూ వుంటుంది.

గంగా—పెండ్లి కాలేదా?

మన్మ—అయింది. కాని ఆ అమ్మాయి భర్త ఎఫ్. ఏ. చదువుతూండగా యీ పిల్ల పెద్దమనిషి అయింది. అతడు తాను బి. ఏ. ప్యాసైతేగాని కాపురం చేసుకోనన్నాడు. బి. ఏ. ప్యాసైం తరువాత ఎం. ఏ. ప్యాసైతేగాని చేసుకోనన్నాడు. అల్లా మిాదుకట్టివుంచారు.

గంగా—నీకు మర్యాదగా మాట్లాట్టం తెలియదు. నా యీడేమిటి; నీ యీడేమిటి? మీ నాన్నా, నేనూ ఒక యీడువాళ్లంగదా.

మన్మ—ఓహో, మీకు కోపం వచ్చిందాయేమిటి? నాకు తెలుసును.

గంగా—నీకు ఏమి తెలుసును? ఇంటికి వచ్చిన అతిథితో బాగా మాట్లాడుతున్నావు. అదిగో మీ అమ్మ వస్తోంది. ఆవిడతో చెబుతాను. ఏమమ్మా, రాధా, చూశావా? మీ అబ్బాయి, పెద్దా పిన్నా లేదు. ఎవరితో యెల్లా మాట్లాడాలో గూడా తెలియదు.

మన్మ—నే నేమన్నాను? ఏమీ అనలేదు. అది కాదమ్మా, ఈ ప్రక్కవాళ్ల సుందరి వుందే, దాన్ని మీదు కట్టారన్నాను.

గంగా—అంతేనా నువ్వన్నది? నాకు తెలుసునులే అన్నావు. ఏమిటి నీకు తెలిసేది? చిన్నప్పుడు నేను కూడా నా భార్యను రెండేండ్లట్టిపెట్టాను. ఆ సంగతినే కదా నీవు ఎత్తిపొడుస్తున్నావు.

మన్మ—రామ రామ! నాకేం తెలుసు? అదిగో రత్నమ్మపిన్ని వస్తోంది. ఆవిణ్ణి అడగండి- నాకేమైనా తెలుసునేమో.

రత్నమ్మ— ఆ సంగతి ఆ అబ్బాయికెట్లా తెలుస్తుంది?

రాధ — మా అబ్బాయికి ఆ సంగతి తెలుసును. మా యింట్లో అందరికీ తెలుసును. వాళ్ల నాన్న చాలాసార్లు చెబుతూ వుంటారు. అయినా అందులో తప్పేముంది?

మన్మ— ఏమీ తప్పులేదు. సంపాదించడం మొదలుపెట్టిన తరువాత భార్యను తీసుకువెళ్లవలెగాని, మరియొక విధంగా తీసికొనివెళ్లడం న్యాయంకాదు. కాని —

గంగా—ఏమిటి కాని?

మన్మ—ఏమున్నదండీ? నే ననవచ్చిందింకేమీ లేదు. ఆ పెళ్లిచేసుకోవడమే ఆలస్యం చేసుకుంటే మంచిదికదా అని.

రాధ — మరి నువ్వు ఇల్లా చేసుకున్నావేమి? నువ్వు సంపాదించడమేమీ లేదే? మరి భార్యను తీసుకొచ్చి ఇంట్లో పెట్టుకున్నావే?

మన్మ — నాకేమి? మీరు చేశారు, మీరు పోషిస్తున్నారు. నాకల్లాంటి దిగులూ లేదు. నా భార్యకు నేనే సంపాదించి పెట్టి పోషించాలన్న పట్టుదల నాకు లేదు. పట్టుదల ఉన్నవాళ్లను చూస్తున్నాంగా.

గంగా—ఏం చూస్తున్నావు?

రత్న—ఆ కుర్రవాడితో మీ కెందుకు? పసివాడు, ఏం మాట్లాడాలో తెలియదు.

గంగా— పసివాడేమిటి? పాతికయేండ్లయినా లేవా? భార్యతో సంసారం చేస్తున్నాడు.

రాధ — మా అబ్బాయికి మొన్ననే ఇరవైయవ యేడు వచ్చిందండీ.

గంగా — ఇంకా మీ ఆయన రాలేదేమి?

శ్రీ విశ్వనాథ
సత్యనారాయణ

రాధ—ఆయన క్లబ్బునుంచి రాత్రి పది అయితేగాని రారు.

రత్న—ఆయనతో మన అబ్బాయి కూడా వెళ్లాడు.

గంగా—కోడలు?

రత్న—వాళ్ల కోడలు, మన కోడలు కలసి సినీమాకు వెళ్లారు. అందరూ వచ్చే వేళయింది. అదిగో వీథిలో యేదో జట్కా ఆగినట్లుంది. అదిగో కోయిల కిలకిలా నవ్వటం.

రాధ—రా అమ్మా, రా. వాళ్ల శ్యామల యేదీ? అదేమిటమ్మా రత్నమ్మా. మీ కోడలు అంతా యేదో పల్లెటూరి దానివలె వుంటుంది. అల్లా ఒదిగి ఒదిగి వెనక వస్తుందేమి? రెండు రోజులుమట్టీ చూస్తాను. నోరు విప్పిన జాడ కనిపించదు. నవ్విన జాడ కనిపించదు. ఇంటిదగ్గర పెట్టెలో పెట్టి మూత వేస్తారా యేమిటి?

గంగా—ఒక్కొక్కరి తరహా ఒక్కొక్క మోస్తరు. కొందరు పెట్టెలో పెట్టి మూతపెట్టినట్టు వుంటారు. కొందరు వీథిలో గిరాటువేసినట్టుంటారు.

రత్న—ఏమిటా మాట్లాడటం మీరు?

గంగా—రాధారాంగారు వచ్చారా?

రత్న—అదుగో వచ్చాడు. నీకు నూరేళ్లు రాధారాం. మాటలో వచ్చావు. మా శ్రీనివాసు ఏడీ?

రాధారాం—ఇదుగో.

శ్రీనివాసు—అమ్మా, ఇవ్వాళ నేనూ, రాధారాంగారూ కలసి ఫోటోగ్రాఫ్సు తీయించుకున్నాం.

రాధ—మా అబ్బాయిని గూడా తీసికొని వెళ్లకపోయినారా?

కోయిల—మీ అబ్బాయి వెళితే నేను మాత్రం వెళ్లక్కర్లేదా?

మన్మ—నేను వెళితే నువ్వు తప్పకుండా రావాలి. సహధర్మచారిణివి కదా.

రత్న—ఫోటోగ్రాఫు ఎప్పుడిస్తారు?

రాధారాం—ఎప్పుడిస్తారేమిటి? అక్కడ కూర్చొని తయారుచేయించి తీసుకువస్తే?

కోయి—ఏదీ; మా మామగారి ఫోటో ఎట్లా వుందో చూస్తాను.

రత్న—మీ మామగారి నెరగవా, మీ మామగారి ఫోటో ఎరగవా?

రాధ—మనుష్యులు ఎప్పటికప్పుడు కొత్తగా వుంటారమ్మా.

రాధా—ఇదిగో ఫోటో. ముందర ఎవరు చూస్తారు?

అంద—నేను, నేను.

రాధా—అల్లా కాదు. వేలం పాడతాను. ఎవరెక్కువ డబ్బిస్తే వాళ్లూ ముందర చూడటం.

కోయి—గవర్నమెంటుపాట యెంతో చెప్పండి.

రాధా—గవర్నమెంటుపాట రూపాయి, రూపాయి.

కోయి—అట్లా అనకూడదు. గవర్నమెంటుపాట రూపాయి, పావలా, అణా, అని అక్కడ ఆగాలి. అణామీదనుంచి వేలం పెరగాలి.

రాధా—సరే, అణా.

మన్మ—రెండణాలు.

కోయి—మూడణాలు.

రాధ—పావలా. నువ్వు పాడు శ్యామలా. ఐదణాలను.

శ్రీని—దానిదగ్గర అయిదణాలు కాదు కదా, అయిదు దమ్మిడీలు లేవు.

శ్యామ—మీరిస్తేగా. ఎట్లా వుంటవి? ఇవాళ సినీమాకు గూడా కోయిలే పెట్టింది.

శ్రీని—ఇంకా యేం? కోయిలనే పాడమను. నీ బదులు గూడా కోయిలే యిస్తుంది డబ్బు.

శ్యామ—మీ ఫోటో నేను చూడట మేమి, కోయిల డబ్బివ్వట మేమి?

కోయి—చూచేది మీ ఆయన ఫోటో కాదు. మా మామగారి ఫోటో.

రత్న—రెండూ కలిసేవున్నయ్యమ్మా.

మన్మ—ఈ మాటలేనా, వేలా మేమన్నా పెరుగుతుందా?

రాధా—ఆ డబ్బు నీ కివ్వను.

మన్మ—నేను లాక్కుంటాను.

కోయి—నా క్కావాలి.

గంగా—పావలా దగ్గర్నుంచి ఒక్కసారి రూపాయి అనవచ్చునా?

మన్మ—రెండురూపాయ లనవచ్చు.

గంగా—అయితే రెండు రూపాయలు.

కోయి—రెండు రూపాయల పావలా.

మన్మ—మూడు రూపాయలు.

రాధా—నువ్వెందుకురా అల్లా పాడతావు? నువ్వేమన్నా డబ్బిచ్చేవాడివా, పెట్టేవాడివా?

రాధ—అదికాదు. వాడి పాటమీద కొట్టేశారా, వాడు డబ్బివ్వక్కర్లేదు. ఎదటి వాళ్ల పాటమీద కొట్టేస్తే వాడికి డబ్బొస్తుంది. పాటేమో పెంచుతూంటాడు. లోపాయికారీపాట యిదేగా?

గంగా—మూడుంబావలా.

రత్న—మూడున్నర.

శ్రీని—అమ్మా, నువ్వెందుకు పాడతావు?

గంగా—నాయనా, ఊరుకో. ఏదో అందరం సరదాగా ఉన్నాంగదా.

కోయి—మన్మథరావు!

గంగా—భర్తనేనా ఆ పిలవటం? (కొంచెం రహస్యంగా.)

కోయి—మన యిద్దరికీ చెరిసగం. (బిగ్గరగా) నాల్గు రూపాయలు.

గంగా—ఐదురూపాయలు.

రత్న—ఐదుంబావలా.

గంగా—ఆరు రూపాయలు.

రాధా—ఒకటోసారి, రెండోసారి, మూడోసారి. (అని తొందర తొందరగా అనును) ఇదిగో గంగాధరంగారూ, తీసికోండి ఫోటోగ్రాఫు.

మన్మ—ఇది అన్యాయం. మేమింకా పాడేవాళ్లం.

గంగా—ఇవిగో ఆరు రూపాయలు.

రాధా—ఆరు రూపాయ లెందుకండి? ఏదో నవ్వుతూ అన్నాను.

గంగా—అదేం మాట! పుచ్చుకోండి. పుచ్చుకోక తప్పదు.

రాధా—అట్లా అయితే మూడు రూపాయలే యివ్వండి. మా యిద్దరి ఫొటోలూ అందులో వున్నవి గనుక మీ అబ్బాయికి సగం, నాది సగం.

మన్మ—కాదు, ఆరు రూపాయలు ఇవ్వాలిసిందే. నే నెక్కువ పాట పాడతా. ఆరుంబావలా.

రాధా—సరే, ఒకట్లోసారి, రెండోసారి, మూడోసారి; ఆరుంబావలా ఇటుతే.

మన్మ—తొందరపడతారేం? పైన యింకెవరన్నా పాడతారేమో?

రాధా—ఇంకెవ్వరూ పాడరు.

మన్మ—గంగాధరం గారూ, మీరు పన్నెండు రూపాయలు పాడండి. నా ఆరు రూపాయలు నాకు వస్తయి.

గంగా—పన్నెండు రూపాయలు. ఇవిగో నీ ఆరు రూపాయలు.

కోయి—అందులో నావి మూడురూపాయలు.

గంగా—మన్మథరావు, ఈ ఫొటో నేను చూశాను. నీవు చూచి యెట్లావుందో చెప్పు.

మన్మ—ఈ యిద్దరిలో మా నాన్న యెవరు?

కోయి—ఇటుతే, నేను చూస్తా. ఈ యిద్దరిలో మా మామగారు ఎవరు? నాకు తెలియటంలేదే. మీరుచూడండి అత్తగారూ.

రాధ—ఇద్దరూ ఒక్కటే మోస్తరుగా వున్నారే!

శ్యామ — ఏదీ నన్ను చూడనివ్వండి. ఏం? ఎందుకు తెలియటం లేదు?

శ్రీని—ఎట్లా తెలుస్తోంది?

శ్యామ—ఇదిగో యీ యెడమ బొమ్మ మీరు.

రాధా—ఫొటోలో ఎడమను గూర్చుంది నేను.

శ్యామ—సరే! సరిపోయింది.

గంగా—యెట్లా సరిపోతుందమ్మా పిచ్చిదానా. మృచ్ఛకటికలో విదూషకుడు చెప్పినట్లు అద్దంలోవలె ఫొటోగ్రాఫులో కూడా కుడి యెడమ, యెడమ కుడి.

రత్న—మీ కెందుకో కోపం వచ్చినట్లుంది.

గంగా—ఆరు రూపాయలు పోయినవని.

మన్మ—పోయిన డబ్బు తిరిగి వస్తుందటండీ?

గంగా—పోయింది యేదీ తిరిగిరాదు. నిజంగా పోయిందో, లేదో తెలుసుకోవాలి.

కోయి—ఒకొక్కప్పుడు పోయింది తిరిగి వస్తుంది. మనం కొంత ప్రయత్నం చేయడంలో వుంటుంది.

రాధా—ఏదో వేదాంతంగా వుందిగాని నేనూ, శ్రీనివాసూ హోటల్లో భోంచేసి వచ్చాం. తక్కినవాళ్లు భోంచేయండి.

కోయి—నేనూ, శ్యామలా కాఫీహోటల్లో తగినంత తిన్నాం. మా యిద్దరికీ ఆకలి కావటం లేదు.

గంగా—నా కివ్వాళ శనివారం.

రత్న—నాకూ శనివారమే. ఒక్క రాధగారే భోంచెయ్యాలి.

రాధ—నే నారు గంటలకే తిన్నాను. ఇంక పడుకొని నిద్దరపోవచ్చు.

గంగా—నాకు నిద్దరరాదు. వైకుంఠపాళి కొనుక్కువచ్చాను. నేనూ, మాఆవిడా ఆడుకుంటాం.

మన్మ—ఎట్లా ఆడాలో చెపితే నేనూ ఆడతాను.

గంగా—ఆడటంలో కష్టం యేమీ లేదు. ఎవళ్ల పావు వాళ్లకుంటుంది. నాలుగు గవ్వలు పుచ్చుకోటం, గలపరించి క్రింద వేయటం! ఎన్ని గవ్వలు వెల్లకింతలుగా పడితే అంత పందెం. నాలుగు గవ్వలూ ఒక్కసారిగా వెల్లకింతలుగా పడితే పందెం ఎనిమిది. నాలుగూ బోర్లబొక్కలుగా పడితే నాలుగు. నాలుగూ, ఎనిమిదీ పందాలు మూడు వరసాగ్గా పడితే పందెం మురిగిపోతుంది.

కోయి—అబ్బో, ఇదంతా పాములేమిటి? నిచ్చెన లేమిటి?

రత్న—అది అంతేనమ్మా. పుణ్యం చేస్తే మన కాయ ఆ గడిలో పడుతుంది. ఆ నిచ్చెన యెక్కి పైగడిలోకి పోతాం. పాపం చేస్తే ఆ గడిలో పడుతుంది. ఆ పామునోట్లో పడి క్రిందిగడిలోకి వస్తాం.

గంగా—చిన్నప్పు డాడావా యీ ఆట నువ్వు? నీకు బాగా తెలుసునే?

రత్న—చిన్నప్పుడు యెప్పుడూ మా యింట్లో ఆడేవాళ్లం. నేనూ, మా అమ్మా యెప్పుడూ పండేవాళ్లం. మా నాన్నగారికి యెప్పుడూ యేదో పాము కరుస్తూవుండేది. తరువాత మళ్లీ యెప్పుడూ ఆడలేదు.

గంగా—కొందరు తండ్రిని పోలి పుడతారు. కొందరు తల్లిని పోలి పుడతారు.

రాధా—ఆ మాట కర్థమేమిటి?

మన్మ—సరేకానీండి. ఈ ఆటవల్ల యేమిటి ప్రయోజనం?

కోయి—అన్ని ఆటలకుమల్లేనే. గెలవటమో, ఓడటమో.

మన్మ—ఓడినవాళ్లు గెలిచినవాళ్లకేమివ్వాలి?

రత్న—ఏమీ ఇవ్వక్కర్లేదు.

మన్మ—అయితే ఆడట మెందుకు?

శ్రీని—ఒకళ్లమీద గెలిచేందుక్కాదు. మన స్వభావం యెట్లాంటిదో కనుక్కునేందుకు. మన పాపపుణ్యాలు ఎట్లాంటివో తెలుసుకునేందుకు! మన జన్మస్వరూపం ఎల్లాంటిదో అవగాహన చేసుకునేందుకు!

కోయి—దీనివల్ల పాపపుణ్యాలు తెలుస్తయ్యా!

మన్మ—అసలు పాపపుణ్యాలంటూ వుంటేగదా?

శ్రీని—పాపపుణ్యాలు వున్నయ్యా, లేవు. నీతి, అనీతి ఉన్నవి కదా?

మన్మ—అవ్వీ లేవు. కాదు, ఉన్నవి. మనము గవ్వలు అంచివెయ్యడంలో వుంటుంది. నేర్పుగా వేస్తే పందెం పడుతుంది.

శ్రీని—నీతి అట్లాంటిదే. నేర్పుగా ఉంటే నీతి నిలుస్తుంది. నీతి లేకపోతే వెక్కిరి కొక్కిరిగా వుంటుంది.

మన్మ—మొత్తాని కా తండ్రికొడుకువు.

రాధా—ఒరే మన్మథా,నువ్వు హిందూ గృహంలో పుట్టాలిసినవాడవు కాదు. వాళ్లు అతిథులు, మనం గృహస్థులం.

కోయి—హిందూ, అహిందూ అని లేదు. మేమంతా అంతర్జాతీయ వాదులం.

ఈ నడిమడి సంజం, సందేరాగం వ్యవహారాలు మాకు పనికిరావు.

శ్యామ—మామగారూ, నేను కూడా ఆడతాను.

కోయి—నేనూ ఆడతాను.

మన్మ—ఆఁ, ఇది ఆడవాళ్లు ఆడేఆటే.

గంగా— కొంత మట్టుకు అవును. "స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః" అన్నాడు గనుక భగవంతుడు, స్త్రీల శీలం తెలుసుకోడానికి యీ ఆట పెలిస్తే ఇయ్యవచ్చు.

రాధా—నేను స్త్రీని కానుగా, పోయి పడుకుంటాను.

రాధ—కాదని యెట్లా తెలుసు? నా మాట విని ఆడండి. ఇవ్వాళటితో మీమంచితనం తేలాలి.

రాధా—నే నసలు మంచివాడనని యెప్పుడైనా నీతో అన్నానా?

రాధ—అది కాదండీ, పురుషులు ఆడకూడదని యెక్కడ వున్నది? స్త్రీలు దుష్టులు కాగూడదూ అంటే పురుషులు కాకుండా స్త్రీ లెట్లా అవుతారు? నిజానికి పాప మా భగవంతుడు స్త్రీలమీద పెట్టి స్త్రీ పురుషు లిద్దరికీ కలిసే చెప్పాడు.

గంగా—ఈ యింట్లోకి నీవు తప్పిదారి వచ్చావమ్మా. మూడు రోజులమట్టీ యీ మాత్రం సంస్కారం గల మాట యీ యింట్లో వినిపించలేదు.

రాధా—గంగాధరంగారూ, నా సంగతి మీ కేమీ దాచటంలేదు. ఎందు కల్లా అంటారు? నేను ఈ దేశంలో పుట్టవలసినవాణ్ణి కాదు. నా కొడుకూ యిట్లాగే తయారైనాడు. నాకేమీ అభ్యంతరంలేదు. ఆడమంటే ఆడతాను. ఈ పరమపద సోపాన పఠంలో ఎన్ని పాము లున్నయ్యో అన్నీ నన్నే కరుస్తయి.

గంగా—క్షమించండి. నే నేదో ఛలోక్తికి నవ్వుతూ అన్నాను. నిజానికి మీవంటి వాళ్లే పుణ్యాత్ములు. మీ మనస్సులో అంత తపన వుంది. భగవంతుడు మీ యందు ఉన్నంత సన్నిహితంగా మా యందు ఉండడేమో.

రాధా—ఇదిగో వేస్తున్నాను - (కచ్చి వేయును) నాల్గు.

రత్న—మళ్లీ వెయ్యాలి.

గంగా—ఎందుకు?

రత్న—నాలుగు పడ్డా, ఎనిమిది పడ్డా మళ్లీ యింకొకసారి వీలుంటుంది.

రాధా—ఇదిగో వేస్తున్నాను. ఎనిమిది. మళ్లీ వెయ్యాలి కాదూ?

రత్న—వెయ్యాలి. మళ్లీ యీ సారి నాలుగుగాని, యెనిమిది గాని పడితే మురిగిపోతుంది. ఆ, రెండే పడ్డవి. పద్నాలుగో గడిలోకి వచ్చింది కాయ.

రాధా—ఇదేమిటి?

గంగా—ఏదో ఒక చేనత్లే వుంది. పైరు జన్మ అనుకుంటాను.

(అందరును కచ్చుటయు,గవ్వలు వేయుటయు జరుగును)

గంగా—ఇదిగో, నా కాయ సుగుణపు గడిలోకి వచ్చింది. ఈ చిన్న నిచ్చెన యెక్కాను. పదహారో గడిలో నుండి ఇరవై యెనిమిదవ సాలోక్యపు గడిలోనికి వెళ్లాను.

మన్మ—నా కాయ ఇంకా క్రింది వరసలోనే వుందే? కోయిలా, నీకాయా క్రింది వరసలోనే వుంది.

కోయి—మనం ఎంత వేసినా మన పందెం ఒకటే పడుతోందాయె.

రాధా—ఇదిగో, నా పందెం మూడు.

శ్రీని— ఒకటీ, రెండూ, మూడు. పదిహేడవ గడిలోనికి వచ్చింది. రాగము, పరస్త్రీ లౌల్యము. పాము కరచిం దప్పుడే.

రాధ—ఆరవగడిలోకి వచ్చింది కాయ. కుక్క! కుక్కజన్మ మన్నమాట.

రత్న—అక్కా, భర్తను అట్లా అనరాదు.

రాధ—అది బాగుందేం? ఇట్లా అనగూడదు.

గంగా—సు వ్వావిడతో మాట్లాడట మేనా? నీ పందెం వేస్తావా?

రత్న—ఇదిగో పందెం. ఇది నాలుగు, ఇది రెండు.

రాధా—సరిగ్గా నా గడిలోకి వచ్చావు. రాగము, పరస్త్రీ లౌల్యము. దిగు, దిగు, కుక్కగడిలోకి దిగు.

మన్మ—నే నొప్పుకోను. ఆవిడ స్త్రీ గదా. పరస్త్రీగమన మేమిటి?

గంగా— ఈ పేరులన్నీ మగవాళ్ల దృష్ట్యా వ్రాశారు. ఆడవాళ్లు ఆడుతూంటే వాళ్ల దృష్ట్యా సమన్వయం చేసుకోవాలి.

శ్రీని—నాన్నగారూ, నా కాయ ఇదిగో పంధొమ్మిదో గడిలోకి వచ్చింది. గోత్రవర్ధనము. నిచ్చెన యెక్కి నా కాయ గోలోకానికి వెళ్లింది. ముప్పైతొమ్మిదవ గడిలోకి.

మన్మ—ఇదిగో నాపందెం మూడు. ఆరి దీని దుంపతెగ! ఇందాకటినుంచీ ఒకటే ఒకటే పడుతూ, ఇప్పుడు మూడుపడ్డదే! ఒకటి పడితే చిన్న నిచ్చెన యెక్కేవాణ్ణి.

కోయి—రెండు పడితే మామగారిని కరచిన పామే మిమ్మల్ని కరిచేది.

శ్రీని—నిచ్చెనా యెక్కలేదు, పామూ కరవలేదు. అది ఒక మోస్తరు సామాన్యమైన జీవితం. అట్లా వెళుతూ వుంటుంది ఎగుళ్లూ, దిగుళ్లూ లేకుండా. పద్దెనిమిదో గడిలోకి వచ్చాడు. కలువపూవుల జన్మ యెత్తాడు.

శ్యామ—నా కాయ పెట్టండి. (పందెం మూడుసార్లు వేయును)

గంగా—వరుసవెంటనే మూడు నిచ్చెన లెక్కావమ్మా. పదహారులోంచి ఇరవై యెనిమిదికి వెళ్లావు. ముప్పై. ముప్పైలోంచి యేభైలోకి వెళ్లావు. ఏభైలోంచి డెబ్బైరెండులోకి వెళ్లావు. నాకాయ చూశావా? నలభైయేడు. క్రోధపు గడిలోకి వచ్చింది. పాము కరచింది. ఇరవై అయిదు. క్రోడి గడిలోకి వచ్చింది.

శ్రీని— నాన్నగారూ, నా కాయ అరవైమూడో గడిలోనికి వచ్చింది. భక్తి నిచ్చెన యెక్కి బ్రహ్మలోకం ఎనభై మూడోగడిలోకి వెళ్లింది.

రత్న— మళ్లీ నా కాయ నాపామే కరిచింది. పదిహేడో గడిలోంచి మళ్లీ ఆరవగడిలోకి,

రాధా—నీ కొక్కత్తెవే లేవు. నేనూ ఉన్నాను. మళ్లీ నీ దగ్గరికి వచ్చాను.

మన్మ—[illegible] వచ్చాను. ఈసారి రెండు [illegible] [illegible] వస్తుంది.

కోయి—అసలే, పాము [illegible] [illegible] వాకా [illegible]. ఈ అక్షరాలేమిటి? [illegible] నాకు కామము లేదే?

మన్మ—ఉన్నా లేకపోయినా అదిగో పిల్లి జన్మ రొస్తావు. ఆ పిల్లిగడిలో పెట్టు.

రా—ఎవ్వే! నాకోసలికి యేమీ కామం లేదంకే. అంతా భక్తి, జ్ఞానము, వైరాగ్యము, జపతపాలు! రెండింకమికొక్కొకుండా టీ తాగడం! గొరవాసి!

కోయి—నేనే తాగుతున్నానా? మీ అబ్బాయి తాగటం లేదా? మామగారు తాగటం లేదా?

రా—ఛీ, నోరు ముయ్యి.

మన్మ—(నవ్వుతూ) సంసారమంతా బయటపెడుతున్నావు. పరాయి పెద్దమనుష్యులు వస్తే, మన సంగతంతా వాళ్లకు తెలియనా?

రాధ—నాయనా, మంచి బోడుకువు దొరికావురా.

శ్రీని—నా కాయ వైరాగ్యములోంచి వైకుంఠంలోకి వెళ్లింది. పెద్దపాము తప్పిపోయింది.

శ్యామ—నా కాయ డెబ్బైతొమ్మిదిలో నుంచి నూటపదిహేడులోకి వెళ్లింది. కైలాసంలోకి. ఇంక రెండు చిన్నపాము లున్నవి. గర్వము, అహంకారము. అవి రెండూ యెట్లాగో అట్లా దాటానా, యింక పాముల గొడవ లేదబ్బా.

రత్న—ఎన్నిసార్లు ఈ వెధవ పాము కరవటం? మీ రంవరూ నూటపధ్నాలుగు నూటపదిహేను గళ్లకు పోవటం, నే నెప్పుడూ యీ పదిహేనో గళ్లో చావటమూనా?

[illegible] పరస్త్రీ సాంగత్యం [illegible] [illegible].

రాధా—[illegible]

రత్న—[illegible] ఇదిగో ఒకటి. [illegible]

రాధా—నే నింక ఆడలేను. పోయి పడుకుంటాను.

మన్మ—ఇదేమిటి, నా పంచెం [illegible] ఏడైయేడు, ఏడైయెనిమిది, ఏడైతొమ్మిదా? మోహమా? పాము కరిచింది? మళ్లీ మొదటి పదిహేనులోకి కష్టపుగడిలోకి వచ్చానూ? ఛీ, ఈ వెధవాట నే నాడను.

గంగా—బాబూ, ఆట మానేస్తే తీరుతుందా? పాపాలు చేస్తూవుంటాం. జన్మలెత్తుతూ వుంటాం. ఎప్పటికో అప్పుడు పరమపదం చేరాలికదా. విసుక్కుంటే యెల్లాగ? మళ్లీ ఆడాలి. ఇదిగో నీకు పదిరెండుకు? నా కాయ చూడు. నూటఆబులోకి వచ్చింది. పెద్దపాము కరిచింది. ఒకటవగడిలోకి వచ్చింది. నాకన్న యింకా ఆరుజన్మలు ముందు వున్నావు.

శ్యామ—నా కాయ పరమ పదంలోకి చేరింది.

శ్రీని—నా కాయ అహంకారంలోకి చేరింది. పాము కరిచింది. అహంకారము నుండి రాక్షసజన్మ వచ్చింది. నూటఇరవైయొకటినుండి తొంభైతొమ్మిదవ గడికి. ఏదో ఇల్లాగే చేరుతూవుంటాం. పాము కరుస్తుంది. మళ్లీ నిచ్చెన యెక్కుతాం. నేను పోయి పడుకుంటాను.

మన్మ—నేనూ పోయి పడుకుంటాను.

రాధ—మీ నాన్న వెళ్లారా? నేనూ పోయి పడుకుంటాను.

కోయి—మే మందరం పోతున్నాము. మీ రిద్దరూ ఆడుకోండి.

గంగా—మళ్లీ [illegible] [illegible] వచ్చాను.

రత్న—[illegible] [illegible] కనుకుంటాం.

గంగా—[illegible]

రత్న—[illegible] న్నారు.

గంగా—ఇదిగో [illegible]. మళ్లీ పాము కరిచింది.

రత్న—ఇంక నా నాయన పైకి పోడు. ఆడి తేమి లాభం?

గంగా—అవును? ఏమి లాభం. సరేగాని యింతమందినీ ఆడిస్తే నీ కాయూ, రాధా గాంధారి కాయా అట్లా మాటిమాటికీ అ పరస్త్రీసాంగత్యపు గడిలోకి [illegible] పోతూ వుండటం చూస్తున్నామే, ఆయన నీ కేమవుతాడున్నావు?

రత్న—ఎన్నిసార్లు చెప్పాను? వేలు విడిచిన మేనత్త కొడుకు.

గంగా—చిన్నప్పు డాయన మీయింట్లో వుండే చదువుకునేవాడా?

రత్న—అవును.

గంగా—నీకూ, అతనికీ బాగా స్నేహం వుండేదికాదూ?

రత్న—ఏమి టీమాటలు?

గంగా—అత నున్నూ, అబ్బాయీ ఫొటోగ్రాపు తీయించుకుంటే వాళ్లిద్దరిలో యెవరు యెవరో తెలియకుండా వున్నారు కాదూ?

రత్న—మీ మాటలు నాకర్థం కావటం లేదు.

గంగా—నీ కొక విషయం చెప్పనా? ప్రేమలేని చోట శరీరసంపర్కం వున్నా సంతానం కలగదు.

రత్న—మనకు కలిగిందికదూ?

గంగా—అబ్బాయి కిప్పుడెన్నో యేడు!

రత్న—ముప్పైరెండవ యేడు.

గంగా—నీవు కాపరానికి వచ్చి మూడేళ్ళ రెండేళ్లయినది. తరువాత పన్నెండు సంతానం లేదు. ఈ కొడుకు పుట్టింగా నా ఛారం గనే ఉన్నాడు. వైకుంఠపాళి ఆట లోంచేటి నీ యిద్దరి కాయలూ ఒక చోటే పండినవి. ఇప్పుడు నాకు డెబ్బై అయి దేళ్లు వచ్చినవి. నీకు నలభైయేళ్లు వచ్చినవి. నువ్వు కాపరానికి వచ్చిన క్రొత్తరోజుల్లో యీ సంగతి నిన్ను తరచితరచి కొన్ని సంవత్సరాలు అడిగాను. నువ్వు ఒట్లూ సత్యాలూ పెట్టుకుంటే నిజమే ననుకొన్నాను. ఇవ్వాళ ఫొటోగ్రాఫు, వైకుంఠపాళి— రెండూ నిజాన్ని తెల్పినై.

రత్న—మీ కీ అనుమానాలు తీర్చటం చాలా కష్టం. నలభై యేళ్లు సంసారం చేశాము. నేనేం చిన్నదాన్నా, చితక దాన్నా? కొత్తగా కాపరానికి వచ్చిన భార్యని పసివాళ్లు అడిగినట్టడుగుతారు. ఎవళ్లయినా చూస్తే నవ్వుకుపోతారు. ఇంక చాలుగాని, ప్రొద్దుపోయింది, పడు కోండి. మంచంక్రింద నీళ్లు పెట్టాను.

గంగా—అంత మప్పికగా మాట్లాడలేక పోతే ఆడదే కాదు. నలభై యేళ్లు కన్ను కప్పావు. నా యౌవనవాంఛ నీ మాటల వెనుకవున్న అయథార్థాన్ని చూడనిచ్చింది కాదు. ఇప్పుడు విస్పష్టంగా కన్పిస్తోంది. ఈ కొడుకు నా కొడుకు కాదు. నేను ఎవరికోసం నా బ్రతుకంతా ధారపోశానో తెలియటంలేదు.

రత్న—వాణ్ణి పెంచారు, పెద్దవాణ్ణి చేశారు. ఒక యింటివాణ్ణి చేశారు. మీ రంటే వాడికి, వాడంటే మీకూ పట్టరాని ప్రేమ. మన మిద్దరమూ ఆశలన్నీ వాడిమీద పెట్టుకు బ్రతుకుతున్నాము. ఇవ్వాళ వాడు నా కొడుకు కాడూ అంటే వాడేమా తాడు? లోకం ఏమంటుంది? మీరు కాద న్నా వాడు కాకపోతాడా?

గంగా—నేను కాదనటానికి వీలులేదు. నా ఆస్తికి సంబంధించినంతమట్టుకు వాడే కొడుకు. కాని వాడు నా కొడుకు కాదు. ఆ విషయం నీవన్న మాటల్లోనే వుంది, వాణ్ణి పెంచారు, పెద్దవాణ్ణి చేశారు అన్నావుగాని వాణ్ణి కన్నారు అని అన్నావా?

రత్న—అనిగో, యేమైనా అంటే అల్లా అర్థాలు తీస్తారు. నా వుద్దేశ్యం అది కాదు.

గంగా—ఎందుకు మాట మళ్లిస్తావు? నీకు తెలియకుండానే నిజం నోటివెంట వస్తుంది.

రత్న—అర్ధరాత్రివేళ యెందుకీ రగడ పెంచుతారు? ఇంక చాలు, పడుకోండి. మీరు ఏ ప్రమాణం చెయ్యమంటే ఆ ప్రమాణం చేస్తాను.

గంగా—ప్రమాణం చేయటం కాదికి వచ్చేటప్పటికి మనస్సుకి బలం వచ్చింది. ఈజీవితం చివరిదాకా ఇలా వెళ్లబుచ్చేందు



"నామాటవిని ఒడ్డుకురండి. లేనిపోని అనుమానాలు పెట్టుకొని, శాంతంగా ఉన్న సంసారాన్ని నట్టనడిబజారు లోకి ఎందుకు తీసుకు వస్తారు?"



# చైత్రవసంతం

శ్రీ దొడ్లేటి వెంకటకృష్ణయ్య

చైత్రవసంతం చిగురించింది
నవహృదయాలను కదిలించింది.
పర్ణవిపర్ణత శమియించింది
తుహినావరణం విరమించింది
కష్టపరంపర విడిపోయింది
రమణీయాకృతిగా మారింది. చైత్ర॥

కోకిల పికగణములు కులికినవి
ప్రేమవాహినులు వర్షించినవి
సుమమృదుపథములు చూకందినవి
సుఖరాజ్యాలను విరచించినవి. చైత్ర॥

మంచానిలములు పయనించినవి
నవపల్లవములు రుచిగొల్పినవి
ప్రణయభావములు రూపొందినవి
వసంతశోభలు ప్రసరించినవి. చైత్ర॥

ఇచ్ఛాంకురములు ఉదయించినవి
ఆశావనత లెగబ్రాకినవి
మధురభావములు పుష్పించినవి
సుధానుభూతులు ఫలియించినవి. చైత్ర॥

ఆశాపూర్ణత రాణించింది
సౌఖ్యాంబరముల చుంబించింది
మాన్మథసంస్కృతి కళలీనింది
ప్రకృతిసౌరభం జ్వలియించింది. చైత్ర॥

నూతనవిశ్వం జన్మించింది
సహస్రవీథుల వికసించింది
అనార్ద్రక్రూరత విహరించింది
ప్రాణాహుతులను కబళించింది. చైత్ర॥

కాలప్రవాహం స్మృతికందింది
వీరపౌరుషం మదిసిల్పింది
ధర్మావేశం ప్రభవించింది
కార్యోత్సాహం ఉప్పొంగింది. చైత్ర॥

వేదఘోషలే వినిపించినవి
యజ్ఞాంగణములు కనుపించినవి
శూరుల గాథలు ప్రవహించినవి
ఇతిహాసమ్ములు కనువిప్పినవి. చైత్ర॥

జాతిసౌష్ఠవం నిర్మించండి
ఆత్మగౌరవం కాపాడండి
బద్ధాంజలులై సృష్టించండి
నవీనభారతదేశపు జీవం. చైత్ర॥

చ్యుతమైపోయిన ధర్మాచరణం
నవజీవనమున మొలకెత్తింది
కలికాలంలో భారతవర్షం
అభ్యోదయమున పులకించింది. చైత్ర॥





# ఆంధ్రుల సంగీతము

= శ్రీ వింజమూరి వరాహనరసింహాచార్యులు =

కర్ణాటకసంగీతప్రశస్తి ఆంధ్రులవలన కలిగిన సంగతి వారి ఔన్నత్యము-ప్రతిభ-వ్యక్తిత్వము లనెడి గుణములకన్న సంగీతమే చాటగలుగును. ఆంధ్రుల స్వకపోలకల్పిత - వ్యక్తిత్వముల గొప్పను గల యింపబడిన కర్ణాటకగానమును తదితర ప్రవిణదేశస్థులు ఆదరించి అనువదించి విస్తరింపజేయుట కూడ ఆంధ్రుల అనన్యసామాన్య ప్రతిభను వెల్లడించును. సంగీతమునకు ఆంధ్రులు చేసిన సేవనుగూర్చి ఇప్పుడు తెలియుదము.

౧౭, ౧౮, ౧౯ శతాబ్దములందు తదితరకాలములందుకన్న సంగీతము సర్వతోముఖాభివృద్ధి గాంచినట్లు తెలియుచున్నది. ఈ కాలముననే గానకళామతల్లి సర్వాంగశోభితయై, నవనవరుచిరాలంకారముల బుష్టిజెంది యుండెనని చూతుము. ఈ క్రింది విషయములను అంగముల చొప్పున నాకాలమున సంగీతము అభివృద్ధిగాంచెను: (౧) రాగాన్వితగేయములు, (౨) లక్షణగేయములు, (౩) మనోధర్మాభివృద్ధి హేతుకములను కల్పన గీతికలు, (౪) భక్తిపూరిత సంకీర్తనలు, (౫) రాగాలాప్తి, (౬) పద, వర్ణ, జావళ్లు (౭) వాద్యవిశేషాదికములు, (౮) నాట్యము, (౯) కాలక్షేపము, (౧౦) దృశ్యప్రదర్శనములు (నాటకములు మున్నగునవి).

ఇయ్యది యాంధ్రుల యసమానప్రజ్ఞాదుల జాటగలదు. ఆంధ్రులయొక్క గానశాస్త్రవిజ్ఞానము, సంగీతప్రజ్ఞ, నాట్యకౌశల్యము పైయంశము లన్నిటి యభివృద్ధికి కారణమగుచుండెను. తెలుగువారి తెలుగు గేయములు దక్కిన దక్షిణప్రాంతములవారికి కొనసాగునవై, అనుకరణీయములై, అనుసరణీయములై యుండెను. అందుచేతనే అన్యులును తమ తెలుగుసోదరులవలె తెలుగుభాషనేర్చి గేయములు కూర్చుచుండిరి. తెలుగుభాషకుగల ప్రశస్తియే - మాధుర్యమే - సంగీతానుస్యూతియే - తాళహాకడల కనురక్తియే అట్టి భాషేతరులను కూడ తెలుగువాగ్గేయకారులుగ జేయజాలియుండెను.

ఇంతకుమున్ను గేయములు తెలుగునను, సంస్కృతమునను, అరవమునను, కన్నడమునను ఉంట కందుము. జయదేవుని అష్టపదులు, తాళ్లపాకంవారి సంకీర్తనలు, ఆళ్వారాదుల దివ్యప్రబంధములు, పురందరవిఠలుని కన్నడ "దాసరిపాటలు" మున్నగునవి ౧౭-వ శతాబ్దమునకే వెలుగడి విఖ్యాతములై యుండెను. మరియు తెలుగున జక్కులపాటలు, వీధినాటకములు మున్నగునవియు, అరవమున పాసురములు చిందులు మున్నగునవియు అనాదినుండియు గలవు. శ్రీరామకవికృత "రామాష్టపదులు", శ్రీచంద్రశేఖరేంద్రసరస్వతీస్వామికృత "శివాష్టపదులు", రాజవిశ్వనాథసింహావిరచిత 'సంగీతరఘునందనము' ఇత్యాదులు, జయదేవుని 'గీతగోవిందము' నుబోలు ప్రబంధములు అప్పటికి ప్రఖ్యాతములుగ నున్నవి.



మరియు ౧౭-వ శతాబ్దమున "శ్రీ కృష్ణలీలాతరంగము" శ్రీ నారాయణయతీంద్రులు సంస్కృతమున బాడి విశ్రుతకీర్తిగడించిరి. వీరి దేశకాలనిర్ణయమునకు వీరి విరచి

తిరు లంతగా వర్ధిల్లుచుండెను. కాని ఇప్పటి అన్ని ప్రతులలో లేని సాహిత్యము లేని ప్రచారమున బాహువుళ్ళనాయిలో, ఉదాహరణగా "ఆనంద ఫాలం నవనీతచోరం బృందావనసంచారం" అను గీతమునందు "లాలిత శ్రీ అంబికేశ్వరాంతః కరణనిహరా" అని యుండుటచే నితని గోత్రనామాదికము తెలియుచున్నది, వారు శ్రీ భగవదాచార్యు లనియు తెలియుచున్నది. అందుచే వీరును దక్షిణ గోదావరీ తీరములు సేవించుచు చరమా వస్థయందు వసించినట్లు తెలియుచున్నది. ఇచ్చట శ్రీ కృష్ణజయంతి బహుఘనముగ జరుగును. జను లీ యతీంద్రుని తరంగములన్నియు పాడుచుపాడుదురు. ఇచ్చట శ్రీ నారాయణతీర్థుల సమాధియు గలదు. ఈయన గేయములు నృత్యయోగ్యములు. భరత నాట్యప్రవీణులు ఈ తరంగములను ప్రజ్ఞతో నభినయింతురు.

కనుక ఈ కాలమునకు పూర్వమునను, అనగా ౧౫, ౧౬, ౧౭ శతాబ్దములనుండియు తెనుగు గేయవాఙ్మయము విరివిగ నుండుట కందుము. జక్కులపాటలు మున్నగునవి ప్రాచీనములుగ నెంచ వచ్చును. ౧౬-వ శతాబ్దమునుండి ౧౭-వ శతాబ్దార్థముపరకు (౧౬౮౧) తాళ్ళపాకంవారి సంకీర్తనలు, క్షేత్రయ పదములు రాగ తాళములతో జక్కులపాటలును, చంద్రికలు, ఏలలు మున్నగు వానికన్న తీర్చబడినవై భావమంతమై భక్తివంతములుగ నుండుటచే జనబాహుళ్యవ్యాప్తి నొందెను. ఇప్పటికీ కీర్తనలు మరుగుపడియుండుట శోచనీయము. కొందరిలో "నా మొరాలింపవే", "హరిపద తీర్థమే" అనున వివ్వడు వాడుకలో నున్నవి.

తాళ్ళపాకంవారి సంకీర్తన పద్ధతి ఏమ యాంతరంగికాను భవములను- రోమరోమమునకు ననుభవించిన భక్తిభావములను- భగవ ద్గుణానుసంధానమును- వెల్లడించుటకును, భగవంతుని గీర్తించుట కును అనువుగ నుండుటచే రామదాసాదులు వీని ననుకరించి అట్లు పాడుచుండినట్లు తెలియగలము.

"ధ్యాయన్ కృతే, యజన్ యజ్ఞై స్త్రేతాయాం, ద్వాపరేర్చయన్
య దాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవం."

అని చెప్పబడినట్లు ఈ కలియుగధర్మమును ననుసరించి కేశవ కీర్తనము ప్రాయముగుట దెలిసి భగవంతుని తమ సంగీత గరిమచే పాడుచు నాడుచు నానందించు మన వాగ్గేయులు మాననీయులు. వీరి కీర్తనలు భావము- రాగము- తాళము వీని చేరికతో నుండుటచే ప్రతివారికి సులభగ్రాహ్యములై సంకీర్తనము చేసికొనుటకు వీలుగ నుండెను.

భక్తిభావములు సులభముగ చెప్పుటకు సంకీర్తన ముక్కరకు వచ్చుటచే గాబోలు ప్రజలకు రాగకళాభిమానము హెచ్చెను. రాగము లట్లంతకంతకు మెరుగుపెట్టబడి తీర్చబడుటయు కందుము. ౧౭-వ శతాబ్దమున రాగములట్లు కర్ణాటగానమున పరిపూర్ణత నొందె నని యప్పటి లక్షణమందలి శాస్త్రగ్రంథములవలనను, లక్ష్యమందలి కీర్తనాదిగేయములవలనను తెలియుదుము. ఈ శతాబ్దమునుండియు స్వకీయముగ పూర్ణరూపము దాల్చిన రాగకళాబాలిక ౧౮-వ శతాబ్దమున పుష్టి జెంది జీవస్వరయుతగమకాద్యలంకారభూషిత శోభాయమాన యౌవనమున దసకోత్తర కన్యకయై- సమస్తరాజాధిపుల ప్రేమపాత్రమై, వారి నిండోలగమున క్షేత్రయాదినృత్య వేదుల ప్రేర ణచే తాండవించు నృత్యకర్త్రియై, ౧౯-వ శతాబ్దమునను ప్రకాశించు చుండెనై, త్యాగరాజాద మహాభక్తులను వరించు అభిసారికయై ఈ దినమున నభివృద్ధినొందుట నెర్తుము.

## [illegible] వేంకటముఖి

౧౭-వ శతాబ్దమున వేంకటముఖి తన నిర్మితములను డెబ్బది రెండు మేళకర్తలందును లక్షణగీతములు విరచించు రాగములను స్థిరముచేసెను. మంగళకైశికరాగమున ముక్తపదగ్రస్తమున గీతమును, గౌళలో "తక్కతిక్కతొంగిణతొంగి" అను తన్నాకరగీతమును, భైరవిలో "శ్రీరంగప్రబంధము", నారాయణగౌళలో "కైవారప్రబం ధము" మున్నగునవి పాడినాడు. వీనియందలి రాగగమకవిధులు అనన్యసామాన్యములు. ఇట్లు ౭౦ రాగములవరకు ఎంచి అసమాన శయ్యతో వానిని గమకయుతజీవస్వరాధికమున గీతములందు నెల యింపజేసినాడు. ఈయనలక్షణగీతము లిప్పుడు పాఠకులు తమ సంగీతప్రదర్శనములందు పాడకపోవుట శోచనీయము. ఈయన కొన్ని మేళకర్తలను వక్రసంచారయుతములుగ చెప్పుట శుద్ధ గాంధారనిషాదములను సాధారణగాంధార కైశికనిషాదములతో చేర్చునప్పటి వివాదిదోషమును పొందకొలుట కని గ్రహింతుము.

## రామదాసు

ఈయన అసలు పేరు కంచెర్ల గోపన్న. నెలకొండపల్లి వాస స్థానము. భద్రాద్రియందలి శ్రీరామునిపై మక్కువగలిగి తాను తహసీలు ఉద్యోగమున నుండియు సర్కారుపైకము నంతయు రామాలయ నిర్మాణమునకు వెచ్చించి శిక్షనొంది మరింత భక్తితో శ్రీరాముని రక్షింప వేడి కృతకృత్యు డాయెను. శ్రీరామునిగూర్చి భక్తిమానసమున పెక్కు కీర్తనలు పాడెను. ఈయన కీర్తనలు పద గుంఫనము లేని తేలికమాటలతో నుండుటచేతను, రాగ తాళములు సుసాధ్యములై పామర వేద్యము లగుటచేతను, భావములు పుంఖాను పుంఖములై ఆంతరంగికానుభవములను దెలుపుటచేతను దక్షిణాపథ మంతయు విస్తరింప గలిగెను. అరవలు, కన్నడులు, కేరళులు అందరు ఈయనకీర్తనలు సభలందును, భజనలందును, సమాజము లందును పాడుచున్నారు. తెనుగుదాసరులు పట్టెడు నామములు ధరించి నృత్యముతో విలీనమానసమున వీనిని పాడుట కందుము. వీనియందలి రాగకళ అతిసులభము. సుసాధ్యము. మధురము. ఈయన తానీషాకాలమున (అనగా క్రీ. శ. ౧౬౭౩ - ౧౬౮౭) నుండెను.

## క్షేత్రయ

సంగీత లోకమున క్షేత్రయ నెఱుగనివా రుండరని నా నమ్మ

పండితులు దేవి యనుగ్రహమును సంపాదించెను. ఒకనాడు మధుర మీనాక్షి స్త్రీ వేషమున పలనిపడవ వచ్చి దయనిండిన కోటు కమ్మెలను (?) నమియ నతనికు మహాప్రసాదముగ నొసంగినదంత కోటుసంగతిన ఆమ్మెల పన మాటకొలది కీర్తనలు గేయకల్పనలతో గానముచేయుచుండెను. ఈయన ధాతువులకంటె అర్థపుష్టి ననుసరించెను. తన కీర్తనల యందీయన "విజయగోపాల" ముద్ర నుంచినాడు. ఈయన కీర్తన లందు పల్లవియందె కొన్ని ఆవృతములును, అనుపల్లవిలో సందర్భమును, చరణమున పల్లవియందున్ని కొన్ని అన్ని ఆవృతములును కలవు. అన్నిట మూడు చరణములు కలవు. ఉదాహరణముగ నాట కురంజిలోని "నిను మించినవాడు", కాఫీలోని "నీవే నన్ను బ్రోవవలె నమ్మ" అను కీర్తనలు చూడవలెను. "ఇంకా దయరాదా" అను కళ్యాణికీర్తనలో చరణము మధ్యమకాలమున నున్నది.

## ఘనం సీనయ్య

ఈయన సంగీతమందును, సంస్కృతాంధ్ర భాషలందును ప్రవీణుడు. వంగలకులమునకు జెందిన వైష్ణవ బ్రాహ్మణుడు; ఆత్రేయసగోత్రుడు. శ్రీ విజయరంగ చొక్కనాథుని మంత్రిగ నుండెను. శేషం వేంకటపతి కవికృత "తారాశశాంక" ప్రబంధకృతి భర్త. గేయకల్పనల చాతురి వెల్లడించు పెక్కు కీర్తనలు, పదములు పాడినాడు. ఈయన కృతులందు "మన్నారుగుడిరంగ" ముద్ర కలదు. సావేరిరాగమున "సేవించి ధన్యుల మయ్యేము" అను గేయ మీయనను గూర్చి చెప్పబడెను. ఈయన కృతమగు "శివదీక్షా పరురాలనురా" అను పదము ప్రతివారు నెఱిగియున్నారు. దర్బారులో "మగ వాడని", నీలాంబరిలో "మగవాడు పిలిచితే", శంకరాభరణములో "వాడెవరో మన మెవరో" అను పదములు ప్రసిద్ధములు. వీనియందలి రాగరసమంతను చవిచూడగలము. ఈయన సంగీత విద్యావ్యాసంగమును గూర్చి శేషముకవి యిట్లు చెప్పుట చూడుడు:

"హాహాహూహూహులు గానగర్వమున హాహాహూహూ హూ వంచున్ స్వరా
రోహప్రక్రియ గాతురంగతములై రూప్యంబునానన్ వృథా
సాహంకారులు మర్త్యగాయకులు జోడా నీకు పాండ్యేశ్వర
స్నేహాలంకృత వంగలాన్వయమణీ సీనాకవిగ్రామణీ."

## మార్గదర్శి శేషయ్య

ఈయన శ్రీ వైష్ణవ బ్రాహ్మణుడు. తెనుగునను, సంస్కృతమునను పెక్కు కీర్తనలు పాడెను. అయోధ్యయందు కొంతకాల ముండి దక్షిణమున శ్రీరంగక్షేత్రమున కేగి యట శ్రీరంగనాథుని భక్తితో సేవించి యాదేవుని యనుగ్రహమున కీర్తనలు చేసెను. పెక్కువందల కీర్తనలు విరచించినను శ్రీరంగనాథుడు అరువది కీర్తనలు మాత్ర మంగీకరించెనట. తక్కినవి చదలు పాలాయెనట. తన కోసలదేశవాసము జ్ఞప్తికి దెచ్చుకొనుచు కీర్తనలందు "కోసల" ముద్ర నుంచినాడు. కాఫిరాగమున "రంగపతే పాహి మాం" అను కీర్తనలోని అనుపల్లవి మధ్యమకాలమున నున్నది. చరణముతుదయా వృతములుకూడ మధ్యమకాలయుతములుగనున్నవి. విస్పష్టముగవ్యక్తములగు రాగములతోను, మధ్యమకాలావృతములతోను, హృద్యమగు సంస్కృతవాక్యకతోను గల ఈయన కీర్తనలు మార్గదర్శకములుగ నుండుటచే నీయనను మార్గదర్శి శేషయ్యంగారనియు బిలుచుచుండిరి. ద్విజావంతి, కర్ణాటకసారంగ మున్నగు అపూర్వక్రియాంగరాగము లందును ఈయన గేయములు కూర్చెను. కళ్యాణి, కేదారగౌళ, శంకరాభరణము, భైరవి, సావేరి, ఆరాణ, సురటి, బేగడ మున్నగు బహువ్యాపకరాగములందలి కీర్తనలు మిగుల శ్రావ్యములై - గేయకల్పనానానావక్రప్రయోగములై - రాగరసపూరితములై యున్నవి.

## గిరిరాజకవి

ఈయన ఆంధ్రబ్రాహ్మణుడు. శ్రీ త్యాగరాజీయనమను మడే. ఈయన మహారాష్ట్రాస్థానమున నుండి ఆ మహారాజువలన నమితగౌరవము వడసి పెక్కుకీర్తనలు పాడెను. అందుచే నీయన కాలము క్రీ. శ. ౧౭౫౦-౧౮౫౦ న నెంచనగును. కాంభోజిలోని "మాయ నవంచన నమునగు" అను కీర్తన ప్రసిద్ధము.

## గోవిందస్వామిఅయ్య

ఈయనవూనికి ఇప్పటి చిత్తూరుజిల్లాయందలి కార్వేటినగరము. ఈయన తెనుగుబ్రాహ్మణుడు. కార్వేటినగరాధిపుడు వేంకట పెరుమాళ్లురాజేంద్రునిచే బహూకరింపబడి ఆ యాస్థానమున నుండెను. తౌర్యత్రికాత్మకసంగీతమున నమితప్రజ్ఞావంతుడై, భరత నాట్యప్రవీణుడై యానిరుపమగు వాఙ్మయనిర్మాతలలో క్షేత్రయ వలె స్థిరకీర్తిని గడించెను. క్షేత్రయపదము లుచితకాలములో నాట్యలోకము నరికట్టగలుగుటచే అవిషమగు వాఙ్మయమును పెక్కు అనంతరమువారు నిర్మించుచుండిరనియు, నందు గోవింద స్వామిఅయ్య అగ్రగణ్యుడనియు దెలియుచున్నది. ఈయన పదవర్ణరచనకు గడంగి, నటకులకు మార్గదర్శకుడుగ నుండెను. ఈ పదవర్ణములందలి తాళసోకసలు-జాతులమార్పు ననుసరించు జతిస్వరరీతులు ఆశ్చర్యానందకౌతుకములు. ఈయన పదవర్ణములు పాడినచో ఇప్పుడు పాడుచుండు పల్లవి వీలయని తోపించును. మోహనరాగమున "సరిగా దాని" అను పదవర్ణము వేంకటపెరుమాళ్లు రాజేంద్రుని ముందు నృత్యమున నభినయించి అమితసన్మానము నొందినట్లు తెలియుచున్నది. ఈ వర్ణము గూర్చి మరియొక సంగతి దెలియుచున్నది.

వేంకటపెరుమాళ్లురాజుగారు వేంకటగిరి రాణిగారినే వివాహమాడి యామె నట పుట్టినింట నుంచి యేమరియుండెను. ఆమె గురుడు గోవిందస్వామి అయ్య భర్తకడకు జేర్చుట కుపాయము పన్ని, ఆమెతో కార్వేటినగరము జేరి రాజుగారి కొలువున మగ వేషమున నామెను మోహనవర్ణమును నభినయింపజేసి రాజాదరణ వడసెను. రాజుగారు ఆమెనృత్యమునకు కడు సంతసించి తన

## టాజ్ మహల్ వలె

వజ్రమును నిర్దుష్టముగా
అందముగా ఉండాలి.

---

ఉత్తమాభరణములు సృష్టించ
గల పనివారు మా కున్నారు.



10



12

**వజ్రము లెన్నడూ నశించవు**



11



13

# ఉమ్మిడి రామయ్య శెట్టి, గురుస్వామి శెట్టి,

## నగల వర్తకులు.

**23-25,** చైనాబజారు రోడ్డు, మద్రాసు.

టెలిఫోన్ : **2802.** టెలిగ్రాం : **"VUMMIDIAR"**


కట్టడపు భాగముల అభివృద్ధి.
భారతదేశపు యుద్ధానంతర సమస్యలు అమలులో పెట్టుసరికి గొప్ప గొప్ప నూతన భవనములు కట్టబడును. అవి కర్మాగారములు. ఆఫీసులు, ఆస్పత్రులు మరియు బడులు. వెడల్పైన పై కప్పుగల ఏ భవనమునైనను ఉక్కు లేకుండ కట్టుట అసాధ్యము,
తాతా ఉక్కు.
TATA STEEL
ది తాతా ఐరన్ & స్టీల్ కం॥ లి॥ వారిచే ప్రకటించబడినది.
హెడ్ సేల్స్ ఆఫీసు.
102 ఎ, క్లైయివ్ స్ట్రీట్, కలకత్తా.
JWT (E) LTD.

లప్పిదము నెఱగి ఆమెను భార్యగ గొని సుఖమున నుండెనట. నాట్యవేదు లాకాలమున నెంత ఘనత గాంచినదియు నీ సంగతి చాటగలుగును. రాజన్యుల లేమ లేమి, ధనాధిపుల పడుచు లేమి, బ్రాహ్మణపాప లేమి, వృద్ధు లేమి, పిల్ల లేమి, అందరు నాట్య మెరిగి, నాట్యవేదులై, అభినయప్రియులై యుండిరని తెలియు చున్నది. ౧౮-వ శతాబ్దమున భరతనాట్యము జనాదరణ నొందినట్లు మరి ఇతర కాలములందు కానము. గోవిందస్వామి అయ్యా కేదార గౌళరాగమునను, నవరోజు, ముఖారిరాగములందును పదవర్ణములు విరచించి నృత్యము చేసినట్లు తెలియుచున్నది. ఈయన తమ్ముడు కువనస్వామయ్యా నాటకురంజిరాగమున "ఇంత అలుక" అను పద వర్ణమును పాడెను. గోవిందస్వామి అయ్యా కాలము క్రీ. శ. ౧౬౮౦-౧౭౧౦ అని తెలియుచున్నది.

## మాతృభూతయ్యా

ఈయన త్రిలింగబ్రాహ్మణుడు. సంగీత కళయందును, ఆంధ్రమునను మిక్కిలి ప్రజ్ఞ సంపాదించి యుండెను. త్రిశిరగిరియందు కుంతలాంబను భక్తితో సేవించి ఆమె యనుగ్రహమున పెక్కు కీర్తనలు, గేయకల్పనలు వెలయు పదములు పాడెను. "పారిజాతాపహరణము" కూడ పాడెను. కడులేమి ననుభవించుచు నితడు "కాళికర్పణమీవలెనమ్మ" అను కీర్తన పాడునప్పుడు స్వప్నమున కుంతలాంబ "తంజపురి కేగుము. ప్రతాపసింహ మహారాజు నిన్నాదరించు" నని పలుకునంత అచ్చట కేగి రాజదర్శనము చేసెను. ప్రతాపసింహ మహారాజు ఈయన సంగీతమునకు మెచ్చి పదివేల రూపాయల నొసగి యాదరించెను. తన త్రిశిరగిరినాయకిని దలచుచు "త్రిశిరగిరి" ముద్రతో నిరుపమాన రాగశయ్య నొప్పునట్లు కీర్తనలు పాడుచుండెను. కీర్తనలందు అనుపల్లవిలో పల్లవియందు గల యావృతములకు రెట్టింపు ఆవృతము లుండును. చరణమున ననుపల్లవి కన్న రెట్టింపు ఆవృతము లుండును. వీనియందు సామాన్యముగ మూడు చరణము లుండును. తోడియందలి "తరలిహాయ్యేసమయము" సారంగలో "ఉమా హిమాచలకుమారి" కళ్యాణిలో "కనుగొని పాపవిముక్తుల మయ్యేము" కేదారగౌళలో "శంభో పుర మద" అనునవి ప్రసిద్ధములు. నాట్యానుగుణ్యముగ పెక్కు పదములు కూడ ఈయన రచించుటచే నాకాలమున నాట్యము సంగీతమున ప్రధానముగ నుండెనని తెలియగలము. ఈయన క్రీ. శ. ౧౭౪౧ - ౧౭౬౫ కాలమున నుండినట్లు ఎంచనగును.

## వీరభద్రయ్యా

ఈయనయు నాంధ్రబ్రాహ్మణుడే. సంగీత సాహిత్య విశారదుడు. ఈయన మాతృభూతయ్యా సమకాలికుడుగ దెలియుచున్నది. అందుచే క్రీ. శ. ౧౭౭౦ ప్రాంతమున నుండినట్లు ఎంతము. తంజపురి రాష్ట్రాధిపతి ప్రతాపసింహ మహారాజుగారి సంగీత గరిమ, అభిమానము నెఱిగి యట కేగి తన సంగీతమ్ము నాయనకు వినుపింప రాజుగారు ఈయన గానమునకు పరమాశ్చర్యము నొంది వీరభద్రయ్యను తన యాస్థాన విద్వాంసునిగ గ్రహించెను. ఇట్లు రాజాశ్రితుడై పెక్కు రక్తిరాగములందు "ప్రతాపరామ" ముద్రతో కీర్తనలు పాడుచుండెను. రాగములను ఘనయదేశీయముల నొప్పున దీర్చి వాని నన్ని వెలయించి సంగీత లోకమునకు మార్గదర్శకుడాయెను. నాట్యానుగుణ్యము లగు పెక్కు పదములు, దరువులు, తిల్లనలు, చిందులు మున్నగునవి కూడ వెలయించెను. ముద్దుస్వామి దీక్షితుల తండ్రి రామస్వామి దీక్షితులు బాల్యమున వీరభద్రయ్యవద్ద సంగీతము నేర్చినట్లు తెలియుచున్నది. దర్బారులో "అక్కరో", నాదనామక్రియలో "ఆతెల్లా హాతెల్లా" నీలాంబరిలో "అలిగికూకితే", మణిరంగులో "తరుణి నిన్ను బాసి" మున్నగు పదములు ప్రసిద్ధములు.

## వేంకటరామయ్యా

ఈయన కూడ తెనుగు బ్రాహ్మణుడు. సంగీతమున ప్రజ్ఞ సంపాదించి పెక్కు కీర్తనలు పాడెను. ఈయన కీర్తనలందలి రాగశయ్య ప్రౌఢముగ నుండి నిశ్ఛేద్యమై యినుపశనగలవలె కొరుకుపడకుండునట్లుండుటచే నీయన ఇనుపశనగల వేంకట్రామయ్యా అని పిలువబడుచుండెనట. ఈయన కీర్తనలందు "గోపాలకృష్ణ" ముద్ర కలదు. బోధేంద్ర సద్గురునిపై "సతమని" అను తోడికీర్తన పాడినాడు.

## ప్రతాపసింహ మహారాజు

ఈయన తంజపురి రాష్ట్రమును క్రీ. శ. ౧౭౪౯ మొదలు ౧౭౬౫ వరకు నేలెను. మహారాష్ట్రవంశమునకు జెందియు నాంధ్ర నాయకరాజుల రాజ్యము నధిష్ఠించి వారి తెనుగు, సంగీతము లెన్న నేర్చి ఆంధ్రవాఙ్మయ నిర్మాణమునకు దోడగుచు తెనుగు కవులను, ముఖ్యముగ సంగీతజ్ఞులను బోషించెను. పైన తెలిపిన మాతృభూతయ్యా, వీరభద్రయ్యా మున్నగు వాగ్గేయకారులెట్లు ఈయనచే నాదరింపబడినది తెలిసియుంటిమి.

ఈ మహారాజు మృదంగమున నమితప్రజ్ఞ సంపాదించినట్లు తెలియుచున్నది. పెక్కు తెనుగు గేయములు రక్తిరాగములందు పాడెను. మహారాష్ట్రభాషలో నవరత్నమాలిక కూడ చేసెను.

## ఆదప్పయ్యా

ఈయనయు తెనుగు బ్రాహ్మణుడు. ప్రతాపసింహమహారాజు కాలమున, అనగా క్రీ. శ. ౧౭౭౦ ప్రాంతమున నుండెను. సంగీతమున ఈయనకు గల ప్రజ్ఞ అపారమనునది ఈయన "విరిబోణి" వర్ణము చాటగలదు. కొంతకాలమువరకు "విరిబోణి" వర్ణము పాడగలిగిన యతడు గొప్ప విద్వాంసుడుగ నెంచబడుచుండెను. ఈ వర్ణము వీణయందు నతిసమర్థతను తెలియజేయగలదు. కావున నది వీణగొడ్డలిగ నెంచబడుచుండెను. ఈయన రాగరీతులు, శయ్య యాదర్శకములు. పెక్కు దేశీయ రక్తిరాగములందు "శ్రీ వేంకటరమణ" ముద్రతో రాగరసము చిప్పిల్ల కీర్తనలు చేసెను. ఆ కాలమున నాట్యము ప్రధానముగ నుండెనని యెంచుటకు

ఈయనయును పెక్కు పదవర్ణములు ప్రథమకాలమున జేసియుండుట నిదర్శనము. ఈయన "విరిబోణి" వర్ణము పదవర్ణమే అని తెలియ గలయును. అందలి నృత్యానుగుణ్యమగు తాళజతుల కూర్పు అనుభవ వేద్యము కాని వ్రాయ వీలులేదు. పెక్కు అటతాళవర్ణములు పాడిన పల్లవి గోపాలయ్య ఈయన శిష్యుడే. ఈయన కుమారుడు ఘన కృష్ణయ్య సంగీతమున ప్రజ్ఞావంతుడై "సప్తతాళేశ్వరము" మున్నగు ప్రబంధస్వరూపయములు చేసెను. ఈయన కుమారుడు అనగా ఆదప్పయ్య మనుమడు సుబ్బుకుట్టి రసవంతమగు రాగాలాపనక్రమమున మధ్యమ కాలపల్లవులు ఎదుర కాలప్రజ్ఞ చూపున పాడు చుండెను. ఈయన ౧౮-వ శతాబ్దాంతమున నుండెను.

## సారంగపాణి

౧౭-వ శతాబ్దమున భరతనాట్యమున కనుగుణ వాఙ్మయ మభివృద్ధిగాంచినట్లు చూచితిమిగదా. క్షేత్రయ యనంతరము ఆయన పదములను బోలునవియు, నృత్యానుగుణ్యములునగు పదవర్ణములు, తిల్లనలు, దరువులు మున్నగునవి విరచింపబడుట యా కాలమున తెలియుచున్నది. ఆ కాలముననే సారంగపాణి అను నాయనయు పెక్కు పదములు తెలుగున "వేణుగోపాల" ముద్రతో వెలయించినాడు. దేశీయరక్తిరాగములందు రాగరసము చిల్కు నాయకీ నాయక భావములు వెల్లివిరియ రచింపబడిన ఈయనపదము లిప్పుడు సంగీతజ్ఞులు పాడకపోవుట శోచనీయము. ఇయ్యవి చౌకకాలమున వెలయింపవలసియుండుటచే గమకాన్వితములుగ పాడుట కశక్తిరే యిందుకు కారణముగ దోచును.

సారంగపాణి వాసస్థానము కార్వేటినగర ప్రాంతమని తెలియ నగును. ఆ ప్రాంతమందు వాడుక గల సామెతలు, సామ్యములు, పదములు ఈయనకృతులందు చూతుము.

మరియు నాకాలమున విరచింపబడిన పెక్కు పదములు "పరిమళరంగ" ముద్రతో కలవు. నాయకీనాయక భావానుగుణ్యములు రాగపోకడలతో రసము చిల్కుచు జీవకళతో గల ఈ పదములు నృత్యవేదుల కానందదాయకములు. అనన్యసామాన్య ప్రతిభాప్రకటితములు. తెనుగువారి సేత నుగ్గడించు మేలుబంతులు.

ఇయ్యవికాక మరిపెక్కు ముద్రలతో వెలయింపబడినవియు, కృతికర్తలు తెలియరానివియు నగు పదము లా కాలమునాటివి చూతుము. ఇయ్యవి నాట్యానుగుణ్యములుగను, రాగకళాపోషకములుగను, నాయకీనాయక భావప్రకటితములుగను, శృంగారతత్వవేదన సమర్థములుగను నుండుట దెలియుదుము. రాగభావమును పకటించు స్వరచిట్టలు కొన్నిట చేర్పుగ తాళజతుల చొప్పున కూర్పబడియుండుటయు జూతుము.

## పల్లవి గోపాలయ్య

ఈయన ఆంధ్రుడు. ఆదప్పయ్య శిష్యుడు. ఈయన అమరసింహమహారాజు కాలమున (అనగా క్రీ. శ. ౧౭౮౭-౧౭౯౮)నుండి నట్లు తెలియుచున్నది. సంగీతరత్నాకరాదిగ్రంథములందు చెప్పబడిన రూపకాలప్తి ననుసరించు పల్లవిపాడుటలో నతిసమర్థుడు. ఘననయ దేశీయరాగముల చొప్పున అటతాళమున వర్ణములు విరచించెను ఈయనరాగశయ్య, తాళజతిపోకడల నేర్పు "వనజాక్షి" అను కళ్యాణి వర్ణమునను, "కనకాంగి" అను తోడివర్ణమునను నేర్వగలము. తాళజతుల ననుసరించు స్వరతానములు నృత్యము ననువదించునని ఎంచి కాబోలు పదవర్ణములకు బ్రతిగ తానవర్ణములు ఈయన కూర్చినాడు. తదితరులు వీనిని నేర్చి ఈ విధమగు వర్ణములు అనంతరము కూర్చుచుండుట తెలియుచున్నది. ఇయ్యది మధ్యమకాలతానచిట్టలతో నుండుటచే నృత్యవేదులతోబాటు గాయకులు కూడ వీనిని విరివిగ పాడుచుండుట చూతుము.

గోపాలయ్య కీర్తనలందలి ధాతువు కష్టతర జతి పోకడల చొప్పున, అనగా త్రిశ్ర, ఖండ, మిశ్ర ఇట్టి విధమగు స్వరకూర్పున ననన్యసామాన్య తాళవిరుపులతో సురుచిర రాగవిన్యాసాధికమున నున్నది. రాగవిన్యాసము, మనోధర్మయుతముగ జేయగలుగుటకు వీలగు పల్లవులు తన కీర్తనలం దమర్చినాడు. ఉదాహరణముగ తోడి యందలి "అంబనాను", నాటకురంజి రాగమందలి "నీదుమూర్తిని", కాంభోజియందలి "హరిసర్వ", కళ్యాణిరాగమందలి "మహిషాసుర" మున్నగునవి చూడనగును.

## వీణ పెరుమాళ్లయ్య

ఈయనయు నాంధ్రబ్రాహ్మణుడు. సంగీతకోవిదుడు. ఘనరాగములను పాడిన సంగతులు పునరుక్తిచొప్పున లేకయు, సమర్థతతోను, దినములకొలది పాడుటలో నేర్పరి యైయుండెను. వీణావాద్యనిపుణుడు. అందుచే వీణ పెరుమాళ్లయ్య అని పిలువబడు చుండెను. తొంజరమానురాజు నొద్ద పదిదినములు భైరవిరాగము నాలపించి ఘనత గాంచెనని తెలియుచున్నది. సౌరాష్ట్రి, సావేరి రాగములందు వర్ణములు విరచించెను. ఈయన తంజావూరు ఆస్థానమున నుండెను. క్రీ. శ. ౧౭౬౦-౧౭౯౦ కాలమున నీయన ఉండినట్లు తెలియుచున్నది. ఈయన తమ్ముడు కొండయ్య సావేరిలో స్వరజతి చేసెను.

## సొంటి వేంకటసుబ్బయ్య

ఈయనయు నాంధ్రబ్రాహ్మణుడే. ఈయన ఇంటిపేరి వారిప్పుడును ముఖ్యముగ గోదావరిజిల్లాలయందు గలరు. వీరును సంగీతమున ప్రజ్ఞగలవారుగ నందందు ఎఱుగుదుము. వేంకటసుబ్బయ్య తంజావూరు రాష్ట్రాధిపతిని గొలిచియుండెను. గమక క్రియలో "నిన్నుకోరి" అను పదవర్ణము నృత్యయోగ్యముగ విరచించెను. తన ఏలిక తులజీమహారాజు గూర్చి బిలహరిరాగమున నొక వర్ణము చమత్కారగేయఫణితిని పాడెను. ఈయన వీణ పెరుమాళ్లయ్య సమకాలికుడు. అనగా ఈయన క్రీ. శ. ౧౭౫౦-౧౭౯౦ కాలమున నుండెను. ఈయన కుమారుడు వెంకటరమణయ్య త్యాగరాజునకు బాల్యమున సంగీతము నేర్పెను.

## రామస్వామిదీక్షితులు

ఈయన ఔత్తర దేశీయుడుగ, అనగా కంచిపట్టణప్రాంతమున నీయన తండ్రి వేంకటేశ్వరదీక్షితు లుండుటచే నట్లు చెప్పబడెను. చిన్నతనమున తెలుగుసంస్కృతములు కొన్ని నేర్చియుండెను. తర్వాత వంద్రులు కొలుముచేసిన పనుక తంజావూరున కేగి యచ్చట తెలుగు గాయకశ్రేష్ఠుడు వీరభద్రయ్యగారియొద్ద సంగీతము నేర్చియుండెను. అనంతరము మధ్యార్జునక్షేత్రమున కేగి యట వేంకటవైద్యనాథ దీక్షితులయొద్ద వెంకటముఖి సంప్రదాయము, అనగా చతుర్దండి ప్రకాశికయందు గల లక్షణ మెల్ల నేర్చి యాపద్ధతి ననుసరించి పెక్కు కీర్తనలు పాడుచుండెను. హంసధ్వనిరాగమును నిర్మించి యందు తానవర్ణమును విరచించి మార్గదర్శకుడాయెను. తంజావూరు రాజుగారిచే నాదరింపబడి తిరువారూరున నివసించి యుండెను. ఇట సంగీత త్రిమూర్తులలో నొకడగు ముద్దుస్వామిదీక్షితు లను కుమార రత్నమును గని సంగీతలోకమునకు మహోపకృతి కలుగజేసెను. మణలిగ్రామమందలి ముత్తుకృష్ణముదలియారు అను ధనాఢ్యుడు రామస్వామిదీక్షితులయొక్క సంగీతమును మెచ్చి తన గ్రామమం దాయనను ఆదరణతో నుంచుకొనెను. ఇటనే ఈయనకు స్వకృత అష్టోత్తరశతరాగమాలికకు కనకాభిషేకము కూడ చేయబడెనట. క్రీ. శ. ౧౮౧౭-వ వత్సరమున నీయన కాలధర్మము నొందెను. ప్రజ్ఞను చాటునట్టి స్వరస్థానవర్ణములు, వసంత, హిందోళ, పూర్ణ చంద్రిక మున్నగు రాగములందు చౌకవర్ణములు విరచించుటయే కాక శహనరాగమున "వాణివాణి" అను కీర్తన, ఆనందభైరవిలో "అంబ నీశరణము", నాగగాంధారిరాగమున "మన్నారురంగ" అను కీర్తనములు ఇట్టివి పెక్కులు "వేంకటకృష్ణ" ముద్రతో, రసవంత ములగు రాగపుష్టితో బాడెను. ఈయనవలనను, ఈయనకుమారుడు ముద్దుస్వామి దీక్షితులు, శ్రీ త్యాగరాజు మున్నగు వాగ్గేయుల వలనను ౧౮-వ శతాబ్దమున సంగీతతరుణి కరము పుష్టిజెంది లావణ్య తారుణ్యవిలాసముల చూప్పున తలుకొత్తుచుండెను.

## వైడల గురుమూర్తిశాస్త్రి

ఈయనయు తెనుగుబ్రాహ్మణుడే. సంగీతమున నతిసమర్థుడు. సంగీతలక్ష్యలక్షణవేదియై రాగలక్షణమును సువ్యక్తముగ గీతము లందు చేర్చి వెయ్యిగీతములవరకు పాడినాడు. పెక్కు కీర్తనలు కూడ విరచించెను. ధన్యాసిలో "నీరజనయన", దేవగాంధారిలో "స్ఫురతు తే", మోహనలో "సభాపతి" అనునట్టివి పాడి సంగీత లోకమునకు వానిని ప్రసాదించి యుండెను. ఈయన గీతములు రాగలక్షణ ప్రకటితములై మార్గదర్శకములై యున్నవి.

## యువరంగపదములు

తులజేమహారాజు కాలమున సుదయార్పాళెము నేలిన యువ రంగునిపై గేయకల్పన చాతుర్యము చూప్పున పాడిన పెక్కు పదము లుండుట తెలియుచున్నది. రచయిత పేరు తెలియకున్నది.

## పెద్దదాసరి

తంజావూరునాయకరాజుల కాలమున నుండిన పెద్దదాసరి నరసింహభక్తుడు. పెక్కు పదములు విరచించెను. తనపై నొక పదము చెప్పవలసినదని రాజుగారు కోరినను ఈయన అట్లు పాడకపోవుటచే కరిశిక్ష విధింపబడెను. అట్లయ్యు నీయన నరునకు శ్రీ నృసింహ స్వామి తలయందు తోచ్చి యంతర్ధానము నొందెనట. ఈ వార్త రాజుగారు విని క్షమింపగోరి మిగుల వ్యసనపడి భక్తునకు తాను కలిగించిన యపకృతికి పశ్చాత్తాపము నొందెను. దేవగాంధారిలో "గ్రహబలమునుయాయను" అను కీర్తన, మరి యిట్టివి ప్రసిద్ధములు.

## మెరటూరు వేంకట్రామశాస్త్రి

ఈయన తంజావూరు సమీపమునందలి మెరటూరు నివాసి యగు ఆంధ్రబ్రాహ్మణుడు. దత్తాజి కుమారుడు మల్లారి కంకితముగ "శరభకు బెరుకు" అను చిందు పాడెను. ఈయనకీర్తనలందు మధ్యమకాల సాహిత్యచిట్టలు నవ్యముగ నమర్చబడి యున్నవి. ఉదాహరణముగ నానందభైరవిలోని "కన్నతల్లి" అను కీర్తన మున్నగునవి చూడవగును. పెక్కు పదములు కైశికీ రీతి రాగపదసౌష్ఠవ మున విరచించెను. ఈయన శరభోజి, శివాజి మహారాజుల కాలమున, అనగా ౧౭౯౦ - ౧౮౨౦ ప్రాంతమున నుండెను.

## దొరస్వామయ్య

ఈయన తెనుగుబ్రాహ్మణుడు. సంగీత కోవిదుడు. తెను గున రంజకముగు రాగకళ చూప్పున పెక్కుకీర్తనలు "సుబ్రహ్మణ్య" ముద్రతో బాడెను. గౌరిరాగమందలి "ధూర్జటి నటించె" అను కీర్తన; తోడిరాగమున "తత్తద్రిమితదద్ధి" అను కీర్తన ఇట్టివి ప్రసిద్ధ ములు. ఈయనయు శరభోజిమహారాజుకాలమున (క్రీ. శ. ౧౭౯౮ - ౧౮33) నుండెను.

ఇట్లు ౧౯-వ శతాబ్దమువరకు సంగీతమున నృత్యయోగ్యము లగు పద దరు తిల్లనాదులును, గానయోగ్యము లగు కీర్తనాదులును తెనుగువాగ్గేయులచే వెలయింపబడుట చూతుము. తెలుగువారి చేతిలో సంగీతతరుణి సురుచిరాలంకారశోభతో గన్నులపండువై-హృదయాకర్షకమై-చూపరులను మగ్నమానసులుగ జేయజాలి యుండెను. ఒయ్యారపు నృత్యాధికమున ప్రతివారిని తన చెంతకు రావించుకొనుచుండెను. వారిని సమ్మోహితులుగ జేయుచుండెను. తనయందనురక్తులుగను, భక్తులుగను వారిని మార్చుచుండెను. తదితరద్రవిడదేశవాసులు కూడ ఈ కర్ణాటకసంగీతయువతి సౌందర్య నాట్యమున చాలుగొనుచు నాపెను బెంచుచుండుటయు జూతుము. ఇట్లు నాట్యయోగ్యములుగ నాకాలమున వెలయింపబడిన పెక్కు పదములు రచయితల పేర్లు తెలియరానివి పదేపదే తెలియుదుము.

కస్తూరిరంగ:-సురటిరాగమున నీముద్రతో గల "ఇందెందు" అను పదము విఖ్యాతము.

మల్లికార్జున:—ఈ ముద్రతో "హొక్కుచు" అను పదము కలదు. అనుపల్లవిలో "కృష్ణ" అను ముద్రయు కలదు.

ఇక ఘట్టుపల్లివారు "కైలాస ముద్రతోను, జట్టపల్లివారు "గోపాల" ముద్రతోను, ఇనుకొండవారు "విజయరామ" ముద్రతోను, శివరామపురమువారు "రామపురము" లేక "ఆదివరాహ" ఇట్టి ముద్రతోను, వేణంగివారు ఈగ్రామముపేరున గల ముద్రతోను పదములు పెక్కులు వెలయించియుండుట కందుము. రచయితల పేర్లు తెలియకున్నవి. వీనియందలి నాయికానాయక భావములు నవ్యములు. ఇయ్యవి రాగరసపూరితములై, మనోహరములై ఆంధ్రుల ప్రతిభను చాటగలుగుచున్నవి.

## శ్యామశాస్త్రి

ఆంధ్రదేశమున కంభముప్రాంతమునుండి కంచిక్షేత్రమున కేగి బంగరుకామాక్షిని గొలిచి పూజించుకొనుచు దురకల ఒత్తిడికిసహించక దక్షిణప్రాంతముల కేగిన బ్రాహ్మణసంతతికి జెందిన శ్యామశాస్త్రి క్రీ. శ. ౧౭౬౩-వ సంవత్సరమున జనించెను. ఈయన తండ్రి తాతలట్లు తమ పూజావిగ్రహమగు బంగరుకామాక్షితో కడకు తిరువారూరునకు వచ్చిరి. అటనే ఈయన జనించినాడు. అందుచే నీయన ఆంధ్రసంతతికి జెందినట్లు తెలియుదుము. చిన్నతనముననే సంగీతము, తెనుగు లెస్సగనేర్చిన ధీమతియగు సంగీతస్వాములు అను యతివలన శ్రీవిద్యోపాసన నేర్చి ఆదప్పయ్య, వీరభద్రయ్య మున్నగు ఆంధ్రసంగీతజ్ఞుల ప్రౌఢ గానరీతులు నేర్చి శ్రీ కామాక్షి అనుగ్రహముకలుగ పెక్కు కీర్తనలు, స్వరజతులు "శ్యామకృష్ణ" ముద్రతో బాడుచుండెను. ఈయన కీర్తనలందలి ఎడుపుకాలపు రీతులు, నారికేళపాకము ననుసరించు రాగశయ్య, కష్టతర తాళజతుల చొప్పున గల తాళపోకడల మహిమ అనుభవవేద్యమే కాని చెప్ప వీలులేకున్నది. అందుచే నీయన సంగీత త్రిమూర్తులలో నొక్కడుగ నెన్నబడును. ఈయన క్రీ. శ. ౧౮౨౭-వ వత్సరమున కాలధర్మము నొందెను. ఈయన కుమారుడు సుబ్బరాయశాస్త్రిలు తండ్రిగారి వలె సంగీతమం దతిసమర్థుడై తండ్రిగారి శయ్యచొప్పుననే కీర్తనలు పాడుచుండెను.

## ముద్దుస్వామి దీక్షితులు

ఈయన రామస్వామి దీక్షితుల కుమారుడు. సంగీతత్రిమూర్తులలో నొక్కడని ఎంచబడును. క్రీ. శ. ౧౭౭౫-వ సంవత్సరమున తిరువారూరున జన్మించెను. లేప్రాయముననే కావ్యనాటకాలంకారములు ముగించి కౌముదికూడ నేర్చియుండెను. జ్యోతిషమునను, వేదాంత మీమాంసములందును నేర్పరిగ నుండెను. సంగీతమును వేంకటమఖి సంప్రదాయమున నేర్చి తండ్రిగారిని మించియుండెను. తిరుత్తనియందలి సుబ్రహ్మణ్యేశ్వరుని సేవించి ఆ దేవుని యనుగ్రహమున పెక్కు సంస్కృతకీర్తనలు విరచించెను. జీవస్వరాధిక రాగవిన్యాసమున, గమక యుతధాతువులతో, దక్షిణదేశమందలి పెక్కు దైవములపైనను, కాశీ విశ్వేశ్వరునిపైనను, అన్నపూర్ణ గూర్చియు కీర్తనలు పాడెను. డెబ్బదిరెండు మేళకర్తలందును, శూలాది తాళములందును విచిత్రగేయ కల్పనలతో వెలయింపబడిన ఈయన కీర్తనలు సంగీతలోక మున్నంతకాలము సామ్రాజ్యము చేయగలవు. వీనియందలి రాగరస మాధుర్యము, రాగశయ్య, రాగప్రతిమల ఒయ్యారము—ఠీవి, వానియం దిమిడియుండు అంశాదిస్వరముల యందము అనన్యసామాన్య ప్రతిభా ప్రకటితములు. ఈయన అందందు అప్రయత్నముగనే కొన్ని మానవాతీతమగు పనులుసలిపి ౧౮౩౫-వ సంవత్సరమున పరలోకగతు డాయెను. చిన్నస్వామి, బాలస్వామి అను ఈయన తమ్ములు అన్నగారి కీర్తనలు నేర్చి పాడుటయేగాక తాము కూడ కీర్తనలు విరచించిరి. ముద్దుస్వామిదీక్షితుల శిష్యులలో తిరుక్కడయూరు భారతి, తేపూరు సుబ్రహ్మణ్యయ్య, మృదంగం తంబియప్ప పొన్నయ్య, తిరువారూరుకమలము మున్నగువారు ముఖ్యులు.

## శ్రీ త్యాగరాజు

ఈయన ఆంధ్రబ్రాహ్మణుడు. గిరిరాజకవి మనుమడు. రామబ్రహ్మము కడగొట్టు కుమారుడు. ఈయన తిరువారూరునందు క్రీ.శ. ౧౭౬౭-వ సంవత్సరమున జనించెను. బాల్యమున ఏకసంథాగ్రాహియై శొంఠి వేంకటరమణయ్యయొద్ద సంగీత మచిరకాలమున నభ్యసించి గేయకల్పనలు నేర్చియుండెను. శ్రీ త్యాగేశుని దేవళమున కడు నీమముతో ౯౬ కోట్లు రామనామము జపించి ఇష్టసిద్ధినొంది శ్రీరాముని సందర్శించి వాకొనుచుండెను. శ్రీరామానుగ్రహమున వేనవేల కీర్తనలు పాడుచుండెను. భక్తిపరవశుడై, రోమరోమమునకు భగవంతు ననుభవించి కీర్తించుచుండెను. మంజులమగు రాగములు భావమునకు తగిన విధమున తోప, రసము చిల్కునట్లు ద్రాక్షాపాకమున వానిని వెలయించుచుండెను. తన భావప్రకటన కనువగు సంగతులు ఈయనకీర్తనలందు చూతుము. ఈనూతనపద్ధతి కర మాదరణీయమై, మాధుర్యమై-మేలుగ నున్నది. భక్తిసంగీతముల అవినాభావ మిందు ప్రకటింపబడెను. సంగీతత్రిమూర్తులలో మూడవవాడై యీ లోకమునకు మహోపకార మొనర్చి క్రీ. శ. ౧౮౪౭-వ సంవత్సరమున తనసందేశము నీప్రపంచమున చాటి, విశ్రాంతిగొనుటకు పరలోకమునకు వెడలెను. ఈయనకీర్తనలు ఇప్పటి సంగీతజ్ఞులకేమి, ఇకముందు సంతతికేమి ఆదర్శకములుగ నుండగలవు.

శ్రీ త్యాగరాజశిష్యులలో వీణ కుప్పయ్య, తిలస్థానం రామయ్యంగారు, ఉమయాళ్పురం కృష్ణ సుందర భాగవత సోదరులు, తోడి సీతారామయ్య మున్నగువారు ముఖ్యులు. వీణ కుప్పయ్యగారు పెక్కు ఆదితాళవర్ణములు, కీర్తనలు విరచించి ప్రఖ్యాతివడసెను. ఈయన కుమారుడు తిరువత్తూరుత్యాగయ్య సంగీతమున ప్రజ్ఞావంతుడై తానవర్ణములు, కీర్తనలు పాడి కీర్తిని గడించెను.

తోడి సీతారామయ్యగారు:—ఈయన ఆంధ్రబ్రాహ్మణుడు. తోడిరాగమును దినములకొలది పాడుచుండెను. ఒకానొక ధనాఢ్యుడు ఈయన తోడిరాగమును మెచ్చి యద్దానిని తనకుమాత్రము వినిపించుటకును, అందుల కాయనకు వలయు ధన మిచ్చి తాకట్టు పెట్టుకొనుటకును ఏర్పరచుకొనెననియు, అనంతర మారాగమును ఈయన పాడనొల్లకుండె ననియు దెలియుచున్నది.

శంకరాభరణము నరసయ్యగారు:— ఈయన శంకరాభరణ మును మిక్కిలి నేర్పుతో-అనన్య సామాన్యతతో బాడుచుండెను. ఈయన పెక్కు పదములు విరచించెను.

## ఘనం కృష్ణయ్యగారు

ఈయన సంగీతకోవిదుడు. తంజావూరు ఆస్థానమున గొంత కాల ముండి అనంతరము ఉదయారుపాళెపుఏలిక యగు యువరం గనిచే నాదరింపబడి, యట నుండెను. ఈయన సంస్కృతమునను, తెనుగునను పెక్కు కీర్తనలు "శ్రీ కృష్ణ" ముద్రతో వెలయించెను. మధ్యమకాల స్వరస్థాన సాహిత్యములు, చిట్టలు, కీర్తనలం దలంకారముగ నుంచినాడు. పెక్కు ఘన నయ దేశీయ రాగములందును, రుద్రప్రియ, వేగవాహిని మున్నగు నవీనరాగములందును కీర్తనలు రసవంతముగ బాడినాడు. యమునాకళ్యాణి మున్నగు ఔత్తరీయ రాగములందును ఈయనకీర్తనలు కలవు.

## ఆనయ్య

ఈయన సంగీతమందును, తెనుగు సంస్కృతములందును మిగుల సమర్థుడు. శరభోజీ మహారాజు ఆస్థానమం దుండి "ఉమాదాస" ముద్రతో బెక్కు కీర్తనలు రాగరసపోషకములుగ బాడి నాడు. ఈయన "భజనసేయవే" అను కేదారరాగమందలి కీర్తనము బహుజన రంజకముగ నున్నది. మహావైద్యనాథయ్యరు ఈయన శిష్యుడే.

ఇట్లు కర్ణాటక సంగీతము ౧౭-వ శతాబ్దమునను, మరి ౧౯-వ శతాబ్దార్ధమువరకును సర్వతోముఖముగ బుష్టిజెంది యాంధ్రుల ప్రతిభను చాటుచుండెను. ఈకాలము సంగీతలోకమున బంగారు యుగముగ నెంచబడుచుండును. ౧౬-వ శతాబ్దము నుండియు వెలయింపబడిన నాట్యానుగుణ్య మగు వాఙ్మయము, అనగా పదములు, పదవర్ణములు, చౌకకాల కీర్తనలు, తరంగములు, తిల్లనలు, దరువులు, చిందులు, జావళ్లు మున్నగునవియు, సంకీర్తన కనువగు కీర్తనలు, కృతులు, దివ్యనామప్రబంధము, జోల పాటలు, లాలిపాటలు ఇత్యాదులును, మనోధర్మసంగీతమును ప్రకటించు పల్లవి కల్పన, రాగాలాపన, కృతులు, స్వరస్థాన మాతువులు, చిట్టలు, ప్రథమ మధ్యమకాలపు స్వరకల్పన, రాగమాలికలు మొదలగునవియు నిట్టి పెక్కుభంగుల చొప్పున గల సంగీత వాఙ్మయము పుష్టిగ వెలయింపబడెను. ౧౭-వ శతాబ్దమున ఈ విధమగు సంగీతకళ స్ఫుటితస్ఫూర్తితో నవనవరుచుల నీనుచుండెను. ఈ కళామతల్లి లావణ్య చారుత్వాతిశయము ౧౬-వ శతాబ్దమందు కన్న నిప్పుడు గన్నుల పండువుగ నుండెను. రాగకళయు ఘననయదేశీయముల చొప్పున అంశాది లక్షణాన్వితముగ నొప్పింపబడి హాయినొనగూర్చుచుండెను. ఈ కాలము నాటి సంగీతమే ఎల్లకాలములకు ఆదర్శముగ నుండగలదు. ఈ కాలపు సంగీతమే ఆంధ్రుల ప్రతిభౌన్నత్యము - స్వకీయతలను చాటుచు హిమవత్పర్వతమంతటి మహోన్నత పదవి నొందియుండెను. సంగీతలోకమున నీకాలమే ఇట్లు బంగారు యుగముగ నుండెను.

అనంతరము కాలవైపరీత్యమువలన సంగీతకళాతరుణి రాజాధిపుల యాదరణ నొందలేక ౧౯-వ శతాబ్దాంతమువరకు కాలముపుచ్చుచు ప్రజల ననువర్తించి వారి యామోదమును వడయుటకు తుదకు తన సౌందర్యమునే మార్చుకోవలసిన దగుచుండెను. అందుచే నిప్పటి నాటకములు, సినీమాలయందు నటీనటులతో దాను కూడ వేరువేషము దాల్చి స్వకీయలావణ్యమును గోల్పోయి మారురూపమున దిరుగు నభాగ్యమున కియ్యకొనవలసిన దాయెను. తన ఆంధ్రవ్యక్తిత్వము నిలుపుకొనుటకు - స్వీయరూపమును చూపుటకు-ఆంధ్రావనియందు తావు లేకుండుటచే గన్నీరు పెట్టవలసియుండెను. ద్రవిడాది దక్షిణదేశములందు మారువేషమున కాక కొంత నిజరూపమున దిరుగగలిగినను స్వకీయ ఆంధ్రావనియందు మారువేషము దాల్చి తిరుగుటకు కష్టపడుటయేకాక సిగ్గుపడుచున్నది. ఆంధ్రవ్యక్తిత్వప్రకటితమగు గానకళ ఇప్పుడిట ఎట్లున్నదియు వర్ణించుట కిట తావులేదు. కాక, అందరకు తెల్లముగా తెలిసినదే.

అయినను ౧౯-వ శతాబ్దాంతమున కొందరు తెలుగువాగ్గేయులు అందందు కలరు. ఈకాలమునను, ౨౦-వ శతాబ్దమునను గేయకల్పనలకు తెనుగు బాగుగ నక్కరకువచ్చు నను నది గ్రహించియేమి-తెనుగువారి నేతయొక్క యుత్కృష్టతను గ్రహించియేమి-కొందరు అఱవలు, మళయాళులు తెనుగున గేయములు కూర్చుచుండిరి. ఇట్టివారిలో మహావైద్యనాథయ్యరు, పట్నము సుబ్రహ్మణ్యఅయ్యరు, సదాశివరావు, సుబ్రహ్మణ్యదీక్షితులు, పల్లవి శేషయ్య మున్నగువారు ప్రసిద్ధులు. వీరినిగూర్చి ఇంచుక తెలుపుదును.

## శ్రీ సుబ్రహ్మణ్యకవి

కొంతకాలముక్రితము ౧౯-వ శతాబ్దముననే సుబ్రహ్మణ్యకవి అధ్యాత్మరామాయణముకీర్తనలచొప్పున బాడెను. ఈయన కీర్తనలయందలి రాగశయ్య నవ్యమై, లలితమై, జనాంగీకారయోగ్యమై యున్నది. ఆంధ్రావనియం దీకీర్తనలు తెలియనివా రిప్పుడు లేరనగలము. ఈయన కీర్తనలందు "శేషాచలపతి" "శేషగిరీశుడు" అని తిరుపతి వేంకటేశ్వరుని గూర్చిన ముద్ర యుండుట తెలియుచున్నది. ఈయన తిరుపతి నివాసస్థానముగ నేర్పరచుకొని యుండుట కూడ తెలియుచున్నది.

## మహావైద్యనాథయ్యరు

ఈయన సంగీతకోవిదుడు. ఆనయ్యాగారి వద్ద సంగీతము నేర్చి షట్కాలములందు పల్లవికల్పన చేయగలిగియుండెను. ఈయన క్రీ. శ. ౧౮౪౪-౧౮౯౩ వరకు జీవించియుండెను. ఇప్పుడు మనము తెలియు డెబ్బదిరెండు రాగాంగరాగముల చొప్పునను రాగమాలికను పాడి తన ఘనతను చాటినాడు. విద్వాంసు లీయనను 'మహా' అను బిరుదమిచ్చి యట్లు పిలచుచుండిరి.

## పట్నం సుబ్రహ్మణ్యయ్యరు

ఈయన (క్రీ. శ. ౧౮౪౫-౧౯౦౨) పెక్కు రక్తిరాగము లందు తెనుగున కీర్తనలు పాడెను. ఇయ్యవి శ్రీ త్యాగరాజు కీర్తనల ననుకరించును. వీనియందు వేంకటేశముద్ర కలదు. ఈయన పల్లవి పాడుటలో నతిసమర్థుడు. సింహానందతాళమున బల్లవి పాడి వినుతికెక్కెను. కొన్ని వింతరాగములు, ముఖ్యముగ "కదన కుతూహలము" ఇట్టివానిని కల్పించి పాడుచుండెను. బేగడరాగమును ఈయన పాడినట్లు ఆకాలమున నెవ్వరు పాడలేని కతమున ఈయనను బేగడ సుబ్రహ్మణ్యయ్యరు అనియు బిలుచుచుండిరి. ఈయన చెన్నపట్నమున నెక్కుడుగ వసించియుండుటచే పట్నం సుబ్రహ్మణ్యయ్యరు అని పిలువబడెనట. రామనాథపురం శ్రీనివాసయ్యంగారు (పూచి అయ్యంగారు) ఈయన శిష్యుడే.

## సదాశివరావు

ఈయన మైసూరుసంస్థానమున నుండెను. సంగీత కోవిదుడు. తెనుగున పెక్కు కీర్తనలు పాడెను. శ్రీ త్యాగరాజుగారి శిష్యుడగు వేంకటరమణ భాగవతుల శిష్యుడు. ఈయన కీర్తనలందలి చరణములు మధ్యమకాల ధాతువులతో నుండును. తన పేరును, అనగా "సదాశివకవి" అను ముద్ర తన కీర్తనలం దుంచినాడు. కొన్ని వర్ణములు, తిల్లనలు కూడ విరచించెను.

## ధర్మపురి సుబ్బరాయడు

నాట్యమున కనువగు పెక్కు జావళ్లు తన గ్రామము పేరున 'ధర్మపురి' ముద్రతో జేసెను. వీనియందలి రాగము ఇంపై, సొంపై హృద్యముగ రసము చిల్కుచుండును.

## దక్షిణామూర్తి

ఈయన కరూరునం దుండెను. 'గర్భపురి' ముద్రతో బెక్కు రాగములందు కీర్తనలు వెలయించెను. కీరవాణి రాగమునందలి ఈయన కీర్తనము పెక్కు జను తెలియును. మధ్యమకాల కీర్తనా రచన కీయన మిగుల నేర్పరి. ఈయన కీర్తనలందలి రాగము సులక్షవేద్యమై, రసవంతమై యుండును.

## పల్లవి శేషయ్యగారు

ఈయన తెనుగుబ్రాహ్మణుడు. ఈయనతండ్రి సుబ్బయ్యగారు శ్రీ త్యాగరాజుగారి శిష్యుడు. సేలము జిల్లాయం దుండెను. పల్లవి కల్పనయం దతిసమర్థుడై యాపేరున బిలువబడుచుండెను. ఈయన పెక్కు వర్ణములు, కృతులు, తిల్లనలు విరచించెను. సావేరిరాగమును పెద్దకాలము పాడుచుండెనట.

## సుబ్బరామ దీక్షితులు

ఈయన క్రీ. శ. ౧౮౩౯-౧౯౧౦ ల మధ్య జీవించియుండెను. ఈయన బాలస్వామిదీక్షితుల దౌహిత్రుడు. సంగీతమున ప్రజ్ఞావంతుడై తెనుగున వర్ణములు, కీర్తనలు, పదములు విరచించి ప్రఖ్యాతుడాయెను. ఎట్టియాపురాధీశునిచే గౌరవింపబడి రాజుగారి యాదరణమున "సంగీత సంప్రదాయ ప్రదర్శని"అను మేటిగ్రంథమును ప్రచురించి సంగీతలోకమునకు మహోపకార మొనరించెను. పెక్కురాగములందు తానములుకూర్చి తనపుస్తకమున బ్రకటించెను.

## తచ్చూరి శింగరాచార్యసోదరులు

వీరు సంగీత విద్యాకోవిదులు. సుబ్బరాయ శాస్త్రిగారి శిష్యులు. తెనుగున కీర్తనలు, రాగమాలికలు కూర్చి పాడుచుండిరి. సంగీతము ప్రజలకు కరతలామలకమగుటకు పెక్కు గ్రంథములు విరచించి స్వకీయముద్రాలయమున వానిని ముద్రించి ప్రచురపరచిరి. పెక్కుమంది రాజులచే సన్మానింపబడి చెన్నపట్నమున వసించియుండిరి.

ఇక ఇటీవలికాలమున ఆంధ్రావనియందు వాగ్గేయులై తెనుగున కీర్తనలు పాడినట్టివారిలో శ్రీమదాదిభట్ల నారాయణదాసుగారు (ఇటీవలనే కీర్తిశేషులు), హరి నాగభూషణముగారు, ముత్తయ్య భాగవతర్, వాసుదేవాచారిగారు మున్నగువారు ప్రఖ్యాతివంతులు. వీరివలనను సంగీతము ఘనతగాంచినది.

# డింగి

శ్రీ తటవర్తి సూర్యనారాయణమూర్తి

ఏవిధి భూనభోంతరము లెల్లను ముంచగ జూచు వీచికా
రావము తగ్గి నాకు సుకరంబుగ భీతివినాశహేతువై
వేవిధులన్ ఘటిల్లునో - వివేకము గల్గదు సుంతయేని ఓ
నావిక ! నిన్ను నమ్మి పయనమ్మయి వచ్చితి రిక్తచేతులన్.

నీవు పరాకులేక గమనించి యెటైనను గట్టుజేర్పగా
బోవని నమ్మి భీకరసముద్రము దాటగ బూనినాను నా
చేవ యెరింగియుందు వొక చేతయు నీతయు రాదు గట్టిగా
నావిక ! నిన్ను నమ్మి పయనమ్మయి వచ్చితి దీర్ఘయాత్రలోన్.

నావలె కండకావరమునం జరియించుచు నంతిమప్రయా
ణావసరంబునందలి భయంకరబాధల ధ్యాస లేక ఏ
దోవిధి దస్సి గెంటుకొని దూరము చేరనివారి జేర్చు నో
నావిక ! నిన్ను నమ్మి పయనమ్మయివచ్చితి ఇంతదూరమున్.

నీవు సమస్తవేదివి ఘనీభవమత్తమనోవికారదు
ర్భావతమఃప్రకీర్ణనిరుపాయుడ నేను సహస్రకోటిఖం
డావృతజీర్ణపోత మిది యంతయు నేడ యెరుంగజాలియే
నావిక ! నిన్ను నమ్మి పయనమ్మయివచ్చితి ఇంతదూరమున్.

నీవు కళాధినేతవు గణింపగనైతిని నీయుపజ్ఞతా
ధీవరతావిశేషత సుధీవరవేద్యము కామలోభవా
తావరణంబునన్ దిరుగు తార్కికబుద్ధికి గోచరించునే
నావిక ! నిన్ను నమ్మి పయనమ్మయివచ్చితి ఇంతదూరమున్.

త్రోవ యగమ్యగోచరము తోడుగ నీ విటు చెంతనున్న నా
కేవిధమైన భీతియు జనింపదు, గావున తప్పకుండగా
రావలె నీవు. ఆశ్రితపరంపర నెల్లను గట్టుజేర్చు నో
నావిక! నిన్ను నమ్మి పయనమ్మయివచ్చితి ఇంతదూరమున్.

నీవు నిజంబుగా బలుక నేర్చియు నన్నని పల్కరింపగా
రావు వినంగ నేర్చి బధిరత్వము బూనెదు దీర్ఘయాత్రలో
తావకసౌహృదాదరసుధారస మబ్బు నటంచు నిప్పు డో
నావిక !నిన్ను నమ్మి పయనమ్మయివచ్చితి ఇంతదూరమున్.

నీవు నిరంతరంబు బహునిర్మలదీధితు లుల్లసిల్లగా
నావలపై వసించు చధునాతనపాంథులు గుర్తుపట్టు ప్ర
జ్ఞావశులైన తత్తరణసంగతి తప్పక జూపుచుండు నో
నావిక! నిన్ను నమ్మి పయనమ్మయివచ్చితి ఇంతదూరమున్.

ప్రావృషిజంబునందు కల భావము రూపఱకుండునట్లు ఆ
జ్ఞావిధి నేర్పరింపు. తెరచాపయు ద్వంద్వమరుత్తు లేమియై
పోవునొ కీలు లెల్ల విడిపోవునొ గాన అరిత్రధారి ఓ
నావిక! నిన్ను నమ్మి పయనమ్మయివచ్చితి ఇంతదూరమున్.

గ్రావము లొక్కచో మకరకచ్ఛపమీనతిమింగిలాదినా
నావిధఘోరవారిచరనాదములుం జెలరేగ నెన్న డీ
నావ బుడుంగుమం చనునొ నాభయ మంశయు బారద్రోలు మో
నావిక! నిన్ను నమ్మి పయనమ్మయివచ్చితి ఇంతదూరమున్.

నావలలోని గంటల నినాదము వీనుల కింపుసేయ స
ద్భావికచాబ్జశోభ కనుదోయికి చల్లదనంబు గూర్ప ని
ద్రావశతానభిజ్ఞమధురప్రమదం బొనగూర్తు వంచు ఓ
నావిక! నిన్ను నమ్మి పయనమ్మయివచ్చితి గట్టుజేర్పవే.





# 2000 ఏళ్లకు ముందు..

పూర్వపువారు చందనమును పరిశుద్ధతకు పర్యాయపదముగా నిర్ణయించినారు. నేటివారు మోటారులలో "రోల్స్‌రాయిస్"ను ఉత్తమమయినదని చెప్పినట్లు, మంచివస్తువుల ప్రసంగములో చందనమును శ్రేష్ఠమయిన దానినిగా ప్రశంసింతురు. చందనము, మధురపరిమళము, చలువగుణము కలిగియుండుటవలన చందనతైలము సౌందర్యాలంకార వస్తువులలో ముఖ్యముగా ఉపయోగింపబడుచున్నది. అశోకుని కాలమున యథార్థముగా అంగీకరింపబడిన విషయము నేడుకూడ యథార్థమే !

## మైసూరు శాండల్ సబ్బు

"పరిశుద్ధతకు ప్రసిద్ధమైనది చందనమే"




మైసూరు గవర్నమెంటు ప్రాడక్టు.

# ప్రాచీన బౌద్ధశిల్ప విన్నాణములు—౧




కార్లీ:—కన్నారీ మహాచైత్యగుహాముఖమునందలి కొన్ని శిలాస్తంభములు

# ప్రాచీన బౌద్ధశిల్ప విజ్ఞానములు—౨




కార్లీ:-కన్హారీ మహాచైత్యగుహాముఖమునందలి స్తంభశిల్పములలో ఇంకొకదృశ్యము

== చిత్రకారుడు: శ్రీ పెండ్యాల వెంకటరామారావు ==

# ఆంధ్రనాటకరంగం

## = శ్రీ నండూరి కృష్ణమాచార్య =

తెలుగు సారస్వతములో నాటకము అచిర ప్రవృత్తము. అనగా తెలుగు దేశములో ఇంతవరకు ఏవిధమైన నాటకరచన గాని, నాటక ప్రదర్శనములు గాని లేవనుట గాదు. నాట్యకళపై గల అభిమానము, అభినయ విద్యలో గల అభినివేశము తెలుగు జాతికి ఈ నాటివి గావు. నన్నయ భారతములో సుభద్రాపరిణయఘట్టమున రైవతకోత్సవములో "క్రొమ్ముకుదులందున పుష్పములు" జారుచుండగా తరుణీమణులు తాళలయాశ్రితమైన నృత్తమును సల్పుట వర్ణించినాడు. ఆ వర్ణనకు ప్రాతిపదిక ఆ నాటి తెలుగు వేశ్యలు కాకపోయినచో పంబపడుచులో, లేక జక్కుల పురంధ్రులో అగుట తథ్యము. 'జక్కులపురంధ్రి' శ్రీనాథుని నాటికే కీర్తికెక్కినది.

సమస్తకళలకును ప్రాథమికదశలో ప్రాక్తన మానవుని హృదయము ఆశ్రయము. వనచరుడుగా, శాఖామృగముగా సంచరించు ఆటవిక మానవుని హృదయము రసతరంగితమైనపుడు రింగులు త్రొక్కుచు పదము పాడినాడు. ఇదియే నృత్తకళకు ఆరంభము. విన్యాస విక్షేపాత్మకమైన యీ ఆటవిక తాండవము క్రమపరిణామ వికాసబద్ధమైనపుడు తాళలయాశ్రిత మైనది. ఈ నృత్తమునకు జంత్రగాత్ర సమన్వితమైన నాదము తోడుపడుటతోడనే కాలక్రమమున నృత్యవిద్య వెలసినది. నృత్యకళ భావార్థసమన్వితమైన శబ్దసాహచర్యమున అభినయవిద్యగా అవతరించినది. అభినయము అన శబ్దార్థమును ఆలంకారిక సంజ్ఞలచే, పారిభాషిక ముద్రలచే దేహమున ప్రదర్శించుట. ఈ అభినయము శబ్దార్థమునే కాక "అవస్థలను" ప్రదర్శించిన నాడు నాట్యకళగా పరిణమించినది. "అవస్థానుకృతి ర్నాట్యమ్"- ఇది ఆలంకారిక నిర్వచనము. నృత్తము—నృత్యము- అభినయము- నాట్యము అను కళలు క్రమపరిణామ వికాసమునకు లోనయిన ఏకకళయే యైనను మానవహృదయముతో గల అత్యంత సన్నిహిత సంబంధము వలన నేటికిని వ్యక్తిత్వమును పోగొట్టుకొనక సహజసౌందర్యముతో ప్రత్యేకకళలుగా నిలిచియున్నవి. నృత్తము, నాదము, శబ్దము నేడు ప్రత్యేక పరిణామరూపములలో నాట్యము, సంగీతము, కవిత్వము అను కళలుగా మారినవి. ఇట్లు విడివడి పరిణతిగన్న కళలన్నియు తిరిగి నాటకరూపమున ఒకచో సంగమించినవి. నృత్యము, నృత్తము, అభినయము, నాట్యము, కవిత్వము, సంగీతము మున్నగు కళలన్నియు ఆహార్యాది ఉపకళలతో చేరి అన్యోన్య మిశ్రితములై అనేకరూపములు దాల్చినవి. ఈ కళలన్నియు అనేక రూపములతో ఆంధ్రదేశమున చిరకాలమునుండియు విలసిల్లుచున్నవి.

తెలుగుదేశములో నృత్త విద్యను అభిమానించిన 'పంబవారు', 'జక్కులవారు' ను ఒకవిధమైన 'నృత్తనాటకములు' (**Dance dramas**) ప్రదర్శించుచుండెడివారు. ఇవి రానురాను అనేక రూపాంతరములను దాల్చినవి. 'కొరవంజి' ఒక ప్రత్యేక విశేషము. తాళలయాశ్రితమైన నృత్తమేగాక - ఎఱుకలసాని వేషములో సోదెజెప్పుచు ఒక పాత్ర ప్రవేశించుట దీనిలో ఒక విశేషలక్షణము. కృష్ణలీలలు, బృందావన విహారాదులు మున్నగు నృత్తనాట్య ప్రక్రియలను అభిమానించినది గొల్ల భాగవతులు. శ్రీకృష్ణుడు - గోపికలు యాదవులైన తమ సొంత సొత్తని వారి అభిప్రాయము కావచ్చును. లేక కృష్ణలీలాదులు ప్రదర్శించుటచే వీరికి 'గొల్లభాగవతు' లను పేరు వచ్చియుండవచ్చును. యానాదిభాగవతులు ప్రదర్శించు గరుడాచలనాటకములు కలవు. వీరు గొల్ల భాగవతులకంటెను ప్రాచీనులు కావచ్చును. ఇందు కథానాయిక అయిన చెంచెత ఆటవికులైన తమయింటి ఆడుపడుచని వీరి అభిప్రాయము. ఇంకొక దశలో ఈ దేశీయనాటక ప్రదర్శనములలో ద్విపదలు, తోహరలు, వృత్తములుకూడ ప్రవేశించినవి. ఇవే రూపాంతరమున యక్షగానములుగా మారియుండును.

యక్షగానములు అచ్చతెనుగు - అనగా శుద్ధదేశినాటక ప్రదర్శనములు. ఇట్టివి సంస్కృతములో లేవు. యక్షగాన మను శబ్దముకూడ 'జక్కులపాట' అను మాటలకు సంస్కృతీకరణమే యని తోచుచున్నది. ఈ యక్షగానములు తెనుగు దేశములో శ్రీనాథునికి పూర్వము నుండియు వచ్చుచున్నవి. శ్రీనాథుడు - "కీర్తింతు రెవ్వాని కీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగాన సరణి" అని పల్కినాడు. యక్షగానాలు గేయాశ్రితములు. కీర్తనలు, పదములు వీనిలో ఎక్కువ. అక్కడక్కడ భారత భాగవత పద్యములును జేరుచుండెడివి. తెలుగుభాషకు నిసర్గమధురమైన గీతి కీర్తనరూపములో వెల్లివిరియుచున్నది. "దేశభాషలందు తెలుగు లెస్స" అను పలుకునకు

ఆధ్యాత్మికజ్యోతిని ఎన్నడును చల్లార్పలేదు. భారతీయుల నటరాజు శృంగారములో లీనమైన అర్ధనారీశ్వరుని అపరావతారమే. కాని ఆ అర్ధనారీశ్వరుడు అంతకు ముందు కాముని భస్మముచేసిన పరమశివుడు. భారతీయుల పురుషార్థములలో అర్థకామములు ధర్మమోక్షములమధ్య నిబద్ధమైనవి. భారతీయసభ్యతాప్రవృత్తిననుసరించి భోగము మితిమీరి ఆత్మనతిక్రమింపబోవు సమయమున భారతీయుడైన ఆంధ్రుడు ఇంద్రియకలుషితమైన నాట్యవిద్యాకృషికి, వేశ్యాసంఘమునకు స్వస్తిపఠించి నిర్వికల్ప సమాధినిష్ఠుడైనాడు. అంతేకాని కళోపాసననే విరమించుకొనినాడనుకొనుట కల్ల.

తిరిగి తెలుగుదేశమున నాటకకళ ౧౯-వ శతాబ్ద్యంతమున అవతరించినది. కాని నేటి 'మార్గ' నాటకము (Classical drama) వెనుకటి తెలుగుయక్షగానమునకు పరిణామము గాదు. ఈ అర్థముననే తెలుగులో నాటకము అచిరప్రవృత్తమనుచున్నాము. నేటి మార్గనాటకమునకు సంస్కృతనాటకమే మాతృక. ఇందు నృత్యాభినయముల కన్న అవస్థానుకృతియగు నాట్యమే ఎక్కువ. పూర్వమునుండి వచ్చుచున్న గొలుసుకట్టు తెగిపోవుట మార్గనాటక ప్రదర్శనములలో ఒకవిధముగ కనిపించుచునే యుండును. కుంఫిణీప్రభుత్వాదరణక్రింద మొట్టమొదట ఈ నాటకములు బయలుదేరినవి. ధార్వార్ కంపెనీ మున్నగు సమాజములు నాటకప్రదర్శనములకు దోహదము కల్పించినవి. తెనుగువారుకూడ ఈ నాటకములు చూచి మురిసిపోయినారు. తెనుగులో నాటకసమాజములు బయలుదేరినవి. కవులు నాటకరచనమునకు పూనుకొన్నారు. మొట్టమొదట తెనుగునాటకమును తెనిగించినది శ్రీ వీరేశలింగముగారు. ఆనాడు, ఏ నాటకముగాని వీరి శాకుంతలమట్లు రంగమున కెక్కలేదని వినికిడి. తరువాత నాటకములు తెనుగులో తామరతంపరగా వెలసినవి. శ్రీ ధర్మవరము కృష్ణమాచార్యులువారు అనేక నాటకములు స్వతంత్రముగా రచించినారు. వీరు కవులే కాక నటులు గూడ. వీరు నటులై ప్రదర్శనమునకై నాటకములు వ్రాసిరో, లేక కవులై నాటకములు వ్రాసి ప్రదర్శనమునకై నటులై ఆ పాత్రల ధరించిరో చెప్పలేము*. వీరి తరువాత పౌరాణిక చారిత్రిక నాటకములు ఎన్నో అవతరించినవి. అచిరకాలములో ఈ మార్గనాటకములకు ఇంత వ్యాప్తి, గౌరవము వచ్చుటకు కారణము సంస్కృత నాటకమే. నాటకప్రక్రియ సంస్కృత సాహిత్యములో "నాటకాంతం సాహిత్యం", "కావ్యేషు నాటకం రమ్యం" అని విశేషకీర్తి కెక్కినది. సంస్కృతాలంకారికులు-కవులు నాట్యకళా సముద్రమును తరచి తరచి రసామృతమును లోకమునకు పంచిపెట్టినారు. మూర్తి నిర్మాణములో మూడు కాలములలో సంస్కృత నాటకము విశిష్టస్థానము నాక్రమింపగలదు. అలంకారశాస్త్రములోని రస ప్రకరణము నాట్యకళాలతకు దివ్య దోహదము. విశ్వసాహితీ సంస్కృతిలో ఎచ్చటను సంస్కృతాలంకారికుల రసచర్చకు ఈడులేదు. "రసము యన్నిష్ఠము?" అను విషమ చర్చలనుండి రంగముమీద నిషేధింపదగిన వధ, దూరప్రయాణము మున్నగు సూక్ష్మ విషయములను గూడ సూక్ష్మాతిసూక్ష్మముగ, పుంఖానుపుంఖముగ సంస్కృతాలంకారికులు పరిశీలించి, లోకసంగ్రహార్థము తుది నిర్ణయముల నిచ్చియున్నారు. సాంగోపాంగమైన సమగ్ర సంస్కృత నాటకము తెలుగు కవులకు ఒక మహోన్నతమైన మాతృక, మహోదారమైన మార్గదర్శిగ లభించినది. మన తెలుగు నాటకములు చాలవరకు సంస్కృతానువాదములు. లేకపోయిన అనుకరణములు. గయోపాఖ్యానము, బొబ్బిలి, ప్రతాపరుద్రీయము, చిత్రనళీయము, రామదాసు, హరిశ్చంద్ర, ఉద్యోగ విజయములు—అన్నియు ఆంధ్ర రంగమున విజయవంతములుగా నేటికిని ప్రదర్శితమగుచున్నవి. కాని తెలుగు నాటకములో ఏకదేశసిద్ధి మాత్రమే లభించినది. సాకల్యసిద్ధి లభింపలేదు. గయోపాఖ్యానములోని ప్రయోగ రంజకత్వము, ప్రతాపరుద్రీయములోని తెలుగు దనము, చిత్రనళీయములోని సన్నివేశ సంఘటనా కౌశలము, ఉద్యోగ విజయములలోని కవితా సారళ్యము, తదితర నాటకములలోని సంభాషణా చాతుర్యము, ఇంకను వాంఛనీయమైన ఉదారతా శిల్పములు మేళవించి తెనుగుదేశమున మహానాటకము అవతరింపగల శుభోదయము ఆకాంక్షణీయము.

"భారతదేశము స్వాతంత్ర్యమును కోలుపోయినను నేను విచారించుటలేదు. షేక్స్పియరుకవినాటకములు చదువు అవకాశభాగ్యము కల్గినందులకు ఆనందించుచున్నాను."—ఇది ఆంధ్రవిశ్వకళా పరిషత్తులో ఆంగ్లోపన్యాసకులుగా నుండిన శ్రీ ఎమ్. వి. ఎన్. సుబ్బారావుగారు ప్రసంగవశమున అన్నమాట. ఆంగ్ల సారస్వతములో నాటక కవి చక్రవర్తిగా పేరుగడించిన షేక్స్పియరు కవి సంపర్క ప్రభావము అద్యతనాంధ్ర నాటకములలో మృగ్యము. ఈ మాటకు ఈ మహాకవి నాటకములకు అనువాదములుగాని, అంధప్రాయమగు అనుకరణములు గాని లేవనుట అర్థము కాదు. అట్టివి కొల్లలుగాగలవు. ఆంధ్రీకరించుట మన అనాది ఆచారము. పెద్దలనుండి సంక్రమించిన వారసత్వము. కాని అతని తత్త్వమును ఆంధ్రమున ప్రపంచించిన నాటకకవి లేడు. వంగదేశములో ద్విజేంద్రలాల్ కవి వ్రాసిన నాటకములు—చంద్రగుప్త, షాజహాన్ వంటివి ఇతివృత్తములో శుద్ధభారతీయములు. ఈ నాటకములలో ప్రతి వాక్యములో షేక్స్పియరు కవివాక్కు ప్రతిధ్వనించుచుండును. ద్విజేంద్రుని నాటకములు చాలమంది తెనుగులోనికి అనువదించినారు. నాటక కవులకు ఈ అనువాదముల మోజు ఎప్పుడు వదలునో తెలియదు. నేడు నాటకములు కుప్పతిప్పలుగ వెలయుచున్నవి. ఇవి బహుళములుగా అనువాదములు. కాకపోయిన అనుకరణములు—అంధానుకరణములు. ఎరువుసొమ్ములవలె వెగటుపుట్టించుచున్నవేగాని క్రొత్తవస్తువులవలె వింతనైన కల్పించుటలేదు, అన్యసాహితీ సంపర్క

* ఆంధ్రనాటకకళాపరిషత్తు-అధ్యక్షోపన్యాసము- శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు.

స్థలము అద్వైతనాంధ్ర సాహిత్యరంగములోని వాదోపవాదములు. ఆకాశ భాషణములు, కిలికించితములు, ఏకాంతములు ఇత్యాదులు అస్వాభావికము లని, అవి నాటకములలో పనికిరా వనుచున్నారు కొందరు నవ్యులు. గద్యపద్యమిశ్రణము, రంగవిభజన ఇవన్నియు నూతన సమస్యలే. ప్రయోగవిషయమున గూడ వాదోపవాదములు చెలరేగుచున్నవి. సంగీతావశ్యకత, స్త్రీ పురుషభూమికా నిర్వహణము మున్నగునవి వివాదాంశములే. ఇట్లు సిద్ధాంతరాద్ధాంతములు, ఖండనమండనలు పెచ్చు పెరిగిపోవుచున్న కాలములో - పులిమీద పుట్రవలె నాటకముపై పోటీకి సినిమా వచ్చిపడినది.

"కొంతమంది మందబుద్ధులు హాలీవుడ్ లో చేరినారు. వారి బుద్ధిమాంద్యమును ప్రపంచ మంతయు వెదజల్లుచున్నారు." అన్నాడు ఒక కళాకోవిదుడు. అమెరికాఖండవాసి ఇబ్సెనునాటకము ప్రదర్శితమగు రంగమును చూడ అన్నివేలమైళ్లు ప్రయాణము చేసి నార్వే చేరుకొనినాడు. కాని అప్పటికి ఆ రంగశాల సినిమాహాలుగా మారిపోయినది. విషాద పరవశమైన ఆ రసజ్ఞుని హృదయము నుండి పొంగిపొరలివచ్చిన ప్రవచనమే పైన ఉదాహరించిన సుభాషితము. రసజ్ఞుడగు మానవుడు యుగయుగములనుండి అభ్యసించి అలవరచుకొన్న లలితకళా సమ్మేళనము నాటకవిద్య. సంగీతము, కవిత, చిత్రలేఖనము, నాట్యము మున్నగు కళలేగాక ఆహార్యాది ఉపాంగము లెన్నియో పరాకోటిని ముట్టి ఒకచో సంగమించిన కళ నాటకము. మొట్టమొదట ఛాయాగ్రహణము చిత్రకళకు ప్రతిద్వంద్విగా నిలిచినది. కాని దానిని కళాకోవిదులు లలితకళ కాదన్నారు. కాని నేడు చలనరూపమును ధరించి, శబ్దగ్రహణముతో చేతులుకలిపి నాటకకళపై దండయాత్ర ఆరంభించినది. దీనిని చూచి కళోపాసి కన్నీరు కార్చుచున్నాడు. ఈ సినిమా వెఱ్ఱి మితిమించి వెఱ్ఱితలలు వేయక ముందు రసజ్ఞులైన కళారాధకులు నడుముకట్టి నాటకకళ నుద్ధరించుటకు పూనుకొనవలెను.

ఒకమూల సినిమా వేలమువెఱ్ఱి ప్రబలుచున్నది. వేరొకమూల వాదోపవాదములు చెలరేగుచున్నవి. నేటి తెలుగునాటకములు అసలు నిసలైన నాటకములే కావని కళాప్రపూర్ణు లన్నారు. రచనలో నేమి, ప్రదర్శనములో నేమి భిన్నాభిప్రాయములకు కారణము ప్రతీచీ సభ్యతా సంపర్కము. కళావిషయమున పాశ్చాత్యుల దృక్పథము వేఱు.

ప్రాచీనకాలమునుండి పాశ్చాత్యులు 'కళ' వాస్తవిక జగత్తునకు అనుకరణ మని ప్రతిపాదించినారు. యూరపులో ఆలంకారిక శాస్త్రమునకు విద్యాగురువులు గ్రీకులు. వారిలో ప్రథముడు ప్లేటో "కళ మూలమునకు రెండంతరముల దూరములో నున్నది." అని ప్రవచించినాడు*. అనగా ఈశ్వరసంకల్పమునకు అనుకృతి సృష్టి; సృష్టికి అనుకృతి కళ అని ఈ వాక్యమునకు పండితులు భాష్యము చేయుచున్నారు. అతని శిష్యుడు, అలెగ్జాండరు చక్రవర్తి గురువు నగు అరిస్టాటిలుగూడ 'కళ' అనుకరణమేనని చెప్పినాడు. కవితాలోకమున అర్వాచీనులగు షెల్లీవంటి ఆంగ్లకకవులు గూడ కళ సృష్టికి అనుకరణమనియే వచించినారు. సృష్టిని అద్దము వలె ప్రతిబింబింప జేయుటయే కళకు పరమాదర్శమని వారి ఊహ. (Holding mirror up to nature) ఇట్టి స్వభావవాదము, లేక యథార్థవాదము పాశ్చాత్య సభ్యతలో జీర్ణించిపోయినది. వారి కళాసృష్టి వాస్తవిక జగత్తులోని పొలిమేరలు దాటిపోలేదు†. కాని భారతీయుల కళాసృష్టి విశ్వసృష్టికి ప్రతిద్వంద్వి.

"అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే"

అని ముక్తకంఠముతో భారతీయాలంకారికులు చాటినారు. "కావ్యసంసారమునకు కవియే సృష్టికర్త. ఈవిశ్వము అతని ఇచ్ఛామాత్రమున పరివర్తనము చెందును." ఇది భారతీయుల సిద్ధాంతము. భారతకవి నవరసస్రష్టు డగుటతో నతడే వాస్తవిక జగత్తు నతిక్రమించును. అప్పుడు స్వర్గలోకము [illegible] ద్వారములతో అతనికి అమృతాభిషేకము చేసి ఆహ్వానించును. రసానుభవము బ్రహ్మానంద సబ్రహ్మచారి. విగళితవేద్యాంతరము. సద్యః పరనిర్వృతి. అప్పుడు నదులు [illegible] రసలై అతని ఎదుట నృత్యము సల్పును. ఋతురాజు వసంతుడు పుష్పబాణాయుధుడైన మన్మథునితో ప్రత్యక్షమగును. మన కవులు పలుకరించిన పాషాణములు గూడ బదులు పలుకును. భారతకవి ప్రకృతిచే బంధింపబడడు. భారతీయుల కళ వాస్తవ ప్రపంచమునకు నకలుగాని, అనుకరణగాని కాదు.

ఇప్పుడిప్పుడు పాశ్చాత్యులలో స్వతంత్ర ప్రతిభావంతులు కొందరు భారతదృక్పథము వైపునకే మొగ్గుచున్నారు. ఇటీవల ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయములో కావ్యశాస్త్ర విద్యాపీఠము నలంకరించిన బ్రాడ్లే పండితుడు—"కళ వాస్తవికజగత్తులో ఒక అంతర్భాగము గాని, దానికి ప్రతిబింబము గాని కాదు. కళాజగత్తు స్వయంసంపూర్ణము, స్వతంత్రము నైన ప్రత్యేక సృష్టి. ఇహలోక వాసనలను విడిచిన గాని దాని యనుభూతి లభింపదు". అని [illegible] ఉపన్యాసము నిచ్చినాడు.‡

భారతీయులలో ట్రాజెడీ లను విషాదాంతరూపకములు లేవు. మరణమును రంగస్థలముపై ప్రదర్శింపరాదను నిషేధమే దీనికి

---

* Art is twice removed from the original—Plato.

† శ్రీ ముట్నూరి కృష్ణారావు గారి 'సమీక్ష' లో.

‡ Art is not a part or a copy of the real world (as we commonly understand the phrase) but it is a world by itself-independent, complete, antouomous and to possess it fully you must enter that world, conform to its laws and ignore for the time being the beliefs which belong to you in the other world of reality—Oxford lectures.

కొరబడునుగాదు. భారతీయునకు మరణమనిన జీవితపరిసమాప్తి కాదు. మరణాంతములు గాకపోయినను శాకుంతలాది నాటకములు యథార్థముగా ఉత్తమోత్తమమైన ట్రాజెడీలు. ప్రాచ్యప్రతీచీ సభ్యతలోని దృష్టిభేదమును పరిశీలించిన నేటి వాదోపవాదముల అంతస్తత్వము బోధపడును.

"యథార్థలోకములోని సంఘటనను ఎంత అచ్చుగ్రుద్దినట్లు అనుకరించిన అంత మంచి నటుడు" అను క్రొత్త కొలతబద్దలు పాశ్చాత్యకళాదృష్టివల్లనే సిద్ధించుచున్నవి. ఇక స్త్రీపాత్రలను స్త్రీలే ధరింపవలెను; సంగీతము అసహజము — ఇట్టి వాదములు విద్వన్మన్యులతో బయలు దేరినవి. "అట్టయిన పురుషులవారి పాత్రలు పురుషులవారే ధరింపవలెను." అని శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు చక్కని పూర్వపక్షమును నెలకొల్పినారు. 'స్త్రీలముగదా, మన మేమి చేసినను స్త్రీ పాత్రాభినయమే' యని విజృంభించుచు రంగము నెక్కుచున్న ఎందరో స్త్రీలకన్న కొందరు పురుషులే ఆభూమికలను బాగుగా నిర్వహించుచున్న సంగతి అనుభవసిద్ధము. అసలు కళాజగత్తులో ప్రదర్శితమగుచున్న స్త్రీత్వము లౌకికస్త్రీత్వము కాదు. అది అతిలోకమైనది. దానిని ప్రదర్శించుటకు ప్రతిభ కావలెను. అది సామాన్యస్త్రీల కెంత దుర్గ్రాహ్యమో నటీమణులకు కూడ అంత దుర్గ్రాహ్యమే. ఒకవేళ లౌకికస్త్రీత్వమే కళారంగమున గూడ ప్రదర్శితమగుచున్న రంగభూమికి పోనక్కరలేదు. కన్నబిడ్డ పోయినప్పుడు చంద్రమతి అభినయించు దుఃఖము వాస్తవజగత్తులోని దుఃఖముకాదు. యథార్థలోకములో పుత్రశోకముతో దుఃఖించు తల్లిని మనము చూడలేము. చూచినను ఆనందించలేము. అప్పుడు మన హృదయము పగులును గాని కరగదు. శోకము స్థాయీభావముగా గల కరుణారసమును చంద్రమతి అభినయించును. అది రసస్వరూపము కనుక కరగును. మన హృదయమును పగులగొట్టదు. లౌకిక కాలుష్యములేనిది గనుక మన అంతరాత్మలను పవిత్రమొనరించును. దీనినే భావితాంతఃకరణ ప్రవృత్తి అని భారతీయాలంకారికులు, ఖాథిన(Cachorsis) అని గ్రీకు విద్వాంసులు నిర్వచించినారు. శివాజీనాటకప్రదర్శనములోని శివాజీ చారిత్రిక శివాజీ ఎన్నటికిని కాజాలడు. ఒకవేళ ఆరాత్రి స్వర్గమునుండి శివాజీ దిగి వచ్చినను ఆ భూమికను అతడు ధరించి నిర్వహింపలేడు. కళా జగత్తు వేరు; వాస్తవికజగత్తు వేరు. ఒకటి సత్యమైన రెండవది అంతకంటె సత్యమైనది. యథార్థజగత్తు, కళాజగత్తు ఎచ్చటను కలియని సమానాంతరరేఖలు *. వాస్తవికజగత్తులో పరస్పరైక్యము-సౌందర్యము మృగ్యము. అది అవ్యవస్థితము. కళాజగత్తు సౌందర్యపూరితము; స్వయంసంపూర్ణము; స్వతంత్రము. అందుచేతనే కవిత్వము ఛందోబద్ధముగను, సంగీతము శ్రుతిశుద్ధముగను, నృత్యము తాళలయాశ్రితముగను అభివ్యక్తము లగుచున్నవి.

ఈ దృష్టితో చూచినప్పుడు నాటకములో గద్యపద్యమిశ్రణము, ఏకాంతములు, ఆకాశభాషణములు, సంగీతములు మున్నగు సమస్యాపరిష్కారము సులభమగును. స్వాతంత్ర్యప్రియులగు నవ్యులు కొందరు "నాటకములలో ఏకాంతము లుండరాదు. అసహజములను, అస్వాభావికములగువానిని పరిహరించవలయు" నని పరిషత్తులలో తీర్మానములు చేయుచున్నారు. కాని "నిరంకుశాః కవయః" అను ఆర్యోక్తి అతి ప్రాచీనమైనది.

నేడు వందలకొలది ప్రేక్షకుల నాకర్షించుచున్న తెలుగునాటకము లసలు నాటకములే గావనియు, కేవలము నాటకరూపమున చెల్లుబడి అగుచున్న ఆభాసములనియు, వేలకొలది రసపిపాసువులు మృగతృష్ణల వెంబడించుచున్నారనువారును కలరు. ఇన్నివేల హృదయములను మంత్రముగ్ధము గావించు శక్తి ఏది? అది కళ. ఈనాడు ఇది 'సహజము', అది 'అసహజము' అను పట్టుబడి మాటలతో ప్రతినాటకమును సమీక్షించు నవనాగరకరసికులు-ఒకనాడు "రాజు వెడలె రవితేజము లలర" అను వీథినాటకములో తలలుత్రిప్పిన ప్రేక్షకు లుండెడివా రని మరువరాదు. ఇదంతయు ఆభాసము గాదు. భ్రమ గాదు. మాయ గాదు. కళాజగత్తు వేరు; ఆ జగత్తును పరిపాలించు ధర్మములు వేరు. నిజమునకు తెలుగునటులను చూచిగాని, తెలుగునాటక ప్రదర్శనములను జూచిగాని తెలుగువారు సిగ్గుపడనవసరము లేదు. నేటి తెలుగునాటకమును జూచి తెలుగువారు గర్వించవలసినదే. స్వల్పకాలములో రంగమును మహోన్నతదశకు తీసికొనివచ్చిన నటనటీమణులందరును అభినందనీయులు.

"నేడు తెలుగుదేశములో ఉత్తమనటులున్నారు. కాని ఉత్తమనాటకములులేవు" అని శ్రీ కోలవెన్ను రామకోటీశ్వరరావుగారు నవ్యసాహిత్యపరిషత్తుసందర్భమున ప్రవచించినారు. ఉత్తమనాటకము ఆంధ్రావనిలో ఇంకను ఉద్భవించవలసియున్నది. నాటకములో అంగభూతములగు కవిత్వము, సంభాషణాచాతురి, సన్నివేశసంఘటనా కౌశల్యము కవిని ఉత్తమనాటకకవిని జేయజాలవు. "ప్రతినాటకము ఒక పిండాండము. దానికి కవియే సృష్టికర్త" అన్న ఆంగ్లవిమర్శకుని అర్థవంతమైన వాక్కులు నాటకసృష్టిని విశ్వసృష్టికి ప్రతిధ్వనిని జేయుచున్నవి. సృష్టికర్త తాను సృజించిన పాత్రలన్నిటిలో ఇమిడియున్నను సృష్టి పదార్థములకు సర్వదా అతీతుడే. అట్లే నాటకకవి తాను సృజించినపాత్రలన్నిటిలో ఇమిడియున్నను, వాని కతీతుడే. కాళిదాసాదులు తమ కథాసంవిధానములలో జీవితపరామర్శను అంతర్గర్భితముగా ప్రదర్శించినారు. వేదాంతులుగూడ ఈ రహస్యమును గుర్తించియే కాబోలు పరమాత్మను జగన్నాటకసూత్రధారిగా, జీవులను పాత్రధారులుగా ప్రపంచమును రంగస్థలముగా ఉపమించుచున్నారు.

ఆంధ్రనాటకకళాపరిషత్తు చిరకాలము క్రింద స్థాపింపబడినను ఆంధ్రలోకమున గల

---

* Art and life are parallel developments which no where meet. A. C. Bradly. (Oxford lectures)

నటీనటులను, నాటకరచయితలను ఏకోన్ముఖము జేసి నాటకకళకు కేంద్రవ్యవస్థ కొలేక పోయినది. అప్పుడప్పుడు ఆదర్శప్రేరితులగు ఉత్సాహవంతులు చేరి పరిషత్తును నిర్వహించుచున్నారు. యావదాంధ్రమునందలి నాట్యకళా పరిషత్తుయాజమాన్యమున, రసజ్ఞుల పర్యవేక్షణలో ఏయేట సమీక్షింపబడుట కళాభ్యుదయమునకు మొదటిమెట్టు; ఉత్సాహవంతుల ప్రతిభకు దోహదము. కళాభిమానులు అప్పుడప్పుడు పత్రికాముఖమున మొఱబెట్టుచున్నను, అది అరణ్యరోదన మగుచున్నది*. తెలుగుదేశములో కూచిపూడివారి భరతనాట్యవిద్యవలె కేరళదేశమున కథాకళియను నృత్యవిధానము గలదు. దానిని నేడు కేరళీయులు అభిమానించి ఆదరించుచున్నారు. మళయాళమునకు తిరువాన్కూరు, కొచ్చిన్, సంస్థానముల రాజపోషణ గలదు. కన్నడమునకు మైసూరు రాజ్యము గలదు. మన తెలుగు దేశములో ఇట్టి స్వదేశసంస్థాన మొక్కటియు మన ప్రాచీనకళా సైద్ధ్యమును కాపాడునట్టిది లేదు. ఉన్న హైదరాబాదు సంస్థానము ఇంతకంటె ముఖ్యమైన సేవలో మునిగి తేలుచుండును. తెలుగు దేశములో జమీందారులు నాటకకళకు పట్టుగొమ్మలై నిలిచినారు. అందులకు వారు అభినంద నీయులు.

నాట్యకళ జాతిలోని చైతన్యము. నాట్యానుశీలనము నెరుగని జాతి మృతప్రాయము. కృత్రిమమైన కళావిలాసములు కుక్కగొడుగులవలె బయలుదేరుచున్న ఈ కాలములో నాట్యకళోద్ధరణమునకు రసజ్ఞులగు కళాభిమానులందరును నడుముకట్టుకొని ముందునకురావలెను. మార్గనాటకములనేగాక నృత్త, నృత్య, అభినయవిద్యలనుగూడ ఆదరింపవలసిన అవసరము ఇప్పుడు పట్టినది.

వేశ్యాసంఘము మదురవాణితో అభినయ విద్యకూడ అంతరించుచున్నది. పశ్చిమ సముద్రతీరమందు కేరళసోదరులు తిరిగి కథాకళిని నవ్యచైతన్యముతో సృష్టించుకొను చున్నారు. నృత్యకళను ఆంధ్రులుకూడ ఉద్ధరించుటకు పూనుకోవలెను. ఆంధ్రనాట్యకళాపరిషత్తు మార్గనాటకములవలె భరతనాట్యాభినయమునకు నాట్యక[illegible] మను [illegible]దయము మెన్నటికో!! ముందుగా ఈ మహోదయమును కాంచినయే కాబోలు భరతనాట్యప్రవీణులగు ఆంధ్రనర్తకులు కొందరు ఉత్సాహముతో విద్యార్థులకు ఉపాధ్యాయులై [illegible] నర్పించు చున్నారు!!

*ఆంధ్రపత్రిక తారణ సంవత్సరాది సంచిక—శ్రీ కూర్మా వేణుగోపాలస్వామిగారి వ్యాసము.





'నీలాటి రేవుకు'

"నీలు తేబోతుంటె నితోడ్గా వోలమ్మ
నాయెనక యెవరోను నడిసినట్టుంటాది"

— చిత్రకారుడు : శ్రీ రేమళ్ల చిన్నారావు —



[పుల్లి మొగుడు తలమీద పెద్ద మూట ఎత్తుకుని కాలవమలుపు తిరిగాడు. ఇంతలో పుల్లికూడా కాలవమలుపులో కనబడింది. మొగుడూ, పెళ్లామూ కబుర్లు చెప్పుకుంటూ వస్తున్నారు—]

# పుల్లి

రంగనాథం డాము పక్కని కూచున్నాడు.

నీరు లుంగలుచుట్టుకుంటూ డాము ఇవతలకి దూకుతోంది. కాలవ అవతల జనపచేలు పచ్చగా పూసి ఉన్నాయి. పొరుగూరు సంతనించి జనం తిరిగివస్తున్నారు.

రంగనాథానికేమీ తోచడం లేదు. ఈసారి అతనికి ఆపల్లెటూరు దిగులుగా ఉంది. అందులో పొద్దున్న పుల్లి గొడవ చూసి నప్పటినించీ.

పుల్లి అతని తాతగారి ఇంట్లో దాసి—అతని చిన్నతనం నించీ కూడా. ఇంట్లో మనిషికన్నా ఎక్కువగా ఉండేది. అతన్ని చిన్నతనంలో ఎత్తుకుతిరిగేది—అతనికి పాలు ఇచ్చిందట కూడాను; అతని తల్లి చెపుతూ ఉంటుంది. పుల్లి నవ్వితే చాలు ఇంట్లో పిల్లలందరూ ఏడుపులు మానివేసేవారు. ఒక్కసారి పుల్లి ఎత్తుకుని నలిపిపారేస్తే (పుల్లి మెల్లగా ఎత్తుకోదు; ముద్దుగా ఇటూ అటూ ఊపేస్తో కిచకిచ పెడుతూ ఎత్తుకుంటుంది) పిల్లలు పకపక నవ్వుతారు. ఆమె కలకలలాడుతూ వస్తుంది. ఆమె చురుకుగా చలాకీగా చూస్తుంది. నలభయి ఏళ్లు పైబడ్డా ఆమెలో చురుకు తగ్గలేదు. రంగనాథం మేనమామల ఇంటికి రావడానికి పుల్లి ఒక పెద్ద ఆకర్షణ. ఆమెతో ఎన్నాళ్లయినా అతడు కబుర్లు చెపుతూ గడిపేవాడు. అందుకని మేనమామల ఊరంటే అతనికి ఎంతో సరదా ఇన్నాళ్లూనూ.

పొద్దున్న అతను కళ్లారా చూసిన గొడవంతా అతని మనస్సులో అల్లకల్లోలంగా నిండి ఉంది. అతనికి అన్నిటిమీదా కోపంగా ఉంది. పుల్లిమీదా, పిల్లెంకడిమీదా, ఆ ఊరుమీదా, పుల్లి మొగుడు మీదా.

పుల్లి మొగుడు దూరాన్ని కనబడ్డాడు. తలమీద పెద్ద మూట ఎత్తుకుని కాలవమలుపు తిరిగాడు. దారిపక్కని ఉన్న మర్రిచెట్టు కింద ఎవరితోనో ఒకక్షణం మాట్లాడాడు. పక్కని బియ్యపుమర ఆఖరిపొగ గుప్పుగుప్పున వొదిలి ఆవేళకి పని చాలించింది. ఇంతలో పుల్లి కూడా కాలవమలుపులో కనబడింది. మొగుడూ, పెళ్లామూ కబుర్లు చెప్పుకుంటూ వస్తున్నారు-ఎల్లా చెప్పుకోగలుగుతున్నారో అతనికి ఆశ్చర్యం వేసింది; ఇంతగొడవయ్యాక.

పిల్లెంకడు అతని పక్కని వచ్చి కూర్చున్నాడు. పాలు పితికి అప్పుడే దూడల్ని వొదిలాడు. వెనకఉన్న పశువుల సావడిలో దూడలకాళ్ల చప్పుడు, పొదుగులకోసం వాటి ఆబ, ఆవుల ఆకలి అరుపులు రంగనాథం విన్నాడు. వెనక్కి తిరిగి చూశాడు. ఎర్రటి సంజఎండ మామిడితోటమీద పాకింది. పచ్చిమామిడికాయలు ఆ వెలుగులో స్పష్టంగా, స్ఫుటంగా కనబడుతున్నాయి. పిల్లెంకడి గుడిసెలోంచి పొగ లుంగలుగా ఆకాశంలోకి వ్యాపిస్తోంది.

పిల్లెంకడి వేపు చూశాడు. పిల్లెంకడు నలభయి ఏళ్లు-దాటిన నవ్వు మొగంతో అప్పుడే పెళ్లయిన కుర్రవాడిలా ఉంటాడు. సరదాగా నిర్లక్ష్యంగా చుట్ట కాలుస్తో చూస్తాడు. అతడు పుల్లీ, పుల్లి మొగుడూ సంతనించి వస్తుండడం చూశాడు.

"రంగన్న బాబో! సంకురేత్తిరికి రాలేదేం? మామయ్య సాలా సూశాడు నువ్వూ, అమ్మాయీ వొత్తారేమోనని."

"వీల్లేకపోయింది. అమ్మకి నోంట్లో బాగాలేదు." రంగ నాథం విసుగ్గా అన్నాడు. ఆ ప్రశ్న అతను వచ్చిన తరవాత ఈ రెండురోజుల్లోనూ అందరూ తలాకసారి అడిగారు. మొదట అత్తయ్య, తరువాత మామయ్య, పుల్లి, పుల్లిమొగుడు, అంతానూ.

పుల్లీ, పుల్లిమొగుడూ దగ్గరగా వొచ్చారు. పుల్లి మొగుడు ఆగకుండా తిన్నగా వెళ్ళిపోయాడు. పుల్లి ఆగింది. అంది:

"అబ్బాయి! తలంటోసుకుంమాగాని నడు. పొద్దోతంది."

పుల్లి అతన్ని చిన్నప్పటి నించీ అబ్బాయనే పిలిచేది. ఆవేళ మాత్రం రంగనాథానికి ఏదో వెగటుగా అనిపించింది ఆ పిలుపు.

"ఈవేళొద్దు. రేపు పొద్దున్న. నువ్వెళ్లు. నేను వెనకా లొస్తాను."

పుల్లీ, పిల్లెంకడూ ఒకరివే పొకరు చూసుకున్న చూపు అతడు చూశాడు. ఉక్కిరి బిక్కిరి అయిపోయాడు. ఈలోకంలో సిగ్గు అనేది ఎక్కడా లేదా అనిపించింది అతనికి.

"అమ్మాయి సూత్తుంటది నీకోసం" అంటూ పుల్లి వెళ్లి పోయింది. ఇదివర కెన్నో సార్లు పుల్లి అటువంటి మాటలు సర దాగా అంటుండేది. రంగనాథానికి కడుపు నిండినట్టుండేది. కాని ఈవేళ అంతా తల్లకిందుగా అయిపోయింది.

అతన్నీ, అతని భార్యనూ పుల్లి చిన్నప్పటి నించీ ఎత్తుకు తిప్పింది. చిన్నప్పుడే ఇద్దరిచేతే తమాషామాటలన్నీ అనిపించేది. ఇద్దరికీ పెళ్లి అవుతుందని ఆమె చిన్నప్పుడే నిశ్చయించుకుంది. తన తల్లికీ, తన మేనమామకీ, అత్తకీ అందరికీ ఆమే చివరకి అంతా నచ్చచెప్పింది. పెళ్లంతా పుల్లిచేతిమీద జరిగినట్టుగా జరిగి పోయింది. పుల్లి లేకపోతే పెళ్లి చాలా వెలితిగా ఉండేది. అంతెం దుకు, పుల్లి లేకపోతే రంగనాథానికి తన మేనమామల ఇంట్లో సగం సరదా లేదు. తన తల్లికీ, తన మేనమామకి దెబ్బలాట వచ్చిన నాటినించీ పుల్లితప్ప అతనికి ఆ ఊళ్లో ఇంకో ఆత్మబంధువు ఎవరూ లేరు. తల్లికంటే ఎక్కువగా చనువయింది ఆమెతో.

అతను లేచి ఇంటివేపు బయలుదేరాడు. సన్నటికాలవగట్టు మీద ఎదురుగా మూడల మంద వస్తోంది. అతను కాలవవాలులోకి తప్పుకుని నిలబడ్డాడు. మధ్య ఒక పెద్ద గిత్తమీద చెవులు ఎత్తి బెదురుమాపులు అతనివేపు చూసింది. పెద్దమూపురం, దానిమీద నల్లని మచ్చ, పొట్టిగా అగుపించీ అగుపించని కొమ్ములు, చొంగ కారే నల్లటి మూతి- గిత్త వింతగా ఉంది. చటుకుని దానికి ఉద్రేకం వొచ్చి ముందు నడుస్తున్న ఆవును కుమ్మింది. మందమందంతా ముందుకి పరుగెత్తింది. వెనక నడుస్తున్న పాలికాపు మోటకర్రతో గిత్తను కొట్టాడు. మంద వెళ్లిపోయింది.

రంగనాథం పొద్దున్న జరిగిన దంతా జ్ఞాపకం తెచ్చు కున్నాడు.

పొద్దున్నే అతను బయలుదేరి పొలంవేపు వస్తున్నాడు. ఈడిగపాలెంలో ఒక పెద్దగుంపు అర్ధచంద్రంగా నిలబడి, కూర్చునీ ఉన్నారు. అతని కసలు గుంపులంటే అసహ్యం. తప్పుకుని ఇంకో దారివెంట పోదా మనుకున్నాడు. ఇంతలో పుల్లిముఖం కనబడింది. ఆమెపక్కని పిల్లెంక డున్నాడు. ఈడిగపెద్ద ఒక ఎత్తు అరుగు మీద కూర్చున్నాడు. గుంపుకి ఇవతలగా [illegible]తో కొత్తకల్లు ఉంది. రంగనాథం కుతూహలంకొద్దీ అగి నిలబడ్డాడు. పుల్లి మొగుడు నిలబడి చెపుతున్నాడు:

"అదేమో, మొన్న సందేటేల మాఅయ్యగారి పొలం పోయింది. ఎంచేపటికీ రాకపోతే నాకు ఇనుమానించి. పెద్దకుర్రది మంచంమీదుంది. సిన్నకుర్రదానికి సొంటరాదు. నా సుకొచ్చి తోటలో మాయయ్యగారి దూగ్గనాలుంగి. అక్కడ [illegible]. సీకటిపోతంది. అప్పుడు సూశేనండి."

అతని ముఖం మొద్దులా ఉంది. నవ్వు గలిపే ఆదుర్దం ఏదో అతని ముఖంలో ఉంది. అతని మాటల్లో ఉద్రేకం ఏమీ లేదు. అతని మాపుల్లో కోపం లేదు. ఏదో అనాసక్తంగా ఇంత మందికీ నిలబెట్టి బాధపెడుతున్నట్టుగా అస్తిమితంగా నిలబడ్డాడు.

"ఏటి సూశా?" పెద్ద అడిగాడు.

"అదన్నీ......"

"అదెవరు?"

"మా పుల్లి. అదీని, పిల్లెంకడూ సీకట్లో సిక్కిమొటిపక్కని దగ్గరగా కూకునిఉన్నారు. అదేదో నా కళ్లారా కళ్లతో సూపెట్టి పొడిచాడు. అది నవ్వింది."

"నువ్వేం చేశా?"

"ఏం చెయ్యమంటారు? కోపంగా ! ఇంటికి రా. ఇక్కడేటి సేసంతావు అన్నాను"

"ఇరగదన్నావా?"

"లేదండీ! యెల్లా గిరగదన్నను?"

అందరూ పకపకా నవ్వారు. పుల్లీ, పిల్లెంకడూ కూడా నవ్వారు. పుల్లిమొగుడు కంగారుపడి తనూ నవ్వి కూర్చున్నాడు.

రంగనాథానికి చటుకుని పడిపోయి చెప్పకట్టలేనంత బాధ పెట్టింది. పుల్లి ఇల్లాంటి దని అతనికి ఇంతవరకూ తెలియదు! అతడు తొందరగా పొలం పోయాడు. కాని అతని మనస్సంతా కలిగిపోయింది.

పదిగంటలవేళ మళ్లీ ఇంటికి బయలుదేరాడు. ఆదారిని వెళ్లకూడ దనుకున్నాడు. పక్కసందులోంచి ఇంటికి మళ్లబోతుంటే అవతల పెద్దగోల అవుతోంది. అతనికి కుతూహలం ఆగింది కాదు. సందులోంచి మళ్లీ ఒక ఇంటి అరుగుపక్కనించి తొంగిచూశాడు. అందరూ ముంతలతో కల్లు తాగుతున్నారు. ఆడ, మగ ఒకళ్లమీద ఒకళ్లు పడి గెంతుకుంటున్నారు. ఆ దృశ్యం చూసేసరికి అతనికి

అసహ్యం వేసింది. ఇంత నీచమయిన స్థితికి మనిషి దిగిపోవడం అతను ఇంతవరకూ చూడలేదు. పుల్లి కల్లు అందరికీ పోస్తో తనూ తాగుతోంది. ఈడిగపెద్ద ఆమెవెనకాలే వచ్చి తూలుతూ ఆమె మీద పడ్డాడు. ఆమె తప్పించుకుంది. అతడు ముంతతోకూడా కింద పడిపోయాడు. ముంత చితికిపోయింది. అందరూ పకృన నవ్వారు. పుల్లి ఇంకోముంతతో అతనికి కల్లు ఇచ్చింది. ఆమె ఒక చూపు చూసేసరికి అతని కోపం మాయమయిపోయింది. పుల్లి మొగుడు చేతిలో ముంతతో కునికిపాట్లు పడుతో గోడపక్కని కూర్చున్నాడు. పిల్లెంకడు అందరిమధ్యా తిరుగుతూ ఏవో పాటలు పాడుతున్నాడు. రంగనాథం ఇంటికి మళ్లిపోయాడు. ఇంతలో నరసన్న అతన్ని చూసి పరుగెత్తుకునివొచ్చి నమస్కరించాడు. అత డంత బాగా తాగలేదు. రంగనాథం ఏమీ ఎరగనట్టు అడిగాడు :

"ఏమిటీగొడవ ?"

"పుల్లికీ, పిల్లెంకడికీ తప్పేశారండి"

"ఎందుకు ?"

"ఎందుకేటండి బాబూ! తమకి తెలియని దేముంది? ఆడికీ దానికీ సంబంద ముందండి"

"ఎన్నాళ్లనించి ?"

"అబ్బో! శానాళ్లనించండి"

నరసన్న అతని పక్కని నడుస్తో వస్తున్నాడు. రంగనాథానికి ఇంకేమడగాలో తోచలేదు. ఇంకా ఏదో తెలుసుకోవాలని అతనిలో ఒకపక్క కుతూహలంమాత్రం లేకపోలేదు.

"ఇంత ఇల్లాంటిదని నేనెరగను"

"అయ్యబాబు! దానికేముండి? ఏదో ఒకో లోటుంటదనుకోండి. ఎవరికి లేదు సొప్పండి? మరి పుల్లంటే పుల్లే. దానికి సాటెవ రొత్తారు?"

"అయినా ఇటువంటి పనే? మంచీ చెడ్డా ఉండొద్దూ?"

"అల్లాగంటే ఎల్లాగండి బాబూ? దాని మొగుడు సూశారా? మీ తాతయ్య కట్టిపెట్టేరు దానికి. ఆడికి బుఱ్ఱలేదు. ఎందుకూ పనికి రాడు. మరింక దది ఏంజేత్తాది సొప్పండి? ఆకు వొట్టి రాయి. అయినా బాబూ! ఒకోనాడు ఏమీ అనలేమండి. సుక్క బాగా తగిత్తే ఇంక వొళ్లు తెలదు. అల్లాంటప్పుడింక నీదీ నాదీ అన్న మాటుండదు బాబయ్యా! ఏమయితేనేం, పుల్లిలాంటి మనిషి మళ్లీ లేదు. ఎన్నిలోకాలు వెతికినా సరే. అదలా నడిత్తే సాలు, ఒక్క సూపు సూత్తే సాలు."

"మరి ఇన్నాళ్లబట్టీ ఈసంగతి తెలియకే ఊరుకున్నారా?"

"దాని మొగుడొచ్చి పెద్ద దగ్గర అల్లరి పెట్టాడండి. పెద్ద ఇయ్యాల ఊరు పోతన్నాడు. అందుకని పొద్దున్నే కూడగట్టాం."

రంగనాథం ఇదంతా ఆలోచించుకున్నాడు. తన కివన్నీ తెలియవు గనుక పుల్లిని గురించి గొప్పగా అనుకున్నాడు ఇన్నాళ్లూనూ. ఇవన్నీ తెలిసినవాళ్లంతా పుల్లిని అంత గొప్పగా పొగుడుతా రెందుకు? వాళ్లంతా నీచులనీ, వాళ్లకి నీతీ అవినీతీ లేవనీ రంగనాథం నిశ్చయించుకున్నాడు.

ఇంటికి వచ్చినతరవాత అతని భార్య తలంటు పోసుకోమని ఎంతో బలవంతం చేసింది. అతను పోసుకోనని మొండిపట్టుపట్టాడు. అతడు దక్షిణపు పెరట్లో మల్లి పందిరిపక్కని మంచం వాల్చుకుని పడుకున్నాడు. గోడఅవతల వైష్ణవుల ఇంట్లోంచి ఏదో కమ్మని వాసన కొట్టింది. మంచంఅడుగుని అప్పుడే నీరుజల్లిన నేల మత్తుగా వాసనకొట్టింది. మల్లి పువ్వులు స్వచ్ఛంగా, చల్లగా, తెల్లగా, ఒత్తుగా పూశాయి. రంగనాథం చాలా చిరాకుగా ఉన్నాడు. పుల్లి వచ్చి మంచంపక్కని నిలబడింది. అతడు లేచి కూర్చున్నాడు.

"రా బాబూ! తలంటోసుకుందూగాని" అని మెల్లగా బలవంతపెడుతున్న గొంతుకతో అంది పుల్లి.

"నేను పోసుకోను"-రంగనాథం మళ్లీ పడుకున్నాడు. పుల్లి అతని చెయ్యి పట్టుకుని మందలిస్తున్నట్టు లేవదీసింది.

"మీ మామయ్యకాడ పేశీపెట్టు. అంతేగాని నాదగ్గరే? లే. లే. నీళ్లు మరిగిపోతన్నాయి." ఆమె అత నింక వస్తా డన్నట్టు ధీమాగా వెళ్లిపోయింది. రంగనాథానికి లోపల చాలా చిరాకుగా ఉంది. ఆమెచనువూ, ఆమె బలవంతం, ఆమెధీమా అతనికి చాలా కోపం కలిగించాయి. అయినా అతను లేచాడు. తువ్వాలు కట్టుకుని నీళ్లసావడిలోకి వెళ్లాడు. అతని భార్య, పుల్లి అక్కడన్నీ సిద్ధంచేసి అతనికోసం ఎదురుచూస్తున్నారు. తలంటుతో పుల్లి ఎవ్వో మాట్లాడింది. అతని తల్లిని గురించి అడిగింది. చిన్ననాటి కబుర్లు ఎన్నో చెప్పింది. రంగనాథానికి ఏదో ఈసు గొంతుక దాకా పొంగింది. కాని, అతను ఏమీ సమాధానం చెప్పలేదు. పుల్లి స్పర్శకు అతని శరీరం మైలపడి పోయినట్టు ముడుచుకుపోయింది. తక్షణం లేచి ఎవరినో ఒకర్ని ముక్కుమీద నెత్తురువచ్చేలాగ గుద్దాలనిపించింది. కాని అతను చెయ్యీ కాలూ కదపకుండా అల్లాగే తలంటించుకున్నాడు.

అతనికి ఆ వేళ భోజనం సహించలేదు. అతడు అల్లుడి తనం సాగిస్తున్నాడని మేనమామ అనుకున్నాడు. అన్నాడు కూడా అల్లాగని.

"ఏరా! మామీద కోపమొస్తేవొచ్చింది. తిండి సరిగ్గాతిను."

"కోపం ఎవరిమీద ?"

"ఏమోలే. మీ అమ్మకి ఒచ్చిందిగా నామీద."

రంగనాథం ఇంకేమీ సమాధానం చెప్పలేదు.

భోజనం అయినతరవాత మళ్లీ దక్షిణపు పెరట్లో మంచం మీద పడుకున్నాడు. చీకట్లో అతనికి ఆకాశం ఒకటే కనబడుతోంది. మల్లి పువ్వుల వాసన ఏదో పూర్వలోకాన్ని స్మరణకు తెస్తోంది. అతనికి తక్షణం ఆఊరు వదలి ఎక్కడికో పోవాలనిపించింది.

పుల్లి ఒక చేత్తో దీపమూ, రెండో చేత్తో ఇంకో సద్దిమంచమూ పట్టుకువచ్చింది. అతని మంచంపక్కని వాల్చింది. దీపం సమ్మంమీద పెట్టి రెండు పరుపులు రెండు చంకల్లోనూ మోసుకువచ్చింది. వాల్చిన మంచంమీద పక్క వేసింది. రంగనాథం కదల్లేదు. ఆమె దగ్గరగా వచ్చి నిలబడింది.

"లే. అంగెమీద పడుకో. పక్కేస్తాను."

అతను సమాధానం చెప్పకుండా పక్క వేసిన మంచంమీదికి వొర్లాడు. ఆమె రెండో మంచంమీద పక్క వేస్తోఉంటే అతని భార్య సమ్మంలో వచ్చి నిలబడింది. పక్క వెయ్యగానే వచ్చి పక్కమీద కూర్చుంది.

"ఏమండీ! పుల్లిని మన ఊరు తీసుకుపోదామా?" అంది.

పుల్లి మంచంపక్కని కూర్చుంది. రంగనాథం సమాధానం చెప్పలేదు.

"మాట్లాడ్డు, రంగన్నబాబు! మే మెందుకు పనికొత్తాంలే. పట్టువోసం మరి. అమ్మాయిగనక మామీద అల్లాగుంటది" ఆమె అమ్మాయిని నిమిరింది. అమ్మాయి పడుకుని పుల్లి చెయ్యి బుగ్గమీద పెట్టుకుంది.

"నువ్వెందుకొస్తావు? నిన్నసలు మామయ్య వొదులుతాడా? అదీగాక నీ కెన్ని ఉన్నాయి......ఓ పక్కని పెళ్లాం ఉంది!" అతను ఆఖరిసుక్క నాలా నత్తిపోదుస్తున్నట్టుగా, కోపంగా అన్నాడు.

"సాల్లెద్దూ! నేర్చుకుపోయావు. సాంతాకోలంగాదు మరి. నువ్వు రమ్మన్నా, నే నిప్పుడు నీకూడా వొస్తేగదా"

"అంత నే నీరాత్రే ప్రయాణమయి వెళ్లిపోదాం పదులే."

మొత్తంమీద రంగనాథానికి తనేదో కానిమాట అని పుల్లికి లోకువయిపోయినట్టు అనిపించింది. అది నసలు పెళ్లాంకదే గొడవ ఎత్తకుండా ఉండవలిసింది.

"పుల్లి, మరేం, అత్తయ్య ఒక పెద్ద సింగారం కొంటే. పొద్దున్నే దాన్నిండా నీళ్లు పోసి ఉంచుకుంటాం. సాయంత్రం దాకా సరిపోతాయి."

"అమ్మని ఓసారి తీసుకురా అబ్బాయి. లేకపోతే నన్ను తీసికెళ్లినా సరే. తోడబుట్టాళ్లకి ఇల్లా మాటా మంతీ నెడిపోడం బాగుండదు. నే కలుపుతాను. నే నిల్లాగన్నానని అమ్మతో అను."

"మామయ్య పోనీ రమ్మని రాయకూడదూ? అంత పట్టుద లెందుకు?"

"రాస్తే వొస్తుందా ఏమిటి? ఇద్దరికీ పట్టుదలే. ఇందులో తక్కువవాళ్లెవరు?" అంది అతని భార్య. సంభాషణ అకారణంగా చనువులోకి దిగిపోతోంది. అతను నిద్రవోస్తున్నట్టు నటించాడు. పుల్లి అతనివేపు చూసింది. అతను కళ్లు మూశాడు.

"అంతే. నే నింక అవతలికి వెళ్లిపోవాలన్నమాట. పట్టవోసంలో తానా నేర్చుకున్నాడు బాబు. మాట్లాడతా మాట్లాడతా కన్ను మూత్తన్నాడు సూశావా అమ్మాయి? అమ్మాయి కేమీ తెలదు. పిచ్చి మాలోకం!" పుల్లి అమ్మాయిని ప్రేమగా దగ్గరగా తీసుకుంది.

[అతనికి క్రమంగా నిద్రపట్టింది.....అది పల్లెటూరో పట్నవాసమో చెప్పడానికి వీలులేదు. పెద్ద చింతచెట్టుంది. దానికింద రేడియో పాడుతోంది. ఒకటేబిలుమట్టూ....]



"రంగన్నబాబు పెద్దోడయాడు. సిన్నప్పుడెత్తమానూ యేదుసేవాయన. ఎత్తుకోలేక సేతు లడిపోయేవి. పెద్దోడయి పెద్దపనిలో కెళ్తే ఎంతెల్లా మారిపోతారో సూడు మొగోళ్లు...అయినా రంగన్నబాబు రంగన్నబాబే. వొజ్రగం మాణిక్యం. ఏం బాబు! ఓస్ నిద్ర! పోతన్నాను. పెద్ద కుర్రదానికి జొరం. అమ్మాయి! పోతాను. పురుగూ పుట్రా వొత్తాయి. దీపం కిటికీలో పెడతాను. రంగన్నబాబు! మా పెళ్ల మంచిదేనా? అబ్బో! నిద్ర!

న్నాకి సుంగు సవ్వస్న మాటలన్నీ నాకు గురుతున్నాయితే. ఏం బాబూ! ఏదారిదాకా ఈ ఊరు రాకుండా ఎల్లాగున్నా? మా నాట మరిచిపోయావా? పోతాను......పొద్దున్నే రావాలి."

పుల్లి వెళ్లిపోయింది. రంగనాథం కళ్లు విప్పాడు.

"నిద్దర్రాస్తోందా?" అంది అతని భార్య.

"ఊ!" అని మళ్లీ కళ్లు మూశాడు.

అతని తలకింద దిండ్లు సరిజేసి ఆమెకూడా అతని పక్కని పడుకుంది.

అతనికి ఎన్నో దృశ్యాలు జ్ఞాపకం వొచ్చాయి. ఇదివరకు దాకా పుల్లి అతనికి ఆరాధ్యదేవత. ఆమెతో అతడు చెప్పని రహస్యం లేదు. చెనికయినా సరే ఆమెమీద ఆధారపడేవాడు. ఆమెతో చెప్పుకుంటే అతని మనస్సులో బరువంతా తీరిపోయినట్టుండేది. ఇక్కడికి వచ్చేముందు ఎన్నో ఆమెతో మాట్లాడాలనుకున్నాడు. తన తల్లికీ, తన మేనమామకీ మధ్య మనస్పర్థలు పెరిగిన తరవాత అతని పరిస్థితి ఇరుకులో పడింది. తన భార్యక్కీ, తన తల్లికీ మధ్య ఆ తగాదా యొక్క ఛాయలు కొద్దికొద్దిగా వాకపం ప్రారంభించాయి. వాటికన్నిటికీ పుల్లి పరిష్కారం చూపించి తీరుతుం దని అతను గంపెడాశతో ఈసారి వచ్చాడు.

తన తల్లి పక్కని కూర్చుని పుల్లి కాళ్లు చాపుకుని చెనకటి కబుర్లు చెబుతో ఎల్లా అసలుసంగతి ఎత్తుతుందో, ఏమీ నొప్పి తగలకుండా ఎల్లా మనస్సు మెత్తగా చేసేస్తుందో, అంతా అతను ఇదివరకు ఊహించుకున్నాడు. ఈలోకంలో మంచి ఏదుంటే దానికంతకీ ప్రమాణం పుల్లి. పుల్లి ఒక దేవత. అతని జీవితాన్ని సవ్యంగా నడిపించడానికి ఈ లోకంలో పుట్టింది. పుస్తకాల్లో చదివే మాతృదేవతకు ఆమె అవతారంలాగ అతనికి అనిపించేది. ఆమెకు ఒక మొగుడూ, పిల్లలూ ఉన్నారన్న సంగతి అసలు రంగనాథం మరిచిపోయాడు.

పొద్దున్న సంగతి అంతా కళ్లారా చూసిన తరవాత, అతనికి పుల్లి మీద తీరని ఈసు, కోపం వచ్చాయి. తనని ఇన్నాళ్లూ ఆమె మోసగించినట్టు అతనికి అనిపించింది. ఈమె ఇల్లాంటిదని అతనికి ఇన్నాళ్లూ ఎందుకు తెలియలేదు?

అతని భార్య పక్కని మెదిలింది. ఆమెస్పర్శ అతనికి కొంచెం ఉక్కిరి బిక్కిరిగా ఉంది. ఆమె అంది:

"ఏమండీ! పుల్లి ని మనం తీసికెడదామా?...దాన్ని అడిగానండి. అది మీరు సరేనంటే వస్తానంది...అత్తయ్యకూడా ఏమీ అనదు."

"ఎందుకు అక్కడికి? రంకుముండ?"

"చాల్లెద్దురూ. ఏం మాటలు?"

"పొద్దున్న గొడవంతా విన్నావుగా?"

"వినే దాని గొడవ దానిది. మన్నేమన్నా అది బాధించిందా? దానీ ఇదేమన్నా కొత్తవిషయం గనకనా. దాని మొగుడు అసలు మొద్దు అవతారం..."

"చాల్లే! ఊరుకో...నాకు నిద్రవస్తోంది."

ఆమె కాస్సేపు అల్లాగే పడుకుని లేనాతి లేచి పక్క మంచంమీదికి పోయి పడుకుంది.

అయితే ఆసంగతి అందరికీ తెలుసును! తనకే తెలియదు! ఏమి చిత్రం? తన భార్యకూ తెలుసును. అయినా ఎంత చనువుగా, ప్రేమగా పుల్లి పక్కని కూర్చుని మాట్లాడుతోంది! ఈ పల్లెటూళ్లలో ఇంతే. నీతి లేదు. సంఘం అంతా కుళ్లి పాడయిపోతోంది. ఏమీ ప్రమాదం జరగలేదన్నట్టుగా, ఆ సంగతి అంత ముఖ్యమయినది కానట్టుగా మాట్లాడతారేం అందరూ?

అతనికి క్రమంగా ఆలోచనలు చెదిరిపోయి దారీ తెన్నూ లేకుండా తిరుగుతున్నాయి. పట్నంలో చక్కగా దుస్తులు ధరించిన స్త్రీలు, వాళ్ల మర్యాదలు, వాళ్ల తెలివితేటలు, ఎంత చనువయినా కొంచెం దూరంగా అట్టేపెట్టే సంస్కారం ఒకపక్కనీ; పల్లెటూళ్లు, గడ్డిమేట్లపక్కని వ్యభిచారాలు, ఆవిషయమయి సిగ్గుపడకుండా అతినిర్లక్ష్యంగా మాట్లాడ్డం, సంస్కారంలేని మోటహాస్యాలు రెండోపక్కని కలగాపులగంగా అతని మనస్సులో దొర్లిపోతున్నాయి. అతనికి క్రమంగా నిద్రపట్టింది.

* * * *

అది పల్లెటూరో పట్నవాసమో చెప్పడానికి వీలులేదు. పెద్ద చింతచెట్టుంది. దానికింద రేడియో పాడుతోంది. ఒక టేబిలుచుట్టూ పది పదిహేనుమంది కూర్చుని టీ సేవిస్తున్నారు. అందులో తక్కిన వారెవరో అతనికి గుర్తులేదు. అతని పక్కని ఒక యువతి కూర్చుంది. ఆమెముఖం ఎల్లా ఉందో అతనికి స్పష్టంగా తెలియదు. ఆమె మాత్రం ఆదర్శప్రాయ. ఆమెహృదయం అతివిశాలమయినది. ఆమెకు ఈ లోకంలో తెలియని విషయంలేదు. కాని ఆమెతో ప్రస్తావించిన విషయం ఏమిటో అతనికి గుర్తులేదు. అతని మనస్సు దూదిపింజలా ఉద్రేకంతో పైకి ఉబికింది. కొంతసేపయిన తరవాత అతడూ, ఆమే ఒక కాలవగట్టుమీదనించి నడిచిపోతున్నారు. అంతా సినీమాలలో చూసే దృశ్యంలాగ ఉంది. నీటిమీద కలవ ఆకులున్నాయి. నీటిలో కలవపువ్వు లున్నాయి. చటుకుని కాలవ చెరువులాగ అయిపోయింది. పక్కని ఒక కొత్త గడ్డిమేటి ఉంది. ఇద్దరూ ఆగడ్డిమేటి పక్కకి పోయి కూర్చున్నారు. అతడు ఆమె పక్కలో వేలెట్టి పొడిచాడు. ఆమె విరగబడి నవ్వింది. అతడామెను గట్టిగా కౌగలించుకున్నాడు. పక్కని ఎక్కడో ఆవులు కదిలిన ధ్వని.

"పుల్లీ" అన్నాడు ఇంకా గట్టిగా కౌగలించుకుంటూ.

"రంగన్న బాబుకి మతోయిందా?" అంది పుల్లి అతన్ని మెల్లగా నిమురుతో. అతని వొళ్లంతా దూదిలా తేలికగా అయిపో

యింది. పుల్లి, చిన్నపిల్లలాగ, పెద్ద తల్లిలాగ అతన్ని ఆవరించింది. చెరువులో అతని ముఖం అకారణంగా ప్రతిఫలించింది. అందులో పిల్లింక డున్నాడు. ఇంతలో చటుకుని పుల్లి మొగుడు అన్నాడు "రా! మక్కలిరగదంతాను."

* * * *

అతనికి ముచ్చెమటలు పోశాయి. ఊపిరి ఆడ లేదు. కిటికీలో దీపం ఆరిపోయింది. అతని గుండెలు దడదడ కొట్టుకున్నాయి. అతడు తడుముకుంటూ లేచి పక్కమంచం మీదికి పోయి తన భార్యని గట్టిగా అదుముకుని పడుకున్నాడు.



అమెరికాఖండములోని అద్భుతమైన ధాన్యపు గిడ్డంగులు

పురుగులనుండి ధాన్యమును కాపాడుటకై ప్రత్యేకపుఏర్పాట్లతో ఇటువంటి ఎలివేటరుగిడ్డంగులు అమెరికాలో షుమారు 22000 వరకు నిర్మింపబడి యున్నవి. ఈచిత్రములోనివి ఒంటారియోరేవులోని గిడ్డంగులు.

## = శ్రీ రావుసాహెబ్ డా|| బి. విశ్వనాథ్ =

ఏ మహాకల్పతరువుపై చతుష్షష్టికళలు శాఖలుగా పుట్టుకొచ్చినవో- ఏ ఆదిపరిశ్రమవల్ల అశేష పరిశ్రమలు ఉద్భవించినవో-ఏ కృషికి వెనుక మానవజాతికి అన్నవస్త్రాద్యవసరాలు బలపరిచెడి యితరకృషులన్నియు కల్పింపబడినవో – అట్టి మాతృకృషియైన వ్యవసాయ మిప్పుడు (ఈ అవసరా లన్నియు పండించలేక, ఆ పండించెడి కాపువానికి అన్నంకూడ కడుపునిండ కట్టుబాటుగా లేక) గొప్ప సమస్యగా పరిణమించినదంటే—మన నాగరికత కట్టడంయొక్క పునాదు లెంత సడలిచ్చినవో, మన యిహలోక సుఖజీవనంయొక్క భద్రతకు ఎంత భంగం యేర్పడినదో అందరికీ గోచరించి తీరాలి. ఇది నైతికపతనానికి కూడ దారితీస్తుంది. ఇటీవల బెంగాలులో యేర్పడ్డ క్షామపరిస్థితుల్లో తల్లులు పిల్లల్ని అమ్మేసేరంటేనూ, భర్తలు భార్యల్ని పడిచి పెట్టేరంటేనూ, పట్టెడన్నంకోసరం ప్రాధేయపడి ప్రాణమానాలు కోల్పోయేరంటేనూ దీనియథార్థం సువ్యక్తం కావాలి. అంతవరకూ అక్కరలేకుండా మన విశాఖపట్నం, రాయలసీమల కాటకాలు ఒక్కసారి తలుచుకుంటే చాలు సమస్య తెల్లమౌతుంది. "నిజదారసుతోదరపోషణార్థం హాలికు లైననేమి ?" అన్న మహాకవి పల్కులకు బదులు "ఏడవనేర్చినచో వ్యవసాయము చేయు"మన్న మానసికపరివర్తన మన విద్యాధికులలోను, వ్యవసాయకులలోను కలిగినదంటే, దీనికి కారణమేమిటని కొంచెం వివేకమున్న ప్రతిభారతీయుడూ తన్నుతాను ప్రశ్నించుకోక తప్పదు. ఒకప్పుడు లేని ఈ వింతసమస్య యిప్పుడెలా యేర్పడినదో తెలుసుకుంటే, తన్నివారణోపాయం తట్టకపోదు; అంతా పూనుకుంటే సమస్యాపరిష్కారం కాకనూపోదు.

### పూర్వం

పూర్వం జనాభా తక్కువ; భూమికిలోటు లేదు. మనిషి ఒకచోటనుంచి మరొకచోటికి మకాం యెత్తడానికి అడ్డేమీ లేదు. అతని ఆశయం ఏమిటంటే, తనకూ తన కుటుంబానికీ సరిపడ్డ తిండి-గుడ్డ పండించుకుంటే అంతే చాలు. బ్రతకటానికి మాత్రమే తింటూ, మానవజీవితం మహత్తర పూర్ణమైనదని గుర్తించి, తీరికకాలాన్ని జ్ఞానార్జనానికి వినియోగించుకొనేవారు ఆనాటివారు.

ఆ రోజుల్లో రస్తాలు అభివృద్ధి పొందలేదు. ప్రతీ కుటుంబంగాని, కులంగాని, గ్రామంగాని స్వయంసమృద్ధిగా ఉండేది. తమకున్న భూమి కుటుంబానికి, పశువులకు కావలసిన ముఖ్యపంటలకు, యితర అవసర పైర్లకు కేటాయింపు చేసుకుని కృషిచేసుకొనేవారు. పంటల ఫలదాయం అమ్ముకోవచ్చునన్న సంగతే వారికితోచేది కాదు. బాహ్యప్రపంచంతో తమకు సంబంధం ఉండేది కాదు. తమ కొండమీదనే మకాం; కొండవల్లనే బ్రతకడం; ఆ కొండకోసరమే కృషి !

క్రమంగా పరిస్థితులు మారేయి. జనసంఖ్య పెరిగింది. రస్తాలు వచ్చేయి. వ్యాపారం, పరిశ్రమలు వృద్ధిపొందేయి. పూర్వపరిస్థితులు తారుమారయ్యేయి. తమ ఫలదాయానికి వాణిజ్యప్రాముఖ్యత వచ్చిందిప్పుడు! ఇక తమ అదృష్టం తమ కులంమీదగాని, గ్రామంమీదగాని ఆధారపడి యుండడమే లేదు. తమ దృక్పథం, కర్తవ్యాలు, బాధ్యతలూ దేశసరిహద్దులు దాటేయి. దూరంలోనున్న అమెరికాలోగాని, యిరోపాలోగాని సుభిక్ష-దుర్భిక్షాలు వచ్చేయంటే, అవి మనల్ని, మన వ్యవసాయ కార్యకలాపాన్ని కూడా తాకుతున్నాయి. అనేకనోళ్లకు ఆహారం అందించవలసివస్తూవుంది; అనేక

పరిశ్రమలకు ముడిపదార్థాలు ఉత్పత్తిచేయడంలో వస్తూ వుంది. వాణిజ్యపుపంటలు కృషి హెచ్చు కాబోతుంది.

## ప్రస్తుతం

ప్రస్తుతంగా ఎలాంటి పరిస్థితి తెచ్చిపెట్టాయంటే— పండేది ప్రజలకు సరిపడక, పండించేవారి కృషి కిట్టుబాటుగాక గట్టి యిబ్బంది లొచ్చేయి. తమ జీవనానికి కావలసిన తిండి-బట్ట వ్యవసాయదారుడు పండించి యిస్తుంటే, చల్లగా ఆరగిస్తూ, ఆరగించడానికే పుట్టే మనుకుంటూ, అతడికి కృతజ్ఞులమై యుండాలేమో- మనవల్ల అతడి కేమైనా ఉపయోగసహాయా లుండాలేమో నన్న ఊహైనా పట్టణవాసులకు, విద్యాధికులకు తట్టడంలేదు.

## కిం కారణం?

పంటలు ప్రజలకి సరిపోకపోవడానికి కారణాలు— జనాభా పెరగడం, పంటల విస్తీర్ణం పెరగకపోవడం, పంటదిగుబడి హెచ్చుగాకపోవడం అని చెప్పొచ్చు. వ్యవసాయం కిట్టుబాటుగా లేకపోవడానికి అనేక కారణాలున్నాయి. అదనం పంట పండించినా, తమ కష్టానికి తగ్గ ఫలితం తమకు ముట్టదని సందేహించే వ్యవసాయదార్లు పూనికతో ఉత్పత్తి యెక్కువ చేయడానికి తగ్గఉత్సాహం పొందటం లేదని చెప్పక తప్పదు. ఈ సమస్యా పరిష్కారం యెట్లు చేయనౌతుంది? మనకు 'కోలనీ' లుంటే అక్కడినుంచీ అవస…లు హెచ్చుగా రావచ్చు; అవి లేవు. ఇతర పరిశ్రమలు వృద్ధిపొందివుంటే, సగటు ఆదాయం కొంత పెరిగేమాట నిజమే; అదీ లేదు. అప్పుడైనా, పండిన పంట అంతా ఉంటే గదా డబ్బిచ్చి దాన్ని కొనుక్కోగలగడానికి. తిండిగింజలు కొరవడిననాడు వెండి-బంగారాలు నూరుకు తాగడానికైనా ఉపయోగించవు! ఐతే విదేశాలనుంచి కొనుక్కోడానికి ఉపయోగించవచ్చు. అదైనా ఓపికా సౌకర్యాలనుబట్టి, అనేక యితరవిషయాల్ని బట్టి వుంటుంది.

## అక్కడా, ఇక్కడా

విదేశాలలోనూ ఇలాంటి సమస్యలే బయలుదేరేయి; కాని వారు శాస్త్రజ్ఞానం ఉపయోగించి, సాగు విస్తీర్ణమేకాక, సాగయ్యే ప్రతీ యెకరంనుంచి ఫలదాయం దిగుబడి కూడా యెక్కువ చేసుకోగలిగేరు. మనకు ఇలా విస్తీర్ణం పెంచడానికి అంతగా లేదు. ఇదివరకే ఒక అవధి చేరేం. దేశంలో తిండికి పనికిరాని పంటల విస్తీర్ణంనుంచి 50 లక్షల యెకరాలు తిండిగింజల సాగు క్రిందికి తెచ్చేం; అధికాహారోత్పత్తి ప్రచారంవల్ల 30 లక్షల ఎకరాల కొత్తభూమి సాగులోకి తెచ్చేం.



విదేశాలలో వ్యవసాయ సౌకర్యాలు: ౧

ఒక రిజర్వాయరునుంచి ఈ పైపు అయిదుమైళ్లదూరము నీటిని తీసుకొనిపోయి ఒక కాలువలో చేరిపోవును. ఆ కాలువ నీటిని ఉపయోగించుకొని వేలకొలది ఎకరాలను సాగుచేసి సమృద్ధిగా పంటలు పండించుకొంటారు అమెరికా రైతులు.

ఆరోగ్య
విధులు
3

# నిర్లక్ష్యము చాలా అపాయకరము

సాధారణ దగ్గును అందరు ఉపేక్షచేయుట స్వాభావికము. యీ ఉపేక్షయే అధిక ఖర్చుకుకారణము. మరియు అశ్రద్ధచేసినచో అట్టిదగ్గు అపాయకరమగు వ్యాధులకు మూలము. బాహుళ్యముగా ప్రసిద్ధికెక్కి పేరొందిన వైద్యులచే "గ్లికొడిన్ టెర్పవసాకా" అనే మందు తరచుగా వచ్చుదగ్గును నిర్మూలించునని పేరు పొందినది. ఈ ఔషధము సేవించినంతనే శ్వాససంబంధమైన ఊపిరితిత్తుల సమస్త వ్యాధులను పూర్తిగా నివారించి, దగ్గును పారద్రోలును.

ప్రమాదకరమైన వ్యాధి లక్షణములున్నప్పుడు
మీ డాక్టరు సలహా తీసుకొనండి.




అలంబిక్ కెమికల్ వర్క్సు కంపెనీ, లిమిటెడ్, బరోడా

AL. 257—TL

కాని పంటల దిగుబడి మామూలుగానే వుంది. ఇది కూడ హెచ్చించాలి; హెచ్చించవచ్చు.

యథార్థానికి మన దేశంలో గత 70 యేళ్లలోను జనాభా నూటికి 36 పాళ్లు పెరిగినా ఇంగ్లాండులో 77 పాళ్లు, జపానులో 113 పాళ్లు, రష్యాలో 115 పాళ్లు పెరిగింది. ఐనా విదేశీయులు తమ సమస్యలు పరిష్కరించుకో గలిగేరు; మనం అనేక కారణాలవల్ల అవస్థ పడుతున్నాం. 300 ఏళ్లక్రితం 40 లక్షల రెడ్ ఇండియన్లు తిండికోసరం తిరుగాడిన అమెరికాదేశ మిప్పుడు 115 లక్షల సైనికులతోబాటు 1300 లక్షల ప్రజల్ని సుభిక్షంగా పోషించుకొని, ఉత్పత్తి సరుకుల్లో ఏడోవంతు లీజ్-లెండ్ యేర్పాట్లక్రింద విదేశాలకు పంపించి, ఇంకా నిలువపడిపోయివున్న తిండిపదార్థాలు ఏమిచేసుకోవాలో తెలియక తల్లడిల్లుతున్నది. 25 ఏళ్లక్రితం 1390 లక్షల జనాభాతో 6010 లక్షల సెంట్నర్సు తిండిగింజలు పండించిన సోవియట్‌రష్యా యిప్పుడు 1930 లక్షల జనాభాతో 11950 లక్షల సెంట్నర్సు గింజలు పండించుకోగలిగి, ప్రజల అన్నవస్త్రాదులకు లోటు లేకుండా చేసుకోగలిగింది. ఇటీవలివరకు ఇతరదేశాలపై ఆధారపడిన జపాను ఇప్పుడు ప్రతీ చదరపుఅడుగు స్థలం, ప్రతీ మెరుపుపదార్థం సద్వినియోగ పరచుకుంటూ, స్వయంసమృద్ధిగా తయారైంది; ప్రపంచంలో ముప్పైయ్యోవంతు జనాభాతో వున్నప్పటికీ, ప్రపంచంలో గల చేపలపరిశ్రమలో మూడోవంతు ఉండేటట్లు అభివృద్ధిచేసుకొని, ప్రజలకు యుక్తాహారం యివ్వగలుగుతూవుంది. ప్రపంచజనాభాలో ఐదోవంతు గల మన దేశంలో 'వేసిన గొంగళి వేసినచోటే వుంది!' పాడిపంటలకు పుట్టిల్లయిన దేశ మిప్పుడు తన ప్రజలకు సరిపడ్డ పాడిపంటలు యివ్వలేకుండా వున్నది. ఫలితం-ప్రజల ఆయురారోగ్యాలు దిగజారడమే. ఇతరదేశాల్లో మనిషిసగటు ఆయుర్దాయం 67 ఏళ్లవరకు ఉంటే, మన దేశంలో 27 యేళ్లు! ఇలాంటి పరిస్థితులన్నీ యేర్పడ్డానికి అనేక కారణా లున్నాయి. వ్యవసాయసమస్య తయారవడానికి ముఖ్యకారణాలు-భూసారం తగ్గడం, ప్రజల్లో విద్యాగంధమూ, శాస్త్రజ్ఞానమూ పాకకపోవడం.

### త ర ణో పా యం

ఈ సమస్యాపరిష్కారానికి ఉపాయం జనసంఖ్య తగ్గించడం ఒకటి. ఇది ఒక పట్టాన సులభసాధ్యంకాదు. ప్రజల్లో విద్య, ఆర్థికసంపద, పెరిగితే ఇది కొంత తగ్గవచ్చు. కొత్త విస్తీర్ణం సాగులోకి తేవడం కూడ మన దేశంలో అంత వీలున్నదిగా లేదు. ఇక వీలున్న దల్లా సాగయ్యే భూమినుంచి విస్తారం పండించే సూత్రాలు వెదకడమే. ఇతరదేశాల్లోలాగ మనకు యిది సుసాధ్యమని చెప్పొచ్చు. ఉన్న పంచభూతాల సౌభాగ్యం, ప్రకృతిసిద్ధమైన నదులు, అడవులు, ఖనిజసంపద మొదలైనవన్నీ సద్వినియోగం చేసుకోవాలి. చేసుకొని ప్రజాపోషణకు, అభివృద్ధికి, రక్షణకు వినియోగించాలి. మన ఆధ్యాత్మికజ్ఞానానికీ, శాస్త్రజ్ఞానానికీ సామరస్యం కలిగించి, దృక్పథం పెద్దది చేసుకొని, ఐహికాముష్మిక సుఖజీవనాలకు సులభపంథాలు యేర్పరచి, "సర్వే జనా స్సుఖినో భవంతు" అన్న సందేశం ప్రపంచానికందజేయాలి.

### శు భ సూ చ న లు

ఆంధ్రలక్ష్మీపునరుద్ధరణ ప్రారంభమైన దని చెప్పొచ్చు. పంచభూతాల సద్వినియోగానికి యత్నిస్తున్నాం. నదులకు అడ్డులు కట్టి, వ్యవసాయకృషికి ముఖ్యమైన నీటిసప్లయికొరకు యేర్పాట్లు చేసుకుంటున్నాం. విద్యుచ్ఛక్తిఉత్పత్తికీ, పరిశ్రమాభివృద్ధికీ పంథాలు వేస్తున్నాం. వాయువులోని నత్రజనిసారాన్ని పట్టుకొని, అమోనియాసల్ఫేటు మెరువుగా తయారుచేసే ఫేక్టరీలు పెడుతున్నాం. భూసారం హెచ్చించే మార్గాలు అవలంబిస్తున్నాం. ఉన్న పశువుల మెరువు, గానుగపిండ్లు వగైరా సేంద్రియపుయెరువులన్నీ భూమికి చేర్చే కృషి, ప్రచారం సాగుతున్నాయి. మంచి ఆబోతులు, పశుపోషణ, సంరక్షణలవల్ల పాడిపశువుల్ని, పని పశువుల్ని వృద్ధిలోకి తీసుకురావడానికి యత్నిస్తున్నాం. లోటుగానున్న తిండిగింజలు, పప్పుదినుసులు, కూరలు, పళ్లు, పాలు, గుడ్లు, చేపలు, మాంసం వగైరా ప్రతీ ఆహారద్రవ్యంయొక్క ఉత్పత్తి యెక్కువచేయడానికి కృషిచేస్తున్నాం. దీనితోబాటు భూముల అమరకాల పద్ధతులు, పంపకాల ఆచారాలు, ఋణవిమోచనసహాయాలు, సహకారపద్ధతులు, పశుజాత్యభివృద్ధి, గృహపరిశ్రమల పునరుద్ధరణ వగైరాలన్నీ జరిగితే వ్యవసాయ సమస్య తీరుతుంది.

9. [illegible]ల అభివృద్ధికి 'మిశ్రమ-సేద్యం' [illegible] పంటలు, పశువులు పరస్పరంగా పోషించు[illegible] [illegible]ండాలి.

10. పెట్టుబడిఖర్చులు తగ్గటానికి 'ఉమ్మడి-[illegible]' ప్రారంభించి వృద్ధిచేయాలి.

11. యంత్రసహాయంవల్ల కృషి సాగించడానికి [illegible]కు వీలున్నది, ఇది [illegible]వరకు మనుషు తగ్గించ గలదు అన్న విషయాలు పరిశీలించాలి.

12. పళ్లతోటలు, కూరగాయల పెంపకం ప్రోత్సహించాలి, మంచివిత్తనాలు, మొక్కలు సప్లయి చేయడానికి ఏర్పాట్లుచేయాలి.

పరిరక్షణ:—

13. పంటలకు నష్టపు పురుగులు, తెగుళ్లు ఎదు[illegible] సిబ్బందిని నియోగించి, వీటి నివారణానికి తోడ్పడాలి.

14. రైలుబాటలదగ్గర నరుకు నిలవవుంచు కోడానికీ, నిలవనరుకు పాడవకుండా చూడడానికీ ఏర్పాట్లు జరగాలి.

అమ్మకం:—

15. మధ్యవర్తుల్ని వీలైనంతవరకు తగ్గించి, ప్రభుత్వంవారే నిలవగావించి, లాభసాటిగా అమ్మించే ఏర్పాట్లు చేయాలి.

16. రైలుస్టేషనులదగ్గర గోదాములుకట్టించడం, రైలురేట్లు తగ్గించి, రవాణాసౌకర్యాలు హెచ్చించి, (త్వరలో పాడయ్యే పాలు, పళ్లు, కూరలు, మాంసం మొదలైనవి చలువకొట్లలో నిలవఉంచడానికి) రైల్వే వారు సహాయపడాలి.

విద్య:—

17. రైతు లందరూ మంచి వ్యవసాయపద్ధతులు, ఆరోగ్యకరమైన జీవితపద్ధతులు అమల్లో పెట్టేటట్లు ప్రబోధం జరగాలి. ఇందుకు ఎక్కువగా వ్యవసాయ విద్యార్థుల తర్ఫీదు కొరకు (రెండవ) వ్యవసాయకళాశాల కావాలి. ఇదివరలోవలెగాక తర్ఫీదుపొందిన ఫీల్డు మెన్లు, స్త్రీ[illegible] సాయపరిశోధన[illegible]

వ్యవసాయకృషికి [illegible]

18. వ్యవసాయ[illegible] గృహపరిశ్రమలు, [illegible] వినియోగించే [illegible] కొంచెం కలిగాక [illegible]

పరిశోధన:—

19 [illegible] తెలరేటుగీలు[illegible] శోధనలు, ప్రయో[illegible] అందించాలి. ఇవి ప్రతి[illegible] చక్కటి సిబ్బందిని ఉంచాలి.

ఏర్పాట్లు:—

20. ఇప్పుడున్న వ్యవసాయశాఖను పెంచి, పెద్దదిగా చేసి, పని నడిపించాలి.

ఖర్చు:—

21. (దేశమొత్తానికి 1,000 కోట్ల రూపాయలు) మన రాష్ట్రవ్యవసాయాభివృద్ధికి 5 ఏళ్లకు 50 కోట్ల రూపాయలు.

ఇలా కృషి జరిగితేనే వ్యవసాయ సమస్య తీరుతుంది. దీనితోబాటు చక్కబడవలసిన సాంఘిక ఆర్థిక వగైరా విషయాలెన్నో ఉన్నాయి. వీటి కన్నింటికీ ముఖ్యం విద్యాధికుల దృక్పథం మారాలి. తమ్ము పోషించే వ్యవసాయదార్ల విషయమై తమ కర్తవ్య నిర్వహణ గావిస్తున్నామా అన్న ఆలోచన ఉండాలి. వ్యవసాయదార్ల దృక్పథంకూడా మారాలి. పట్టుదలతో పని ప్రారంభించి ("ఉద్ధరేదాత్మ నాత్మానం")తమ్ముతామే ఉద్ధరించుకోవడానికి కృషిచేయాలి. కృషితో సర్వప్రపంచం పోషింపబడుతున్నప్పుడు, కృషిచేస్తే సర్వదుర్భిక్షాలు, పీడలు, సమస్యలు పోవడానికి సందేహంలేదు. పోతాయి.

"కృషితో నాస్తి దుర్భిక్షం"

# [illegible]

[కథ]

— [illegible] —

లక్ష్మీకాంతం, పారిపోయి వచ్చి, మాయింట్లో దాక్కున్నాడు...

పారిపోయివచ్చాడంటే... వెంట ఎవరో తరుముకు వస్తూంటే, నురుగులు గ్రక్కుతూ పరుగెత్తుకుంటూ వచ్చాడని కాదు: దాక్కోడమంటే, ఎంత వెదికినా కనపడని ఏదో చీకటిగుయ్యారంలో నక్కికూర్చోడమూ కాదు.

— నిదానంగా నడిచివచ్చాడు ... దొరకొడుకెవరురా అన్నట్టు ఒళ్లువిరుచుకు కుర్చీలో పడుకున్నాడు...

అయినా, నాకు అలా అనిపించింది... వాడి నీడగా కొండంత భయం, పర్వతమంత ఆవేదనా కనిపించింది...

'ఏంరా? '...అని మౌనంగానే కుశలప్రశ్న చేశాను...

'నేను తాగితే ఏం ఫరవాలేదుకదా!' అన్నాడు ఓపట్టాన... ఎవరినో అడుగుతూన్నట్టు...

'ఎవరికీ ఫరవా?'

'నీకు'అని మనసులో పలకడానికి నావంక చూపు గ్రిరున తిప్పి...'నీకు అభ్యంతరం ఏమీ ఉండదుకదా?' అని గొణుక్కున్నాడు.

'లేళ్లూ, పులులూ కలిసి పూరిమేసే పుణ్యభూమి యీ ఆశ్రమం అన్న సంగతి మరచిపోతే ఎలా?— మహారాజుగా సేవించు: నన్నుమటుకు సహపంక్తికి బలవంతపెట్టకః నే నిప్పుడే భోజనం చేశాను...' అని హెచ్చరించాను...

లక్ష్మీకాంతం... జేబులోంచి మంచిసరంజామా తీసి... గంగతో అపవిత్రం చేయకుండా ... దాహం పుచ్చుకున్నాడు...

మొగం జ్వరపు- మొగం పచ్చది...కళ్లు మెరుస్తున్నాయి ... అలా సిగరెట్ కాలుస్తూ కాళ్లూ, చేతులూ చాచుకుని ఒక నిమిషం పడుకున్నాడు: వడ కొడుతూందిగదా అని వట్టివేళ్ల తెరలు దించి...సీటి జల్లు తిప్పాను...

'పోయిందిరా...'

రొదగా నిట్టూర్చాడనుకున్నాను మొదట ... మాటకదా అని తరువాత మనసుకుతట్టింది...

ఎవరు?...ఎక్కడికి... ఎందుకు?... ఈ మూడింటిలో ఏదో ఒక్కటైనా, మాటధోరణిని అడగవలసిన ప్రశ్న...అడుగుదా మనుకున్నానుకాని, అడగకపోయినా జవాబు వాడంతట వాడే ఎలాగూ చెప్తాడుకదా అనిపించి...విని ఊరుకున్నాను.

'శకుంతల లేచిపోయిందిరా అంటూంటే ... మాట్లాడవేం?' అని వాడు దండించాడు...

శకుంతల అంటే...నాకు అర్థంకాలేదు.

'నామూలానే లేచిపోయింది...'—అదే శ్రుతిలో అన్నాడు...'నీతోనే ఎందుకు లేచిపోలేదు?' అని కొంటె

విసు రోకటి విసరమంది మనసు. కాని, వాడిలో ఆ బాధను చూసి, నా నోటికి జాలేసింది.

'అలాగా-పాపం' లాగా తల ఊగించాను.

'ఎవడితోనో, ఊరూ పేరూ లేనివాణ్ని తీసుకుని ఎక్కడికో లేచిపోయింది...'

...లేచిపోయేముందు, నాయకుడి పేరుప్రఖ్యాతులు ఆలోచించవలసిన అగత్యం ఏమిటో నాకు ఎంత మాత్రమూ బోధపడలేదు. ఇదేమన్నా పెండ్లిసంబంధమా ఆశ్లేష-పౌరుషేయములు నిదానంగా విచారించడానికి! ఇంకో విషయంకూడాను - ఇందులో వీడి నిర్వాహకం కొంత ఉందంటున్నాడుగా, మరి, ఈ నిక్షేపరాయడు ఒరిగించిందేమిటి?...తన చేతిమీదుగా ఈ సత్కార్యాలు జరుగుతూన్నప్పుడు, తాను, అంతమాత్రం మంచిచెడ్డలు ఆలోచించనక్కరలా?...ఏమిటో అంతా అగమ్యంగా ఉంది...

'మరి నాపెళ్లాం ఎందుకు...'

...'ఎందుకు లేచిపోలేదూ?...'అంటా డనుకున్నాను...వాక్యం సగంలో త్రుంచేసి నిద్రపోయినాడు. ...నిద్రపట్టిందికాబోలు అనుకుంటూండే లోపుగా నే... నిద్రలో మునిగితేలి బడలిక తీరినవాడిలాగా...ఒక్క నిమిషంలో తెరిపిగా మేలుకున్నాడు...

'ఏంరా, యీ కోతిమొగాన్ని చూసి కళ్లున్న దేవతన్నా ముచ్చటపడుతుందటరా?'— వాడు ధూకుడుగా అడిగా డన్నమాటేకాని, అందులో కొంత యధార్థం లేకపోలేదు. లక్ష్మీకాంతాన్ని, పరాకున అయినా, అందగా డనుకునేందుకు వీలులేదు...

'శకుంతల మధురమీనాక్షిలాగా కలకలలాడుతూ ఉంటుందిరా. నేను ఎంత పుణ్యం చేసుకోబట్టో... అన్నయ్యా అని పిలిచేదిరా...నాతో అరమరికలేకుండా ఉండేదిరా...'

ఓహో, ఇప్పుడు అర్థమైంది: శకుంతల అంటే, మనవాడి యింటికి ఎదురుగుండా మేడలో క్రిందభాగంలో ఉంటున్నాడే...తాసిల్దారుకూతురు: పిల్ల చాలా అందంగా ఉంటుంది...చిదిపి దీపం పెట్టవచ్చు: అవును, నేను ఒకటిరెండుసార్లు చూసిన జ్ఞాపకంకూడాను...

'అన్నయ్యా అనే మాటకు ఎన్ని అర్థాలుంటాయిరా?-నీవే చెప్పు...'

—ఏం చెప్పను? అందరికీ తెలిసిన ఆ ఒక్క-అర్థమే నాకూ తెలుసును:... ఈ నా అజ్ఞానాన్ని నా ప్రశ్నలు మిటకరించినవి...

—'అన్నయ్యా' అంటే 'బావా!'అనీ, 'మామా!' అనీ అనుకోవచ్చునా?-చెల్లీ అని పిలుస్తూ, చాటునా మాటునా పెళ్లాంగా వాడుకోవచ్చునా...మనిషైనవాడు ఎవడన్నా అలా గడ్డితింటాడా?...పోనీ, మొగవాడు, ఏ కోటిమందిలోనో ఒకడు పశువౌతాడనుకో... అప్పుడుమాత్రం, అ దెలా పరిపాటిఅవుతుంది?... వాడు వట్టి పశువుకాక మని షెలా అవుతాడు?...

'అవును...నీ వంటూన్నదంతా నిజమే' నని తల ఊగించాను.

'నాపెళ్లాం నన్ను శుద్ధ-పశువుకింద కట్టింది...

'శకుంతలను నేను ప్రేమిస్తున్నానని అనుక్షణమూ అభినందించడం మొదలుపెట్టిందిరా. అలాటి పాపపుమాట లనవద్దని ఎన్నోవిధాల బ్రతిమాలుకున్నాను: ఊహు...తల్లికీ పెళ్లానికీ తేడా తెలియని మనిషి...ఊఁ...మనిషా, అదికూడా ఒక మనిషేనా?...

'నన్ను తిట్టి దుమ్మెత్తిపోసినా అంత బాధపడేవాణ్ణి కాదేమో: నేను చేస్తున్నది ఏదో ఘనకార్యమనీ...నేను కాగా అంత ప్రయోజకుణ్ణి కాగలిగాననీ, ఆవిడ అంటూన్నప్పుడల్లా నాగుండెలో శూలాలు నాటుకునేవి:

'నామీద ఎక్కడలేని దయా, అపేక్షా యింటావిడకు పుట్టుకువచ్చినవి...దయతో చంపడం-అని యింగ్లీషువాళ్లు అనే మాటలో హాలాహాలం నాకు నరనరాల ప్రాకిపోయింది. —శకుంతలకు మాఆవిడ అఘాయిత్యం ఎక్కడ తెలుస్తుందో...ఆ అమాయకురాలి మనసు ఎక్కడ చివుక్కుమంటుందో అని నాకు వెర్రెత్తిపోవడం మొదలుపెట్టింది.

'కాని, నేను ఏం చేయను? ఈ పాపపుమాట ఆఅమ్మాయిచెవిని పడకుండాచేయడం ఎలా?—ఏమీ పాలుపోయింది కాదు...తెంచుకు ఎక్కడికన్నా పారిపోతే?...ఇహ మాఆవిడనోటికి హద్దూ పద్దూ ఉండదు

...పారిపోకుండా, యింటినే అంటిపట్టుకుఉంటే...ఏనిమి షాన ఏం ముణుగుతుందో ?

'శకుంతలను, మాయింటికి రావద్దని చెప్పుదునా?—అయితే, కారణం ఏమనాలి?—

...'నీవు ఒక్కటి అడగవచ్చును...నీపెళ్లాం నోటికి బుద్ధి చెప్పలేకపోయినావా అని: అదీ ఆలోచించాను: నాకూ తామసం లేకపోలేదు—నన్ను చూసి యికిలిస్తూ మాగృహలక్ష్మి ఓ వెకిలిమాట కూసినప్పుడల్లా...ఆ పళ్లన్నీ ఒక్కవరుసను రాలేట్టు కొడదామా అనిపించేది...కాని చేయి లేచేదికాదు... ఏం చెయ్యను, అది నా దౌర్భాగ్యం ... పెళ్లాన్ని కొట్టడం ఎన్నడూ అలవాటులేదు...చూసన్నా ఉండక పోతిని...మానాన్న అమ్మమీద ఎన్నడూ చెయిచేసుకున్న పాపాన పోలేదు...

'అవాళ శ్రావణమంగళవారం: శకుంతల తలంటి పోసుకున్న నునుపుతో, కొత్త చీరా, రెవికా కట్టుకుని...కలకల్లాడుతూ, వాడకట్టుకు పేరంటానికి వెళుతూ మాగుమ్మంలోకి వచ్చింది. ఏం వదినా అని మాఆవిడను కూడా రమ్మనమని కేకవేసింది. ఆవిడ, చీర సింగారింపు యింకా తెమలలేదుకాబోలు, లోపలికి వచ్చి...నేను కూర్చున్న గదిలోకి తొంగిచూసి, వచ్చి కూర్చుని, ఏదో పత్రికలో బొమ్మలు చూస్తూన్నది.

'ఇహ కాస్సేపటికి...మా ఆవిడ అక్కడికి వచ్చింది. వస్తూనే, విసపుచూపొకటి చూసింది : ఆ వాలకం నేను చూశానుకాని, శకుంతల బొమ్మల ధ్యానలో ఉండి దాన్ని గమనించలేదు...

'పోనీ, అంతటితో పోనీయవచ్చునా—లోపలికి వచ్చిందల్లా, గుమ్మంఅవతలకు ఎగిరి గంతువేసి— ఆ విసురులోనే తలుపు ఛెళ్లున వేసింది...

'శకుంతల ఉలికిపడి, తల ఎత్తింది. ఏమి టని ఆచూపులు నన్ను ప్రశ్నించినవి. నేను అర్థంకానట్టు... చూసీ చూడనట్టు ఊరుకోగా,

'ఏమిటది?' అని పలికింది.

'ఏం లేదు, ఎక్కడనుంచో గాలివచ్చి...'

'నాలుగుగోడల సందునా గాలి ఎల్లా విసురుతుంది?'

'విసరదు—మసులుతుంది.'

'మసిలేగాలికి అంత అంరివాలుటనం ఉండదు.'

'ఐదువతనంతో కాచే లడిరిపాటుకనమూను...'

'ఐదు వరాలిచ్చిన ఆ ఐదువగాలి పేరేమిర...'

(శకుంతల ఎంతో బాగా పాడుతుందను చెప్పడం మరచిపోయినాను.)

'శకుంతలతో యతికి-ప్రతిగా చాలా కొంటెగా మాట్లాడటం చాలా సరదాగానే ఉండు. ఆ పిల్ల దానికి అసలు-కుట్లు ఎక్కడ అర్థమైందోనని చిత్రంగానూ ఉంది.

'నా గండ్రగోళం ఏమీ గమనించకుండా, శకుంతల సారంగపాణి చరణాన్ని మరో రెండుసార్లు సాగదీసి...

'తలుపుదగ్గిర నిలవేసి బ్రతిమాలితే గాని చెప్పనట్లే ఉంది...' అని నవ్వుతూ నూరాంచేసే పోకిమిలో నాచెయ్యి పట్టుకుని గుమ్మందగ్గిరకు లాక్కువస్తూంది... ఇద్దరమూ వెక-వెక - పక-పకలాడుతూన్నాము...

'గుమ్మం రెండురెక్కలూ దూదిపింజలు లాగా చెరో చెంపకూ ఎగిరిపడి, పుస్తీలను బాదుకుని లబ-లబలాడినవి...

'నమిలి మ్రింగేసేట్టు మాఆవిడ కణకణలాడుతూ నిలుచుంది, ఎదురుగుండా...

'మాటలతో అయితే, ఎంతసేపు తర్జన భర్జన జరిగేదో, అవును కాదూలు ఎన్ని ఆవృతులు తిరిగేనో, ఎన్ని తిట్లు ఒట్లు గాలిలో కలిసిపోయేవో, సర్వత్రా ఎంత హైరాను చెలరేగేదో?...

'కాని మాటలకు అలవికాని శక్తి, ఒదుగు మౌనానికి ఉంది...మాటలు అర్థంలో ఆపగింజంత పాలును పలుకుతవి—మౌనం కొండంతదాన్ని ముక్తసరిగా ఉద్ఘోషిస్తుంది...

'తెప్పపాటంతటిలో—పొంగి పొరలిన మౌనం, శకుంతలకు, సంగతి అంతా విప్పిచెప్పింది...

'వదినా!'...అన్నది, కలలో మూలిగినట్లు... శకుంతల.

'చెల్లాయ్'—అన్నాయి, నవ్వుగా మా ఆవిడ పాపపు పెదవులు...నాతల పాతాళంలోకి క్రుంగిపోయింది...

'ఎన్ని యుగాలకో, నేను మళ్లా తెప్పరిల్లి, తల ఎత్తి చూసేసరికి... మా ఆవిడమొగమే చూశాను: శకుంతల... లేదు.

'పొరబాటున తలుపు తోశానండీ' అన్నది ఆ యిల్లాలు: నాబాధ పరమాత్ముడికైనా అర్థం కాదు... నదురూ బెదురూ లేకుండా అన్న ఆ ఒక్క ముక్క నన్ను రాక్షసుణ్ణి చేసేసింది. మెడ నులిమేస్తే ...గుండె చీల్చి వెచ్చని పచ్చినెత్తురు తాగితే...ఆ మెదడును కసకస నమిలి తినేస్తే—ఏం చేస్తే మటుకు ఏం లాభం?—ఏం చేసినా ఒక్కటేగా ఆరోదు?—చచ్చి ఊరుకుంటుంది... కాని, రౌరవం లోకి శాశ్వతంగా యీ అబద్ధాన్ని వెంటపెట్టుకు పోతుంది. ...ఆ రాకాసిని హతమార్చడానికి భయ పడ్డాను—

'శకుంతల మళ్లా నాకంటికి అగుపించలేదు.

'నిన్న ఎవడినో తీసుకు లేచిపోయింది—

'ఈ శుభవర్తమానం మా ఆవిడనోటిమీదుగానే నాకు తెలిసింది—

'శకుంతల మా ఆవిడకు ఉత్తరం వ్రాసిందిరా: అందులో పంక్తులు గుండెలో చింతనిప్పులై మండుతు న్నాయిరా...

'వదినా, అన్నయ్యను వరించా ననుకున్నావు కాదూ?—నీకు అలా రాసిపెట్టిఉందిగాని, అలాంటి కోతిమొగాన్ని కట్టుకోవలసిన కర్మం నాకేం పట్టిం దమ్మా? ఏరీ కోరీ, నాయిష్టంవచ్చినవాడితో నేను లేచిపోతున్నాను:

'నీతో మాట్లాడటమంటే సరదా; నీతో సరస మాడట మంటే సరదా; నీవంటే నాకు తగనిసరదా—

'నీవు ఏమనుకునిపోతావో అని, నీమనసు ఎక్కడ నొచ్చుతుందో అని...నీకోసం, ఆయన్ని అన్నయ్యా అని పలుకరించేదాన్ని కాని, మీ ఆయనంటే నాకు తగని రోతసుమీ: ఉన్నమాట అన్నందుకు ఉలికి పడ్డావా వదినా?'

'ఈ ఉత్తరం చదివి మా ఆవిడ ఏనుగునెక్కిం దిరా: నావిషయంలో లేనిపోనివన్నీ అనుకున్నందుకు ఎంతో కించపడ్డదిరా—మా కౌగిలింతలో నలిగి మన్మ ధుడి దుంప తెగిపోయిందిరా...

'ఏమీ అనలేక...ఏమీ చేయలేక, ఆ బాహు పంజరంలోంచి ఎలాగో తప్పించుకుని ఎగిరివచ్చి యిక్కడ పడ్డారా—'

—లక్ష్మీకాంతం అయోమయంగా నిట్టూర్చి ...పక్కకుదరనివాడిలాగా కుర్చీలో కొంతసేపు యాత నగా అటూ యిటూ మసిలాడు. గాజుకుప్పెలో కుర దలా తీర్థాన్ని సేవించాడు...క్రమంగా మొగంలో వేడి-ఎరుపు దిగిపోయింది: మనిషి తేరుకున్నాడు.

'శకుంతల నాకోసం ఎంత త్యాగం చేసిందో చూశావా?' అన్నాడు స్వగతంగా.

—త్యాగమేమిటో నాకు బోధపడలేదు.

'నా కాపురం చెడిపోతుందేమోనని, తన పరు వును, తనవాళ్ల పరువును నట్టేట కలిపింది. ఇలా చేయ కుండా, యింటిపట్టునే ఉండి, ఎన్ని ప్రమాణాలు చేసినా మా ఆవిడ నమ్మదని శకుంతలకు తెలుసును. కాని-ఎంతపని చేసిందిరా, వెర్రిపిల్ల: నా కాపురం తగులడిపోతేమాత్రమేం, వెయ్యేళ్లు వర్ధిల్లాలిసిన బంగా రుతల్లి ...'

'ఇదంతా మీ ఆవిడమీది అభిమాన మేమో...'

'ఆఁ...వల్లకాడు: ఆవిడంటే శకుంతలకు తగని అసహ్యం...నాకోసమని ఆవిడను మెచ్చుకుంటూ ఆ అబద్ధాలన్నీ వ్రాసింది...సరేకాని, యిప్పుడు ఏమిటి చేయడం?...'

లక్ష్మీకాంతం ఉరిమిచూస్తూ ప్రశ్నించాడు, పదే పదే: ఏం చేయమనడానికీ నాకేమీ పాలుపోలేదు ...సలహా యివ్వకుండా ఊరుకునేందుకు అంతకన్నా వీలులేదు ఆస్థితిలో.

'ఇంటికి మాత్రం వెళ్లను ఇహ, ఏమైనా సరే; మా ఆవిడ భూతంలాగా పట్టుకుంటుంది. అది పతివ్రత కావడంకూడా నా ప్రాణానికే వచ్చింది. ఎర్రగా బుర్రగా ఉన్నవాణ్ణి ఎవడినన్నా తీసుకుని లేచన్నా పోదేం?—'

నాకు నవ్వు వచ్చింది: కాని, వాడిబాధ అర్థమైంది...

'పోనీ, అలా సలహాయివ్వరాదూ?' అన్నాను... ఆలోచన చెప్తున్నట్టు...

'చెపితే నవ్వుతావేందిరా...'—వాడి అవస్థకు తగని జాలి వేస్తూంది: అమాయకుడికి అతి తెలివి తేటలు ఉన్న పిల్లను యిచ్చి పెళ్లిచేయడం ఎంత అనర్థమో నాకు యిప్పుడు బోధపడింది...

'ఏంరా, పాపపరిహారార్థం...నేను చెప్పిన పని చేస్తావా?...' అన్నాను: వాడు ఎగిరి గంతేసినంత అప్రమత్తుడైనాడు.

'ఎవతెనన్నా కుర్రదాన్ని వెంట వేసుకొని, కొన్నాళ్లపాటు తీర్థయాత్ర చేసిరా...'

...నేను వెక్కిరిస్తున్నా ననుకున్నాడు...

'నిజంగానే చెపుతున్నాను భాయీ. శకుంతలకు అపచారం చేశా ననుకుంటున్నావు కాని, నీస్థితి మరీ శోచనీయమన్న సంగతి మరచిపోతున్నావు. మీ ఆవిడ దృష్టిలో నీవో పసిపాపవు: పిల్లాడిని గారాబం చేసినట్టు చేస్తూంది: తల్లిలాగా పెంచుతూంది: నీ యిల్లాలు నిన్ను వల్లుతూంది...ఇది నీమగసిరికి పరువా?—శకుంతలకు ఏదో నీవల్ల అపచారం జరిగిం దనుకుంటున్నావు కాని, నీవు ఎంత అర్భకుడివైపోతున్నావో ఆలోచించడం లేదు...మడిగట్టుకుని కూర్చున్న మగవాడిమీద ఆడదానికి మమత ఉండదురా—మొగుడు కొరగానివాడైతే, ఇక ఆయిల్లాలి ఆనందానికి పట్టపగ్గాలు ఉండవు. తనకు దక్కకపోతున్నాడే అనే బాధలో ఆమె మైమరచి పులకరించుతుంది: తన కౌగిలిలోకి లాక్కునేందుకు మన్మథుడూ, వసంతమాధవులూ ప్రసాదించిన వలలన్నీ పన్నుతుంది...ప్రేమిస్తుంది.

'శకుంతలకు ఉన్న తెగింపైనా నీకు లేకపోతే ఎలా?—లే, ప్రయాణం కట్టు!'

ఆకు నందకుండా, పోకను పొందకుండా, కోమటి పురాణంలాగా దీర్ఘోపన్యాసం చేశాను... లక్ష్మీకాంతం నాకు గుడ్లు వప్పగించి, చూస్తూ కూర్చున్నాడు.

'అయితే, యింతకూ నన్ను ఏంచేయమంటావు?' అన్నాడు, ఎప్పటికో తెప్పరిల్లి.

'ఏం చేసినాసరే...కాని, యిలా హాలాహలం మ్రింగుతూ కాలంగడపటంమాత్రం వద్దు...'

'త్రాగకపోతే, శకుంతల జ్ఞాపకం వస్తుంది... త్రాగితే...మా ఆవిడ చేసిన ద్రోహం జ్ఞాపకం వస్తుంది...త్రాగి మరచిపోదా మనుకున్నాను...అదీ సాగడం లేదు...'

'త్రాగుదామనే సంగతి మరచిపో...అప్పుడు యిద్దరూ జ్ఞాపకం రారు...'

'మా ఆవిడ నన్ను మరచిపోయినా బాగుండును...'

'నిన్ను మరచిపోతే ప్రొద్దుపోవడం ఎలా?... ఎక్కడున్నా వెదుక్కుంటూవస్తుంది...'

'అవును, అది అంతటి జాణ'

...నేను 'అలాగా' అని తల ఊగించాను.

—సంజెవేళ అవుతూంది: ఇద్దరమూ అవీ యివీ తిని కాఫీ పుచ్చుకుంటున్నాము. లక్ష్మీకాంతం భార్య లోపలికి చక్కావచ్చింది. ఆమెను చూసీ చూడటంతోనే మన ధీరుడు కుర్చీలోనహా గజగజలాడిపోయినాడు: కేవలం పిల్లి అయిపోయినాడు.

—'సినిమాకు వెళదాం, రండి' అన్నది కోమల స్వనంతో, పల్లెటూరిబడిపంతుల అదమాయింపుతో.

'నాకు...ఒంట్లో ఏమీ బాగుండ లేదు...' అన్నాడు నీరసంగా.

'మరి...బీచికి పోదామా?'

'నాకు...మనసేమీ బాగుండలేదు.'

'అలాగా? ... అయ్యోపాపం! అలా అయితే ఎక్కడికీ వద్దు, యింటికే పోదాం...'

'...నీవు వెళ్లు: నేను కొంచెంసేపుండి...'

—చేయి అందిచ్చి, పసివాడినిలాగా పొదివి పట్టుకుని నిలవేసింది: వెళ్లివస్తామని నాతో చెప్పి, మెల్లిగా, నందిట నడిపించుకుంటూ వెళ్లి, కారులో కూర్చోవేసింది...డ్రైవర్‌తో, ఫలానాసినిమాకు పోనిమంది...

...మలుపు తిరిగి మాయమయేదాకా కారువెన్ను పరధ్యానంతో పరకాయించిచూస్తూ...మెట్ల

రత్నా స్నో

—

ముఖాలంకరణమునకు ఉత్తమమగు స్నో. జిడ్డు పట్టదు. ముఖముపై కరిగిపోవును. చర్మమును మృదువుగను, పట్టువలె ఉంచును.

★

505

# రత్నా స్నో

## ముఖమునకు కాంతి నిచ్చును




**రత్నా టాయిలెట్ వర్క్సు,**
**నెం 3. సీనుముదలి వీధి, జి.టి. మదరాసు.**

లిల్లీ టాయిలెట్ పౌడరు.

—

మిక్కిలి సున్నితమైనది. అతి మృదువుగా చర్మములో కలసి పోవుటచే ముఖము కొంచమైనను పౌడరద్దినట్లు కన్పింపదు.

★

---

# బాంబే లైఫ్ అష్యూరెన్సు కంపెనీ

## లిమిటెడ్.

(స్థాపితము ; 1908.)

భారతదేశపు ప్రథమశ్రేణి జీవితభీమా కంపెనీలలో ఒకటి.
**1944-వ సం॥న రూ. 2½ కోట్లకుపైన వ్యాపారముచేసినది.**

మద్రాసు బ్రాంచి సెక్రటరీలు, దేశీయసంస్థానములతో సహా
దక్షిణ ఇండియాకు చీఫ్ ఏజంట్లు :

## కోచికార్ బ్రదర్సు, లిమిటెడ్.

స్థాపితము : 1910.

తమ పట్టాదార్లకును, ప్రతినిధులకును అపూర్వమగు సౌకర్యములనిచ్చును. 35 సంవత్సరములు విశ్వసనీయముగా సేవజేసినవారు.

**1944-వ సం. న అత్యధికమగు పూర్తిజేసిన వ్యాపారము**

52 లక్షలు మించినది.

ఈ క్రింది స్థలములలో ఆఫీసులున్నవి :—
బొంబాయి * బెంగుళూరు * మద్రాసు *
మంగుళూరు * కాలికట్ * మధుర *
త్రివేండ్రం * ఉడిపి.

---

నా అంగడిలో బంగారు నగలున్ను, రాళ్లు వేసిన నగలున్ను, వెండిసామానులున్ను నమ్మకముగ అమ్మబడును.

**PELALA KONDIAH,**
Shroff Merchant,
KURNOOL.

మీదనే అలా నిలవబడిపోయిఉండి, లోపలికి వెళ్లిపోయినాను.

...ఖాళీసీసాలూ, గ్లాసులూ ఉగ్గుగిన్నెలులాగా తోచినవి. వాడు ఇందాకటినుంచీ కూర్చున్న కుర్చీ ఉయ్యాలై...పొత్తిళ్లలో పడుకుని, ఉంగా-ఉంగా అంటూ, కాళ్లూ చేతులూ తొట్టెగిలకలకు వేసి కొట్టుకుంటూ, తల్లి ఆశాశపెట్టే గిలకపండు అందుకునేందుకు వంకరచేతులు పిడికిళ్లతో జాపే ఆముదపుగుడ్డులులాగా ... కందగడ్డలాగా ... ఉన్నాడు లక్ష్మీకాంతం...అవును, కొన్ని జీవితాలకి ఎప్పటికీ పురుదు వెళ్లదు.

—మొన్న ఈనడుమ ఎప్పుడో ... ఆల్బర్ట్ హాలులో భరతనాట్యం చూస్తూంటే...అవతల ఆ చివర కూర్చుని ఉన్నారు...దంపతులు. ఇద్దరూ చిలకా గోరింకలలాగా నవ్వుతూ, తుళ్లుతూ క్రిక్కిరిసికూర్చుని తదేకదీక్షతో ప్రదర్శనంలో నిమగ్నులైఉన్నారు...

లక్ష్మీకాంతాన్ని చూసి, ఎక్కడ జాలిపడతానో అని...భయమేసింది...



# నేటి తెలుగు ఫిలిం పరిశ్రమ

## వక్రగతి తప్పించడానికి కొన్ని విధానాలు

— శ్రీ సముద్రాల వెంకటరాఘవాచార్య —

ఈనాటి తెలుగుసినిమాలను గురించి మీ అభిప్రాయం ఏమి టంటే టక్కీమని సమాధానం చెప్పటం చాలా కష్టం. ఆలోచించి చెప్పినా ఒకరు చెప్పినట్టే ఇంకొకరు చెపుతా రను కోను. సినిమాలను సృష్టించేవారి లక్ష్యం వేరు; డబ్బిచ్చి చూచి ఆనందిస్తున్న ప్రజాసామాన్యంతీరు వేరు. ప్రసకల్యా పరీక్ష చేసి ఆక్షేపించే విమర్శకుల ధోరణి వేరు. ఈ ముగ్గురికీ ఆదర్శాలు వేరూ, పరిశీలించే దారులు వేరూ అయినప్పుడు ఏకీభావం కుద రటం దుర్లభం. ఏ సినిమాను గురించి కానీ అలాటిది కుదిరిం దంటే అది గొప్ప అదృష్టమే. అలాగంటి భాగ్యం ఇంతవరకూ కలిగినట్టు నే నెరుగను. ఎంత మంచిదానికైనా ఏదో ఒక లోపం చూపించ వచ్చు. ఇక పూర్వప్రాయంలో ఉన్న మన సినిమాలలో లోపాలు చూపించటం కష్టమైన పనిగాదు. కాని ఒక్క విషయంమాత్రం ప్రతిక్షణమూ మనం గమనించుకొంటూ ఉండాలి. విలక్షణమైన కళాసృష్టిని చేసినా చేయకపోయినా, మనం చేస్తున్న ప్రయ త్నాలూ, పొందిన అనుభవమూ ఆ ఉత్తమలక్ష్యాన్ని చేరటానికి తోడుపడుతున్నవా, లేదా అని ఆలోచించుకోవాలి. అందుకు అడ్డుతగులుతున్న పరిస్థితు లేవో తెలుసుకుని తొలగించుకోవాలి.

### ఇరుగుపొరుగువారి సినిమాలకంటే
### తెలుగుసినిమాలే ఎంతో మెరుగు-

ఒక్క మాటలో చెప్పాలంటే—తెలుగుసినిమాలు తక్కిన ప్రాంతీయ భాషాచిత్రాలకంటే ఎంతో బాగున్న వంటాను. అఖండభారతీయతకూ, అంతర్జాతీయతకూ అర్రులు చాస్తూ ఆంధ్ర త్వం మరచిపోయే మహనీయులకు నా మాటలు రుచించకపోవచ్చు. ఆ అభ్యుదయ పంథాలో కూడా ఆంధ్రత్వం అంతరించరా దని అభి లాషపడే నాకు వారి వాదం నచ్చదు.

### అన్ని అమరినవాళ్ళకూ, మనకూ
### పోలికపెట్టడం ధర్మంకాదు-

అసలు హాలీవుడ్ చిత్రాలతోనూ, హిందీ చిత్రాలతోనూ పోల్చి తెలుగుసినిమాల మంచిచెడ్డలు నిర్ణయించడం ధర్మం కాదు. అంతర్జాతీయ వ్యాపారవిస్తృతే కాక ఉత్తమచిత్ర నిర్మాణాని కవసరమైన అన్ని సౌకర్యాలూ అందుబాటులో ఉన్న హాలీవుడ్ చిత్రాలకూ, మన చిత్రాలకూ ఎక్కడి పోలిక? ఆ అభిప్రాయమే పొరపాటు. ఇక పోతే హిందీచిత్రాలు. వీటితో పోల్చిచూడటం కొంతవరకు యుక్తమే. అయినా వారికీ మనకూ వ్యాపార వృద్ధిలో భేదాలున్నవి. అదృష్టదేవత కన్ను తెరవాలిగాని హిందీ చిత్రాలకు ఒక్క కేంద్రంలోనే మొత్తం పెట్టుబడి రావగినంత ముఖ్యపట్టణా లెన్నో ఉన్నవి. ఒక్క "రామరాజ్య"చిత్రానికి ఏడాది తిరిగేలోగా యేబది లక్షల రూపాయలు వచ్చినవట. మన చిత్రాలకు మొత్తం జీవితమంతా కలిసినా దానిలో పదవ వంతు వస్తుందనే నమ్మకం లేదు. హిందీచిత్రాల రంగస్థలం భారతదేశ మంతానూ. మన చిత్రాలకు ఆధారం పదకొండు జిల్లాలు. అందులో ఐదు జిల్లాలు పెద్దమ్మ ప్రత్యక్షిస్తే. ఈ విషయంలో మనకంటే అరవ జిల్లాలే చాలా మెరుగు. పెద్ద పట్టణాలూ, ఎక్కువ ధనమూ గల రాష్ట్రం వారిది. పై ఉభయులకూ సొంత స్టూడియోలు ఉన్నవి. ఉన్న ఒక్కదాన్నీ మనం మూసిపెట్టుకున్నాం. సౌకర్యాలలో ఇన్ని లోటు లున్నా సామాన్య చిత్రనిర్మాణవ్యయం ఇప్పుడూ ఎప్పుడూకూడా భారతీయచిత్రా లన్నింటికీ సమానమే. అల్పసంఖ్యాకమైన తెలుగు చిత్రాలకు ఇతర చిత్రాల పోటీ యెక్కువ. ఇన్ని యిబ్బందులున్నా తెలుగు ప్రొడ్యూసరు వెను కాడకుండా, విడువకుండా చిత్రాలు తయారుచేసి తెలుగు సినిమా పరిశ్రమ చావకుండా ఇంతవరకూ నిలబెడుతున్నారు. ఆ తెలుగు అభిమానానికి నా అభినందనాలు.

### పరాయివారుకూడా సైయన్నారు
### మన సినిమాలు చూచి-

ఇన్ని యిక్కట్లకు లోనై తయారవుతున్నప్పటికీ తెలుగు చిత్రం దరిదాపులకే యితర చిత్రాలు రాలేక పోతున్నవి. ఈ సత్యాన్ని తమిళసోదరులు, కన్నడ మిత్రులు అసందిగ్ధంగా అంగీకరిస్తారు. దాక్షిణాత్యులేకాక ఉత్తరాదిన కూడా భారత

దేశంలో హిందీ తరవాత వెన్నుదన్ను నడుస్తున్న చిత్రం తెలుగే అని నిర్ణయించినట్టు చదివాను. నా రంగీకరించినా అంగీకరించకపోయినా, తెలుగు చిత్రాలు హిందీ చిత్రాలతో పోటీ చేస్తున్న మాటమాత్రం నా స్తనం. మనభాషలలో హాహాహాన తయారవుతూ వచ్చిన ౧౨ చిత్రాలలో ఎన్ని ఉత్తమచిత్రాలనుకొన్నారో మాపండి! హిందీభాషలో తయారవుతూవచ్చిన వందల కొలది చిత్రాలలో ఎన్ని ఉత్తమచిత్రాలనిపించుకొన్నాయో ఆలోచించండి!! ఈ దామాషా పోల్చిచూచుకొంటే మన తెలుగుచిత్రాలే హిందీచిత్రాల కెన్నింటికంటేనో గుణాత్మకంగా ఉన్నాయని చెప్పవచ్చు. మన తెలుగుచిత్రాలలో కొన్ని "ఇంటర్ నేషనల్ ఎకాడమీ అవార్డు" పొందగలవని కొందరు మిత్రు లంటారుగాని అది వీరాంధ్రంమాట. కాని అఖిలభారతదేశానికి అలాంటి అవార్డు ఇచ్చే అదృష్టం కలిగితే ఆనాడు తెలుగుచిత్రాలు తప్పకుండా ప్రథమ గౌరవానికి పోటీచేసి తీరతయ్. పొందుతయికూడాను. కడచిన దశాబ్దిలో మనం చూపించిన అభ్యుదయమే ఈ ఆశకూ, విశ్వాసానికీ ఆధారం.

## ఎన్నితీరులతోనో నూతనచైతన్యం, వ్యక్తిత్వం పరుగులు తీసినవి-

రమారమి ౧౯౩౫-వ సంవత్సరం వరకూ తెలుగుసినిమా పరిశ్రమ తెలుగువారి చేతులలో లేదు. అగ్రప్రధానులైన ఆంధ్రేతర వ్యాపారుల చెప్పుచేతల్లో నడిచింది. వారు మన ప్రజలను పురాణగాథలతో భ్రమపెట్టి డబ్బు దోచుకున్నారు. ఆ తత్వం తెలుసుకొన్న కొందరు తెలుగువారు ఆ దోపిడి నరికట్టి ఈ పరిశ్రమను ఆ కట్టుకోవలె నని కార్యరంగంలో ప్రవేశించారు. ఆ నాటికి ప్రాంతీయభాషాచిత్రాలలో స్వరూప స్వభావాలు మారిపోయినవి. సాంఘిక గాథలు కాలూనుతున్నవి. ఆ పలుకుబడికి లొంగిపోయి ఒక్క గంతున సమస్యాచిత్ర నిర్మాణానికి పూనుకొన్నారు తెలుగులు. గృహలక్ష్మి, మాలపిల్ల, వందేమాతరం, వరవిక్రయం, రైతుబిడ్డ, మళ్లీ పెళ్లి, సుమంగళి, ఇల్లాలు, విశ్వమోహిని, దేవత, అపవాదు, పంతులమ్మ మొదలైనచిత్రాలు తెలుగుతెరమీది కెక్కినవి. సాంకేతిక విషయాలమీద అత్యంత శ్రద్ధ చూపించి ఉత్తమహిందీనిర్మాతలతో ఉజ్జీలనిపించుకొన్నారు. ఈ ఉత్సాహంలో తెలుగునాటి భక్తకవుల జీవితగాథలుకూడా ఆంధ్రుల సంస్కృతితో జతపరచి సృష్టించారు. జానపదకథలు, హాస్యకథలు. ఎందరో ప్రొడ్యూసర్లు! ఎన్నితీరులలోనో వీరి వీరావేశం పరుగులుతీసింది. తెలుగువారిలో నూతనచైతన్యం, వ్యక్తిత్వం వచ్చింది. అంతే. తాటాకుల మంటవలె ఆ వేడి చప్పున చల్లారిపోయింది. కారణం?

## కాని, నడమంత్రంలో నేడు నానారకాలబాధలూ వచ్చిపడ్డవి-

ఆనాటి కళోత్సాహంలో, కార్యక్షేత్రంలో దూకినవారిలో చాలామంది నిస్సహాయులూ, నిరాయుధులే. ఆత్మబలం చాలక చాలామంది ధనంకోసం డిస్ట్రిబ్యూటర్లమీద ఆధారపడవలసి వచ్చింది. మేఘాగమకాలను నమ్ముకొన్న మెట్టరైతులవలె వ్యవసాయం సాగించారు. వచ్చిన ఆదాయం పెట్టుబడిదారు కొట్టుకుపోగా రైతుమాత్రం మిగిలాడు. కొన్ని సందర్భాలలో చేతులు కూడా కాల్చుకోవలసివచ్చింది. సమస్యాప్రధానములైన సాంఘిక చిత్రాలమీద మోహం మొత్తింది. కొందరు మెల్లగా ఈ పరిశ్రమలోనుంచే జారుకొన్నారు. ఉన్నవారు దిక్కుతోచక, వెనక్కుపోలేక మీనమేషాలు గుణిస్తున్నారు. ఈ సమయానికే పిల్లల పిడుగులా యుద్ధం వచ్చిపడి ఆ ఉన్న అవకాశాలను, ఆశలను తుడిచిపెట్టింది. తీరా చూసుకొంటే గతంలాగే భవిష్యత్తుకూడా అంధకారంగానే ఉంది. ఆశారేఖ ఎక్కడా కనిపించలేదు. ప్రభుత్వం వారి ఆర్డినెన్సులకూ, లైసెన్సులకూ ఆగి, అర్హత సంపాదించుకొన్న తెలుగుప్రొడ్యూసర్లు పట్టుమంటే పదిమంది దొరకలేదు. అంతకు ముందు మనం తయారుచేసుకుంటున్న తెలుగుచిత్రాల సంఖ్యే చాలా తక్కువ. ఈ ఆఘాతంతో ఆ సంఖ్య మరీ సన్నగిల్లింది. గతసంవత్సరంలో తయారైన తెలుగుచిత్రాలు ఐదుమాత్రమే. వాటిలో సామాజికచిత్రం ఒక్కటే నేమో. ఈ సంవత్సరపు కార్యక్రమంకూడా అంత ఆశాద్యోతకంగా లేదు. ఈ పరిస్థితే మరికొంత కాలం సాగితే అభ్యుదయగమనం అలా వుండగా అసలు గమనమే కట్టుబడిపోతుందేమో. మళ్లీ పరిశ్రమ మన చేతుల్లోనుంచి జారిపోవచ్చునుకూడాను.

## నేటి నిరుత్సాహానికీ, మందగమనానికీ బాధ్యత మనపెద్దలదే-

ఈ నిరుత్సాహానికి, మందగమనానికి విద్యావంతులూ, ధనవంతులూ అయిన ఆంధ్రులే బాధ్యులు. పొరుగింటి పుల్లకూర రుచి యన్న సామెత మన విషయంలో బాగా పడుతుంది. తెలుగు తెగులుగా మారిపోతున్నది. ఈ సవతితల్లిప్రేమ సినిమాలమీదా పోకింది. "నే నింతవరకూ తెలుగుసినిమా చూడ"లేదన్న కొందరు తెలుగు మిత్రులను నే నెరుగుదును. ఈ నిరసనము వల్లనే తెలుగుసామాజికచిత్రాలు ఆర్థికంగా లాభించలేకపోయినవి. అనుశ్రుతంగా వచ్చే ఆచారవిశ్వాసాలకు విరుద్ధంగా ఏం చెప్పినా ప్రజాసామాన్యం హర్షించదు. విప్లవపరిణామం కోరే విద్యావంతులు వాటిని ప్రోత్సహించరు.

## గిరీశంపడ్డ అవస్థలో పడ్డారు ప్రొడ్యూసర్లు-

ప్రొడ్యూసర్లేం చేయాలి! వారూ గిరీశంపడ్డ అవస్థలో పడ్డారు. అల్పసంఖ్యాకులైన విద్యావంతులను నమ్మి, కళాభిమానంతో అభ్యుదయచిత్రాలు తీసి, చిక్కి సగమై, చివరకు రంగంలోనుంచి నిష్క్రమించడమా? బహుళసంఖ్యాకులైన ప్రజాసామాన్యాన్నే ఆశ్రయించుకొని, వారు చూచి మెచ్చుకొనే పురాణగాథలు, భక్తుల జీవితాలు, జానపదకథలు చిత్రించి, బ్రతికి బలపడడమా? ఇదీ వారి సమస్య. "జీవన్ భద్రాణి

పకృతి" వారికి నచ్చింది. రథాలు త్రిప్పివేశారు. అనుకొన్నట్లు తిరోముఖులై మళ్లీ పురాణాలు, యక్షగానాలు తిరగవేస్తున్నారు. కాదని విద్యావంతులు వాదించినా ఈ మార్పుకు కారణం చాలా వరకు వారే. వారి నిరుత్సాహమే.

## లాభసాటి బేరంకాదండామా అర్థశాస్త్రవేత్త లొప్పుకోరు-

మన దేశంలో ఐశ్వర్యానికి లోటు లేదు. హాలీవుడ్‌తో పోటీకి చాలకపోయినా మన సినిమాపరిశ్రమలో లోటు తీర్చటానికి చాలు. అయినా మన ధనవంతులు దీన్ని గురించి ఆలోచించనేలేదు. ఒకవంక మార్వాడీలు, తమిళులు, కర్ణాటకులు మన వ్యవహారాలలో జోక్యం కలిగించుకొని, మన కడుపులో కాలు ద్రొక్కుకొని, మన కనులముందు లాభాలు తీస్తుంటే చూస్తూకూడా ఆలోచించక పోవటం న్యాయం కాదు. ఇది లాభదాయకమైన బేరం కాదంటే అర్థశాస్త్రవేత్త లంగీకరించరు. మోటుయుక్తితో ఆలోచించినా, ఇన్ని వందల మైళ్లనుంచి యిల్లూ వాకిళ్లూ వదలి వచ్చిన యీ సెట్లు ఊరికే వరదన పోతున్నారా? అయితే మన ధనవంతులు దీని నొక పరిశ్రమగా గణించలేదు. అభిమానించలేదు. మన చేతుల్లో ఉంటే కలిగే ప్రయోజనాలు గుర్తించటానికి ప్రయత్నించలేదు. ఇప్పటి కైనా మన శ్రీమంతులు ఈ విషయమై ఆలోచించకతప్పదు. అల సించి యిలాగే చూస్తూ పోనిస్తే అచిరకాలంలోనే ఆంధ్రులు సినిమాలు చూడటానికిగూడా పరరాష్ట్రాలకు పోవలసిన యోగం పట్టవచ్చు. ఆ దుర్యోగం రాకుండా ఆంధ్రజాతినీ, ఆంధ్రసంస్కారాన్నీ రక్షించుకోడం ఆంధ్రుల ముఖ్య ధర్మం.

ఫిలింతాలూకు బలసంపద ప్రపంచసంగ్రామం మనకు వ్యక్తం చేసింది. ప్రజాహృదయాలమీద అది చూపించగల పలుకుబడి విశదమైంది. ఆపరమసత్యం కనులారా చూచికూడా, మనసారాగ్రహించికూడా మనం తాత్సారం వహించి, మన సినిమాపరిశ్రమ అభ్యుదయ గమనానికి చేయూత యివ్వకపోవడం జాతీయాపరాధం కాకపోదు. మనఐశ్వర్యాన్ని జాతీయాభ్యుదయంకోసం, స్వజాతి సంస్కార విస్తృతికోసం వినియోగించడం పరమధర్మం కూడాను. ఈ విషయం ఏ రెండు కుర్చీల ప్రొడ్యూసర్లకో వదలిపెట్టి, సమర్థులైనవారు దూరంగా ఉండి తమాషాచూసి నవ్వుతుంటే మనం ఒక్క అంగుళంకూడా ముందుకు జరగలేము.

## నేటి వక్రగతి తొలగవలెనంటే ఒక్కటే ఒకమార్గం

ఈ పీటముడి విప్పాలంటే, ఈ వక్రగతి తొలగి, తెలుగు సినిమా పరిశ్రమ వెలుగులు వెదజల్లుతూ త్రివిక్రమ స్వరూపం చూపించవలెనంటే ఒక్కటే మార్గమున్నది. మనలో తెలుగుతనానికి మెరుగెక్కాలి. ఎలాటిదైనా, తెలుగు సృష్టికి మన జీవనంలో ప్రాధాన్య మివ్వాలి. ప్రేమహృదయంతో మన తప్పులు విప్పి చెప్పుకొని దిద్దితీర్చుకొని ఉత్తమకళాశిఖరాలకు ఉద్గమించాలి. మన సమస్తశక్తులనూ—విధ్వంసకశక్తులు మినహా— మన బలసంపద లన్నింటినీ జతచేసుకొని ఏకముఖంగా నడవాలి. ఈ పరమాదర్శం అందరికీ ఉంది. దానిని క్రియారూపంలోకి తేగల కార్యశూరులు కావాలి. ముందు తెలుగువారికో సర్వోపస్కారసంపన్నమైన స్టూడియో కావాలి. ఈ కళాదర్శాలతో సానుభూతి గల మంచి ప్రొడ్యూసర్లు ముందుకు రావాలి. ప్రజలను వారికి తెలియకుండా మన ఉద్దేశాలతో ఏకీభావం కలిగి అభ్యుదయభావాలను ఆనందంగా జీర్ణించుకొనేలాగు చెయ్యాలి. యుద్ధం పరిసమాప్తి చెందేలోగా ఈ నిర్మాణ కార్యక్రమం కొంతవరకైనా కొనసాగించగలిగితే యుద్ధానంతర కార్యక్రమంలో ఆశయసిద్ధిని పొందవచ్చు. ఈ విశ్వాసంతోనే వాహినీ పిక్చర్సు వారు స్టూడియో నిర్మాణానికి ప్రయత్నాలు చేస్తున్నారు. ఇలాగే అభ్యుదయోత్సాహులైన పత్రికాధిపతులు, రచయితలు, ప్రజలూ చేదోడువాదోడుగా ప్రయత్నం చేస్తే ఫిలింపరిశ్రమలో నేటి మందగతిని నివారించి దానిని కొత్తబలంతో, కొత్తదారుల్లో నడిపించగలరు. ఆ మరుక్షణమే ప్రొడ్యూసర్లు దేశం వెనువెంట వస్తారు.

ఇంతవరకూ చిత్రాలకూ, ప్రజాహృదయాలకూ ప్రొడ్యూసర్లు, ప్రొడ్యూసర్ డైరెక్టర్లూ దర్శకు లయినారు. కాలం మారుతున్నది. ఇకనుంచి ప్రజలే ప్రొడ్యూసర్లకూ, దర్శకులకూ దర్శకులై తెలుగుకళాలక్ష్మిని అభ్యుదయసీమల్లో తాండవింప జేయాలి. తథాస్తు.

# దారినిపొయ్యే దానయ్య

[ నా టి క ]

= శ్రీ శివరాజు వెంకటసుబ్బారావు =

**పా త్ర లు**

| | | |
|---|---|---|
| భోసీజిరావు | — | బారిష్టర్ |
| పెద్దరాజ్యం | — | భార్య |
| పంకజం | — | పెంపుడుకూతురు |
| రామయోగి | — | |
| దానయ్య | — | దారినిపొయ్యే |

[తెర లేచేటప్పటికి 'పంకజం' త్యాగయ్య కృతి పాడుతూ వుంటుంది.]

పం—"సాక్షాత్కార నీసద్భక్తి-సంగీత జ్ఞాన విహీనులకు..."

రామ—స్కాండలస్ ! ఈపాట నన్ను జ్ఞానిగా చెయ్యలేకపోయిం దంటే, ఆ పాటలో అర్థంలే దన్నమాట. అందులో గొప్ప సందేశం ఏడిసిందా? జీవిత విమర్శ తగులడిందా? నీకంఠం కాబట్టి 'టాలరేట్' చేశాం. త్యాగయ్యకృతులు రాజాగారి మందిరంలో ముక్కుతూ మూల్గుతూ పాడుకుని పాతళాలువా కప్పుకోడానికి తప్ప మరి ఎందుకూ పనికిరావు. రోమేన్ రోలెండ్ ఏ మన్నాడంటే— వా డేమంటే ఎందుకులే?—

పం—ఏమన్నాడో జ్ఞాపకం తెచ్చుకో.

రామ—మోక్షం, దైవం, ముక్తి—పేర్లు మన చెవుల్లోకి గుచ్చి (బిహేవియరిస్టులు దీన్ని వెర్బల్ కండిషనింగ్ అంటారు.) మనల్ని చెమిటి బైరాగులకింద చేసేశారు.

పం—"మోక్షముగలదా..."

రామ—మోక్షముం దని నే భ స్తే అను లేదు. 'నరకం' వుందని తెలుసు—అది మన జేవాలయం. భారతీయులు ఏనాడు పరలోకచింత మానుకుని యీ ప్రపంచసమస్యలను ఎదుర్కుంటారో, ఆనాడే...

పం—హియర్, హియర్. (చప్పట్లు కొడుతుంది.)

రా—థ్యాంక్స్ మై డియర్. ఆనాడే యీ దేశీయులకు తిండి దొరుకుతుంది; కట్టుకునేందుకు బట్టా దొరుకుతుంది; చేసుకునేందుకు భార్యలూ దొరుకుతారు. ధనికులు తమ సొంత ఆస్తుల్ని కాపాడుకునేందుకు కర్మసిద్ధాంతం, పరలోకచింత, ఆధ్యాత్మిక విలువలూ వీటిని మనకి తెగ బోధించారు.

పం—సరే, బీదవాళ్లు ధనికులైతే, వాళ్లూ అవే బోధిస్తారు...

రామ—పూర్తికానీ ప్లీజ్! ఈభూస్వాములున్నారే- వీళ్ల ఆస్తి సొమ్ము, భూములు, భార్యలు. ఆస్తినిబట్టి భార్య లుంటారు. అందుకనే మొగాడు ఎందర్నైనా పెండ్లి చేసుకోవొచ్చు నని నిర్ణయించారు. ఎల్ల కాలం భార్యనిపోషించలేని స్త్రీపరుసమస్తా అమావాస్యరోజున సందులమ్మట తిరుగుతాడు. పాతస్లీడరికి వొక భార్య; బారిస్టర్ కి జోడు భార్యలు; మిల్లు యజమానికి ముగ్గురు; కోటీశ్వరుడికి కోటిమంది.

పం—బీదవాడైన బ్రహ్మచారికి అందరూ.

రామ—అసలుపాయింట్ చెప్పనీ.వీళ్ల భార్యలని ఎవడు లేవదీసుకు పోతాడోనని భయపడి పెళ్లిని, ప్రేమమీద కాకుండా మతంమీదా, పాతివ్రత్యంమీదా ఆధారపడేటట్లు చెయ్యమని వాల్మీకి కో ఆరెకరాలు పారేసి ఆర్యులు శాశ్వతమైన భార్యల్ని కొనుక్కున్నారు. రాజాధిరాజుల్ని సరించే వ్రాయమని వ్యాసుడి కో అగ్రహారం పారేసి భారతం వ్రాయించారు.

ఆ గడ్డాల తాత ద్రౌపదికి ఐదుగురు భర్తల్ని తగిలించి వూరుకున్నాడు. ఎందుకంటావ్? వాళ్లకు తమ ఆస్తుల్ని కాపాడుకునేందుకు తగినంత శక్తి లేదు, ధనమూ లేదు. బైరాగుల్లా అరణ్యాలమ్మట పడిపొయ్యారు. అంచేత ఐదుగురు బీదవాళ్లకి వొక భార్యని పెంచడం కష్టం కాదు. చివరికి శ్రీ కృష్ణుడు కూడా భూస్వామికిందే తయారయాడు. గీతలో ఆయన చెప్పిన సందేశం ఏమిటి? "ఓ ధనంజయా, నీ భవనాలు, రాజ్యం, నీ భార్యలు

నీ స్థిరాస్తి. వీటికోసం యుద్ధం చెయ్యడం నీవిధి. అదే ధర్మం. నాకూ వున్నారు బోలెడుమంది భార్యలు. పట్టు, నేకూడా నీతో కలిసి యుద్ధం చేస్తా!"

పం—(దగ్గరగా వెళ్లి అతని తల తడిమి) నీబుర్ర యీ భావాలతో వేడెక్కిపోతోంది. తలంటు పోసుకోరాదూ, మంగల్ని పిలిపిస్తా?

రామ—తలంటు భూస్వాముల హైజీన్ పద్ధతి. మన శరీరం మనం చూసుకోవాలి. డాక్టర్లకి మన ఆరోగ్యాలనీ, వేదాంతులకు ఆత్మలనూ, లాయర్లకు ఆస్తుల్నీ శరీరాన్ని మంగళ్లకీ వొప్పజెప్పడంవల్లే మనదేశం యిల్లా తగులడింది. నోమంగలీ, నోతలంటూ. ఈ భూస్వాములు సోమర్లు. కష్టమంటే తెలీక, బొజ్జలు పెంచుకుని, దాన్ని రెచ్చగొట్టేటందుకు, మంగళ్లని నెలకొల్పారు. బైదిబై - మన పెళ్లికి అభ్యంతరం మీ నాన్నదా, అమ్మదా?

పం—మా నాన్న ఉద్దేశం నన్ను బాగా డబ్బున్నవాడి కిచ్చి హైచదువుకి ఇంగ్లండు పంపాలని.

రామ—అదే నాకు సరిపడదు. స్వార్థంతో మాట్లాడుతున్నా ననుకోవద్దు. నిన్ను ఇంగ్లండు పంపి భూస్వాముల నాగరికతా తత్వం, మానసిక బానిసత్వం నీ ఎముకలకి సహితం పట్టేటట్లు చెయ్యాలని ఎత్తు. మీ నాన్న కూడా పట్టించుకున్నాడుగా మరి! తోకలేని నక్క కథ మాదిరి— ఈ విశాల భారతదేశంలో నీకు జ్ఞానోపదేశంచేసే విద్యాలయం లేదంటావా? ఘోర్తుఘారం ఫేలై, పెండ్లాంపుస్తెలమ్మి, ఇంగ్లండు లేచిపోయి—మీనాన్న విషయం కాదు—అక్కడ దమ్మిడీ విలువచెయ్యని పట్టాన్నీ, యిద్దరు దొరసాన్లనీ కట్టుకొచ్చిన యీ 'టెన్‌త్' రేట్ వ్యక్తులుమాత్రం జ్ఞానులూ; కడుపులో చల్ల కదలకుండా, పొలం దున్నుకుని ప్రకృతిప్రశాంతంలో వర్ధిల్లించిన భారతీయ కృషీవలులు శుంఠలూనా? పాశ్చాత్య నాగరికతలో గౌరవంగా చెడిపొయ్యే అవకాశాలున్నాయి గనకనే ధనికులకి దానిమీద అంతమోజు. వెల్స్ ఏమన్నాడంటే-

పం—(జాలిగా చూసి అతని మొహం తనవైపు తిప్పుకుంటుంది.)

రామ—సుందరం ప్లీజ్! హైందవస్త్రీ పెండ్లికాకుండా పరపురుషుణ్ణి తాకొచ్చా—అందులో ఏకాంతంగా!

పం—పదిమందిలోనూ చెయ్యొచ్చా?

రామ—అఫ్‌కోర్స్! దాంపత్యాలు బహిరంగంగా చేస్తే ఎవడికీ అనుమానం వుండదు. సినిమా తెరమీద ముద్దు అందుకే అంత మజాగా వుంటుంది. అసలు నామతం ప్రత్యేకత, రహస్యం వుండకూడదనిగా. అంటే, నా తాత్పర్యం మీ అమ్మగారాగానే ఎగిరి గంతేసి నన్ను కౌగలించుకోమని కాదు.

పం—(ఆపలించి) చాలా టైమయింది—స్నానానికి లే. సాయంత్రం మనం కూడా మా నాన్నతో కలిసి భోజనంచేదాం. మాటేజ్ నిగురించి ఆయన అభిప్రాయాలు తెలుసుకుందాం! ఆస్తి కావాలంటాడు.

రామ—ఫూలిష్! ఉన్నవాడు కూతుర్ని లేనివాడి కివ్వాలంటాను—ప్రైవేట్ కూతురు యిష్టపడితే. నిజమైన ప్రేమ—కాలిటీ ప్లాటానిక్, ఆర్ ప్రిమిటివ్—ఆర్థిక సాంప్రదాయాలకు అతీతం అని తెలుసుకోలేని మీ నాన్నకి బారెట్ లా పట్టానిచ్చిన డబ్లిన్ విశ్వవిద్యాలయం వాళ్లు వొత్తిదద్దమ్మలంటాను. మీ నాన్నకీ, అమ్మకీ వొకళ్ళమీ వొకళ్లకి నిజమైన అనురాగం వుందంటావా?

పం—ఏమో నాకేం తెలుసు? మా నాన్న ఎప్పుడూ అమ్మతో వాదించడు—ఎప్పుడూ దెబ్బలాడుకోరు. మాయింట్లో అన్ని వ్యవహారాలూ సాఫీగా సాగిపోతున్నాయి. నా విషయాల్లో కూడా ఎవరూ ఎక్కువగా జోక్యం కలగజేసుకోరు. "రామయోగిని రమ్మంటున్నా నాన్నా" అన్నాను. "తప్పకుండా. ఎవరతను?" అన్నారు. "సోషలిస్టు" అన్నాను. "మరి తప్పకుండా రమ్మను" అన్నారు.

రామ—గుడ్. కొంత బాక్‌గ్రౌండ్ తయారుచేశావు కాబట్టి మనం రంగంపైకి నిర్భయంగా ప్రవేశించవొచ్చు నంటావా.

పం—ఏం వుద్యోగం అని అడిగింది అమ్మ.

రామ—ఫూలిష్ ప్రశ్న. ఉద్యోగం లేంది పుట్టినమనిషికానని నిర్ణయించుకోం. పనకూకూడా చీరేనా కొనితెచ్చే తాహతు లేని సుబ్బారావు అల్లుడు కాకూడ దనడం సహజంగానే వుంది. ప్రొసీడ్ ప్లీజ్.

పం—"ఇంకా చదువుతున్నాడు" అన్నాను. "ఎట్లా వుంటాడు మనిషి" అంది.

రామ—మోర్ ఫూలిష్. మగాడి దక్కదనాన్ని చూసి స్త్రీలు ప్రేమించడం నిజమే ఐతే యీపాటికి సూనకజాతే నశించేది. హాలీవుడ్ యాక్టర్లు సాంకేతిక సంకేతాల్లో స్లోగన్ "డబ్బు, డబ్బు, డబ్బు" కత్తిలేని పిచ్చి. మా సినిమాలకి యిదే గోరటాకొ గోఅనే ప్లేస్.

పం—అంతే. స్నేహమే మీ అనకేగు.

రామ—పొరపాటు చేశావు. నన్ను గురించి క్లుప్తంగా చెప్పాల్సింది. మాటల్తో ప్రపంచాన్ని జయించవొచ్చు. సీ- తలుపు కొడుతున్నా రెవ్వరో. కాబోయ్యే అత్తగారు అనే నరకం కాదుకదా...(కుర్చీలో కూర్చుని పుస్తకంతీసి చదువుకుంటాడు.)

పం—వంటవాడై వుంటాడు. మా యింట్లో అన్నీ గోడగడియారంలా సాఫీగా జరిగిపోవల్సిందే.

రామ—ఐనో. నాగరికతలో వుండే విశేషమే అది. ఫస్టే పైకి తేలరు. లోలోపలే కుళ్లి, పైకి ఎంతో మర్యాదగా నటిస్తూ, చివరికి కొంప ముంచుతారు. భూస్వాముల బతుకంతా, చీకటి, రహస్యం, కృత్రిమం ... తలుపుతీసి చూడు.

(పంకజం తలుపు తీస్తుంది. దానయ్య ప్రవేశిస్తాడు. లాల్చీలాంటి పొట్టి చేతుల

బొంకాస్త్రం, ఖద్దరుపంచె, కండువా, 'క్రిరు' జోళ్ళు, పదిరోజుల్నుంచి కత్తిరించని గడ్డం- పక్లైటబారి ఆసామిలా వుంటాడు. వయస్సు నలభై)

దా—ఇదేనాండి బారిస్టర్ భానోజీ రావుగారి గృహం?

పం—ఇదే. ఎవ రండీ మీరు?

దా— నేనా? నా పేరు దానయ్యండి గారూ. వీధిగుమ్మం తలుపులు తీసుంటే యిట్లా వచ్చాను. వారితో పనుంది లెండి. నువ్వెవ రమ్మా?

పం—నా నాయనగారే లెండి.

దా—అదే అనుకున్నా. వారిని చూసి చాలాదినాలైంది లెండి. అబ్బో! రైలందు వెళ్ళకపూర్వం. ఎందుకు నవ్వుతావు? ఏదో పూర్వకాలపువాణ్ణి. నా కీ క్రొత్తవి సరిగ్గారావు.

పం—అర్థం అయింది.

దా—ఆ, అదే. నిన్నసలు చూడనే లేదు. పెద్దదాన వయ్యావు. వివాహ— (మెల్లగా గొణుగుతాడు. అతను పూర్తి చెయ్యకుండానే—)

పం— ఇంకా లేదు. లేదు. చదువు పూర్తికాలేదు. మా నాన్న ఇల్లా ఇప్పట్లోకి వస్తుంటారు. కూర్చోండి.

దా—కొంత మంచి తీర్థం తెస్తూ. (అటూ ఇటూ చూసి) వారెవరూ? (లోపలి కెడుతుంది) తను రెవరూ?

రామ— ఎవ రంటే ఏం చెప్పను మహాత్మా! ఒకానొక మనిషిని.

దా—(ఆశ్చర్య పడ తా డు) ఏం అం టారు?

రామ—మనిషి వనగానికి బోలెడు నిద ర్శనా లున్నాయి. ఆకలేసినప్పుడు కూడా తిండికోసం తంటాలుపడని జంతువు మానవు డొక్కడే. స్వర్గాన్ని నమ్ముకుని ఆకలి, దాహం, ప్రేమ వీటిని మరిచిపొయ్యేది మని షొక్కడే. ఈలక్షణాలు నాలో మూర్తీభ వించి వున్నాయి గనక నన్ను మని షనొచ్చు.

దా—చాలా చిత్రంగా వుంది బాబూ. భానోజీరావుగారికి తమ రేమౌతారు?

రామ—ఒక మనిషి కొకమనిషి, ఏమీ అవను. ఒంటరిగా జన్మించి చీకట్లోంచి వెలుగులోకొచ్చాను. మళ్ళా చీకట్లోకి నడుస్తాను. అయ్యా, నేనూ, మీరూ అంద రం యాత్రీకులం.

దాన—మరీ చిత్రంగా వుంది. తమ నామధేయం ?

రామ—గులాబీని మరోపేరుతో పిలి చినా పరిమళం మారదు. ఎన్ని పేర్లెట్టు కుని నాటకం ఆడినా మనిషి మనిషే. నన్ను రామయోగి అని పిలుస్తే మీరు నిజా నికి దగ్గరగా వొచ్చినవా రౌతారు.

దా—పేరుకు తగినట్టుగానే వుంది మీ వాక్కు. తమవృత్తి సెలవిచ్చారు కాదు.

రామ—నాపూర్వులు అడివిమనుషులు. వాళ్ళ పూర్వులు కోతులు. వీళ్ళందరికీ వొక్కే వృత్తి వుండేది. ఆకలేసినప్పుడు అన్నం తినడం, ఆకలితీరింతర్వాత పిల్లల్ని కనడం. నేను ఆ రెండుపన్లూ తప్ప అన్నిపన్లూ చెయ్యగలను. సంఘసంస్కర్తని; లోకో ద్ధారకుణ్ణి; సోషలిస్టుని; నిరుద్యోగిని; నన్ను చూసుకోడంతప్ప నాకు చేతకాని పనిలేదు.

దా—(నవ్వుతూ) మీ వుద్యోగానికి యింత జీతం అంటూ వుందా ?

రామ—ఆ. ఈసంఘం నన్ను జీవించ నిచ్చింది.

దాన—హరి హరీ. ఎంతమాట! నేటి కాలపు యువకు లందరూ చాలా చిత్రమైన భాష మాట్లాడుతారు. అడుగుతున్నా నని ఏమీ అనుకోకండి — భానోజీరావుగారి కూతురుతో మీ కెట్లాంటి పరిచయం...

(పంకజం చక్కా వొస్తుంది, నీళ్ల గ్లాసుతో)

పం—నా స్నేహితుడు లెండి. మీ రేంపనిమీ దొచ్చారో చెప్పారు కాదు. అంత మరీ తొందరపని కాదుకదా !

దాన—మిమ్మల్ని చూస్తుంటే నా గొడవే మరిచిపొయ్యాను. హాయిగా, నిశ్చి ంతగా, పోరూ పొంగూ లేకుండా, సంసా రం చట్టబండలూ లేకుండా చెట్టుమీది పక్షులలా...

రామ—పెళ్లి తాలూకు బాధ్యతలు లేకుండా స్త్రీసంపర్కం కావా లంటారు. ఇది ముసలాళ్లు యవ్వనాన్ని చూసి పడే శృంగారబాధ, తన్మయత, ఎలొక్వెన్స్...

దాన—మీరిద్దరూ వొకళ్ళ నొకళ్లు ఎలా ఎరుగుదురు ?

రామ—పూర్వజన్మసావాసం.

దాన— అల్లానే మరి. ఆయన నీ కేమౌతా డమ్మా? ఏం చదువుతున్నాడు?

రామ— ఆనర్స్ మి: నన్నడగండి. చిన్నప్పటినుంచీ వొంటికి రాసుకున్న పవి త్రపుబురదని వొదుల్చుకుని, ఆంగ్లంబూడిద రాసుకోడం ఉన్నతవిద్య. దాన్ని దులుపు కుని బైరాగిలా కావడం విజ్ఞానం. నే నావిడకి ఏమీ కాను. జీవితశక్తి మమ్మ ల్నిద్దర్నీ దగ్గరగా తీసుకొచ్చింది.

పం—అత నంతా అట్లాగే మాట్లాడ తాడు లెండి. అతని కీ సంఘం వింత ప్రపంచం.

దా—ఆయన దస లేవూరు?

రామ—నా జన్మస్థానం జానకీకుటీరం! గమ్యస్థానం రామరాజ్యం — 'యుటో పియా!' మిగతా అందరిదీ లంకాద్వీపం.

దాన—ఘట్టుగా వుంది. పంతులూ, నీకు వివాహమైందా?

రామ—ఈప్రశ్నకి యింత వుపోద్ఘాతం ఎందుకు మహాత్మా? ఒక పురుషుడు, వొక స్త్రీ కలిసి వొకేయింట్లో కాపరం వుండి పిల్లల్ని కనడం వివాహమైతే మనకి ఎంత మాత్రం కాలే దనే చెప్పాలి. 'వివాహం' అన్న సంస్థ నిలబడాలంటే రెండు విష యాలు కావాలి — భర్త చెమిటివాడూ, భార్య గుడ్డిదీ అవాలి. సారీ. నా కది కాలేదు.

పం—అబ్బ, ఊరుకో రామం...

రామ—హాకేస్నై? ఈ మహత్తర వ్యక్తి నా జీవితంలోకి అమాంతం ప్రవేశించి, నా రహస్యాలన్నీ ఊదలాగి, నా ఆదర్శాల పునాదులు త్రవ్వుతుంటే ఎట్లా వూరుకోను? ఏమంటావ్ కామ్రేడ్ దానయ్యా?

దా—అవును జోగీ.

రామ—జోగీ!! మిమ్మల్ని మీరు సరిచేసుకోండి. నేనింకా నాలుగో స్టేజికి రాలేదు. నా యాత్రకి నాలుగు మజిలీలు: భోగి, రోగి, యోగి, జోగి. నేను మొదటి స్టేజిలో వున్నాను.

దా—అదా? ఏదో పెద్దవాణ్ణి. మతి మరుపు జాస్తి.

పం—మీకు మా నాన్న వొచ్చేలోగా ఏదన్నా పనుంటే చూసుకురండి.

దా—అబ్బే. నా కంత ముంచుకుపొయ్యే వ్యవహారం ఏమీ లేదు. మొన్న బందర్లో రెండు లక్షణమైన సంబంధాలు చూశా. కుశాల రావుగారి కుమారుడు. లా చదువుతున్నాడు.

రామ—వాట్? ఎ మారేజ్ బ్రోకర్! స్కాండలస్! గో ఆన్ ప్లీజ్.

దా—కుర్రాడు నారింజపండులా వుంటాడు.

రామ—(ఎక్కిళ్లతో బాధపడుతుంటాడు) హిక్... నారింజతోక్...... నారింజతోట వుక్...వుందా హిక్?

దా—ఈడూ జోడూ బాగుంటుంది. మీనాయనగారితో మనవిచేద్దామని. అసలు పని కేంలెండి, ఎప్పుడూ వుండే కోర్టు గొడవలే.

పం—మీరు యీ సంబంధ విషయం మా నాయనగారితో చెప్పనక్కరలేదు.

రామ—బాగా హిక్, చెక్—చెప్పావు. ఇదివరకే స్థిరపడింది కామ్రేడ్ క్రామ్‌వెల్. మీపేరు హిక్ ప్లీజ్?

దా—దానయ్యని మనవిచేశాగా. ఏమిటి, చాలా చిత్రంగా వుందే. ఇది వరకే స్థిరపడిందా? చెప్పావుకాదేమమ్మా!

రామ—ఆ ధన్యుం దెవం—హిక్.. డొక్కోక్కా! హాచ్. (తుమ్ముతాడు)

దా—ఇవాళ నాగ్రోజు ఏమీ బాగుండలేదు. ఏం తలపెట్టినా ఆటంకాలే. ఎక్కిళ్లకి మంచినీళ్లు త్రాగుబాబూ.

రామ—వెల్ సెడ్ దానయ్యా - యాక్ (తుమ్ముతాడు) మంచినీళ్లు — పంకజం— ప్లీ...క్...జ్...

దా—పెద్దవాణ్ణి చెబుతున్నానని ఏమీ అనుకోకు. నీకుకూడా భార్యతో కాపరం చేసే కాల మొచ్చింది.

రామ—ఎవరి భార్యతో మహాత్మా..? (మంచినీళ్లు తాగుతాడు)

దా—మా తమ్ముడుకూతు రుంది—ఇంకా పెద్దమనిషి కాలేదు.

రామ—ఇంకా తుంటరిపిల్లే. చంపావు మై వుడ్‌బీ బిగ్ ఫాతరిన్లా.

దా—అదికాదు నే ననేది.

రామ—తెలుసు. బాల్యవివాహాలవల్ల మన దేశం బాలింతల ఆస్పత్రిగా మారిపోయింది.

దా—మీరు మహాచెడ్డ జలుబుతో బాధపడుతున్నారు. కొంత పొడుం యిస్తునా?

రామ—చెడ్డజలుబనడానికంత మాత్రం వీలులేదు. ఇటీవల మనకి ప్రాప్తించినవాటిల్లో యిది చాలా ఉత్కృష్ట మైందనొచ్చు.

దా—నీ కేమాత్రం ఆస్తి వుంది యోగీ?

పం—అతనికి పెండ్లయిందిలెండి దానయ్యగారూ.

దా—మరల్లా బ్రహ్మచారిలా మాట్లాడతాడేం?

రామ—పంకజం ఈజ్ రైట్.

దా—పెండ్లాంతో కాపరం చేస్తున్నా పరిహాసం మానలేదు కంతులూ— చాలా అదృష్టవంతుడవ్.

రామ—మై పూర్ దానయ్యా. నాకే కనక భార్యవుంటే నే నిక్కడ పరస్త్రీతో మాట్లాడుతూ కూర్చుందునా? తెలిసిందంటే మక్కెలు విరగతంతుంది.

దా—హరిహరి!

రామ—స్వానుభవ మిది తెల్పుచున్నాను వినుడు. ఏం? (కన్ను గీటుతాడు.)

పం—రామం! ఇవాళ నువ్వు చాలా యిదిగా మాట్లాడుతున్నావ్. — కొత్తా పాతా పెద్దా చిన్నా అని లేకుండా.

రామ—పొయెటిక్ లైసెన్స్. ఆధునిక కవికి కొత్తపాతలూ, పెద్దచిన్నలూ లేవు. ప్రపంచాన్ని నా గుప్పెట్లో గులాబీమొగ్గలా నొక్కిపెడతా. అనంతాన్ని ఆవులింతలో అమర్చుకుంటా.

దా—(గడియారంకేసి చూసి) సరే. నా కొంచెం పోస్టాఫీసులో పనుంది. వెళ్లి మళ్లా గంటలో వొస్తా. సెలవు. మీ నాయన గారితో చెప్పమ్మా వొచ్చి వెళ్లానని. (నడుస్తాడు) (కొంతసేపు నిశ్శబ్దం)

పం—(అతని దగ్గరగా వెళ్లి) రామం, ఎందు కంత దిగులుగా వున్నావ్? చలాకీ అంతా అప్పుడే పోయిందేం?

రామ—వాట్ చలాకీ—నీకు చెలగాటం, నాకు హృదయమారాటం. సంతింగ్ రాంగ్ అనుకుంటా—కాంట్ హెల్ప్. జీవితశక్తి నాలోని విచారాన్నీ, శూన్యత్వాన్నీ కప్పిపుచ్చేటందుకు సంతోషం, చలాకీ అనే వొక ముసుగుని కప్పుకోమంది. నా బ్రతుకూ, నా స్వార్థం నన్ను ఏడవమంటోంది. కాని జీవితశక్తి నవ్వమంటోంది. అన్నుడిమనుండు జీవితశక్తిది పై చెయ్యి. నీముందు నా నిజ స్వరూపం—యివి నా రెండు అవతారాలు.

పం—నువ్వు దిగులుగావుంటే నేచూడ్లేను యోగీ. నీ నవ్వును చూసే నా మనస్సు మొదట్లో నీ మీదికి పోయింది. కష్టాలలో అందరూ విచారంగా వుంటారు. బాధలో కూడా నవ్వుతూ విధిని చూసి వెక్కిరించి నన్ను ప్రేమిస్తూ నీ స్వార్థాన్నికూడా మరిచిపోగల వ్యక్తులు ఎందరో వుంటా రనుకోను,

**HINDUSTAN GOLDCOVERING JEWEL WORKS.**




నిపుణులైన పనివారలచే మా వర్కుషాపులలో ఉత్తరవాదమైన, వెండిపై బంగారుకట్టు, బంగారుమలామాచేసిన అన్ని రకములైన నగలు తయారుకాబడుచున్నవి. మా నగల నాణ్యమును గ్యారంటీయును వాటిని కొని యింతవరకు ఉపయోగించు చున్నవారికి తెలిసియేయున్నది. వ్యాపారస్తులు, యితరులు మాకు వ్రాసిన వివరములు బడయగలరు.

## హిందూస్థాన్ గోల్డు కవరింగ్ జ్యూయల్ వర్క్సు,

మచిలీపట్టణం.

తోట సుబ్బారావు- అండ్ బ్రదర్సు, ప్రొప్రైటర్లు.

---

అనుమతిపొందిన మూలధనము 50లక్షలు
చందావేయబడిన మూలధనము 25లక్షలు
చెల్లించబడ్డ మూలధనము 12½ లక్షలు

జీవితము · అగ్ని · నౌక
ప్రమాదములు
పనివారి పరిహారములు వగైరా
భీమా వ్యాపారము నిర్వహించును.

## స్టెర్లింగ్ జనరల్

**యిన్సూరెన్సు కంపెని లిమిటెడ్.,**

**న్యూ ఢిల్లీ.**

మద్రాసు బ్రాంచి :-10, లింగిచెట్టివీధి, మద్రాసు. దక్షిణఇండియాకు,
బొంబాయికి రెసిడెంటు మానేజరు : శ్రీ కె. యస్. రామమూర్తి, యం. ఎ.,

---



## డోంగ్రే గారి

## బాలామృతము

బలహీనమైన బిడ్డలకు
పుష్టియున్ను, బలమున్ను
ఆరోగ్యము నిచ్చును

రామ — వెయిట్ ప్లీజ్. రిహార్సల్ చేసిన స్పీచ్ కొదవనుకుంటా. బట్ – కాని నాతో యింత స్వేచ్ఛగావుంటూ నువ్వు వేరే మీ నాన్నతో చెప్పి పెళ్లి ప్రయత్నాలు చెయ్యడం, ఇఫ్ దానయ్యా ఈజ్ నిజం, పంకజం, 'పంకజిజమ్' కాదు, మంకీయిజమ్ అంటాను.

పం — ఓస్ ఇదా నీ అలక. నే అప్పుడే అనుకొన్నాను. ఏదో మనతో మంచి చేసుకోడానికీ, మా నాన్న మెప్పుపొందడానికీ అట్లాంటిమాట లనుంటాడుకాని అది నిజమనుకోవడం నీ మిస్టేక్. ఇంత జ్ఞానంవున్న వాడవ్ — నీక్కూడా అనూయే? ఇదేనా సోషలిజమ్ ?

రామ — నిజం చెబుతా విను జాన్. సోషలిజమ్ అందరికీ అన్నం పెట్టగల్గు కాని మనోవికాసం యిస్తుం దనుకోను. స్వేచ్ఛగా ప్రేమించి జీవించే అవకాశాలు కలగచేస్తుంది. కాని, ప్రేమని శాశ్వతంగా వుంచుతా నని గ్యారంటీయివ్వదు.

పం — పెళ్లి విషయించి నా అభిప్రాయాలు మా నాన్నకి తెలియక ప్రయత్నాలు చేసివుం డొచ్చు. పోవని పొయ్యేదానయ్య మాట ల్పట్టుకుని నువ్వింత చికాకుపడడం మోస్ట్ అన్ రామయోగీయిష్.

రామ — బ్యూటిఫుల్. నీకు కోపం వొచ్చినప్పుడు ఎంతో అందంగా వుంటావ్. అనుభవించడం చేతగాని దౌర్భాగ్యుడికి మీనాన్న నిన్ను అంటగడుతున్నా డంటే నాలో వుద్భవించే కోపాన్ని న్యాయమైన బీభత్సం అనొచ్చు-కొండొకచో రైట్యస్ ఇండిగ్నేషన్. (గూట్లోంచి తొంగిచూసి) ఓ మై గుడ్ నెస్! మీ నాన్న వొస్తున్నట్లున్నాడు. మనం బైటకి వుడాయించడం శ్రేయస్కరం అనుకుంటాను. తోట్లోకి పోదాంపద.

పం — ఇన్ని కబుర్లు చెబుతావు - మా నాన్నంటే ఎందు కంతభయం ?

రామ — భయం కాదు డార్లింగ్ పం! కోపంలో ఏదేనా మాటా మాటా వొస్తే ఏం చేస్తానో ఆఖరికి కొరల్ మార్క్సు కూడా నిర్ణయించలేడు.

(పంకజం పాట పాడుతూ, జడ అల్లుతుంది. అతను సిగరెట్టు పూర్తి అయ్యే వరకూ పుస్తకం చదువుతాడు. ఇద్దరూ నవ్వుకుంటూ తోట్లోకి వెడుతుంటే తెరపడాలి.

## ౨

[అదే సమయం. వీథిగదికి వెనకాల వున్న హాలు. భానోజీరావు వేషం— పొడుగాటి, అంత వొదులులేని తెల్ల పైజామా, కాలర్ మూసిన లాంగ్ కోటు, చేతులో బెత్తం, టోపీ తియ్యగానే ఎలెక్ట్రిక్ బల్బుమాదిరి మెరిసే బట్టతల, వెనక భాగంలో మాత్రం రెండు చెవులకీ మధ్య తెల్ల దువ్వెన అతికించినట్లు కొసిని వెండ్రుకలు కనిపిస్తుంటాయి. కళ్లకి జోడు. ముందు వొంకర తిరిగిన 'పడవ' జోడు కాళ్లకి. తెర లేవగానే ఆయన ప్రవేశించి కోటు తీసి, బెత్తం మూల గిరవాటెట్టి, టోపీ అవతల పారేసి కుషన్ కుర్చీలో లోతుగా కూలబడతాడు. వెనక ఎత్తుగా వుయ్యాల మాదిరి వూగే కుర్చీలో కూర్చొని ఆయన భార్య పెదరాజ్యం లేస్ తో ఏదో అల్లుతూ వుంటుంది. ఆమెది స్థూలశరీరం. బాగా ఎర్రగా వుంటుంది. చిన్న ముక్కు, స్ఫుటంగా కనిపించని కనుబొమ్మలు, పెదవులు. మధ్యపాపిడి; అక్కడక్కడ వెండ్రుకలు నెరిసినాయి. జడని మెలితిప్పి కడుతుంది. చెవలకి దుద్దులు, చేతికి గడియారం, కుడి చెయ్యికి రెండే నల్లగాజులు. యవ్వనంలోని సౌందర్యచిహ్నాలు యిప్పటికీ కనిపిస్తూనే వుంటాయి పరీక్షగా చూస్తే.

భానోజీరావు కోటువిప్పినప్పుడు కాని ఆయనబొజ్జ బైటపడదు. చాయ నలుపులో జత; బహుచిన్ని కళ్లు. టొమాటో ఆకారం గల మొహం. నాలుగు మీసాల వెండ్రుకలు ముక్కుని అంటిపెట్టుకుని వుంటాయి. చుట్ట నోట్లోపెట్టుకుని బాగా లావాటి పుస్తకాన్ని తీసుకుంటాడు.]

భా — అగ్గిపెట్టేదీ?

పెద్ద — ఇంక్ స్టాండ్ వెనకాల.

భా — (తీసుకుని) వంటింట్లో వుండవలసిన అగ్గిపెట్టె యిక్కడ దొరికితే మనం ప్రాక్టిస్ విరమించి సన్యాసం పుచ్చుకోవచ్చు. (గజగబా రెండు, మూడు పుల్లలు గీస్తాడు. ఒకటే వెలగదు.) మన ఇండియన్సు ఎందుకూ పనికిరాని ఇడియట్సని రాసిస్తాను. అగ్గిపెట్లు చెయ్యడం చేతగాదు. పైగా వీళ్లకి పాశ్చాత్యదేశాలతో సమానగౌరవం, స్వతంత్రం కావాలిట. అగ్గిపెట్టెదాకా ఎందుకు ? సిరా తీసుకో. ఒక్క కంపెనీ మంచి సిరా చెయ్యగలిగిందీ? ఒక్కొక్క కంపెనీవాడి సిరా బుడ్డిలోనే గడ్డకట్టి బుడ్డిని గొడ్డలితో పగలగొడితేనే కాని పగల్దు. దీనికి మహామహుల సర్టిఫికేట్లొకటి. మనవాళ్లకి తగిన సిరాయే చేస్తున్నారు కంపెనీవాళ్లు. **Every country Gets the Government it deserves.**

పెద్ద — మీ కెప్పుడూ అగ్గిపెట్టె అవసరం వొస్తుంటుందని నేనే వంటాయన్ని బల్లమీద వొక టుంచమన్నాను. స్వానింకే కొనరాదూ, ఎందుకింత రుసరుస? మన వాళ్లు సిరాచెయ్యడం మొదలెట్టింది మొన్న మొన్న నేగా? ఈ ఖద్దరుచీరచూడండి: కొని నాలుగేండ్లయింది— చెక్కు చెదర్లేదు.

భానో:— గోనీ సంచీకి చెదరేందుకు చెక్కెక్కడేడిసింది ?

(పేజీలు తిప్పి చదవ ప్రయత్నిస్తాడు. పుస్తకంమధ్యలోంచి నెమిలియాక, కళ్ల జోడు కేసులో వుండే అద్దాలు తుడుచుకునే గుడ్డా, రామయోగి విజిటింగుకార్డు తీస్తాడు.)

ఇదేమిటి? ఇవన్నీ ఎక్కడ నుంచి వొచ్చాయి? హౌంగిట్ ఆల్- మన యిండియన్సు యిళ్లల్లోవుండే న్యూసెన్సే యిదండి. ఎక్కడుండవల్సిన వొస్తువు అక్కడుండదు. **It gets on my nerves.**

పెద్ద — నెమిలీకా, రిబ్బనూ అమ్మాయిని. బల్లకింద పడుంటే, మీరు కోపం చేసుకుంటారని, నేనే పుస్తకంలోపెట్టాను

ప్రతిరోటా ఏ వోస్తువో వుండవల్సినచోట లేదని యుద్ధంచెయ్యడం మామూలేగా. ఆ లావుపుస్తకం నీకిప్పుడే కావలిసొచ్చిందీ?

భా—క్రిమినల్‌లా లావుగా గాక సన్నగా ఎల్లావుంటుంది? దేశంలో వున్న అన్యాయం, పాపాలు, క్రూరత్వం, పశుత్వం-అన్నింటి చరిత్రా యిందులోనే వుంది. ఇందులోనే విజిటింగ్ కార్డులు, విజిటర్లు కాపరం చెయ్యడం, ఇదుగో—వై. రామయోగి—

పెద్ద—అది అందులోకెల్లా వొచ్చిందో నాకు తెలీదు. మనమ్మాయి పెట్టిందేమో అందులో.

భా—ఏదీ ఎక్కడుందీ? రమ్మను, కనుక్కుంటాను.

పెద్ద—అబ్బ, పోనిస్తురూ! సాయంత్రం కులాసాగా తోట్లో ఆడుకుంటోంది కాబోలు.

భా—ఆ జోగి యిక్కడే వున్నాడా? వాడింక కాళ్ళగా యేమిటి? విశాలహృదయుణ్ణి కాబట్టి పెండ్లికాని పిల్లని పరాయి వాడితో వుండనిస్తున్నాను. ఇదే ఏవరేజ్ ఇండియన్ ఐతే, భార్యతోసహా నూతులో పడును.

పెద్ద—దానికి వున్న ఫ్రెండ్ అతనొక్కడేట.

భా—ఫ్రెండ్ కాదు ఫీండ్! అసలెవడీజోగి?

పెద్ద—(నవ్వు ఆపుకుంటూ) జోగి కాదు, రామయోగి. సోషలిస్ట్; కవి; సంఘ సంస్కర్తాట.

భా—వాడి క్రాపింగూ, నాగుండూను. ప్రతివాడూ పైజామా, లాల్చీ, కళ్ళజోడూ తగిలించుకుని, వుద్యోగం సద్యోగం లేక వీధులమ్మట తిరగడం, సోషలిస్టనో, భావకవినో చెప్పుగోడం! వీళ్ళ గాలి తగిలిందా-మన పిల్ల ఎందుకూ పనికిరాదు.

పెద్ద—మీ చిన్నప్పుడు మీరు మాత్రం తిరగలేదా ఏమిటి?

భా—నెవ్వర్. నేను ఐర్లండులో వున్న రోజుల్లో కమ్యూనిస్టుల్ని అడివిమనుషుల కింద చూసి, వాళ్ళని సంఘంలోంచి బహిష్కరించేశాళ్ళం. బోల్షివిక్కులంటే ఎవళ్ళో తెలుసా? ఎంతసేపూ తిండి, తిండి-తరవాత పని, పని, పని. రహస్యాలు లేవు. ప్రత్యేకత లేదు. పిల్లల్ని గవర్నమెంటు లాక్కుపోయి తలిదండ్రులకు దూరం చేస్తారు. ఆధ్యాత్మికవిలువలు, స్వతంత్రమైన కళా లేవు. అసలు మతమే లేదు. పూటకి తికాణాలేని యీ ధవ్వాగాళ్లు ఇండియాలో సోషలిజమ్ నెలకొల్పుతారుట!

పెద్ద—ఏమో నాకేం తెలుసు? అమ్మాయి చెప్పింది: అతను జీవితాన్ని సామ్యవాద ప్రచారంకోసం అంకితం చేశాడని.

భా—ఉద్యోగంలేక యేదో పదిమంది నోళ్ళల్లోనూ పడాలని చేసే అల్లరిదంతా. రేపో గుమాస్తాపని దొరికిందంటే సోషలిజమ్ సొమ్మసిలి పడుకుంటుంది.

పెద్ద—కవిటకూడా.

భా—నేటి కవుల మాట చెప్పకొనే. ఏముంది, యవ్వనంలో వున్న బ్రహ్మచారులంతా ఏ ఆడదానివెనకో పడడం, అది వీళ్ళకి లొంగకపోవడం—డబ్బులేని వీళ్ళ మొహం ఆఖరికి బోడమ్మ కూడా చూడదు—ఆ కసి తీరక కవిత్వం వ్రాయడం! లేకపోతే కామకథలూ, ప్రేమకథలూ వ్రాసి పళ్ళబోసుకోవడం! అందాకా ఎందుకూ? వీళ్ళందరికీ తలో పెళ్ళాన్నీ వొప్ప జెప్పు. కవిత్వం రూపులేకుండా మాయమౌతుంది.

పెద్ద—సంఘసంస్కర్త అని కూడా చెప్పింది.

భా—సంఘం! ఈ దేశంలో వో సంఘం అంటూ ఏడిస్తేగా? మూడువందల జాతులూ, ఆరువందల భాషలూ, పదహారువందల మతాలూ వున్న ఇండియాలో నలభైనాలుగుకోట్ల సంఘాలున్నాయి. ఇందులో దేన్ని వుద్ధరించడం? ఈ వూళ్లో అనాధశరణాలయంలో బోలెడుమంది భర్త చచ్చిన బాలికలున్నారు. వాళ్ళల్లో ఒకదాన్ని పెండ్లిచేసుకుంటే గొప్ప సంఘసంస్కారం చేసినట్లు. అల్లా చెయ్యమను.

పెద్ద—ఈ వగైరా కారణాలవల్లా మన పంకజం అతన్ని పెళ్లిచేసుకుంటానని నాతో మొన్న చెప్పింది.

భా—(కంగారుపడి లా పుస్తకాన్ని కింద వొదిలేస్తాడు) ఆ. ఆ. మళ్లా చెప్పు.

పెద్ద—(తాపీగా) ఈ వగైరా కారణాలవల్లా మన పంకజం అతన్ని పెళ్లిచేసుకుంటానని నాతో...

భా—ఆపు. నువ్వు విని ఆనందించావా?

పెద్ద—దానికి కావలసిన మొగుడు దొరకడం దాని భాగ్యం. అసలు దానికి పెళ్లంటూ కావడం మన భాగ్యం గనక ఆనందించాననే చెప్పాలి.

భా—ఓసి నీ పెద్దరికం పెటాకలెత్తి కానూ! వీడెవడే? పూటకి తికాణాలేని ధవ్వా....

పెద్ద—అతని మనీపర్సులో ఇరవై రూపాయలకు తక్కువ లేవు.

భా—ఆస్తీ పాస్తీ లేని, ఉద్యోగం సద్యోగం లేని, స్థితి, మర్యాద, గౌరవం లేని పోకానాకి కమ్యూనిస్టుకి పంకజాన్ని యిస్తానని అనుకుంటే ఆ ఆలోచనని తక్షణం దిగమింగి మొగ్గలోనే గొంతుపిసెయ్.

పెద్ద—ఆస్తి పదెకరాల మాగాణీ వుందిటకాని, దాన్ని సమంగా తన స్నేహితులకి పంచుతాడుట. తను ఆఖరికి మిల్లుగుమాస్తా పన్లో నేనా ప్రవేశించి యేదో గడించుకుంటూ....

భా—ఒసేవ్, చిలకలా కూర్చుని చిల్లర కబుర్లు నా ముందు చెప్పకు. మనం ఎవళ్ళం? మొదటి జాతివాళ్ళం. పేరు, ప్రతిష్ఠ, గౌరవం, పలుకుబడీ వున్న వున్నతరకంవాళ్ళం. ఆ యోగిగాడెవడు? రెండోతరగతివాడు. మిడిల్ క్లాసు మొరాలిటీని ఇంగ్లీషువాడు హేళనచేసేస్తాడు. వాళ్లు ఎప్పుడూ డబ్బుకోసం సకలమైన ఛండాలపుపన్లూచేస్తూ గౌరవంగా వున్నట్లు నటిస్తూ, దౌర్భాగ్యపు బతుకు బ్రతుకుతూ......... ఛస్తే

పంకజాన్ని ఆ బురదలో కాలు పెట్టనివ్వను. ఓ మై గుడ్‌నెస్.

పెద్ద—మనమ్మాయి చెప్పడం అతను చాలా నిజాయితీగల మనిషని. పైగా కాపరం చేసేది అది కాని మీరు కాదుకదా!

భా—పొరబాటు; బీదకుటుంబంలో వాడికి కూతుర్నిస్తే అల్లుడుతో మామగారే కాపరం చెయ్యాలి. వాడికి ఉద్యోగం వుండదు. ఇక్కడే శాశ్వతంగా మకాం చేస్తూ మనవున్న ఆస్తంతా క్షౌరంచేస్తాడు. వాడి సిగరెట్లకి చాల్దు నా ప్రాక్టీస్.

పెద్ద—హిందూముస్లిమ్ కలయికని నిరూపించడానికి అప్పుడప్పుడు బీడీలు కూడా కాలుస్తాడుట. మనకి మొగపిల్లలు లేరుగా. ఉన్న వొక్క ఆడపిల్లా అనుభవిస్తే మనం సంతోషించాలిగాని...

భా—ఇప్పుడు నీ వుద్దేశం వీడు మన పంకజాన్ని ప్రేమించి యిదవుతున్నాడను కున్నావా? వాడికి కావల్సింది డబ్బు. గొప్పవాడి పిల్లని ఎల్లాగో మాయకబుర్లు చెప్పి బుట్టలో వేసుకున్నాడు. ఇదుగో... హిందూకన్యతో వున్న చిక్కే యిది. వివక్షత, ముందుచూపు, జ్ఞానం ఏకోశానా లేవు. ఎవడోవోడు మొగుడంటూ దొరికితే చాలునని...వీళ్ల గొప్ప ఆదర్శం పెండ్లి కావడం. నువ్వు ప్రపంచానికిచ్చిన గొప్ప సందేశం "నా మొగుడు బారిష్టర్" అని. కాఫీ తీసుకురా.

పెద్ద—మీరు పూర్వపు పద్ధతుల్ని మెచ్చుకోవడం నాకూడా ఆశ్చర్యంగా వుంది.

భానో—ఇంగ్లీష్‌గరల్ వుందంటే—పాతికేళ్లొచ్చాకాని పెండ్లివిషయం తలపెట్టదు. కనిపించినవాడి వెనక పడదు.

పెద్ద—పదిమందిని వొకేసారి చూసి, అందర్లోకీ ఎవడు ఫస్టని తోస్తే...

భానో—వాడితో 'ఎంగేజ్'కావడం, గ్రాడ్యువల్ లవ్...

పెద్ద—తల్లితండ్రుల అంగీకారం లేకపోతే—

భానో—ఆకస్మికంగా ఎలోప్‌మెంట్. (రాజ్యం లోపలి కెళ్లి, కాఫీట్రే తెచ్చి బల్లమీద పెడుతుంది) ఇదుగో—వాడికి మాత్రం పంకజాన్ని యివ్వను. (అగ్గిపెట్టె తీసుకుని రెండుపుల్లలు కొడతాడు అవి వెలగవు. అగ్గిపెట్టె దూరంగా గిరవాటెడతాడు. అప్పుడే గుమ్మం దాటిన దానయ్య దాన్ని గుప్పెట్లో పట్టుకుని ప్రవేశిస్తాడు) డామ్ డర్టీ మాచ్‌బాక్స్!

దాన—బారిష్టర్‌గారికి నమస్కారాలు. అగ్గిపెట్టెలో పుల్ల లుండగానే గిరవాటెట్టారు! (బల్లమీద పెట్టి) నాపేరు దానయ్య.

భానో—మీరా? చాలా రోజులైంది మిమ్మల్ని చూసి. అల్లా కూర్చోండి. ఎక్కడనుంచి రావడం? పిల్లలు క్షేమమా?

దాన—ఆహా! ఏదో పడవ లాగేస్తున్నాను. మా పూర్ణించే. శంకరంగారు యీ వుత్తరం మీ కిమ్మన్నారు. (ఉత్తరం యిస్తాడు) మరిచా. శంకరంగారు కాదు, సూర్యనారాయణగారు. మావాడి వుద్యోగం విషయంలో తమ రికమెండేషన్ దయ చేస్తే...

భానో—(ఉత్తరం చదివి నవ్వుతూ) ఇది రాసింది సూరయ్యగారు.

దాన—మరిచా, వెధవ మందమతీ నేనూ! మరే, సూరయ్యగారు. (రాజ్యం లోపల్నించి మరోకాఫీకప్పు తెచ్చి బల్లమీదపెట్టి, కట్టడం మొదలెడుతుంది.)

భానో—(ఉత్తరం రాస్తూ) నా రికమెండేషన్లకి విలువ పోయి చాలారోజులైంది.

దా—(మెల్లగా) నేనూ, శారదాంబగారూ వొకే రైల్లో ప్రయాణం చేశాం.

(భానోజీ మొహం పైకెత్తి, కనుబొమ్మలు చిట్లించి, 'ఇష్' అని సంజ్ఞచేస్తాడు. దానయ్య వినిపించుకోకుండా-)

మిమ్మల్ని మరీమరీ అడిగానని చెప్పమంది. అడగడం ఏమిటి, వెధవమందమతీ నేనూ! ఇక్కడికి వొస్తానంది తమ ఉత్తరం చూసుకుని....

(భానోజీ 'చెప్పొద్దు' అన్నట్లుగా కళ్లెగరేస్తాడు) అమ్మాయిని చూచి చాలా రోజులైందిట. శారదాంబగారున్నారే—ఏకులం ఐతేంగాని, మహా ఉత్తమురాలు...

భా—మీవాడికి కావల్సిన ఉద్యోగం?

పెద్ద—అసలు శారదాం బెవరంటాను?

దా—ఆవిడని గురించి తమరికన్నా నాకంత బాగా తెలియదు.

భానో—మీ రీఉత్తరం సూరయ్యగారి కిచ్చి....

పెద్ద—శారదాంబంటే? వెనక అనాథ శరణాలయంలో వున్న అప్సరసా...?

దాన—వెనకవిషయం మనకి బాగా తెలీదు కాని యిప్పటికీ ఎల్లావుందంటే....

భానో—మీరొచ్చింది రికమెండేషన్ కొరకా, బ్యాక్‌కాం పెస్ట్ కోసమా?

పెద్ద—మాట తప్పించకండి. ఆవిడెవరో కొంచెం చెబుదురూ.

భానో—ఈ ఉత్తరసంగంబాకంలో ......

దా—నీకు వారితో పరిచయం ఎల్లాగా అని అడిగా అక్కడికీ...

భానో—అక్కడ వరదరాజులు నా క్లాస్‌మేట్.

దా—శారదాంబగారే-మహా....

భానో—అబ్బ, నీగొడవ గోతాంలో కట్ట! వరదరాజులు, పైక్రాఫ్టురోడ్—అడ్రెస్ వ్రాశా....

దా—చిత్తం. మరి నాకు శెలవా... (వెడతాడు.)

పెద్ద—(కొంటెగా) అనాథశరణాలయంలో అవతరించిన అప్సరస శారదాంబ "ప్రాతచుట్టాలమని నొక్కి పలుకుమనియె."

భా—ఇంగ్లండులో స్త్రీ అసూయ ప్రకటించదు. నాగరికతంటే అదే.

పెద్ద—రహస్యంగా బాధపడుతూ, సుఖంగా వున్నట్లు నటిస్తూ, పరాయిమొగాడితో పాకులాడడం నాగరికతకాబోలు.

భానో— ప్లీడరు పెళ్లానికి నెత్తిమీద 'విగ్గు' వున్న ఏ జడ్జీ విడాకులివ్వడానికి

అంగీకరించదు. అవసరమైన అన్యాయాన్ని ఆమోదించదం ఇంగ్లీషు న్యాయచట్టం. "శిఖామణి వెర్సెస్ శ్రీదేవి గర్ల్—"చదువు. (చుట్ట వెలిగించి పొగ వుంగరాల కింద పోదుతూ) దానయ్యాబీ కామెడ్.

పెద్ద—మీ రిట్లాంటి ఛండాలపు పన్లు వెనకటిరోజుల్లో చేసి, నాకు చెప్పకుండా అప్పుడే అవతరించిన ఆదర్శప్రాయమైన భర్తలా నటించడం చూస్తే మీరు అనాథశరణాలయానికి తండ్రీ, భర్తా రెండూ అవడం సహజంగానే వుంది. పద్ధెనిమిదో శతాబ్దంలో ఉద్భవించిన శారదాంబగారి కున్న స్వాతంత్ర్యంలో వెయ్యో వొంతు పంకజానికి కూడదా అని అడుగుతా.

భా—ఓసి పెద్దపిచ్చిరాజ్యం! అది స్వచ్ఛమైన కర్త్రలేని ప్లాటానిక్ లవ్. అది సంసారస్త్రీకి అర్థం కావాలంటే మరో శతాబ్దం గడవాలి. "శిరోమణి వెర్సెస్ లక్ష్మీదేవమ్మ—"కేస్‌లో ఏమైందంటే...

పెద్ద—ఒళ్లుమండే కబుర్లు చెప్పకండి. మీరూ, నేనూ తలకాయ వొంచుకుని, చిన్న వయస్సులో వున్న వాళ్లు వాళ్లిష్టమొచ్చినట్లు చేస్తుంటే చప్పట్లు కొట్టి చూస్తూ కూర్చునే కాలం వొచ్చిందని వొప్పుకోండి.

భానో—భారతీయులు సెంటిమెంటల్ వ్యక్తులు. మొగపిల్లాణ్ణి పాడుచెయ్యడంలో ఫస్టుప్రైజ్ తండ్రిది. కూతుర్ని కొడుకునీ పాడుచెయ్యడంలో స్పెషల్ మెడల్ అమ్మది. కాబట్టి కాస్తంత నోరు మూసుగుని, యీ విషయంలో జోక్యం కలగజేసుకోకపోవడం నీకూ, నాకూ, ఆంధ్రదేశానికీ శ్రేయస్కరం.

పెద్ద—మీ వ్యవహారాలు పంకజం చెవిని పడితే మీ మర్యాద ఏమవుతుందో వూహించండి. ఈ విషయం రామయోగికి తెలిసిందంటే మన కుటుంబాన్ని యీ దేశంలో కాకుండా, యితర దేశాల్లోకూడా యాగీ చేసి వొదిలిపెడతాడు.

భానో—సంఘానికీ, నిందకీ వెరిచేరకం కాదు మనం. ఈ ఇండియన్స్‌లో చిక్కే యిదె. వాళ్లు పుట్టడం, బ్రదకడం, చావడం —అన్నీ సంఘంకోసం, ఇతరులకోసం. వ్యక్తిత్వం లేని యీ దౌర్భాగ్యపు జాతి స్వరాజ్యానికి తగదని అక్షరాలా రాసిస్తాను.

పెద్ద—మీబోటి మహాత్ములూ, శారదాంబలాంటి సావిత్రులూ ఉన్నంతకాలం స్వరాజ్యం వొస్తుందని మీరు బెంగపెట్టుకోనక్కర్లేదని రాసి అణాస్టాంప్ అంటించి మరీ యిస్తాను.

భానో—ఐతే, పంకజాన్ని ఆ జోగిగాడి కిస్తే నాకు ప్రాయశ్చిత్తం పూర్తవుతుందా...?

పెద్ద—(బిగ్గరగా) ఆ.

భానో—(ఇంకా బిగ్గరగా) 'ఆ' అంటే 'బో' అంటా. (లోపల్నించి పంకజం 'ఉత్తమా యిల్లాలినోయీ' అని పాడుతుంటుంది.)

పెద్ద—వాళ్ల పెళ్లిముహూర్తం ఎల్లుండి ఏర్పాటుచేయిస్తా. ఏం? శారదాంబకూడా పీటల్మీద కూర్చోవొచ్చు.

భానో—(నోరు నొక్కుకుంటాడు) ఇంతకీ పంకజంతల్లి శారదాంబనా నీ వూహ?

పెద్ద—ఎంతమాత్రం కాదు. అది శరణాలయం సృష్టి.

(పంకజం, రామయోగి ప్రవేశిస్తారు.)

పం—నాన్నా, ఏమి టింత బిగ్గరగా మాట్లాడుతున్నారు?

రామ—కార్మికులు సమ్మెనాడుకూడా యింత గొడవ చెయ్యడం ఎరగం. వారు బిగ్గరగా ఆలోచిస్తున్నారు.

భానో—(చిరాకుగా)ను వ్వెవరయ్యా?

రామ—నా విజిటింగ్ కార్డు తమ బల్లమీదే వుంది. నేను మీ శ్రేయస్కామిని.

పం—నాన్నా, ఇతను నా ఫ్రెండ్—మీకు వెనక చెప్పాగా.

భానో—ఏం పని?

రామ—నేటికాలంయువకుణ్ణి ఆ ప్రశ్న వేయకూడదు. దేవుడి కేం పని—నాకూ అదే పని. నాబుర్ర భావాలని సృష్టించడం, సంఘం వాట్ని నిర్మూలం చెయ్యడం.

పెద్ద—మీరు సోషలిస్టులని చెప్పింది మా పంకజం?

రామ—నన్ను 'మీరు' అని సంబోధించిన స్త్రీని నేటికాలానికి చూడగలిగాను. మీ రన్న దాన్ని ఖండించను.

భానో—నీకో ఉద్యోగం సాధించానంటే, యీ వెర్రులన్నీ హూష్‌కాకీ అవుతాయి.

రామ—మీ వెర్రిని నిర్మూలం చెయ్యడం నా ఆశయాలలో వొకటి.

పం—రామం భావకవి నాన్నా.

పెద్ద—మీరు వ్రాసిన సద్యం వొకటి చదవండి.

రామ—అంటే నాకవిత్వం జీవితంలోనే కనపరుస్తా కాని కాగితాలమీద కాదు లెండి. వెనకటికవిత్వం భూస్వాముల సోమరితనాన్నుంచి జనించింది. మా కవిత్వం ఆకలిలో అంతర్ధానమైంది.

భానో—మీ కందరికీ తలో పెళ్లాన్ని పారేస్తే యీ పిచ్చులన్నీ గోదుల్తా యను కుంటా.

రామ—వాంఛించిన స్త్రీని పొందలేక, ఆ కసిని భాష ద్వారా ప్రకటించే మాకవిత్వాన్ని 'కసిత్వం' అనొచ్చు.

భానో—మీలాంటి యువకులందరూ మా అనాథ శరణాలయంలోని బాలికలని వివాహం చేసుకుంటే సంఘాని కెంతో వుపకారం. అట్లా చెయ్యరాదూ?

పెద్ద—శారదాంబనా?

భానో—షటప్.

పెద్ద—ఇంగ్లీషుకోపం కాబోలు.

రామ—అధికారం చలాయించేటందుకు శరణాలయాలు భూస్వాముల పాలిటి కల్పతరువు కాబోలు.

పం—రామయోగి ఆదర్శాలున్న వాడు నాన్నా.

భానో—ఉదాహరణకి....

రామ—నన్ను నేను సంస్కరించుకోవడం. తన్ను తాను సంస్కరించుకోలేని వాడు సంఘాన్ని సంస్కరించడానికి తగడు. తగిన భార్య, సుఖమైన మారీడ్ లైఫ్ లేకపోతే సంఘమే వాణ్ణి బహిష్కరించి సంస్కరించడం మొదలెడుతుంది.

పెద్ద—అతను అభిప్రాయం చాలా చమత్కారంగా వెల్లడి చేశాడు. మన పంకజం అభిప్రాయం అడిగాంకాబట్టి, ఏదో చెప్పేస్తే మంచిది.

భానో—నా కిష్టంలేదు.

పం—చేసుకునేది, భరించేది నేనుకదా.

భానో—చేసుకునేది నువ్వు; భరించేది నేను.

రామ—నో, నో. భరించడం మన డ్యూటీ. భారతదేశంలో భర్తల బాధలన్నీ భరించే నాకు "ఇదిమొక లెక్కయా...?"

భానో—ఆస్తి లేదు.

రామ—అందరి భూస్వాముల ఆస్తీ నాదే.

భానో—ఉద్యోగం లేదు.

రామ—భూస్వాము లందరూ నాబోటి యువకులని ఏదో ఉచ్చా వుద్యోగంలో దింపి, మా ఆదర్శాలని నిర్మూలంచేసి, మా సామ్యవాద ఉద్యమాన్ని నశింపుచెయ్యాలని ఆశిస్తున్నారని కనుక్కునే, మేం ఉద్యోగాలు చెయ్యడం మానేశాం. ఆంధ్రదేశంలో యువకులందరూ ఉద్యోగాలు మానారంటే, ఆంధ్రరాష్ట్రం 'ఏకీ నా ఆంధ్రు'లంటో చక్కా వొస్తుంది; స్వరాజ్యరథం చక్రాలు లేకుండా కదుల్తుంది.

భానో—మీ అల్లు డేం చేస్తున్నాడంటే ఏం చెప్పకోను?

రామ—వెరి సింపిల్. మా అమ్మాయికి భర్తగా వుంటున్నాడని చెప్పండి.

భానో—ఇదుగో అమ్మాయీ, ఎన్ని చెప్పు, నాకీసంబంధం యిష్టం లేదు.

రామ—నాకు మొదలే యిష్టం లేదు. కొందరు భూస్వాములు పెళ్లి ద్వారామమ్మల్ని వల్లో వేసుగోవాలని చూస్తున్నారు. స్టాలిన్ వొచ్చి బ్రతిమలాడినా మీ పంకజాన్ని చేసుకోను. నాకు ఆత్మగౌరవం లేదని తెల్సుకోండి.

పెద్ద—చూడు నాయనా,- నామాటవిను.

రామ—నే విన్నండి. నాకు కోపం వొచ్చిందంటే మనిషిని.

పం—డార్లింగ్. మానాన్న నాటకం ఆడుతున్నారు. పరిహాసం. నాకేసి చూడవూ?

రామ—అఫ్ కోర్స్. ఈ కళ్లు నిన్ను చూడడానికి కాక యింక దేనికి?

భానో—సరే, మీ అందరికీ అంత యిదిగా వుంటే నాకూ...

పెద్ద—శారదాంబకీ ఎందుకు?

భానో—షటప్.

రామ—మి షటప్!! మీరు నన్నిట్లాంటి మాటలన్నారంటే వెంటనే లేచిపోతా పంకజంతో...

భానో—ఆరి నీ తస్సా...

రామ-క్షమించండి. శారదాంబగా రెవరో తెలుసుకోవచ్చా? (దానయ్య ప్రవేశిస్తాడు)

దాన—నిక్షేపంలా. కుశాలరావుగారి చిరపరిచితురాలు.

భానో—వాట్?

దాన—వాటో, బోటో మనకి తెలీదు కాని ఇందాకా మీతో మనవిచేసిన విషయాలు పొరపాటు. ఆవిషయాలు కుశాలరావుగారితో చెప్పమంది. నా మందమతే కారణం.

భానో—(గర్వంగా) చూశావా నాపవిత్రత. తెగ ఎగిరిపొయ్యావు!

పెద్ద—ఈ రెండో వ్యక్తి శారదాంబా?

రామ—ది జూనియర్. హలో, కామ్రేడ్ దానయ్యా, మన పెళ్లికి పెత్తనం తమదే.

దాన—మన పెళ్లి! ఇంకా నాకు పెళ్లేమిటి?

భానో—అన్నీ మీరు మాట్లాడుకోండి.

రామ—అఫిషియల్ గా మీ అంగీకారం?

భానో—(రాజ్యానికేసి చూపించి) అది ఇస్తుంది. (వెడతాడు)

రామ—ఓ. హౌస్ పెక్డ్! ఇదుగో దానయ్యగారూ, నా పెండ్లికి తమరు శారదాంబతో సహా చక్కా రావాలి.

దాన—నేను...నాకు...చంపేశావు.

పం—మా నాటకానికి గొప్ప పాత్రని సృష్టించారు.

(తెర)



# పాకీస్థాన్ సమస్య - - -
# పంజాబ్ హిందూ అభిప్రాయము

= శ్రీ చావలి వెంకట హనుమంతరావు =

[ "డెయిలీ హెరాల్డు" సంపాదకులు, లాహోర్ ]

పాకిస్థాన్ సమస్యనుగురించి సమాలోచించునప్పుడు పంజాబ్ రాష్ట్రప్రజల అభిప్రాయములను ముఖ్యముగ పంజాబ్ హిందువులయొక్కయు, శిక్కుల యొక్కయు అభిప్రాయములను ఆలోచనలోనికి తీసుకొనకుండ ఉండుటకు వీలు లేదు. పశ్చిమసరిహద్దు, సింధు రాష్ట్రములతోపాటు పంజాబు, ఏర్పాటు కాబోవు పాకిస్థాన్ రాజ్యములో ముఖ్యప్రాంతముగా పరిగణింపబడవలసియున్నది. ఈ సందర్భములో ఒక ప్రధాన ప్రశ్న ఏమన, పంజాబ్ రాష్ట్రప్రజలు, ఏ మతమునకు చెందినవారైననుసరే, ఎప్పుడైనను పాకిస్థాన్‌లో భాగముగా నుండుటకు తమంతట తాము అంగీకరింతురా అనునది. పంజాబులోని హిందువులు, శిక్కుల విషయము అటుండనిచ్చి పంజాబ్ మహమ్మదీయులైనను నూటికి నూరుమంది హిందూస్థానమునుండి విడగొట్టబడి క్రొత్తగా ఏర్పాటుకాబడు మహమ్మదీయస్వాతంత్ర్య రాజ్యములో నుండుట కంగీకరింతురనుట అనుమానమే. పాకిస్థాన్ ఏర్పాటుకాబడవలెను, మహమ్మదీయుల కొరకు స్వతంత్ర రాజ్యము ఇండియాలో నుండవలెను, అను ఆందోళనకు ఎక్కువ ప్రోద్బలము, మహమ్మదీయులు అల్పసంఖ్యాకులుగా నున్న బీహారు, సంయుక్తరాష్ట్రములు మొదలగు ప్రాంతములలోనుండి వచ్చుచున్నదనియు, మహమ్మదీయులు అధికసంఖ్యాకులుగా నున్న పంజాబ్, సరిహద్దురాష్ట్రములు, సింధు రాష్ట్రములలో లీగుయొక్క పాకిస్థాన్ ప్రణాళికకు మహమ్మదీయులలోకూడ పట్టుదలపూర్తిగా లేదనియు ఇక్కడ చెప్పవలసియున్నది.

ఈ విషయము కొంతమందికి ఆశ్చర్యము కలిగింపవచ్చును. కాని, దానియొక్క నిజమును ధిక్కరించుటకు వీలు లేదు. దీనికి ముఖ్యకారణ మేమనగా, మహమ్మదీయులు అధికసంఖ్యాకులుగా నున్న రాష్ట్రములలో వారిప్పుడే తమ ఇష్టమువచ్చినట్లు ప్రభుత్వము నడుపుకొనుట కవకాశములు కలిగియున్నారు. పంజాబ్, సింధు, పశ్చిమోత్తరప్రదేశములలో మహమ్మదీయరాజ్యము కాక వేరేమి? ఈ ప్రాంతములందలి హిందువుల రాజకీయహక్కులు కాని, వారి సాంఘికసౌకర్యములు కాని మహమ్మదీయుల మంచితనముపై ఆధారపడియున్నవి. హిందువుల ప్రక్కనుండి మహమ్మదీయులు భయపడవలసిన అవసరము ఎంతమాత్రమును లేదు. కాని, బీహారు, సంయుక్తరాష్ట్రములు, బొంబాయి, మధ్యరాష్ట్రములలోని మహమ్మదీయుల స్థితి వేరు. వారు అల్పసంఖ్యాకులుగా నుండుటవలన ఏ విధముగనైన తమ హక్కులను, తమ స్థితిగతులను దృఢపరుచుకొనుటకు వారి ఆతురత సహజమైనది. అందువలనే వారి దృక్పథమందు హిందూదేశమం దెచ్చటనైననుసరే, స్వతంత్ర మహమ్మదీయరాజ్యములుండుట ముఖ్యవిషయము. అట్టిరాజ్యములు వారి హక్కులను, వారి స్థితిని బలపరుచుకొనుటకు దోహదమిచ్చుననియు, అవసరము వచ్చినయెడల మహమ్మదీయరాజ్యములు తమ హిందూ ప్రజలను బాధపెట్టుదురు కనుక "మీరు మమ్ములను బాధపెట్టకుడు. మా కోరికలన్నింటిని సఫలపరుపు"డని వారు తమతమ రాష్ట్రప్రభుత్వములతో బేరముచేయవచ్చుననియు వారి ఉద్దేశ్యమని అనేకవిషయములవలన స్పష్టమగుచున్నది. ఏది ఎట్లున్నను "హిందూదేశమును

విభజించుము, రెండుమూడు స్వతంత్ర రాజ్యములక్రింద బ్రద్దలుకొట్టుము” అను లీగుసంస్థవారి ప్రణాళికవలన నిజముగా లాభముపొందువారు హిందువు లధికసంఖ్యాకులుగా నున్న రాష్ట్రములలోని మహమ్మదీయులు మాత్రమేనని చెప్పుటలో అతిశయోక్తి లేదు. లేక పోయిన బీహారులోకాని, సంయుక్తరాష్ట్రములలోకాని నివసించు మహమ్మదీయునికి పాకీస్థాన్ స్థాపనవలన వచ్చు లాభమేమో తెలిసికొనుట కష్టము. తన ప్రస్తుతనివాస స్థానమును, తన చిరకాలబంధుమిత్రులను, భూమిపుత్రులను వదలి పాకీస్థాన్ రాజ్యమునకు తరలిపోవుట కంగీకరించినచో నిజముగా పాకీస్థాన్‌కై అతడు బాధపడుచున్నాడని తలంపవచ్చును. అట్టి ఉద్దేశ్యముకాని, నిశ్చయముకాని అతనికి లేనప్పుడు పైన సూచించిన కారణమే పాకీస్థాన్ ఏర్పాటున కాతడు ఒరిపించుటకు కారణమని అంగీకరింపకతప్పదు.

ఇంక పాకీస్థాన్ రాజ్యములో చేర్చబడు రాష్ట్రములలోని హిందువులపరిస్థితి యేమని ఆలోచించినచో స్పష్టమగునదేమనగా, హిందూదేశమంతయు సమిష్టి రాజ్యముగా తీసుకొనిన వీరు అఖిలభారత రాజ్యాంగ విధానమందు మెజారిటీసంఘమునకు చెందినవారై, కేంద్రమందు ఇతరరాష్ట్రముల హిందూప్రతినిధులతో పాటు కలసి తమ రాజకీయసాంఘికహక్కులను, ఐకమత్యమును కాపాడుకొనుట కవకాశములు కలిగియుండియు, పాకీస్థాన్ ఏర్పాటువలన ఆ హక్కులను, అవకాశములను కోల్పోవలసినవారగుచున్నారు. మహమ్మదీయులు అధికసంఖ్యాకులుగ నున్న ప్రదేశములను విడదీసి స్వతంత్ర రాజ్యముగా ఏర్పాటుచేయుట కంగీకరించెద మనియే తలంపుడు. అట్టి సందర్భములో పంజాబు రాష్ట్రములో హిందూ, శిక్కుమతస్థులు నూటికి ౬౦,౭౦ మందికి పైగానున్న ౧౨ జిల్లాలను పాకీస్థాన్ లో ఎందుకు చేర్చవలెను, అట్లు చేర్చుట ఏ కారణములవలనసమంజసమగు నిర్ణయము అను ప్రశ్నలకు జవాబు చెప్పవలసియుండును.

౧౯౪౪ సెప్టెంబరు నెలలో బొంబాయిలో జరిగిన గాంధీ-జిన్నా సంభాషణలలో ఈ విషయమును గాంధీ గారు పైకి తీసుకొనివచ్చిరి. పంజాబు హిందువులతరఫున గాంధీగారి దగ్గరకు పంపబడిన ప్రతినిధి శ్రీలాలా బ్రిజ్ లాల్ గాంధీజీకి ఈ సందర్భములో పంజాబు హిందువులు పడుచున్న అదుర్దాను స్పష్టముగా వ్యక్తీకరించుచు ఒక మెమోరాండమును వ్రాతపూర్వముగా ఇచ్చియుండిరి. పశ్చిమపంజాబులోని ౧౭ జిల్లాలలోను మహమ్మదీయు లధికసంఖ్యాకులుగానున్నారు. శ్రీ రాజగోపాలాచారి గారి ప్రణాళికప్రకారము ఈ జిల్లాలుమాత్రమే పాకీస్థాన్ లో చేర్చుట కవకాశముండును. గాంధీజీ జిన్నా గారికి వ్రాసిన ఉత్తరములలోకూడ పంజాబులోని ఇవి మహమ్మదీయుల జిల్లాలని ఖండితముగా చెప్పనగిన జిల్లాలు పాకీస్థాన్ లో చేర్చుట సమంజసమనియు, హిందూదేశము విభజింపబడి మహమ్మదీయరాజ్యమేర్పాటుచేయవలెనా, లేదా అను ప్రశ్న నిర్ణయించుటకు జరుపబడు ప్లెబిసైట్ (plebicite) ఈ జిల్లాలలో మాత్రమే తీసుకొనవలెననియు స్పష్టముగా తెలిపి యుండిరి. జిన్నాగారీవాదన నంగీకరించక ప్లెబిసైట్ పంజాబురాష్ట్రమందంతటను తీసుకొనబడవలెననియు, పంజాబురాష్ట్రము ఇప్పుడు ఉన్నది ఉన్నట్లుగా పాకీస్థాన్ రాజ్యములో చేర్చబడవలెననియు, ఇదియే ముస్లిమ్ లీగ్ లాహోరుతీర్మానమునకు సరియగు అర్థమనియు గాంధీజీకి తమ జవాబునందు తెల్పిరి. బొంబాయిసంభాషణలు విఫలమగుటకును, హిందూ మహమ్మదీయ సమస్య తీర్మానింపబడకపోవుటకు జిన్నాగారి ఈ అభిప్రాయము ఒక ముఖ్యకారణమని ఇందువల్ల స్పష్టమగుచున్నది. గాంధీజీ పంజాబురాష్ట్రమంతయు పాకీస్థాన్ లో చేర్పబడవలె నను సిద్ధాంతము నంగీకరించినచో జిన్నా గారు వెంటనే సంతోషముతో ఆ సూచన నంగీకరించి యుందురు. కాని గాంధీజీ ఆ విషయములో జిన్నాగారికి లోకువఇచ్చియుండినచో పంజాబుహిందూసంఘములో పెద్ద ఆందోళనకు తావిచ్చినవారైయుందురు. ఇది జ్ఞాపకముంచుకోవలసిన విషయము.

బొంబాయి సంభాషణలలో జిన్నాగారి నిజమగు భయములు, ఉద్దేశ్యములు చాలవరకు బయల్పడుట కవకాశము కలిగినది. ముఖ్యముగా ఆయన భయపడున దేమన, మహమ్మదీయు లసంఖ్యాకులుగా నున్న ప్రదేశములందు ప్లెబిసైట్ తీసుకొనబడినచో వారిలో చాల మంది పాకీస్థాన్ కు వ్యతిరేకముగా తమ వోటు నిచ్చెదరని. మహమ్మదీయులు స్వతంత్రములుగా రాజ్యము చేయు ప్రదేశము హిందూదేశములో ఒకటి ఉండవలెను

అను సిద్ధాంతమును వా రందరు అంగీకరించి నప్పటికిని, నిజముగా పశ్చిమోత్తర ప్రాంతములో అట్టి రాజ్యము ఏర్పాటుచేయబడుటను గురించి నిశ్చయ నిర్ణయమునకు రావలసివచ్చినప్పుడు చాలమంది దానివలన తమకు ఎక్కువ లాభమేమియు వచ్చునని కాని, ఆర్థికముగ, ఇతర సందర్భములను బట్టియు ఆరాజ్యము అనేక కడగండ్లకు పాలవవలసివచ్చియుండదని కాని అంతర్గతముగ వారికి భయము లేకపోలేదు.

అదేకాక ఆరాజ్యమును ఆర్థికముగ పెంపొందించుటకు అవసరమగు ఖర్చు పెట్టుటకును, దాని రక్షణకై కావలసిన సిబ్బందిని తయారు చేయుటకు ఆ సందర్భములో అవసరమగు ఇతర పనులను చేయుటకును ఈ మహమ్మదీయ రాజ్యము తగు ఆర్థికశక్తి కలిగియుండగలదనుటకు వీలులేదు. ఇప్పుడు దేశసంరక్షణకు కావలసిన సైన్యమును తయారుచేయుట సమయము వచ్చినప్పుడు దానికి కావలసిన సామగ్రిని, ఖర్చును చేయుట ఇవన్నియు కేంద్రప్రభుత్వమువారి భుజములపై ఉన్నవి. ఇదియుకాక పశ్చిమోత్తరరాష్ట్రమునకు ఏటేట మామూలు ప్రభుత్వఖర్చుకే కేంద్రప్రభుత్వమునుండి సబ్సిడీ (Subsidy) లేకుండ జరుగుటలేదు. ఈ మధ్య ఈ సబ్సిడీ ఎక్కువచేయించుకొనుటకై ఆ రాష్ట్రప్రభుత్వ ఆర్థికమంత్రి ఢిల్లీకి రాయబారము తీసుకొనివెళ్లుటకూడ అందరకు తెలిసినదే. అఖిలభారత రాజ్యాంగములో ఒకభాగముగానుండుటవలన, పశ్చిమోత్తరరాష్ట్రముల ప్రజలు,హిందూదేశఇతరప్రాంతములతో సంపర్కములు-రాజకీయముగ, సాంఘికముగ, ఆర్థికముగ-కల్గియుండుట కవకాశము లుండుటయేకాక అనేక లాభములను పొందుటకును వీలగుచున్నది. పాకీస్థాన్ స్థాపనవలన ఈ లాభములనన్నింటిని వారు చేతులారా వదలుకోవలసి వచ్చుటయేకాక ఉత్తరోత్తరనష్టముకూడ అనుభవింపవలసినవారగుదురు.

ముస్లిమ్‌లీగ్ కక్షవారు "పాకీస్థాన్, పాకీస్థాన్" అని ఆందోళన చేయవచ్చును. కాని పైన వ్రాసినట్లుగా నిజముగ పాకీస్థాన్‌లో చేర్చబడవలసియుండు ప్రదేశములలో ఆ ఆందోళనకు బలవత్తరమగు పునాది ఉన్నదని తలంచుట పొరపాటు. జిన్నాగారుకాని, ఇతర లీగునాయకులుకాని ఈ విషయమును ఒప్పుకుందురనియు, ప్రపంచమునకు చాటెదరనియు మాత్రము తలంపరాదు. ఇంతవరకు జరుగుచున్న దేమన, పాకీస్థాన్ ఆందోళన మహమ్మదీయ మతస్థులలో లీగ్ పలుకుబడిని ఎక్కువ చేయుటకు, మహమ్మదీయుల హక్కులను బలపరుచుటకును లీగునాయకు లుపయోగించుచున్నారు. ఎన్నిసారులు ఎంతమంది పాకీస్థాను అననేమి, దాని అంతరార్థమును స్పష్టీకరింపుడని జిన్నాగారిని కోరియుండినప్పటికిని, ఆ కోరికకు సరియగు జవాబు ఇంతవరకు ఆయన ఇచ్చియే యుండలేదు. జిన్నాగారి ఈ భావముకూడ పైన సూచింపబడిన భయము ఆయన మనస్సును పీడించుచున్న దను విషయమును బలపరుచుచున్నది. బ్రిటిషు ప్రభుత్వము హిందూదేశమందు బలముగా నున్నంతకాలము, బ్రిటిష్‌వారు మనలో మనకు కలతలను, మనస్పర్థలను రెచ్చగొట్టుటకు సిద్ధముగా నున్నంతకాలము జిన్నాగారు తమ పాకీస్థాన్ వాదనను విడుతురని తలంచుటకు వీలులేదు; అట్లు విడువను విడువరు. ఎప్పుడు బ్రిటిషు ప్రభుత్వము హిందూదేశమునకు స్వాతంత్ర్యము నిచ్చి తామీ దేశమునుండి తొలగుటకు నిశ్చయించుకొన్నామని ప్రకటింతురో, అప్పుడు జిన్నాగారికి హిందువులతో సఖ్యతచేయుటకును వారితో రాజీపడుటకును ఆతురత పుట్టును. అట్లు రాజీపడకుండ ఉన్నదానికి ఫలితము అంతర్గత కలహములు, దేశవిచ్ఛిన్నము మొదలగునవి. జిన్నాగారైనను ఇట్టి పరిస్థితుల కంగీకరింతురని తలంచుట కష్టము.

కాన పాకీస్థాన్ స్థాపన మాత్రమే హిందూ మహమ్మదీయ సమస్యాపరిష్కారమునకు కీలకమనియు, ఈ రెండు మతస్థుల మధ్య ఐక్యతను పెంపొందించుటకు మానసికముగ వారి వారిని వేధించుచున్న అనుమానములను, భయములను తొలగగొట్టుట కూడ ప్రధాన విషయములలో ఒకటి కాదని తలంచుటయు ప్రస్తుత సందర్భములలో కూడ పొరబాటనియే నా అభిప్రాయము. హిందూమహమ్మదీయసమస్య అనగా నేమి అట్టి సమస్యయే లేదు, అని మనస్సును సమాధానపరుచుకొనజూచుట ఎంతపొరబాటో కేవలము హిందూదేశ విభజనయే దానికి ముఖ్యావసరమని తలంచుట కూడ అంత పొరబాటే. ఈ మధ్య డాక్టర్ అబ్దుల్ లతీఫ్‌గారు (పాకిస్థాన్ సిద్ధాంతము పైకి తెచ్చిన వారిలో ఈయన ఒకడు) సప్రూకమిటీకి పంపిన మెమో



తల్లీ కొడుకు

(ఎల్లోరా గుహలనుండి)

— చిత్రకారుడు: శ్రీ [illegible] వెంకటేశ్వరరావు —

రాండములో లీగ్ సంస్థ యొక్క నిజాశయములను, అభిప్రాయములనుగురించి వ్రాయుచు ఈ క్రిందివిధముగా సూచించియుండిరి. ఆయన చెప్పిన దేమన: "ప్రస్తుత సందర్భములలో హిందూమహమ్మదీయ పక్షముల నాయకులలో నిష్పక్షపాతదృక్పథము పెంపొందింపగల్గుట కష్టము. ముఖ్యవిషయ మేమన, వివిధపక్ష నాయకులు అధికారమును సంపాదించుటకై మాత్రమే ఆతురతతోనున్నారు." కాంగ్రెసు పక్షమువారు వారి నాయకులగు గాంధీజీ హిందూదేశమందలి ప్రతిమానవుని స్వేచ్ఛా, స్వాతంత్ర్యముల కొరకై కాంగ్రెసు సంస్థ ప్రయత్నించుచున్న దేకాని, కాంగ్రెసుకే సర్వాధికారము చెందవలెనని కోరుట లేదని అనేకసార్లు స్పష్టీకరించియున్నారు. కాని ముస్లిమ్‌లీగ్, జిన్నాగార్లు మాత్రము బ్రిటిషువారి చేతులనుండి తమ పాకీస్థాన్ కోరికను కానుకగా సంపాదించుటకు ప్రయత్నించుచున్నారని చెప్పుట అతిశయోక్తి కాదు. గాంధీ-జిన్నా సంభాషణలలో గాంధీమహాత్ముడు "మొదట హిందూదేశమునకంతకును స్వేచ్ఛను సేకరించుటకై మనము చేతులుకల్పి పనిచేయుదము; తరువాత అవసరమును బట్టి పాకీస్థాన్ ఏర్పాటునకు మనలో మనము నిర్ణయించుకోవచ్చును" అని పదేపదే జిన్నాగారిని కోరినప్పటికిని, ఆయన "మొదట నా పాకీస్థాన్ సిద్ధాంతమును లాహోరుతీర్మానములో ఇమిడియుంచినట్లు పూర్తిగా అంగీకరింపుము; తరువాత హిందూదేశస్వాతంత్ర్యము కొరకై హిందూస్థాన్ పాకీస్థానములు రెండును ప్రయత్నించవచ్చును" అని జవాబునిచ్చియుండిరి.

బ్రిటిషుప్రభుత్వముమాత్రము ఈ విధముగ, ఇంతసులభముగ జిన్నాగారి కోర్కెను సఫలపరచుటకు సంసిద్ధముగానున్నట్లు ఎంతమాత్రము కన్పించదు. ఇంక మిగిలిన దేమన, ఆ ప్రభుత్వమువారు ఏదోఒకవిధమగు పరిష్కారమును వారి స్వంత బాధ్యతపై ప్రచురించుట; లేదా, హిందూమహమ్మదీయపక్షముల నాయకులు, జిన్నాగారిద్వారానో, అవసరమైనజిన్నాగారిని వదలిపెట్టికాని, వారిలోవారొకఒడంబడికకు వచ్చుట. ఇట్టి ఒడంబడికలోని ముఖ్యవిషయములు ఈ క్రిందివిగా నుండవలెనని నా ఉద్దేశ్యము.

మొదట:—ప్రస్తుతము ముసల్మానులు అధికసంఖ్యాకులుగా నున్న ప్రాక్పశ్చిమోత్తర ప్రాంతములు, అవసరములగు సరిహద్దు మార్పులతో ప్రత్యేక రాష్ట్రములుగా ఏర్పాటుచేయబడవలెను. సరిహద్దుమార్పు లనిన, హిందూమెజారిటీ కలిగిన స్థలములు కాని జిల్లాలు కాని మహమ్మదీయ మెజారిటీయున్న స్థలములనుండి విడదీయబడి ప్రత్యేక రాష్ట్రములుగా నిర్ణయింపవలెను. పంజాబులోని శిక్కులు హిందూరాష్ట్రములో కాని, మహమ్మదీయరాష్ట్రములో కాని వారి ఇష్టము ననుసరించి చేరవచ్చును. లేదా, వారికై మధ్య పంజాబుజిల్లాలు వేరురాష్ట్రముగా నిర్మాణింపవచ్చును.

రెండు: అఖిల భారత దేశమునకు సంబంధించిన సంయుక్తరాజ్య విధానము మన భావి రాజకీయ విధానముగా ఉండవలెను. సంయుక్త కేంద్రప్రభుత్వమునకు అఖిలభారతమునకు సంబంధించిన దేశరక్షణ, విదేశాంగ విషయములు, రైల్వేలు, టెలిగ్రాఫ్‌పోస్టల్ శాఖలు వీటిని నిర్వహించు అధికారము లీయబడవలెను.

మూడు: అఖిలభారత రాజ్యాంగమందు స్వదేశ సంస్థానములకు స్థాన ముండునట్లు చేయవలెను. సంస్థానములు వెంటనే సంయుక్త రాజ్యాంగములో పాల్గొనుటకు వెనుదీసిన వాటికొరకై బ్రిటిషు ఇండియాలో రాజకీయమార్పులను ఆపుచేయుట నవసరము లేదు. క్రమేణ ఈ సంస్థానములు కేంద్రమునందు పాల్గొనుటకు వాటి అంతట అవే సిద్ధమగునని నా ధృఢనిశ్చయము.

డాక్టర్ అబ్దుల్ లతీఫ్‌గారి మరొక సూచనకూడ ముఖ్యమైనదగ గమనింపవలసియున్నది. అట్టి సూచననే కొద్దిమార్పులతో నేను సప్రూసంఘమునకు పంపిన మెమోరాండములో కూడ సూచించియుంటిని. అదేమన, కేంద్రమందు ప్రధానమంత్రిపదవి హిందూమహమ్మదీయమతస్థులమధ్యను, ఇతర మైనారిటీసంఘప్రతినిధులమధ్యను మారుచుండవలెను. సంయుక్తకేంద్ర శాసనసభ ఆరుటరెమ్ము తీసుకొనినచో మొదటిసారి హిందువు, రెండవసారి మహమ్మదీయుడు, మూడవసారి ఇండియన్ క్రిష్టియన్ కాని షెడ్యూల్డ్ సంఘమునకు చెందినవాడుకాని, నాల్గవసారి మరల హిందువు, ఐదవసారి మహమ్మదీయుడు, ఆరవసారి హిందువు-ఈ విధముగ ప్రధానమంత్రిత్వము మారుచుండవలెనని నిబం

ధన ఏర్పాటుచేసుకోవలెను. ఇతరమంత్రులు వివిధమత కక్షుల ప్రతినిధులుగా అందరు ఆమోదించిన ఒక విధానముపై నియమింపబడవలెను. సంయుక్తకేంద్రమంత్రి వర్గము ఏకపక్షసిద్ధాంతముపై ఏర్పాటుచేయుటా, లేక అఖిలపక్షసిద్ధాంతముపై ఏర్పాటుచేయుటా అను విషయము క్లిష్టమైనది. కాని హిందూమహమ్మదీయమనః స్పర్థలు పూర్తిగా రూపుమాయువరకు అఖిలపక్ష ప్రభుత్వ సిద్ధాంతము ననుసరించుట అవసరమని నా అభిప్రాయము. చివరవిషయ మేమన, ముందు ఏర్పడబోవు రాజకీయప్రణాళికయందు సమిష్టి ఎన్నిక పద్ధతి (joint electorates) ని ప్రవేశపెట్టి 15 లేక 20 సంవత్సరములు వాటి ప్రకారము ఎన్నికలను జరుపుటకూడ హిందూ ముస్లిమ్ సమస్యాపరిష్కారమున కొక ముఖ్య మార్గమని చెప్పవలసి యున్నది.

ఇక్కడ సూచించినవి క్లుప్తమైన సూచనలు. కాని వీటిని ప్రధానముగా నుంచుకొని భావిభారతీయ రాజ్య ప్రణాళికను తయారుచేయుటకు పూనుకొనినచో అన్ని విధముల లాభకరముగా నుండును. జిన్నాగారును, ముస్లిమ్‌లీగ్ కక్షవారును వాటిని ఆమోదించి వాటి ననుసరించి కార్యక్రమము జరుగుట కంగీకరింతురా అనునది ముఖ్యప్రశ్నయే. కాని కాంగ్రెస్‌సంస్థయు మహాత్మాగాంధీగారును కేవలము జిన్నాగారిని సముదాయించి మంచిచేసుకొనుటకు మాత్రమే ఆతురత చూపకపోయిన కొంతకాలములో ఆయన చేతులు కట్టుకొని ససేమిరా యని కూర్చుండు పద్ధతిపై లీగుకక్షులో చేరిన మహమ్మదీయులకే నిరాశ, వెగటుపుట్టుట కవకాశములు కలవనుటకు కావలసినన్ని నిదర్శనములు కలవు.

---



# అశ్వశాస్త్ర అతిశయము

యిప్పుడు విలక్షణములగు విచారణీయమైన రత్నగజాదిశాస్త్రము లనేకములుండగా అశ్వశాస్త్రవిచారణమునకు అతిశయ మేమంటే—

సృష్టికాలమందు విరాట్పురుషునివలన చతుర్వేదసృష్ట్యనంతరమందు శ్వేతములైన గవాదిసృష్టికిముందు అశ్వములు పుట్టినవను శ్రుతిప్రసిద్ధిచేత నున్ను, భగవంతుడు అశ్వముఖుడై హయగ్రీవ అవతార మొనరించి బ్రహ్మకు వేదోపదేశముచేసినాడను పురాణ ప్రసిద్ధిచేతనున్ను, పునః బ్రహ్మయొక్క ముఖ ఆనందబాష్పముల వల్లనున్ను, అటువెనుక అతని నాభియందలి జఠరాగ్నివల్లనున్ను, అటు తర్వాత అమృతమథనకాలమందు క్షీరసముద్రము వల్లను జనియించినవని అశ్వశాస్త్ర ప్రథమమందు ప్రతిపాదించుటచేతను, పునః భగవంతుడు పాదచారుడై సముద్రుని మర్యాదలో నిలిపి మర్త్యలోక సంరక్షణచేయుటవల్లనున్ను, అశ్వసంభవులైన అశ్వినీదేవతలు దివ్యౌషధకర్తలై మర్త్యలోకము సంరక్షణచేయుటవల్లను, అశ్వమేధ క్రతువులో ప్రసిద్ధయాగవిశేషవినియోగము కలిగి పావనములై స్వపోషకులైన విశేషజనులకును పోషణములై సకలాభీష్టితమున్ను, సుగతినిన్ని యిచ్చి శ్రీకరములవుటవల్లనున్ను ఏతల్లక్షణశాస్త్ర విచారణము లక్ష్మీకటాక్ష కారణమని శాలిహోత్ర మహాఋషి అశ్వశాస్త్రము రచియించెను.



తమ రెక్కలు పోయినందుకు దుఃఖించే గుర్రాలను శాలిహోత్రుడు ఓదార్చడం.

## నామకరణ విశేషములు

సృష్టికాలమందు బ్రహ్మయొక్క ఆనంద బాష్పములవల్ల పుట్టినవి కాబట్టి వక్త్రసంబంధములని ప్రసిద్ధములైన తురగములు తిరిగి బ్రహ్మ యొక్క నాభియందు జఠరాగ్నివలన సంభవించినవి కాబట్టి అగ్నిసంభవములని ప్రసిద్ధములైనవి. పునః దేవతలచేతనున్ను, రాక్షసులచేతను అన్యోన్యముగా కలిసి మథించిన క్షీరసముద్రమందు పుట్టినవి కాబట్టి అమృతసంభవములని ప్రసిద్ధములైనవి. మరిన్ని ఒక కారణమువలన అశ్వములు తృణలబ్ధస్వరూపములు కాబట్టి తృణాహారము లనుభవించేటట్టు తృణాహారసంభవములని ప్రసిద్ధిపొందినవాయెను.

# గుర్రాల సహజస్థితి



రెక్కలూ, ఆకాశసంచారమూ ఇంకా పోలేదు, ఈస్థితిలోనే దేవేంద్రుని కన్నెర్ర అయింది.



దేవేంద్రుని ప్రార్థనమీద, శాలిహోత్ర మహాముని గుర్రాల రెక్కలు ఛేదించడం.

## ఉన్న రెక్కలు ఊడినవిధము

పూర్వకాలమందు గుఱ్ఱములు రెక్కలతోకూడ ఉత్పత్తి అయి ఆకాశసంచారముకలిగి, గంధర్వులకు సమస్తములైన ఇష్టములు ఇస్తూ వుండెను. అటువంటి బలముకలిగి వహించడానికి ఉచితములైన అశ్వము లను దేవేంద్రుడు చూచి సమీపవర్తి అయివుండిన శాలిహోత్ర మహామునీ శ్వరుని చూచినవాడాయెను.

(చూచినవాడై) "ఓ మహాత్ముడవైన శాలిహోత్రమహామునీశ్వరా! తమకు మూడులోకములయందు అశక్యమైన వస్తువ కనపడలేదు. ఇప్పుడు చెప్పబొయ్యే అశ్వముల పక్షచ్ఛేదముచేసి యుద్ధములకు వాహనములయ్యే పట్టుగా, అందువల్లన నేను శత్రువులైన రాక్షసులను జయించి త్రిభువన సామ్రాజ్యపూజితుడనయ్యేలాగున అనుగ్రహించవలయు"నని శాలిహోత్ర మహామునీశ్వరుణ్ణి ప్రార్థించినవాడాయెను.

శాలిహోత్రమహాముని 'ఇషీక' అనే అస్త్రమును ప్రయోగముచేసి దేవేంద్రుని ప్రార్థన ప్రకారముగా అశ్వములయొక్క రెక్కలు ఛేదించిన వాడాయెను. అ కాలమందు బ్రహ్మదేవునికి బ్రహ్మమానముచేత ఇరవై నాలుగో సంవత్సరము నడుస్తూవుండగా అశ్వములయొక్క రెక్కలు శాలిహోత్రమహామునీశ్వరుడు ఛేదించినవాడాయెను.

(ఇట్లు) శాలిహోత్రమహామునిచేత కొట్టబడిన పక్షములు కలవై దైన్యముచేతను, దుఃఖముచేతను, దేహమంత రక్తముచేతను కూడు కొన్నవై శాలిహోత్రమహామునీశ్వరుణ్ని చూచి అశ్వములు (ఈ రీతిగా) పలికినవాయెను :

"ఓ భగవంతుడవైన శాలిహోత్రమహామునీ! ఏమి నిత్తముచేత మా పక్షచ్ఛేదముచేస్తిరి? లోకములో సజ్జనులైనవారు అపరాధముచేయని వారలకు ఈలాటి ఉపద్రవములు చేయతలచరు. కాబట్టి మాకు దిక్కు తామేను. మాకు సర్వదా సౌఖ్యము (ఏలాగున) కలిగివుండునో అది కోరి వున్నాము."

(అంతట) శాలిహోత్ర మహామునీశ్వరుడు అత్యంతదయకలిగిన వాడై, దుఃఖించుచున్న అశ్వములను చూచి "ఓ అశ్వములారా! దేవేం ద్రుని ప్రార్థనవల్లను (మీకు) సమస్త దుఃఖములను కలగచేసితిని. కాబట్టి మీకు ఈ మూడులోకములయందు సుఖము కలిగి పూజ్యత కలిగివుండే లాగున అనుగ్రహిస్తున్నాను. సూర్యచంద్రాదులకున్ను, భూపతులైన రాజుల కున్ను వాహనములై విశేషగౌరవముగలిగి, లోకములో ఏ రాజు మీకు సర్వదా ఘాసపానాదులయందు తృప్తికలగచేయుచున్నాడో ఆ రాజు యుద్ధ మునందు శత్రుజయముకలిగి భూమినిన్ని, లక్ష్మినిన్ని క్షణమైనావిడువడు. ఆ రాజు గుణహీనుడై గొప్ప శత్రువుచే చిక్కబడివుండినా లక్ష్మీకటా క్షానికి పాత్రుడై, సుఖియైవుండును. ఇదిగాక సమస్తరోగశాంతికలిగి ఆరో గ్యము కలిగేలాగున, జనులకు మీ వల్లను ఆనందము కలిగేలాగున మీరు చేయం"డని ఆజ్ఞాపించినవా డాయెను.



ఆజానేయం

అనేక శుభలక్షణాలు గలవి ఇవి. ఆయుధాల దెబ్బలు తగిలి, పేగులు బయటికి వచ్చినా, మృత్యువు ఆవహించినా, యోధుడు తమ మీద ఉన్నంతకాలం తమ ప్రాణాలను నిలుపుకోగల విశేషం గలదిట ఈజాతి.

ఎప్పుడు తృణోదరోత్పన్నములై ఉన్నత మురైన అశ్వసంఘములు దిక్కులను విదిక్కు లను, పురములను పర్వతములను అంతటాదాటి నవై కోపమువల్లను వనమధ్యములయందు ఉం డినవాయెనో అప్పుడు కోపానుగ్రహకారకుడై, ఋషీశ్వరులలోకి శ్రేష్ఠుడై శాలిహోత్రుడని ప్రసిద్ధుడైన ఈఋషీశ్వరుడు అశ్వములకోపాప రాధమువల్లను ఉత్పన్నరోషము కలవాడై శైవ శాస్త్రార్థతత్వ నిష్ఠుడై శివుని అనుగ్రహమువల్లను అశ్వహృదయాభిజ్ఞుడాయెను. తర్వాత ఆ శాలి హోత్ర ఋషిచేతను వయోబలముచేత కూడుకొని వుండే సమస్తాశ్వములున్ను శిక్షావిశేషములను నేర్పబడినవై యథాయోగ్యముగ పాలితములై శాలిహోత్రఋషికి స్వాధీనములాయెను.

### యుద్ధానికి సహాయము

ఒకానొక కాలమందు దేవతలున్ను, రాక్షసులున్ను యుద్ధము ప్రసక్తమాయెను. సమస్తదేవతలు రాక్షసజయాపేక్షులై అశ్వము లను గ్రహించేటందుకొరకై కిరీటములను ధరించి (వెళ్లి) శాలిహోత్రమహర్షిని పొందినవారైరి. "కృపావంతుడవైన ఓయి శాలిహోత్రమహర్షి! ఇప్పుడు మమ్ము రక్షించు"మని తమ ఉపచారోక్తుల వల్ల శాలిహోత్రుని స్తుతిచేసిరి. ఆ దేవతలస్తుతి చేత సంతుష్టుడైన శాలిహోత్రమహర్షి ఆ దేవ తలకు ఉత్తములైన అశ్వములను ఇచ్చెను. ఆశాలిహోత్రునిచేత అనుజ్ఞాతులై దేవతలు అశ్వ ములనే వాహనములుగా జేసికొని రాక్షససం హారాపేక్షులై యుద్ధముకొరకు ఎదురుగాపోయి జయించిరి. అది మొదలుకొని వాహము లని అశ్వములు శ్రేష్ఠమయిన ఖ్యాతినిపొందినవాయెను.

# త్యాగరాజు మొదలి

## మహాభారతము తెలుఁగున రచించిన ప్రసిద్ధశుద్ధ ద్రవిడకవి

**(1833 - 1879)**

= శ్రీ నిడుదవోలు వేంకటరావు =

సంస్కృతాంధ్ర భారతములనే, గాక ద్రవిడ (కర్ణాట) జైమినీ భారతాదులలోని కథలను సంగ్రహించి మహాభారతము నధునాతనకాలమున రచించిన కవులలో త్యాగరాజమొదలి యగ్రగణ్యుడు- ఈతఁడు జన్మముచే శుద్ధద్రవిడుఁడు - నారాయణ మొదలియారు నకును, జానకమ్మాళునకు క్రీ. శ. ౧౮33 ఆగస్టు ౧౯ వ తేదిని (శా. శ. ౧౭౫౫. విజయ సంవత్సర శ్రావణ శు. నవమినాడు) జన్మించెను. ఈతఁడు నాల్గేండ్ల నాఁటి నుండి తెలుఁగు సంస్కృతముల నభ్యసించి బాల్యము ననే ఆంధ్రమున కవితను సాగించెను. ఈతఁడు వయసు వచ్చునాఁటికి ద్రవిడాంధ్ర కర్ణాటాంగ్లేయ మహారాష్ట్రి భాషలయందు పాండిత్యము గలవాఁడై, చిత్రలేఖనము, వైద్యము, వ్యవసాయము మున్నగు విషయములం దారి తేరినవాఁడు. తొలుత న్యాయవాదియై, యావెనుక నింజనీయరింగు శాఖలోఁ బ్రవేశించి సర్ సాలార్ జంగు బహద్దరుగారి కాలమున హైదరాబాదులో నింజనీయరుగా నుండి రాజభాషయగు ఉర్దూయందు పరిచితి లేకపోయినను తన నియుక్తకార్యములను మహా దీక్షతో నిర్వహించి, విరామము లేని యుద్యోగమున సైతము తీరిక గల్పించుకొని ద్రవిడాంధ్ర సంస్కృత ములయందు గ్రంథములను రచించి క్రీ. శ. ౧౮౭౯ జూన్ 3-వ తేదీని కీర్తిశేషుఁ డయ్యెను.

ఈతని కృతులు ౧. కైవల్యహైయంగవీనము ౨. కౌముదీప్రచారము, 3. సుబ్రహ్మణ్య విజయము, ౪. కందర్ప దర్పదర్పణము, ౫. స్కందనందన కంద శము, ౬. భాషాయోషాభూషణము, ౭. ప్రమోద ప్రశ్లేషము, ౮. రసనికరసంవాదము, ౯. నైషధానంద లహరి, ౧౦. అశ్వవిలాసము, ౧౧. శివానందలహరి, ౧౨. భువనేశ్వరీ స్తవము, ౧3. శృంగారతరంగరంగము, ౧౪. కుశలకళారత్న రత్నాకరము, ౧౫. పంపాక లంబకము, ౧౬. త్యాగరాజ విజయము, ౧౭. సోమా స్కంద స్తవము, ౧౮. ఆంధ్రలక్షణ కరతలామలకచ్ఛం దోరత్నాకరము, ౧౯. సుగంధి సౌగంధికము, ౨౦. చెన్నపురి డంబికాడంబము, ౨౧. సులక్షణ క్షీరహంసా వతంసము, ౨౨. వ్యవసాయ శాస్త్రము, ౨3. విజయ విజయము, ౨౪. బాహులేయఫలకము, ౨౫. అజశివ సూక్తిమాల అనునవి. ఇందు సుబ్రహ్మణ్య విజయము, భాషాయోషాభూషణము, ఆంధ్రలక్షణ కరతలామలక చ్ఛందోరత్నాకరము, రసనికర సంవాదము మాత్రము ముద్రితములైనవి.

ముద్రితములగు నీతని గ్రంథములఁగూర్చి వివరించెదను. విద్వత్కర్ణామృతమను పేర నీతఁడు రచించిన సుబ్రహ్మణ్యవిజయము అను ప్రబంధము చాల ప్రఖ్యాతి కెక్కినది. దీని యచ్చుప్రతియు నాంధ్ర లక్షణకరతలా మలక చ్ఛందోరత్నాకరమును బ్రిటిషు మ్యూజియము గ్రంథాలయములోఁ గలవు. వాని వివరణము నిచ్చుచున్నాఁడను.

1. Tyagaraja Bhoja ఆంధ్రలక్షణ కరతలామలకమను ఛందోరత్నాకరము Andhra Lakshna karatalama lakamu or Chando - ratnakaramu. A treatise on the metres of Telugu poetry their structure and the associations of ideas supposed to be conveyed by them published by Puvvada Venkata Rau P P ii 29 చెన్నపురి 1856 (Madras 1856) No. 1417425.

2. Tyagaraja Bhoja son of Narayana Mudali శ్రీ సుబ్రహ్మణ్య విజయ మను విద్వత్కర్ణామృతము

Subrahmanya Vijiamu. A poem in 5 aswasas on the legends and cult of the God Subrahmanya P. P 136. చెన్నపురము 1859 (Madras 1859) 14174 K 35.

3. A Telugu essay on the benifits of intellectual Education and on the evil of early Marriage to the Indian weak sex by A Theyagaraja Baoja Moodeliar A. C. C. B. B. etc etc etc

స్త్రీ విద్యాభ్యాస గాంధర్వేతర వివాహ గుణా గుణ బోధకమగుచు శృంగార రసతరంగిణి యనంబుదు సనికరసంవాదము.

> అమృత కవిచక్రవర్తి ప్రత్యగ్ర భోజ
> మూర్తి రసపోషణస్ఫూర్తి భూరికీర్తి
> త్యాగభోగకళాశాలి త్యాగరాజ
> మొదలి యార్రచితము సుధీమోదకరము.

Bellary:—Sri Yekshini Press, Printed & Published by A. Davasikhamony Moodeliar, 1865 Copyright and right of translation of this work are reserved 28 pages.

ఈ కవి తన భారతమును ప్రక్రమపర్వము, ప్రద్వేషపర్వము, ప్రధనపర్వము, ప్రశమనపర్వ మను నాలుగు పర్వములుగా విభజించియున్నాడు. పగునెని మిది పర్వముల విభజన యిది:—

ప్రక్రమపర్వము- ఆది సభాపర్వములు (సభా పర్వ పూర్వార్థము)

ప్రద్వేషపర్వము - సభాపర్వోత్తరార్థ అరణ్య విరాటములు, ఉద్యోగపర్వ పూర్వార్థము.

ప్రధనపర్వము — ఉద్యోగ ఉత్తరార్థ భీష్మ ద్రోణ కర్ణశల్య సౌప్తికములు.

ప్రశమనపర్వము — స్త్రీ, శాంతి, అనుశాస నిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణములు.

ఈకవి కడపటి రెండు పర్వము లితఁడు రచిం చనే లేదని దెలియుచున్నది.

తన భారత గ్రంథరచనాపద్ధతిని గ్రంథసూచికయం దిట్లు తెలిపియున్నాడు.

"ఇక్ష్వాకువంశము సంస్కృతాంధ్రభారతములలో నుండు సర్వకథలను, ద్రవిడజైమినీభారతాదులలో నుండు నితరకథలను కలిగియున్నది. పాండవులతో సంబంధపడిన ముఖ్యకథలు విరివిగను, సందర్భానుసరణిచే వచ్చు నితరకథలను సంగ్రహముగను రచించి కావ్య సంపద బొంపిరివోనిలాగునను, గీర్వాణాంధ్రచ్ఛందో వృత్తజాతు లెల్ల చెల్లిపడియులాగునను నందందు పొందు పఱుపఁబడియున్నయది. కావున నిది పండితమండలి నుండ నవశ్య యుక్తమని నమ్మఁబడినది."

మఱియు.

"భారతమునం దాదిపర్వములో చంద్రవంశ్యు లగు రాజుల వంశానుక్రమణిక నిక్ష్వాకువంశమునందు జెప్పఁబూనుట వృథా పెరిపియగుటగాక పరిష్కార ముగఁ జేటుపడుగాన సుపథమగులాగున చంద్రవంశ క్రమమును, వృక్షరూపముగా చిత్రగతి నేర్పఱచిన పటంబీ గ్రంథాంతమునఁ జేర్పఁబడియుండును. దానిచే వంశములు తరతరములు నెఱుంగగలరు. భీష్మపర్వము నందలి భూగోళవివరణములును నిలాగే చిత్రింపఁబడి యుండియుండెడిది."

అనియుఁ దెలిపినవాఁడు. ఇందు సభాపర్వము నుండి కొన్ని పద్యము లుదాహరించుచున్నాఁడను. ఇవి గ్రంథాలయసర్వస్వపత్రిక (౧౯౧౭) నుండి యుద్ధ రింపఁబడినవి.

సభాపర్వమునుండి కొన్ని పద్యములు:—

> సీ. దుర్యోధనాభిఖ్య దుర్యోధనాకాంతి సర్వంసహాభర్త సవనకర్త
> గాంధారవర్యరాగాంధారవృడుఁ పాపవర్తకుండు క్రతుప్రవర్తకుండు
> కర్ణదుశ్శాసనకర్ణదుశ్చేష్టత్వ భాజనంబులు తత్సభాజనములు
> ధర్మరాజాభిఖ్య ధర్మరాజద్భాగ్య విక్రమంబు ఘనాహవక్రమంబు
>
> గీ. ఈర్ష్యహుతవహుఁడును రాగహర్ష మొప్ప-రాజసూయంబునకు ధార్తరాష్ట్రు లెదురు
> జన్న మొనరింపఁ బూని ప్రచ్ఛన్నవృత్తి-మంత్రకూట మొనర్చి యా మనుజవిభుఁడు.

ఉ. కుండకులైన పాండవులు, గూడి సుఖంబొనరించి పిల్చినన్
బండుగుఁగూడ నందఱును బంధువులై చనియుండ విభ్రమం
బండిన నన్నుగాంచిహృదయంబున గౌరవ మింతలేక యా
మిండలమారి నవ్వె తన, మిండని యండను కండగండునన్.

సీ. సరసరమాస్ఫూర్తి జాఱఁగా ముఖకంజ సుఖరంజనలు నాఁడె చూఱలయ్యె
ప్రతిమానుభావంబు బడలఁగా మతిచక్ర గతిచక్రములు నాఁడె గతుకుఁగాంచె
నిబిడతేజస్ఫూర్తి నీల్గఁగా ఘనపర్వ దినగర్వములు నాఁడె కినుకఁబాఱె
నిక్షిప్రవిభవంబు నీరసంబుగ రాజ్య ఖగపూజ్యగతి నాఁడె యగడుఁజెందె
మామ యాలేమ యుత్సాహధామచండ- మామనభిమోహములర నిభరామలీల
సాంద్రతరహాసనిస్తంద్ర చంద్రికాప్ర- సారమక్కట నామెపైఁ గూరినంత.

చ. బికిరము మేమొసంగఁగొని బీరముతో నొక గ్రుడ్డిపాటుదై
వికమున మించి గర్వమున వీఁగెద రందఱు వారి భాగ్యమున్
సుకరముగా హరించి పెను సొంపులవారల నేలకున్న నే
నిక ధర నుండ మేను బలి యిచ్చెద యీ యవమానవహ్నికిన్.

చ. గురుతరశౌర్యముల్ సహజ కుండలవర్ణము నొప్ప కర్ణుఁడున్
నిరుపమసారమాయలకు నీరధియై తగు నీవు నుండ నే
స్ఫురదవమానపంకమున మున్గుట చెల్లునె మామ ప్రీతి నన్
బరువడిఁ గ్రుచ్చి పాండవుల భాగ్యము గైకొని యిచ్చి కావవే.

క. అన విని కొండొకతనమున- మునను విచారించి రోగపూరితునకు వేఁ
డిన భక్ష్యముల నొసంగుట- లన రారాజు గని శకుని యపు డిట్లనియెన్.

సీ. నిల్చిపుట్టుట సారె గెల్చికొట్టుట లును కాయ్వులు చతురంగగణము గాఁగ
జోడుగట్టుట హాయల్ వీడి ముట్టుట లాది వర్తనల్ వ్యూహకల్పనలు గాఁగ
నడ్డుపెట్టుట మేటి యొడ్డుమెట్టుట లాది యాక్రమంబులు విక్రమాప్తిగాఁగ
చేరఁబట్టుట పందె మూరఁబెట్టుట మెప్పు సారెలగతి శస్త్రశక్తి గాఁగ
క్రొవ్వునను చిఱునవ్వులు రువ్వుకొనుచు- నాతతద్యూతరణమునఁ జేతనేత
ర ప్రబలబలములఁ గొని రాజరాజ!-పొలచి నీదాయ సర్వంబు గెలిచియిత్తు.

ఉ. అంగద నిట్టి దైన్యరస మానఁగ నేటికి రాజరాజ! సా
రంగతురంగముఖ్యచతురంగము లక్కఱలేక లీల దా
యంగర మొప్ప ద్యూతచతురంగసురంగమునందుఁ దాకి స
ర్వాంగములన్ హరించెదఁద రంగనతో ననుజాళితోడుతన్.

ఉ. గౌరవ మొప్ప నొక్క మణి కాంచనపూర్ణవిచిత్రసత్సభా
గారముఁ గట్టి పాండవులఁ గ్రక్కున తత్సభఁ జూడ బిల్వుమా
సారసమిత్రపౌత్రుఁ డని శంబును ద్యూతము కోరు, వాని నే
నేరుపు మీఱఁ దెచ్చి ధరణిన్ తరుణిన్ నృప! నీకొసంగెదన్.

క. అన విని దరహాసం బా-ననసీమను మొలకలెత్త నసహిష్ణుత్వో
ద్యనుభావములు పెనంగగ- నిన సుతుఁ డిట్లనియె నమ్మహీపాలునితోన్.

చ. అహరహ మిట్టి వంచనల నార్యులఁ దూరఁగఁ జేసి లోకదు
స్సహులయి కార్యసాధన మొసంగమిఁ గాంచియు వెండియు న్మహో
మహులగు పాండునందనుల మార్కొని గెల్వక జూదమాడుటల్
విహితము గాదుపో శకుని భీరు వెఱుంగదు వీరకృత్యమున్.

ఉ. పక్కన నొక్క కోలఁ గొని పాండవముండములట్టె చెండి పే
రుక్కున నిక్కి వారి రమయున్ క్షమయున్ నిను జేర్చు కర్ణుడ
రక్కసిచక్కి చూడక ధరాజనముల్ నగ జూదమాడున
మ్మక్కల! యెక్కసక్కెముల నాడుట మాన్యమె శూరకృత్యమే.

క. అన విని యాగ్రహమున క-ర్ణుని నిలునిలు మని యదల్చి రోజుచు దుర్యో
ధను జూచి శకుని యపు డిట్లను నందలి దుష్టనివహ మానౌననఁగన్.

ఉ. భీరము లీరసంబుగన ప్రేలెడి కర్ణుఁడు బాటుపోలె మున్
వారలు మీరు నా ద్రుపదుఁ బట్టఁగఁబోయిన నాఁడు ద్రౌపదిన్
వారలు బొంద నోర్వమిని వారి నెదిర్చిననాఁడు జూఁపఁగా
నేరడె ధర్మకౌశలము నిక్కపు సాహసశక్తు లుండినన్.

ఉ. ధర్మముతోడఁ బ్రీతిమెయి ధర్మముఖుల్ పితలౌట వారిబల్
ధర్మములందు నిల్చి సతతంబు జయంబుల నీన చావకన్
మర్మము లూడ దూలక నమర్త్యపురంబును జేరకన్ ద్విష
ద్ధర్మముఁ జూపువారు వసుధాస్థలి లేమి నిజంబు భూవరా.

గీ. దండి గాండీవిచండకోదండ మొలుకు-కాండములు శూలచక్రోరుదండములును
నిలుపఁజాలునె వైచునే నిలువుటడ్డ-సారె లేగాక నిజముగా సార్వభౌమ.

సీ. వైశ్వానరానన ప్రభ వైరిపతిఁ గాల్చు జుమోము లన నాకుఁ బ్రతిభలిచ్చు
హరివక్త్రములు నాఁగ నరిధర్మ తి నొంచుసుహాముఖగతి నాకుఁ గూర్చు శక్తి
రావణాస్యములు నా రహ దాయసొమ్మందు నిధుల నెల్లను నాకు నిత్యమొసఁగు
దిగ్దంతు లనఁగ నెదిరిహృదబ్జములార్చుదిననాథు లన నాకుఁ దేజమిచ్చు

గీ. వారినిధు లన పరభాగ్యవాహులను - లాగికొను గిరులన నన్ను లావుమెఱయ
విజయమున సుస్థిరునిఁ జేయుఁ బెక్కుమూర్తు - లలర నాచేతి సారెలో యులుకు రాగ.

చ. అన విని దుస్ససేనుఁ డను నన్న! దురంబు బలారినాశనం
బానరఁగఁ జేయు విగ్రహ మయోగ్యము సామముఖంబు లొప్పుచో
పనుపడ మామ పల్కినటు పాండవులం గెలువంగఁగూడుగా
క ననికిఁ దారసించుటలు గాదు సుసాధ్యమె? యుద్ధ మిత్తఱిన్.

గీ. అనుఁడు దుర్యోధనుండు సాధ్యమగు కార్య-మిదియ యని నిశ్చయించి తారెల్ల వారు
తండ్రి కౌఱిగించువారలై తఱచి యంతి-పురమునం దావిభునిఁ గాంచి మ్రొక్కునపుడు.

చ. శకుని, మహీశ! నీసుతుని సామజసామ్యతనూవిలాసమం
తకభవు యష్టి చూచిన దినంబున నుండి కృశించియుండుటన్
సుకరములన్ స్పృశించి యిటు చూడు మనన్ ధృతరాష్ట్రుఁ డాత్మజాం
గకములఁ బట్టి చూచి యనుకంపఁ గలంగుచుఁ బుత్త్రుఁ దోసనున్.

ఉ. నందనరత్నమా! యిటు మనంబు కలంగి కృశాంగుఁ డౌచు వి
న్నందన మూన నేల నరనాథులలో నిను బోలి ప్రాభవా
నందనయార్థభోగకలనన్ గలవారలు లేమిఁగాక నా
నందనకల్పకాఢ్యుఁ డయినన్ సరిగాఁడు కతంబుఁ దెల్పుమా.

చ. అనుఁడు సుయోధనుండు వినయంబున నిట్లను నయ్య! తృప్తుఁడౌ
జనపతి నష్టుఁడౌ ననుచుఁ జాటఁడె దేవగురుండు ధారుణీ
శున కిల దాయపెంపు పడఁజూచుట మేనునఁ గండఁ జెండులా
గనుట నెఱుంగవే యినభవాత్మజు పెంపు సహింపఁ జెల్లునే

సీ. నవనిధుల్ గల నరనాథు లేనని జేరి రాజశేఖరులు మిత్రత ఘటింప
సురభిసంతానముల్ నెఱయ గోపతియంచు మొనసి యుపేంద్రుండు పనివినంగ
నిరుపమవాహినీశ్వరసేవితుడటంచు భువనముల్ తన పన్ను పూనిసేయ
పరమపావనుఁడయి ప్రబలెడి బలుఁడంచు తనచే ధనంజయోద్ధతులు వెలయ
భవ్యతేజంబు సత్కళావళి శుచిత్వ - పూర్తి నుగ్రాంబకస్ఫూర్తి పొలుపుఁగాంచు
ధర్మభవలోకపాలకోత్తముని యెదుట - నోపు ఖద్యోతు ప్రోల ఖద్యోతమైతి.

సీ. రాజసూయాత్తసామ్రాజ్యసింహాసన ఖచితరత్నంబు లేకడ వెలుంగ
సాత్యకికరధృతోజ్జ్వలమౌక్తికచ్ఛత్రదీధితిప్రతతిచంద్రికల నీన
భీమార్జునావర్తితామలచామరక్రమము వసంతవాతముల నింప
శౌరిమాద్రేయదుష్టద్యుమ్నవినతభూభృన్మౌళిరుచులు నీరెండగాయ
అసమవైభవసాంద్రుఁడై యమసుతుండు - నిండుకొలువున విన్ననై నిలుచు నన్ను
కృష్ణకృష్ణానుజులు కృష్ణకృష్ణభీమ - ముఖులు గని నవ్వ నవమానమున మునింగి.

ఉ. అంగము రోసియుండియు సభాంగణముం గనఁబోయినప్పు డ
దంగద యెందులేని మణులయ్యా! ననున్ బెను వెఱ్ఱిఁ జేయ నే
భంగపడంగ నన్నుఁ గని పక్కున నవ్వెను భీముఁ గూడి మై
పొంగఁగ నేవురం గవయు భోగిని గౌరవ మెంచి కొంకకన్.

ఉ. దాయల కీర్తియున్ సురనుతంబగు భాగ్యము లెండలై సభన్
దాయలకైన వారి పెను నవ్వులు దావశిఖాళియై కడున్
హేయపుఁ దొత్తు కేలఁ గొను టెంతయు దుర్దినవర్షమైన భూ
నాయకమానవల్లిక వినమ్రత వెండియుఁ గాలి రూపఱెన్.

గీ. వసుచయంబు నిచ్చి ప్రాణంబు ప్రాణంబు-నిచ్చి మానమును మహీశ గావ
వలయుగాన మానవిలయమై మఱి-నేలఁగొనక యున్న ప్రాణ మనుపఁదగునె.

క. కావున సుధర్మవిభవము - చేవన్ గొనరామి శకునిచే ద్యూతమునన్
కైవసమొనర్చి వారల - సేవలకున్ జొనుపకున్న జీవము నొల్లన్.

క. సెలవిమ్మని యేడ్చుచు నల-జలిబడి పలవించు సుతుని సంభ్రమమునఁ గౌఁ
గిలి నుంచి యాంబికేయుఁడు-తులువల వలఁ జిక్కి భీతితో నిట్లనియెన్.

ఉ. జూదము ఖేదమున్ బెనిచి సుస్థిరధర్మము నొంచి పిమ్మటన్
వాదము భేదముం గలుగఁ బార్థుల ధర్మము వంచి నీమహా
హ్లాదము మోదముం జెరుపునట్టులఁ బుత్రకళత్రరోదనో
న్మాదము నాదమున్ బలధనక్షయమున్ ఘటియింపకుండునే

చ. వలసిన నీవు దిగ్విజయవైభవమున్ గనిధీరవృత్తి న
వ్వలసిరిఁ గూర్చి చేయు మొక భవ్యమఖంబు సుఖంబుగాఁగఁ గే
వలసితపక్షచంద్రు గతి భవ్యయశంబుఁ జెలంగఁ జిన్నిత్రో
వల శివమెత్తినట్లరుగవచ్చును జిచ్చును హెచ్చు పుచ్చగన్.



# యుద్ధానంతర ★ ★ 

# ★ గ్రామపునర్నిర్మాణము

= శ్రీ రావుసాహెబ్ గోటేటి జోగిరాజు =

## I గ్రామపునర్నిర్మాణ ముఖ్యసూత్రము

ప్రస్తుత ప్రపంచ మహాసంగ్రామానంతరము ప్రజలు మరల కుదురుపడి సుఖజీవనము చేయుటకు ఆయా దేశములందు జరుపబడవలసిన ఆర్థిక, సాంఘికాది విషయములకు సంబంధించిన యేర్పాట్లను గురించి యోచనలు కొంతకాలము క్రిందటనే ప్రారంభ మయినవి. మనప్రభుత్వము అఖిలభారత దేశమునకును, ఆయా రాష్ట్రములకును సంబంధించిన యుద్ధానంతర పునర్నిర్మాణ ప్రణాళికలను తయారుచేయించి వివరములను అప్పుడప్పుడు ప్రకటించుచున్నది. బొంబాయిలోని కొందరు ప్రసిద్ధవ్యాపారస్థులు ప్రత్యేకముగ మరియొక ప్రణాళికను తయారుచేసి ప్రకటించియుండిరి. కార్మికసంఘమువారు "ప్రజాప్రణాళిక" యను పేర మరియొకదానిని తయారుచేసిరి. ఇవి మూడునుగాక, గాంధీమహాత్ముని ఆదేశానుసారము ప్రొఫెసర్ అగర్వాలాగారు మరియొక ప్రణాళికను ప్రకటించియుండిరి. ఈ ప్రణాళికలను గురించిన విమర్శ లిదివరలో ఆంధ్రదినపత్రికలయందు చదువరులు గమనించియేయుందురు.

భరతఖండమునందలి ప్రజలలో నూటికి తొంబదిమంది గ్రామసీమలందే నివసించుచుండుటచే ఏ ప్రణాళికయందైనను గ్రామ పునర్నిర్మాణమునకే హెచ్చు ప్రాముఖ్యత నిచ్చుట యవసరము. మరియు నిర్మాణకార్యక్రమము గ్రామమునే మూలముగ గైకొని వెలుపలికి వ్యాపింపబడజేయవలెను. కాని, పైని ప్రారంభింపబడి గ్రామమునకు దింపబడరాదు. కావున గ్రామ పునర్నిర్మాణమునకు స్థావమైన విధాన మేర్పరుపబడి దాని ననుసరించి ఏ గ్రామమున కాగ్రామమునకు ప్రత్యేకప్రణాళిక తయారు చేయబడవలసి యుండును. అట్టి గ్రామపునర్నిర్మాణ ప్రణాళికలను తయారుచేయు విధానమును సూచించుటయే యీ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

గ్రామపునర్నిర్మాణమున గమనింపవలసిన ముఖ్యసూత్రము స్వయంసమృద్ధత అనగా సాధ్యమయినంతవరకు ఏ గ్రామమున కాగ్రామము అందలి ప్రజల జీవితమున కవసరమగు ఆహారాదికముల యుత్పత్తి, విద్య, వైద్యసహాయము మొదలగు ప్రజావసరముల విషయమున పరాధీనత లేకుండనుండుట ఏప్రదేశమునగాని ప్రతి గ్రామమును ఏవిషయమునందయినను, స్వయం సమృద్ధముగ జేయబడుటకు పరిస్థితులు వీలుగ లేనిచో ఆ ప్రాంతపు గ్రామములు సాధ్యమయినంతవరకు ఒకదాని లోట్ల నొకటి తీర్చుకొని మొత్తముమీద నా ప్రాంత (ఫిర్కా) మంతయు జేరియైనను స్వయం సమృద్ధముగ నుండునట్లు గావింపబడదగును. ఇదియు వీలుపడని పరిస్థితులలో సాధ్యమైనంతవరకు ఏ తాలూకా కాతాలూకాయును, ఏజిల్లా కాజిల్లాయును ఏ రాష్ట్రమున కారాష్ట్రమును మొత్తముమీద దేశమంతయును స్వయంసమృద్ధముగ నగునట్లు యత్నింపబడవలసి యుండును.

వ్యవసాయ విషయమున నీ స్వయం సమృద్ధ విధానము నవలంబించుచో, గరిష్ఠోత్పత్తికి వీలుపడదనియు, ఏ ప్రదేశమున నే దినుసు సులభముగ నుత్పత్తియగునో అచట దానినే విరివిగ బండించుచు దాని వెగుమతిచేసి విక్రయించి ఆ ప్రాంతమునకు వలయు నితర వస్తువులను దిగుమతిచేసు కొనుచుండవలె ననియు కొంద రార్థికవేత్తల యభిప్రాయము. స్వయం సమృద్ధ విధానమునందైనను ఎగుమతి దిగుమతులకు నిషేధము లేదు. సామాన్య ప్రజావసరముల సరఫరా యిట్టి యెగుమతి దిగుమతుల విధానముపైననే ఆధారపడి యుండకుండుటయే యీ విధానపు టుద్దేశము. అసలే ఉత్పత్తి చేయుటకు వీలు లేనట్టిగాని, మిగుల స్వల్పముగ నుత్పత్తి యగునట్టిగాని దినుసులను తప్పక ఏ గ్రామమున కాగ్రామముననే పండించి తీరవలె ననుట యీ విధానపు టుద్దేశము కాదు. ఎంతటి సమర్థతతో నడుపబడు ప్రభుత్వమైనను సరకుల యెగుమతి దిగుమతులను, ధరవరలను సర్వకాల సర్వావస్థలందును తగినంత నిపుణతతో శాసించి ప్రజల కిబ్బంది లేకుండ నడుచునట్లు చూచుట దుర్లభమని ప్రస్తుత పరిస్థితులు తెలుపుచున్నవి. కావున నూటికి తొంబదిమంది గ్రామసీమలందే నివసించు భరతఖండమున ప్రజావసరముల సరఫరా యెగు

మతిదిగుమతివిధానముపైననే యాధారపడియుండుట క్షేమము కాదు. కావున నుత్పత్తి కొంచెము తక్కువైనను అది ఆయాప్రాంతముల యవసరములకు సరిపోవునట్లు చేసికొనగలుగునంతవరకు స్వయం సమృద్ధవిధానమే ప్రజల జీవితమునకు స్థాయిత్వము గలుగజేయుట కొక్కవగ తోడ్పడు ననుటకు సందేహము లేదు.

ఈ స్వయంపోషక సిద్ధాంతము వ్యవసాయమునకువలెనే చేతి పరిశ్రమలకును వర్తింపజేయదగును. గ్రామప్రజలకు వలయు బియ్యపు దంపుగుడ్డల నేత, పాత్రలు తయారుచేయుట మొదలగు పను లన్నియు గ్రామమునందే జరుగుట శ్రేయము. ఇట్టి సామాన్యావసరములను యంత్రసహాయమున సులభముగను,చౌకగను తయారుచేయుచున్నంత వరకు జనసంఖ్య హెచ్చుగ గల భరతఖండమువంటి దేశములో ఎన్ని క్రొత్తయంత్ర పరిశ్రమలను కల్పించినను నిరుద్యోగ సమస్య పరిష్కారముకాదు. కావున చేతిపరిశ్రమలవలన తయారుచేసికొన వీలగు వస్తువుల నన్నిటిని సాధ్యమయినంతవరకు గ్రామములందే తయారుచేసికొనుచు, అట్లు తయారుచేసికొన వీలులేని దేశావసరములనే అనగా రైలుబండ్లు, మోటార్లు, విమానములు మొదలగువాని నిర్మాణమును, ఇనుము, ఉక్కు మొదలగు లోహముల యుత్పత్తియు మాత్రమే కేంద్ర యంత్ర పరిశ్రమలుగ జరిపించుట యుచితము. ఇట్లు చేతి పరిశ్రమలవలన తయారుకాదగిన వస్తువులకును, యంత్రపరిశ్రమల వలన కాదగిన వస్తువులకును నిర్ణీతమగు హద్దుల నేర్పరుచుచో ఒక దాని సహాయమున నొకటి యొండొంటితో పోటీ లేకుండ అభివృద్ధిగాంచ వీలగును.

### II గ్రామప్రజల యవసరములు

ప్రజల సౌఖ్యము వారల యైశ్వర్య, ఆరోగ్య, సంస్కృతులపై నాధారపడియుండును. ఐశ్వర్యమున ఆహారద్రవ్యములు ప్రధానములు. వీనితరువాత గుడ్డలు ప్రాముఖ్యతను బడయుచున్నవి. ఆహారమును పచనముచేయుట మొదలగు పనులకు వంటసరుకును, దీపమునకు చమురునుగూడ ఆవశ్యకములు. ఇండ్ల నిర్మాణమునకును, గృహోపకరణములకును, వ్యవసాయమునకుగాని, చేతిపరిశ్రమలకుగాని వలయు పనిముట్లకును కొంత కలపగూడ యావశ్యకము. పూరియిండ్ల కప్పులకు, తాటియాకుగాని యేదేని గడ్డిగాని యవసరము. ఆహారద్రవ్యములలో ఉప్పును, పనిముట్లకును గృహోపకరణములకును వలయు ఇనుము ఇత్తడి మొదలగులోహపు వస్తువులునతప్ప తక్కిన ప్రజావసరము లన్నియు భూమినుండి వ్యవసాయదారు డుత్పన్నముచేయవలసినవే కాని, అట్లుత్పన్నము చేయబడు ముడిద్రవ్యములనుండి గ్రామపారిశ్రామికు లుత్పన్నము చేయదగిన వస్తువులుగాని యైయున్నవి.

గ్రామములం దిట్టి యన్నవస్త్రాది ద్రవ్యైశ్వర్య వృద్ధికి జేయవలసిన యేర్పాట్లు మూడు విధములు:—

1. వ్యవసాయాభివృద్ధి మార్గముల నరయుట, వాని నమలులో పెట్టించుట, స్వయంపోషక విధానమున తీవ్రకృషిని (Intensive of arming) ప్రోత్సహించుట.

2. చేతి పరిశ్రమల ప్రోత్సాహము, వాని యభివృద్ధిని గురించిన యన్వేషణ.

3. ఉత్పత్తియు, ఉత్పత్తియగు ద్రవ్యముల పంపకమును, విని యోగమును సక్రమముగను, పొదుపుగను జరిపించుట.

ఆరోగ్య విషయకమగు ఏర్పాట్లు రెండు విధములు:—

1. పుష్టికరమగు ఆహారము, స్వచ్ఛమగు నీరు, శుభ్రమైన దుస్తులు అనుకూలమగు నివాసము గ్రామస్థు లందరకు లభింపజేయుట.

2. శరీరము యొక్కయు, ఆహారాదికములయొక్కయు, నివాసముల యొక్కయు శుచి శుభ్రతలను గురించిన విజ్ఞానము నభివృద్ధిచేసి ప్రజలకు సదభ్యాసము లలవడ జేయుట.

సంస్కృతియొక్క ఔన్నత్యమునకు చేయవలయు ఏర్పాట్లు రెండు విధములు:—

1. విద్యావిధాన సంస్కరణము, వ్యాపకము, లలితకళల ప్రోత్సాహము.

2. సాత్వికమగు సాంఘిక పునర్నిర్మాణము, ధర్మశ్రద్ధా ప్రోత్సాహము.

తొలుత ఆహారాదిక విషయమున గ్రామములను స్వయం పోషకముగ చేయుటకు తగిన ప్రణాళికలను నిర్మించు విధాన విధానము తెలుపబడును.

భరతఖండమున నేటికి సుమారు తొంబదిమంది ప్రజలు గ్రామములందును, తక్కిన పదిమందియు పట్టణములందును, నగరములందును నివసించుచున్నా రని యిదివరలో తెలుపబడెను. గ్రామవాసులకును, తదితరులకునుగూడ వలయు ఆహారాదికద్రవ్యములు అన్నియు గ్రామములందు నివసించు కర్షకులే చాలవర కుత్పత్తి చేయవలసియున్నారు. కావున ఏగ్రామమున కాగ్రామమునకు వ్యవసాయపు ప్రణాళికను తయారుచేయుటలో ఆగ్రామప్రజల సంఖ్యకు తొమ్మిదవ వంతు జేర్చి ఆసంఖ్య కంతకును సరిపడు ద్రవ్యముల నుత్పత్తిచేయుటకు తగిన ప్రణాళికను సంకల్పింపవలెను. కావున ఈ క్రింది ప్రణాళికయందు 1250 మంది జనాభాను ప్రమాణముగ దీసికొనబడును. ఇందు సుమారు 2/5 వ వంతు 12 ఏండ్లకు లోబడిన పిల్ల లయియుండుటచే ఇద్దరు పిల్లలను ఒక వయస్కునిగా లెక్కగట్టినచో మొత్తముమీద వేయిమంది వయస్కులకు తగిన యాహారాదికములు గావలసియుండును. ఈ వేయిమంది వయస్కులలో 900 మంది గ్రామవాసులును తక్కిన నూరుమందియు పట్టణ, లేక నగరవాసులును అయియుందురు.

భరతవర్షపు పరిస్థితిని బాగుగ పరిశీలించిన ఆహారశాస్త్రజ్ఞుల యంచనాప్రకారము ప్రతి వేయిమంది వయస్కులకును వలయు సంపూర్ణమును, ఆరోగ్యవంతమును నగు ఆహారమున నుండవలసిన దినుసుల వివరము దిగ్రింది పట్టికయందు తెలుపబడెను.

## 1 వ పట్టిక

(వేయిమంది వయస్కులకు వలయు ఆహారద్రవ్యములు)

| ఆహారద్రవ్యము | మనిషి 1-కి రోజుకు వలయు పరిమితి (ఔన్సులు) | మనిషి 1-కి సంవత్సరమునకు వలయు పరిమితి (పౌనులు) | 1000 వయస్కులకు సంవత్సరమునకు వలయు పరిమితి (టన్నులు) |
|---|---|---|---|
| 1. తృణధాన్యములు | 14 | 322 | 143 |
| 2. కాయధాన్యములు | 3 | 69 | 31 |
| 3. చమురు | 2 | 46 | 21 |
| 4. పాలు | 8 | 184 | 82 |
| 5. కూరదినుసులు | 10 | 230 | 103 |
| 6. పండ్లు | 2 | 46 | 21 |
| 7. బెల్లము | 1 | 23 | 11 |
| 8. తాలింపుద్రవ్యములు | $\frac{1}{4}$ | 6 | 3 |

వ.రా:—వడ్లు పండుచోట్ల రెండువంతుల బియ్యమును ఒక వంతు ఇతర తృణధాన్యములను తినుట మంచిది.

వ.రా 2:—ఆహారమున తప్పనిసరిగా చేర్పబడవలసిన ద్రవ్యముకాకపోయినను, సామాన్యముగ చాలామందిచే కొద్ది గొప్ప ఉపయోగింపబడుచున్న బెల్లముకూడ పైపట్టికలో చేర్చబడెను. పౌష్టిక శక్తి విషయమున నిది కొంచెం మించుమించు తృణధాన్యములతో సమమగుటచే దీని నెంతగ నుపయోగించిన వాని పరిమితి నంతవరకు తగ్గింప వీలగును.

వ.రా 3:—కూరదినుసులు వగైరాలను దినుట కింపుగ చేయుటకై సామాన్యముగ జేర్చబడు మిర్చి, జీలకర్ర మొదలగు తాలింపు ద్రవ్యముల పౌష్టికశక్తి లెక్కలోనికి రావు.

వ.రా 4:—ఉప్పు రుచికొరకు ప్రతి మనిషి ఆహారమునను తప్పకచేరు ఖనిజద్రవ్యము. సగటున $\frac{1}{2}$ ఔన్సు చొప్పున లెక్క చూచుచో వేయిమందికి సాలుకు 5 టన్నులు కావలసియుండును.

గుడ్డల నిమిత్తము ప్రత్తి వేయిమంది వయస్కులకును వలయు ప్రత్తి పరిమితి యీ క్రింద అంచనా వేయబడెను.

## 2 వ పట్టిక

(వేయిమంది వయస్కులబట్టలకు సాలుకు కావలసిన ప్రత్తియంచనా)

మనిషి 1 కి సాలుకు 2 పంచలు, 2 ఉత్తరీయములు లేక

| | |
|---|---|
| 2 చీరలు మొత్తం గజాలు | 12 |
| తుండుగుడ్డలు, దుప్పట్లు ,, | 4 |
| భాగ్యవంతులు ముఖ్యముగ పట్టణవాసులు ఉపయోగించు చొక్కాలు వగైరాలకు అదనముగ సగటున గజాలు | 2 |
| మొత్తం గజాలు | 18 |

ఒక గజము గుడ్డకు కావలసిన (సగటున 20 వ నంబరుగల) నూలు 6 సిలపలు లేక 12 తులముల (5040 గజాలు)

| | |
|---|---|
| చొప్పున 18 గజములకు | $5\frac{1}{4}$ పౌనులు. |
| ఇందుకు వలయు ప్రత్తిగింజలతోసహా మణుగు నూలునకు 112 పౌనుల చొప్పున | $23\frac{1}{2}$ పౌనులు |
| వేయిమందికి సాలునకు కావలసినది | $10\frac{1}{2}$ టన్నులు |

పల్లెటూళ్లలో దీపములకు వలయు ఆముదము లేక ఇతర చమురును గూడ ఉత్పత్తిచేసికొనుటయే ఉత్తమమని గత మూడేండ్ల యనుభవము దెలుపుచున్నది. ఇపుడు పల్లెటూళ్లలో సామాన్యముగ కుటుంబమునకు నెలకు $\frac{1}{4}$ సీసా చొప్పున లభించు కిరసనాయిలు ఒక వారమునకైనను సరిపోక చాలమంది మరల ఆముదమునే వాడుట తప్పని సరియైనది. కాని యిటీవల ఆముదముల యుత్పత్తి తగ్గిపోవుటచే ఆముదపు ధరయు విపరీతముగ పెరిగిపోయెను. ఒక్కొక్క కుటుంబమునకు సుమారు సాలుకు 6 వీసెల చొప్పున వేయిమందికి అనగా 250 కుటుంబములకు సుమారు 2 టన్నుల ఆముదము కావలసియుండును.

వంటసరుకు కుటుంబమునకు సగటున దినమునకు 4 పౌనుల చొప్పున సాలుకు వేయిమందికి (250 కుటుంబములకు) 162టన్నులు కావలసియుండును.

పైని పేర్కొనబడిన సామాన్య జీవితావసరములుగాక, కొందరకు ఇతర భోగ్యద్రవ్యములు కూడ కావలసి యుండవచ్చును.

ఒక సామాన్యకుటుంబమునందలి వయస్కునికి వలయు సాలుసరి జీవితావసరములకు విలువగట్టుచో, నీ క్రిందివిధనము ప్రస్తుత యుద్ధమునకు బూర్వముండిన ధరలచొప్పున అరువదిరూపాయ లగును.

## 3 వ పట్టిక

(ఒక వయస్కుని జీవితావసరముల సాలుసరి విలువయంచనా)

I ఆహారము:—

| | రు. అ. పై. |
|---|---|
| బియ్యము 207 పౌనులు(ధాన్యము 311 పౌ. రు 1 కి 40 పౌ. చొ) | 7-13-9 |
| చోళ్లు, లేక యితర తృణధాన్యములు 115 పౌ. రు 1 కి 40 పౌ. చొ॥) | 2-14-0 |
| కాయధాన్యములు 69 పౌ. (రు 1 కి 30 పౌ. చొ॥) | 2-14-0 |
| చమురు 46 పౌ. గింజలు 115 పౌ. (రు 1 కి 20 పౌ. చొ॥) | 5-12-0 |
| పాలు 184 పౌ. (రు 1 కి 20 పౌ. చొ॥) | 9-3-2 |
| కూర దినుసులు 230 పౌ. (రు 1 కి 64 పౌ. చొ॥) | 3-9-6 |
| పండ్లు 46 పౌ. (రు 1 కి 32 పౌ. చొ॥) | 1-7-0 |
| బెల్లము 23 పౌ. (రు 1 కి 20 పౌ. చొ॥) | 1-2-6 |

| | |
|---|---|
| తాలింపు ద్రవ్యములు 6 పా. (రు 1 కి 8 పా. చొ॥) | 2-0-0 |
| ఉప్పు 12 పా. (రు కి 1 24 పా. చొ॥) | 0-8-0 |
| మొత్తపు ఆహారపు విలువ | 37-4-9 |

II ఇతర బాపతులు:—

| | |
|---|---|
| దీపపు చమురు $4\frac{1}{2}$ పా. (రు 1 కి 6 పా. చొ॥) | 0-12-0 |
| వంటసరుకు 365 పా. (రు 1 కి 6 పా. చొ॥) | 0-15-3 |
| గుడ్డలు 16 గజములు (గ 1 కి $8\frac{1}{2}$ అణాల చొ॥) | 8-8-0 |
| ఇండ్ల మరమ్మతు వగైరాలు అణాల చొ॥) | 2-8-0 |
| పిల్లల చదువులు, అప్పుల తీర్మానం, వైద్యసహాయం, పెండిండ్లు వగైరా నిమిత్తం నిల్వచేయు లేక ఖర్చు చేయుట. | 10-0-0 |
| మొత్తము | 60-0-0 |

కుటుంబమున సామాన్యముగ నిది వరలో వ్రాయబడినట్లు 5 గురు వ్యక్తులు (ముగ్గురు వయస్కులు, ఇద్దరు పిల్లలు) ఉండుచో మొత్తము నలుగురు వయస్కుల క్రింద లెక్క తేలును గాన నా కుటుంబమునకు సాలుసరి ఆదాయము అసమము రు 240 ఉండ వలసియుండును.

III ఆహారాదికముల యుత్పత్తి ప్రణాళిక:—

1 వ పట్టికలో వివరింపబడినట్లు వేయి మంది వయస్కులకు వలయు నాహారాది ద్రవ్యముల యుత్పత్తికి వలయు భూమి సరిమితి ఆ యా ప్రాంతము లందలి నేలయొక్క స్వభావము, కాలమాన పరిస్థితులు, నీటి వసతులు, కర్షకుని నిపుణత మొద లగు వానిని బట్టి యుండును. తెలుగు జిల్లాలలో మూడు ముఖ్యవిధముల సేద్యపు భూములు గలవు.

(1) వర్షాధారపు కృష్ణరేవడి నేలలు:— రాయలసీమలోని నాల్గు జిల్లాలలోని భూములును, కృష్ణా, గుంటూరు జిల్లాలలోని కొన్ని భూములును యీ తరగతిలో జేరును. ఇందు నీటివసతి గల నేల చాల స్వల్పము. ఈ ప్రాంతములందు ముఖ్యముగ రాయలసీమ జిల్లాలలో - వర్షమును తక్కువ. కాని తగినరీతిని సాగుచేయుచో నిందు పదును నిలచును.

(2) ఎఱ్ఱచెక్కు నేలలు:—విశాఖపట్నం, నెల్లూరు, చిత్తూరుజిల్లాలలోని భూములు చాలవర కిట్టివే. ఈ ప్రాంతములందు రాయలసీమలోకంటె హెచ్చు వర్షములు కురియును. వర్షాధారపు నీటి వసతులు కొంతవరకు గలవు. నూతులు తీసిన చాలచోట్ల కొద్ది గొప్ప నీరుపడును. తూర్పు, పడమటిగోదావరి జిల్లాలలోని యెగువ **(upland)** భూములు కూడ చాలవర కిట్టివే.

3. డెల్టాభూములు:—తూర్పు, పడమర గోదావరి జిల్లాల లోను, కృష్ణా, గుంటూరు జిల్లాలలోను కొంతవరకు నెల్లూరు జిల్లా లోను నిట్టిభూములు గలవు. వీనికి పెద్దనదులనుండి త్రవ్వబడిన కాలువలగుండ నమ్మకమైన నీటివసతి గలదు. ఏ గ్రామమునకైనను అందలి భూమియొక్క స్వభావమును బట్టియు, జనసంఖ్యనుబట్టియు నేసస్యము నెంతెంత విస్తీర్ణమున సాగుచేసిన వారల కవసరమగు నా హారాదిక ద్రవ్యముల నుత్పన్నము చేయ వీలగునో తెలుపు ప్రణాళికను తయారుచేయవలె నన్న మొదలు అట్టి భూమియందు బాగుగ బెరుగు వివిధములగు సస్యములను, వానిని సాగుచేయదగు నుత్కృష్టవిధాన ములను నిర్ణయించి అందుల కగు వ్యయమును, అంగువలన రాదగు నాదాయమును అంచనా వేయవలెను. మాదిరి కొక సస్యమున కిట్టి యంచనా యీ క్రింద చూపబడెను.

## 4 వ పట్టిక

చోడి + ఆముదాలు పంటకు ఆదాయవ్యయముల అంచనా
విశాఖపట్టణపు జిల్లాలోని ఎఱ్ఱచెక్కు నేలలలో)

**ఒక యెకరమునకు**

| నెల | చేయవలసిన పని | వలయు పాటు | | | షరా |
|---|---|---|---|---|---|
| | | *ప,జ, | *మ | *ఆ. | |
| ఆగస్టు సెప్టెంబరు | చోడినారు మడి 5 సెంట్లు, దుక్కి 2 సార్లు. గుంటక తోలుట 4 సార్లు. | $\frac{1}{2}$ | $\frac{1}{2}$ | | |
| అక్టోబరు | ఎరువుతోలుట, పరచుట | $\frac{1}{8}$ | $\frac{3}{8}$ | $\frac{1}{8}$ | 1 బండి మూత్రపు మన్ను |
| | గుంటకతోలి కలుపుట | $\frac{1}{8}$ | $\frac{1}{8}$ | | |
| | విత్తులు చల్లుట, మరల గుంటక తోలి కలుపుట | $\frac{1}{8}$ | $1\frac{1}{8}$ | | విత్తులు 8 సౌనులు |
| | నాగటిచాలున వేయుపాలం | | | | |
| సెప్టెంబరు | దుక్కి 2 సార్లు | 3 | 3 | | |
| | ఎరువుతోలుట పరచుట | $\frac{1}{2}$ | $1\frac{1}{2}$ | $\frac{1}{2}$ | 5 బండ్ల |
| అక్టోబరు | నారుతీత, మోత | | 2 | 4 | పశువుల |
| | నాగటిచాలున వేత | 1 | 1 | 4 | యెరువు |
| | డిటో ఆముదములు (3 అడుగులదూరమున చల్లుచో) | $\frac{3}{4}$ | $\frac{3}{4}$ | $\frac{3}{4}$ | విత్తులు |
| నవంబరు | కలుపుతీత | | 1 | 12 | 8 సౌనులు |
| డిసెంబరు జనవరి | చోడివెన్నుల కోక | | 1 | 12 | |
| జనవరి | దంటుకోత, ఎండిన వెనుక కట్టలు కట్టుట మోత | | 2 | 9 | |
| ,, | నూర్పిడి. ఎగురబోత | 3 | $1\frac{1}{2}$ | $1\frac{1}{2}$ | |
| ఫిబ్రవరి జూన్ | ఆముదపుగెలల కోత కాయలనేరుట ముక్కబెట్టుట, నలుగగొట్టుట, గింజలను శుభ్రము చేయుట వగైరా | | 4 | 4 | |
| | | $9\frac{1}{8}$ | $19\frac{3}{4}$ | $47\frac{1}{8}$ | |
| | పూర్ణాంకములలో | 9 | 20 | 48 | |

* ప జ—పశువుల జతలు. మ—మగవాండ్రు. ఆ—ఆడవాండ్రు లేక పిల్లలు.

**వ్యయము :—**

| | |
|---|---|
| పశువుల జతలకు 9 కి (జత 1 కి రోజుకు 12 అ. చొ॥) | 6–12–0 |
| మగవాండ్రు 20 కి (రోజు 1 కి 6 అ. చొప్పున॥) | 7––8–0 |
| ఆడువాండ్రు, లేక పిల్లలు 48 కి (రోజు 1 కి 4 అ. చొ॥) | 12––0–0 |
| ఎరువుబండి మూత్రపు మన్ను | 1––4–0 |
| 5 బండ్ల పశువుల యెరువు | 2––8–0 |
| విస్తులు, బోళ్లు 8 పా. | 0––6–0 |
| ఆముదాలు 8 పా. | 0––8–0 |
| | 30–14–0 |
| పూర్ణాంకములలో | 31––0–0 |

**రాబడి :—**

| | |
|---|---|
| చోళ్లు 800 పౌనులకు (రు 1 కి 32 పా.) | 25––0–0 |
| దంటు 1750 పౌనులకు (రు 1 కి 500 పా.) | 3––8–0 |
| ఆముదములు 300 పా. (రు 1 కి 22½ పా.) | 13––5–4 |
| ఆముదపు కర్రలు 800 పా. | 1––0–0 |
| | 42–13–4 |
| పూర్ణాంకములలో | 43––0–0 |

ఆ యా సస్యముల విషయమున తయారు చేయబడిన యిట్టి పట్టికలు ఈ లేఖరిచే రచింపబడిన వ్యవసాయ గ్రంథములందు గాననగును. అందు స్థానిక పరిస్థితులకు తగిన మార్పులను గావించుకొని వాని నవలంబింపవచ్చును. లేక అదే విధమున క్రొత్తగా పట్టికలను తయారుచేసికొనవలసి యుండును.

పై విధమున తయారుచేయబడిన పట్టికలను ప్రాతిపదికగ గైకొని, ప్రతిగ్రామమునకును, అచటి పరిస్థితుల ననుసరించి యే యే పైరెంత విస్తీర్ణమున సాగుచేసిన నాగ్రామమందలి ప్రజలకును ఆ సంఖ్యలో తొమ్మిదవవంతు సంఖ్య గల పట్టణవాసులకును సరిపడు ఆహారద్రవ్యముల నుత్పత్తి చేయదగునో, అందుల కెంతెంత పాటు ఆవశ్యకమో మొదలగు వివరములను తెలుపు ప్రణాళిక తయారు చేయబడవలెను. ఇట్లు తయారు చేయబడు ప్రణాళిక ఈ క్రింది విషయములందు పరిశీలనకు తాళవలయును.

1. ప్రణాళిక ప్రకారము సాగుచేయవలయు భూమియొక్క మొత్తపు విస్తీర్ణమునకు లోబడియుండవలెను.

2. ఆయా సస్యములను సాగుచేయు విస్తీర్ణములు సౌష్ఠవమగు పరివర్తనము నవలంబించుటకు అనుకూలముగ నుండవలెను.

3. ప్రణాళికలోని యంచనా ప్రకారము ఉత్పత్తియగు ఆయా ద్రవ్యముల పరిమితి 1–వ పట్టికలో తెలుపబడిన ప్రకారము కావలసిన పరిమితికంటె కేవల వర్షాధారపు భూములందు అధమము నూటికిరువదివంతుల చొప్పునను, ఏళ్లు చెరువులు మొదలగువాని క్రింద భూములందు నూటికి 10 వంతుల చొప్పునను పెద్ద నదులనుండి కాలువలద్వారా నీరు నమ్మకముగ లభించు భూములందు నూటి కైదు వంతుల చొప్పునను హెచ్చుగ నుండవలెను.

4. ఉత్పన్నమగు పశుగ్రాసమును, ఇతర పశ్వాహారద్రవ్యములును సాగుచేయబడు భూములందలి కృషికి సరిపడు దుక్కిపశువులకును, 1–వ పట్టిక ప్రకారము ఉత్పత్తి కావలసిన పాలనొసగ గల పాడిపశువులకును, వాని దూడలకును సరిపోవలెను. సాగుభూమిగాక యీ పశువుల మేపునకు తగినంత బీడుకూడ ఉండవలెను.

5. పై పశువులనుండియు, ఉత్పన్నమగు చెత్తచెదారముల నుండియు, ప్రత్యేకముగ నెరువుకొరకు సాగుచేయబడు పచ్చియెరువు సస్యములనుండియు ప్రణాళికలోని సాగుభూమి కంతటికిని సరిపోవు ఎరువు తయారుకావలెను. సరిపోనిచో ఏయే యితర ఎరువుల నెంతెంత కొని యుపయోగింపవలసియుండునో ప్రణాళికయందు నిర్ణయింపవలెను.

6. ఇదివరలో వివరింపబడిన ప్రకారము వలయు పంటసరుకు గూడ ప్రణాళిక ప్రకారము సాగుచేయబడు సస్యముల మూలమున గాని, బీటిలో పెరుగు చెట్ల మూలమునగాని సరఫరాకావలెను.

7. ప్రణాళిక ప్రకారము గ్రామమునందలి భూమిని సాగు చేయుచో వచ్చు నికరాదాయము దానిని సాగుచేయు కర్షకులందరికిని కుటుంబము 1 కి 240 రూపాయలకు తక్కువకాకుండ లభించవలెను.

ఈ క్రింద పైని వివరింపబడిన పరిశీలనకు నిలుచునట్లు విశాఖపట్టణపు జిల్లాలోని ఎర్రచెక్క నేలలందలి పరిస్థితుల ననుసరించి తయారు చేయబడిన ప్రణాళికయొకటి వివరింపబడును. ఈజిల్లాలో ప్రతి వేయిమంది వయస్కులకును సగటున సుమారు 500 ఎకరముల సాగుభూమియు, 200 ఎకరముల బీడును, 200 ఎకరముల బంజరు భూమియు మాత్రమే కలదు. సాగుభూమిలో సుమారు సగము, ఏటి కాలువలచేగాని, చెరువులచేగాని తడుపబడు పల్లపునేల తక్కినది మెరక. ఈ క్రింద ఈ 250 ఎకరముల పల్లపు భూమినుండియు, బీటిలో సాగుచేయుటకు వరకట్టవలసినది 20 ఎకరములు చేరి 270 ఎకరముల మెరకభూమినుండియు వేయిమంది వయస్కులకు వలయు నాహారాదిక ద్రవ్యముల నుత్పత్తిచేయుటకు ప్రణాళిక తయారు చేయు విధానము తెలుపబడును.

## 5–వ పట్టిక

ఎర్రచెక్క నేలలందు సాగుచేయదగిన ముఖ్యసస్యములు పంట పరిమితి, సాగునకగు పాటు వగైరాలు.

ఎకరము 1-కి

| సస్యము | పంటపరిమితి: గింజలు పౌనులు | పంటపరిమితి: దంటు వగైరా పౌనులు | [illegible] | వలయుపాటు: ప. జ. * | వలయుపాటు: మ. * | వలయుపాటు: ఆ. * | [illegible] * |
|---|---|---|---|---|---|---|---|
| A. పల్లపునేలకు | | | | | | | |
| 1. వరి | 2240 | 3360 | 66 | 10 | 29 | 33 | 36 |
| 2. చోడి (పునాస) | 1920 | 3000 | 56 | 23 | 40 | 53 | 53 |
| 3. గంటి ,, | 900 | 2250 | 35 | 10 | 19 | 27 | 24 |
| 4. గోగు ,, | 750 | 750(కంప) | 75 | 11 | 27 | 49 | 38 |
| 5. నూవు ,, | 450 | 900 | 24 | 7 | 12 | 24 | 19 |
| 6. పెసర (పయిర) | 240 | 480 | 16 | 1 | 6 | 9 | 7 |
| + వెంపలి | | 4480 పచ్చిరొట్ట | | | | | |
| 7. మినుము(పయిర) | 240 | 480 | 20 | 1 | 8 | 9 | 8 |
| + నీలి | | 8910 | | | | | |
| 8. సెనగ ,, | 400 | 800 | 27 | 8 | 15 | 27 | 20 |
| + ఆముదాలు | 255 | 560 | | | | | |
| 9. నూవు (పయిర) | 240 | 800 | 28 | 7 | 16 | 29 | 22 |
| + ప్రత్తి | 150 | 2240 | | | | | |
| 10. అరటి (కంపెనీ ధర) | 22400 | 10టన్నులు | 305 | 27 | 132 | 40 | 160 |
| B. మెట్టనేలకు | | | | | | | |
| 1. నూవు (తొలకరి) | 450 | 900 | 24 | 7 | 12 | 21 | 18 |
| 2. చోడి + | 800 | 1750 | 37 | 9 | 18 | 53 | 30 |
| అనుము | 250 | 500 | | | | | |
| 3. చోడి + | 800 | 1750 | 39 | 9 | 22 | 49 | 31 |
| ఆముదాలు | 300 | 800 | | | | | |
| 4. వేరుసెనగ + | 1250 | 2500 | 65 | 12 | 39 | 89 | 49 |
| కంది | 300 | 600 | | | | | |
| 5. కూరగాయలు | 20,000 | 1200 కంప 4 టన్నులు కంపవగైరా | 240 | 44 | 180 | 75 | 160 |
| 6. అరటి (దేశవాళీపద్ధతి) | 16,800 | 7 టన్నులు చెత్త | 225 | 38 | 130 | 50 | 120 |
| 7. తాలింపు ద్రవ్యములు | 1000 | 1120 (కంప) | 150 | 16 | 22 | 48 | 58 |
| 8. గినీగుడ్డ | | 60000 (పబది) | 134 | 40 | 80 | 120 | 130 |
| 9. ప్రత్తి (నీరుపెట్ట) | 1120 | 3360 (కంప) | 71 | 24 | 48 | 60 | 56 |
| 10. పండ్లతోటలు | 4000 | 4480 రాలుటాకు వగైరా | 250 | 25 | 75 | - | 90 |
| 11. జొన్న మేతకు | | 15టన్నులు | 75 | 24 | 48 | 48 | 63 |
| 12. చిరుగడము | 3 టన్నులు దుంపలు | 20టన్నులు (రొట్ట) | 90 | 16 | 32 | 64 | 60 |

* ప. జ.—పశువులజతలు, మ.—మగవాండ్రు. ఆ—ఆడువాండ్రు లేక పిల్లలు. మొత్తపు వ్యయములో విత్తులయొక్కయు యెరువుయొక్కయు చెరుకు మొదలగు కొన్నిసస్యములకు అవసరమగు వెదురు వగైరాలయొక్కయు విలువచేరియున్నది.

6-వ పట్టిక

ఎర్రచెక్కనేలలందు వేయిమంది వయస్కులకు సరిపడు ఆహారాదిక ద్రవ్యముల సుత్పత్తిచేయుటకు ప్రణాళిక.

| సస్యము | సాగువిస్తీర్ణము: [illegible] | సాగువిస్తీర్ణము: [illegible] | సాగువిస్తీర్ణము: [illegible] | మొ॥పంట విస్తీర్ణం: గింజలు [illegible] | మొ॥పంట విస్తీర్ణం: దంటువగైరా [illegible] | [illegible] | [illegible] |
|---|---|---|---|---|---|---|---|
| A. పల్లపుభూమి | | | | | | | |
| 1. వరి | | 230 | | 230 | 345 | 15,180 | 8.280 |
| 2. చోడి (పునాస) | 25 | | | 18 | 26 | 1,400 | 1,325 |
| 3. గంటె ,, | 25 | | | 10 | 25 | 875 | 600 |
| 4. గోగు ,, | 10 | | | 3 | 3 | 750 | 380 |
| 5. నూవు ,, | 50 | | | 10 | 20 | 1,120 | 950 |
| 6. పెసర (పయరు) | | | 75 | 8 | 16 | 1,200 | 525 |
| + వెంపలి | | | 75 | | 150 (రొట్ట) | | |
| 7. మినుము (పయరు) | | | 50 | 5 | 10 | 1,000 | 400 |
| + నీలి | | | 50 | | 200 (రొట్ట) | | |
| 8. సెనగ | | | 25 | 4 | 8 | 675 | 500 |
| + అముదాలు | | | 25 | 3 | 6 | | |
| 9. నూవు | | | 50 | 5 | 18 | 1,400 | 1,100 |
| + ప్రత్తి | | | 50 | 3 | 50 (రొట్ట) | | |
| 10. అరటి (కంపెనీ పద్ధతి) | 10 | 10 | 10 | 100 | 100 (చెత్త) | 3,050 | 1,600 |
| 11. చెరుకు (మధ్యమ విధానం) | 10 | 10 | 10 | 33 | 20 (చెత్త) 20 పేకలు | 4,000 | 2,700 |
| B. మెట్టనేల | | | | | | | |
| 1. నూవు (తొలకరి) | 75 | | | 15 | 30 | 1,800 | 1,350 |
| తరువాత చోడి | | 60 | | 21 | 47 | 2,220 | 1,800 |
| + అనుము | | | 60 | 7 | 14 | | |
| చోడి + | | 15 | | 6 | 13 | 585 | 465 |
| ఆముదాలు | | | 15 | 2 | 5 | | |
| 2. వేరుసెనగ | | 75 | | 41 | 82 | 4,875 | 3,675 |
| కంది | | | 75 | 10 | 20 | | |
| 3, కూరగాయలు | 15 | 15 | 15 | 134 | 60 | 4,500 | 2,400 |
| 4. అరటిదేశవాళీపద్ధతి | 10 | 10 | 10 | 70 | 70 | 2,250 | 1,200 |
| 5. చిరుగడ-రొట్టుకు | | 20 | | 60 | 400 | 1,800 | 1,200 |
| తరువాత మేతజొన్న | | | 20 | | 300 | 1,500 | 1,260 |
| 6. తాలింపుద్రవ్యములు మిర్చి, ఆవ, పసుపు వగైరా | | 15 | | 7 | 14 | 2,250 | 870 |
| 7. గినీగడ్డి | 25 | 25 | 25 | | 669 | 3,345 | 3,250 |
| 8. ప్రత్తి (నీరుపెట్టి) | | 20 | 20 | 10 | 30 | 1,420 | 1,120 |
| 9. ఫలవృక్షములు | 15 | 15 | 15 | 27 | 30 | 3,750 | 1,350 |
| 10. బీడు వగైరా | | 200 | | | 400 | 1,000 | |
| | | | | | పచ్చిక | 1.000 కలప వగైరా | |
| | | | | | | 62.945 | 38.30[illegible] |

4, 5 పట్టికలలో సూచింపబడినట్లు గ్రామమునందలి నేలలో సాగుచేయదగు ముఖ్యసస్యములకు సాగు విధానమును, ఆదాయ వ్యయములను తెల్పు పట్టికలను తయారుచేసికొని, వెనుక ఆయాసస్యముల నెంతెంత విస్తీర్ణమున సాగుచేసిన గ్రామమందలి ప్రజలకు సరిపోవు ఆహారాదిక ద్రవ్యములు లభించునో తెలుపు ప్రణాళిక నీ క్రిందిమాదిరిగ తయారు చేయవలెను.

పై ప్రణాళికలోని పల్లపుభూమియందు, చెరుకును, అరటియును వరితో 5, 6 సంవత్సరముల కొకసారి పరివర్తనము గావింపబడి వరుసగా కార్చి తోటల సహా మూడేసి యేండ్లుండును. వరికి ముందు పునాసపైరు వేయు భూమిలో ఆ సంవత్సరము పయరను పెసర, మినుము విత్తవలెను. పయరను సెనగ నువ్వు పెట్టిన నేలలలో మరుచటి సంవత్సరము పయరను పెసర, నువ్వు, పెట్టవలెను. పయరనుగాని, పునాసనుగాని ఒక పైరు నొక సంవత్సరము పెట్టిన నేలలో మరుసటిసారి పయరను గాని, పునాసనుగాని, వెనుక పెట్టినది గాక మరియొక్క సస్యమును అనగా, చోడి, గంటె పెట్టిన చోట తొలకరి నూవు, పయరు నూవు పెట్టినచోట సెనగ వేయవలెను. పైనిచెప్పినట్లు చేయుచో రెండుసంవత్సరముల కొకసారికంటె తరుచుగ నేలను మెట్ట దుక్కి దున్నవలసి యుండెదు. మెట్ట నేలలలో ఒక సంవత్సరము నూవు చోడి సాగుచేయు నేలలలో రెండవ సంవత్సరము వేరుసెనగ సాగుచేయవలెను. మూడవ సంవత్సరము కూరగాయలు, ప్రత్తి, తాలింపు ద్రవ్యములను కొంత భూమిలో పెట్టవచ్చును.

పై ప్రణాళిక ప్రకారము 520 ఎకరముల భూమినుండి ఉత్పత్తియగు ఆహారాదిక ద్రవ్యముల పరిమితులను వెనుక తెలిపిన ప్రకారము వేయిమంది వయస్కులకు వలయు ద్రవ్యముల పరిమితులతో పోల్చి ఈ క్రింది పట్టికయందు చూపబడినది.

## 7 వ పట్టిక

వేయిమంది వయస్కులకు వలయు ఆహారాదిద్రవ్యముల పరిమితులతో ప్రణాళిక ప్రకారము 520 ఎకరములనుండి ఉత్పత్తియగు పరిమితుల తులనాలు:

| ద్రవ్యము | ప్రతివేయి మంది వయస్కులకు కావలసిన పరిమితి (టన్నులు) | నూటికి 10 వంతులు అదనముగ చేర్చిన పరిమితి (టన్నులు) | 2 పట్టిక ప్రకారము ఉత్పత్తి పరిమితి (టన్నులు) | సామాన్య పరిస్థితులందు సగటు ఉత్పత్తి (టన్నులు) |
|---|---|---|---|---|
| 1. తృణధాన్యములు | 143 | 157 | 208 b | 184 |
| 2. కాయధాన్యములు | 31 | 34 | 34 | 7 |
| 3. చమురు (ఆహార యోగ్యము) | 21 | 23 | 25 | 12 |
| 4. కూరదినుసులు | 103 | 113 | 169 c | ? |
| 5. పండ్లు | 21 | 23 | 162 d | 62 |
| 6. బెల్లము | 11 | 12 | 33 | 31 |
| 7. తాలింపు ద్రవ్యములు | 3 | 3 | 7 | 3 |
| 8. ప్రత్తి | 11 | 12 | 13 | చాలతక్కువ |
| 9. దీవవు చమురు (ఆముదము) | 2 | 2 | 2 | చాలతక్కువ |
| 10. వార | 2 | 2 | 3 | 2 |
| 11. పాలు | 82 | 90 | 92 a | 45 |

వరా:—(a) పాలయుత్పత్తి వివరములు ముందు తెలుపబడును.

(b) ధాన్యపుతూనికలో $\frac{2}{3}$ వంతు అనగా బియ్యపుతూనికయే యిందుచేరి యున్నది.

(c) అరటికాయలు చేరి.

(d) అరటిపండ్లు చేరి.

పై పట్టికయందలి యంకెలు ప్రణాళిక ప్రకారము సాగుచేయుచో 520 ఎకరములనుండియు వేయిమంది వయస్కులకు వలయు ఆహారాదిక ద్రవ్యము లన్నియు నుత్పత్తియగు నని తెల్పును. ప్రస్తుతపు టుత్పత్తి ముఖ్యముగ కాయధాన్యముల యొక్కయు, చమురు దినుసులయొక్కయు, పాలయొక్కయు ఉత్పత్తి కావలసిన దానికంటె చాల తక్కువగ నున్నది.

6 వ పట్టికయందలి ప్రణాళిక ప్రకారము సాగుచేయవలసిన భూమిని దున్నుట వగైరా పనులకు 5-వ పట్టికలోని 5 వ కలములోని లెక్క చొప్పున 11325 దిన జతల పశువుల పాటు కావలసియుండును. సాగుభూమిని 100 కమతములుగ విభజించి కమతము 1కి 1 జత దుక్కి పశువుల నుంచుకొనుచో జత 1 కి సాలుకు సుమారు 4 నెలలుమాత్రమే పనియుండును. తేలిక నేలలగుటచేత నీఎడ్లు మధ్యమపరిమాణము కలవిగ నున్న చాలును. పాల యుత్పత్తికి పెంచబడు పశువులుగూడ మధ్యమపరిమాణము కలవిగనే యుండదగును. ఇట్టివి 120 ఉన్నచో అందు ఎప్పుడుగాని 72 పాల నిచ్చుచుండును. సగటున దినమున ఒక్కొక్క పశువు 8 పౌనుల పాలనిచ్చు

## 8 వ పట్టిక

పాటునకు, పాడికిని వలయు పశువులకు గావలసిన యాహార ద్రవ్యములు.

| పశువుల వివరము | ఆహారద్రవ్యములందుండవలసిన సారము: పశువు 1కి దినమునకు — జీర్ణమగు మాంసకృత్తులు (పౌనులు) | పశువు 1కి దినమునకు — మొత్తపు పౌష్టిక ద్రవ్యములు (పౌనులు) | మొత్తపుసంఖ్యకు సాల్కు — జీర్ణమగు మాంసకృత్తులు (టన్నులు) | మొత్తపుసంఖ్యకు సాల్కు — మొత్తపు పౌష్టిక ద్రవ్యములు (టన్నులు) |
|---|---|---|---|---|
| 200 మధ్యమ తరగతి పశువులు-జీవితబత్తెము | 0.48 | 4.8 | 15.7 | 157 |
| ,, పనిబత్తెం 4 నెలలకు | 0.32 | 2.0 | 3.5 | 22 |
| 120 మ॥తరగతికిపాడిపశువులకు జీవిత బత్తెము | 0.48 | 4.8 | 9.4 | 94 |
| 72 ఆవులకు పాలబత్తెము రోజుకు 8 పౌన్లు పాలకు | 0.48 | 2.0 | 5.7 | 15 |
| 72 దూడలకు 7-12 నెలలవరకు | 0.32 | 1.6 | 1.9 | 10 |
| 32 ,, 2 వ సం॥ | 0.48 | 3.2 | 2.6 | 16 |
| 32 ,, 3 వ సం॥ | 0.56 | 4.0 | 3.0 | 20 |
| 32 ,, 4 వ సం॥ | 0.56 | 4.0 | 3.0 | 20 |
| 2 ఆబోతులకు | 0.96 | 8.0 | 0.3 | 3 |
| | | | 45.1 | 357 |
| కాలమానపరిస్థితులకు10% అదనముగ | | | 4.15 | 36 |
| | | | 49.6 | 393 |

ననుకొనవచ్చును. మొత్తముమీద సంవత్సరమునకు 92 టన్నులపాలు ఉత్పన్నమగును. సాగుభూమియు, బీడునుకూడ చాల తక్కువగు టచే వీని దూడల నన్నిటిని మేపుకొని పెద్దవానిని చేసికొన వీలుండదు. కావున దుక్కిపశువులలోను, పాడిపశువులలోను ఏటేటగలుగు తరుగును భర్తీచేసికొనుటకు వలయు 20 కోడెదూడలను, 12 పెయ్యదూడలనుమాత్ర ముంచుకొని తక్కినవానిని పాలువిడువగనే విక్రయింపవలసి యుండును. అనగా మొత్తముమీద మేపవలసిన పెద్దపశువులు ఆబోతులసహా 322 ను, వానిదూడలు సంవత్సరము వయస్సు లోపలివి 72 ను గాక 96 ను మొత్తం 490 అగును. ఇపుడు విశాఖపట్టణము జిల్లాలో సగటున ప్రతివేయిమంది వయస్కులకును 474 పశువులు మాత్రమే గలవు. పైని సూచింపబడినట్లు పెంచదగిన 490 పశువులకును కావలసిన ఆహారమునందుండదగు జీర్ణమగు మాంసకృత్తులయొక్కయు, పౌష్టికశక్తియొక్కయు పరిమితు లీక్రిందిపట్టికయందు లెక్కకట్టబడెను.

ప్రణాళిక ప్రకారము సాగుచేయబడు సస్యములనుండియు బీడు, బంజరులందలి మేపువలనను పై పట్టికప్రకారము కావలసిన 49 టన్నుల జీర్ణమగు మాంసకృత్తును, 393 టన్నుల మొత్తపు పౌష్టికద్రవ్యములును నెట్లు లభించునో తెలుపబడినది.

## 9 వ పట్టిక

ఉత్పత్తియగు పశ్వాహారపు వివరములు.

| దినుసు | ఉత్పత్తియగు పరిమితి (టన్నులు) | ఆయాదినుసులందలి జీర్ణమగు మాంసకృత్తు – | మొత్తపు పౌష్టిక ద్రవ్యములు – | జీర్ణమగు మాంసకృత్తు మొత్తము (టన్నులు) | మొత్తపు పౌష్టిక ద్రవ్యములు (టన్నులు) | ఆయాదినుసుల విలువ టన్ను 1-కి |
|---|---|---|---|---|---|---|
| | | | | | | రు.అ.పై |
| వరిగడ్డి | 345 | 1.20 | 14 | 4.1 | 48 | 5–9–0 |
| చోడిచొప్ప | 86 | 0.90 | 17 | 0.8 | 15 | 4–8–0 |
| గంటెదంటు | 25 | 0.75 | 20 | 0.2 | 4 | 4–8–0 |
| కాయధాన్యపు బొత్తు | 60 | 5.00 | 25 | 3.0 | 15 | 11–3–0 |
| వేరుసెనగ రొట్ట | 82 | 5.00 | 25 | 4.1 | 21 | 11–3–0 |
| గినీగడ్డి | 669 | 1.40 | 11 | 8.1 | 74 | 5–0–0 |
| జొన్నజాడు | 300 | 1.40 | 13 | 4.2 | 39 | 5–0–0 |
| చెరుకుకొనలు | 20 | 0.60 | 11 | 0.1 | 2 | 2–0–0 |
| చిరుగడపు రొట్ట | 400 | 2,00 | 8 | 8.0 | 32 | 4–0–0 |
| దుంపలు | 60 | 1.00 | 25 | 0.6 | 15 | 10–0–0 |
| పచ్చగడ్డి గట్లమీదిది | 250 | 1.40 | 13 | 3.5 | 33 | 5–0–0 |
| బీటిమేపు | 360 | 1.40 | 13 | 4.9 | 47 | 2–8–0 |
| బంజరు మేపు | 200 | 1.40 | 13 | 2.8 | 26 | — |
| దాణాదినుసు | | | | | | |
| నూవుపిండి | 13 | 30 | 69 | 3.9 | 9 | 64–0–0 |
| ప్రత్తిగింజలు | 10 | 13 | 76 | 1.3 | 8 | 45–0–0 |
| తవుడు | 6 | 6 | 68 | 0,4 | 4 | 32–0–0 |
| కాయధాన్యపు పొట్టు | 7 | 45 | 26 | 0.3 | 2 | 24–0–0 |
| | | | | 50.3 | 394 | — |

మొత్తపు విలువ రు. 14464

పై 490 పశువులనుండియు, పెద్దపశువులు 322 నుండి సాలుకు 4 బండ్లచొప్పునను, దూడలు 268 నుండి రెండేసిబండ్ల చొప్పునను 1664 బండ్ల పశువులయెరువు లభించును. ఊరగెత్త యెరువు (కుటుంబమునకు మూడుబండ్లచొప్పున) 675 బండ్లును, పొలములో నుత్పత్తియగు 383 టన్నుల చెత్తచెదారములనుండి 151 బండ్ల కంపోస్టు (Compost) యెరువును మొత్తముమీద 2490 బండ్ల యెరువు తయారగును. పశువుల మూత్రముతో తడిసినమన్ను పశువులయెరువులో సగముచొప్పున 832 బండ్లు తయారగును. ఇప్పుడు విశాఖపట్టణముజిల్లాలో ప్రతివేయిమంది వయస్కులకును 314 గొర్రెలును, మేకలును మాత్రమే కలవు. వీని సంఖ్య 450 వరకు హెచ్చింపవచ్చును. వీని వెంట ఆరునెలలు కూడబెట్టుచో 90

## 10 వ పట్టిక

(ఆయా యెరువుల ఉపయోగపు ప్రణాళిక)

| సస్యము | ఎకరములు | ఆయాయెరువుల పరిమితి: పచ్చిరొట్టెరువు 400 టన్నులు | పశువుల యెరువు, కంపోస్టు యెరువు 2490 బండ్లు | ఎముక, గొర్రెల మూత్రము 922 బండ్లు | 243 బండ్లు | ... 81,000 | రసాయనిక ఎరువులు 112 టన్నులు 15 |
|---|---|---|---|---|---|---|---|
| వరి | 230 | 400 | | | | 23000 నాగు మట్లు | |
| చోడి(పునాస) | 25 | | 250 | | | 1250 | |
| గంటె ,, | 25 | | | | | 12500 | |
| గోగు ,, | 10 | | 50 | 20 | | | |
| నూవు ,, | 50 | | 150 | 100 | | | |
| నూవు (పయర) | 50 | | 150 | 100 | | | |
| ,, (తొలకరి) | 75 | | 300 | — | | | |
| చోడి + అనుము | 60 | — | — | 120 | | 3000 | |
| చోడి + ఆముదం | 15 | | | 30 | | 750 | |
| కూరగాయలు | 15 | | 225 | 75 | | | |
| అరటి దేశవాళీ పద్ధతి | 10 | | 200 | | | | |
| అరటి కంపెనీ పద్ధతి | 10 | | 100 | | 100 | | |
| చెరకు | 10 | | 100 | | 60 | 10,000 | 15 |
| తాలింపుద్రవ్యములు | 15 | | 75 | 75 | | 30,000 | కొని |
| గినీగడ్డి | 25 | | 375 | 125 | | | వేయ |
| మేతజొన్న | 20 | | 200 | 40 | | | వలసినది |
| చిరుగడం | 20 | | 200 | 40 | | | |
| ఫలవృక్షములు | 15 | | 75 | 45 | 30 | | |
| | | 400 | 2450 | 790 | 190 | 80500 | 15 |

బండ్లగును. వీనిని రాత్రి 1 కి 450 చొప్పున 180 రాత్రులు పొలముపై మందగూడ గట్టవచ్చును. పై యెరువులుగాక ఆముదపు పిండియు, వేరుసెనగపిండియు కలిసి సుమారు 18 టన్నులు (243 బస్తాలు)కూడ ఉత్పత్తియగును! పచ్చియెరువు సస్యములవలన 400 టన్నుల రొట్ట యుత్పత్తియగును. ఈ యెరువుల నేయే సస్యమున కెంతెంత చొప్పున నుపయోగింపదగునో 10—8 పట్టికయందు తెలుపబడినది.

పై యెరువుల కొను స్వల్పముగ మిగులును వానిని అవసరమును బట్టి సస్యములను అదనముగ వేయవచ్చును.

పశువులను మేపుట కగు వ్యయమును, దానివలన ఆదాయమును 11-వ పట్టికలో అంచనా వేయబడినది.

## 11 వ పట్టిక

(పశువుల పోషణ కగు వ్యయము, వానివలని ఆదాయము)

### I వ్యయము

| | | |
|---|---|---|
| 9 వ పట్టికయందలి పశ్వాహారపు విలువ కడపటి రేట్లలోని రేట్ల ప్రకారము | | రు. 14464 |
| పశువుల కాపరులు 100 మందికి సాలుకు 60 రూపాయల చొప్పున | | రు. 6000 |
| చిల్లర ఖర్చులు, ఉప్పు, త్రాళ్లు వగైరా పశువు 1 కి రు. 1-4-0 చొ॥ 490 పశువులకు | | రు. 613 |
| పశువుల విలువపై తరుగు, వడ్డీ 15% చొ॥ | | |
| దుక్కి పశువులు 200 కు | రు. 16000 | |
| పాడిపశువుల 120 కు | రు. 7200 | |
| తోటపెద్ద 2 కి | రు. 600 | |
| | పైన | రు. 3570 |
| | రు. 23800 | |
| | మొత్తపు వ్యయము | రు. 24647 |

### II ఆదాయము.

| | |
|---|---|
| దుక్కిపశువుల పాటు 11325 దినజతలకు జత 1 కి రు 0-12-0 ల చొప్పున | రు. 8494 |
| పాలు 21024 కుంచములను కుం 1 కి 8 అణాల చొప్పున | 10512 |
| పశువుల యెరువు విలువ 1664 బండ్లకు బండి 1 కి 8 అణాల చొప్పున | 832 |
| మూత్రపు మన్ను 832 బండ్లకు బండి 1 కి రు 1-4-0 చొప్పున | 1040 |
| తయారగు గిత్తలు 20 కి విలువ | 1600 |
| ,, ,, పెయ్యదూడలు 12 కి విలువ | 720 |
| | 23198 |
| నష్టము. | 1449 |

బీడును, బంజరుభూమియు తక్కువగుటచేతను, సాగుభూమి యైనను పశువునకు సుమా రొక యెకరమమాత్రమే యుండుటచేతను

## 12-వ పట్టిక

ఆయా నేలలను సాగుచేయు కర్షకుల ఆదాయ వ్యయములు.

| వివరములు | వర్షాధారపు కృష్ణ రేవడి నేలలు రాయలసీమ (24,00 ఎకరములు) | ఎర్ర చెక్క నేలలు- ఏట్ల చెర్వునూత్ల ఆధారము విశాఖపట్టణం జి॥ 720 ఎక॥ | డెల్టా నేలలు గోదావరి డెల్టా (975 ఎకరములు) |
|---|---|---|---|
| I ఆదాయము | రు. | రు. | రు. |
| ఫలసాయపు విలువ (6 వ పట్టిక లోవలె లెక్కకట్టగా) | 80,600 | 62,945 | 1,26,015 |
| కాలమాన వ్యత్యాసములకు మినహాయింపు | 13,433 (1/6) | 5722 (1/11) | 6,001 (1/21) |
| పోను మిగతా | 67,167 | 57,228 | 1,20,014 |
| పశువుల లెక్కనుండి లాభ నష్టములు | 4,132 లాభము | -1,449- (నష్టము) | -6,411- (నష్టము) |
| మొత్తపు రాబడి | 71.299 | 55,774 | 1,13,603 |
| II వ్యయము | | | |
| 1. వ్యవసాయపు ఖర్చులు(6 వ పట్టికలోవలె లెక్కగట్టగా) | 50,840 | 38,300 | 55,985 |
| 2. భూమిమరమ్మతులు (గట్లు వేయుట,ఒరపిడి(erosion) మాన్పుట వగైరా | 2,400 (ఎకర.1-కి రు 1 చొ) | 1,440 (ఎకర.1-కి రు 2 చొ॥ | 1,950 (ఎకర.1-కి రు 2 చొ॥) |
| 3. వ్యవసాయపు పనిముట్లపై | 3,000 (20 వేలపై) | 2400 (16 వేలపై) | 1800 (12 వేలపై) |
| 4. భూమిపన్ను | 2,400 (ఎకర.1-కి రు 1 చొ॥) | 2175 (మెర. ఎ1కి రు.1½ పల్లమునకు ఎ1కి రు 6 చొ॥ | 9750 (ఎకర. 1-కి రు 10-చొ॥) |
| 5. భూమిసిస్తు(పన్నుకు 4 రెట్లు లేక భూమిఖరీదుపై 5% చొ॥ | 9,600 | 8,700 | 39,000 |
| మొత్తపు వ్యయము | 68,240 | 52,975 | 108,385 |
| నికరాదాయం-అనగా వ్యాపారసరళిని పెట్టుబడి పెట్టి సాగు చేయువాని లాభము. | 3059 | 2799 | 5118 |
| భూమిని 100 కమతములుగా సాగుచేయుచో కుటుంబము 1 కి వచ్చు ఆదాయము | 30.6 | 28.0 | 51.2 |
| పెట్టుబడిపై లాభము నూటికి | 4.5 | 5.3 | 4.7 |
| ఎకరము 1 కి లాభము రు. | 1.3 | 3.9 | 5.3 |

పశువులమేత దినుసులను ప్రత్యేకముగ పెంచవలసి యున్నందున వ్యయ మెక్కువయయి, పశువుల లెక్కలనుండి లాభాలు తేలుటకు బదులు నష్ట మేర్పడెను.

ఇదివరలో దెలుపబడినట్లు వేయిమంది వయస్కులకు సంవత్సరమునకు వలయు 162 టన్నుల వంటసరుకు మింజుమలె ప్రణాళిక ప్రకారము సాగుచేయబడు కంది, ఆముదము, నూవు, గోగు, ప్రత్తి వగైరా సస్యముల కంప 6 వ పట్టిక ప్రకారము 114 టన్నులు లభించును, తక్కిన వంటసరుకును నాగళ్లు పశువులసాలలు వగైరాలకు వలయు కర్రయు, పొలముగట్లయందును, ఆవరణలందును బీళ్లలోను పెరుగుతాటి తుమ్మవగైరా చెట్లనుండి సులభముగ లభించును. కావున వంటసరకు వగైరాల కొరకు తడుముకొనవలసిన యవసర ముండదు.

పైన వివరింపబడిన విధానమున వర్షాధారపు కృష్ణరేవడి నేలలకు డెల్టానేలలకునుగూడ మాదిరి ప్రణాళికలు తయారుచేయబడెను. కాని వ్యాస మింతవరకే కడుదీర్ఘమగుటచే నా వివరము లిందు చేర్పబడలేదు. వేయిమంది వయస్కులకును బీటి నేల కలుపుకొని వర్షాధారపు కృష్ణరేవడి నేల 2400 ఎకరములును, డెల్టాభూమి 975 ఎకరములును గలదు. ప్రణాళిక లీవిస్తీర్ణములకే తయారు చేయబడెను.

**IV ఆయావిధముల నేలలను సాగుచేయువారల ఆదాయ వ్యయములు.**

పైని వ్రాయబడినట్లు తయారుచేయబడిన ప్రణాళికలనుబట్టి సాధ్యమైనంతవరకు స్వయం సమృద్ధమగు కృషిని చేయుచో కర్షకులకు ఆదాయవ్యయము లెట్లుండునో 12-వ పట్టికలోని యంకెలు దెలుపును

పై పట్టికలో ఆయావిధముల నేలల వ్యవసాయమువలన వచ్చు నికరాదాయము, అనగా భూమిని శిస్తుకు తీసికొని కర్షకుడు తాను పాటుపడక కూలీలచే పనిచేయించుచో వచ్చు నికరాదాయము తేల్చబడెను. శిస్తుకు తీసికొని కుటుంబము స్వయముగ పాటుబడుచో దీనికి కుటుంబపు పాటు విలువ సాలుకు 300 రోజులకు* మగవానికి దినమునకు 6 అణాలు, ఆడుదానికి 4 అణాలు, పిల్లవానికి సాలుకు రు 60 చొ॥ మొత్తము రు 247-8-0 కుటుంబాదాయమున చేరును. భూమి స్వంతమైనచో భూమిమీద శిస్తుకూడా కుటుంబాదాయమున చేరును. ఈ క్రింద కమతము 1 కి ఆయాతరగతుల వ్యవసాయదారుల కుటుంబాదాయము లెక్కగట్టబడెను.

* ఇన్ని దినముల పాటునకు పొలమునం దవకాశము లేనిచో, ముందు తెలుపబడు నేవైన యుపవృత్తులందు వినియోగించి యందు వలన రాబడిని భర్తీచేసికొన వీలగును.

**13వ పట్టిక ఆయాతరగతుల కర్షకుల కుటుంబాదాయం**

| కర్షకుని తరగతి | వర్షాధారపు రేవడి యొ 24 లు | ఎర్ర చెక్కనేల | డెల్టా భూమి |
|---|---|---|---|
| | రు | రు | రు |
| 1. కౌలుకు తీసికొని కూలివాండ్రచే పనిచేయించు పెట్టుబడిదారు (12 వ పట్టికలో చూపబడినట్లు | 30.6 | 28.0 | 51 2 |
| 2. కౌలుకుతీసికొని స్వయముగ పనిచేయు కర్షకునకు | 278.1 | 275 5 | 298.7 |
| 3. స్వంతభూమిని కూలీలచే సాగుచేయించు కర్షకుడు | 126.6 | 115.00 | 441.2 |
| 4. స్వంతభూమిని స్వయముగ పాటుబడి సాగు చేయు కర్షకుడు | 374.1 | 362.5 | 680.7 |

పైని తెలుపబడిన కుటుంబాదాయములనుబట్టి కుటుంబమునకు కనీసము వలయు రు 240 ల ఆదాయము లభించుటకు ఏ తరగతి కర్షకు డెంతభూమిని సాగుచేయవలసి యుండునో ఈ క్రింద లెక్క కట్టబడెను.

**14 వ పట్టిక**

ఆయా తరగతుల కుటుంబజీవనమునకు సాగుచేయబడవలయు కనీసపు విస్తీర్ణము.

| కర్షకుని తరగతి | వర్షాధారపు కృష్ణరేవడి | ఎర్ర చెక్కనేల | డెల్టా భూమి |
|---|---|---|---|
| 1. శిస్తుకు తీసుకొని కూలీలను బెట్టి సాగుచేయించు కుటుంబము | 188 | 61.7 | 45.7 |
| 2. శిస్తుకు తీసికొని స్వయముగ పాటుపడు కుటుంబము | 21 | 6.3 | 7.9 |
| 3. స్వంతభూమి కూలీలను బెట్టి సాగు చేయించు కుటుంబము | 45 | 50.1 | 5.2 |
| 4. స్వంతభూమి స్వయముగ పాటుబడి సాగుచేయు కుటుంబము | 16 | 4.8 | 3.4 |

ఏ గ్రామమునసైనను అందలి భూమిని సాగుచేయుటవలన నెన్ని కుటుంబములు జీవింపవచ్చు నను విషయము, అందలి వ్యవసాయదారులలో పైనాల్గు తరగతులలో నెంద రేతరగతివారుగ నుందురో అను విషయమునుబట్టి యుండును. కృష్ణరేవడినేలలందు కర్షకులు చాలభాగము స్వయముగ పాటుబడువారైనకాని అచటి కర్షక

కుటుంబములకు తగినంత భూమి లభింపదు. డెల్టానేలలలో స్వంత భూమి గలిగి తాము పాటుపడకుండ కూలీలచే సాగుచేయు కర్షకులకు గూడ కొంత యవకాశము గలదు. కవులు భూమిని, కూలీలను పెట్టి సాగుచేయుట యెచటగాని భావ్యముకాదు. విశాఖపట్టణపు జిల్లా పరిస్థితులలో ప్రతి వేయిమంది వయస్కులు, అనగా ప్రతి 250 కుటుంబములలోను గ్రామములందు నివసించునవి 225 కుటుంబములుగదా! ఇందు ప్రస్తుతము సుమారు సగము కుటుంబములు 113 కర్షక కుటుంబములు. ఈకర్షక కుటుంబము లన్నింటికిని కుటుంబ

## 15-వ పట్టిక

ప్రస్తుతపు భూమిపంపకము అది యుండదగినరీతి.

| కర్షకుని తరగతి | ప్రస్తుతపు పంపకము * | | ఉండవలసిన రీతిని పంపకము | | |
|---|---|---|---|---|---|
| | కుటుంబముల సంఖ్య | ఎకరముల విస్తీర్ణము | కుటుంబముల సంఖ్య | కమతముల సంఖ్య | ఎకరముల విస్తీర్ణము |
| 1. స్వంతభూమిని స్వయముగ సాగుచేయువారు 10 ఎకరములకు పైగా గలవారు | 4 | 45 | 4 | 4 | 45 |
| 2. డిటో 5-10 ఎకరములవరకు గలవారు | 15 | 90 | 15 | 11 | 90 |
| 3. డిటో 2-5 ఎకరములు గలవారు | 21 | 51 | | | |
| 4. డిటో 1-2 ఎకరములు గలవారు | 9 | 12 | | | |
| 5. స్వంతభూమిని కూలీలచే సాగు చేయించువారు 15 ఎకరములకు హెచ్చుగలవారు | 10 | 182 | 31 | 10 | 245 |
| 6. సిస్తుభూమిని స్వయముగ సాగుచేయువారు 7 ఎకరములకు పైగా గలవారు | 30 | 236 | | | |
| 7. సిస్తుభూమిని స్వయముగ సాగుచేయువారు 4-7 ఎకరములు గలవారు | 20 | 92 | 50 | 25 | 340 |
| 8. డిటో 4 ఎకరములకు లోపుగ గలవారు | 4 | 12 | | | |
| | 113 | 720 | 100 | 50 | 720 |

* ఈ కలములలోని యంకెలు ఉదాహరణకొరకు అవలంబింపబడెను. ఆయా గ్రామములందలి పంపకము వేర్వేరుగ నుండవచ్చును.

మునకు వలయు కనీసపు ఆదాయము (రు 240) వ్యవసాయమువలననే లభించుటలేదు. ఇందు సుమారు సగముమందికి మాత్రమే కనీసపు జీవితాదాయము నిచ్చునంత భూమి లభించుచున్నది.

ప్రస్తుతము లభించు భూమితో నిప్పటి కర్షక కుటుంబము లన్నిటికిని కనీసము జీవితాదాయము లభించుటకు వీలుపడదు. కావున విశాఖపట్టణపుజిల్లా పరిస్థితులలోని గ్రామములందు ప్రతి 225 కుటుంబములకును 100 కుటుంబములు మాత్రమే కర్షకులుగ నుండుటకే ప్రణాళికయందు ఏర్పాటు కావలెను. తక్కినవారికి ముందు తెలుపబడున ట్లితరవృత్తులు కల్పింపదగును. ఈ నూరు కుటుంబములలోను కొన్నిటికి వారల కనీసజీవితాదాయము నొసగు భూమికంటె హెచ్చుభూమి గలవా రుందురు. తక్కువ భూమిగలవారు పాలికాపులను బెట్టి తమ భూమిని సాగుచేయు కర్షకులతో కలిసి జాయంటుగా వ్యవసాయము చేయుచో తమ స్వల్పభూమినుండి వచ్చు ఆదాయము తమ యదనపుపాలునకు ప్రతిఫలముగా లభించు ద్రవ్యమునకు తోడై కుటుంబజీవనము జరుపుకొనుటకు వీలేర్పడును. విశాఖపట్టణపుజిల్లాలో ప్రతి వేయిమంది వయస్కులకును గల 720 ఎకరముల భూమియు, దాని నిపుడు సాగుచేయుచున్న 113 కర్షకులకు పైని వ్రాయబడినట్లు వానిని సాగుచేయదగు 100 మంది కర్షకులకును ఎట్లు పంపకము కాదగునో క్రిందిపట్టికయందలి 2, 3 కలములలో జూపబడినట్లు పంపకమైయుండుచో ఎన్నికమతములుగ నుండదగునో 15-వ పట్టికలో తెలుపబడినది.

పై పట్టికలో సూచింపబడిన ప్రకారము మొత్తపు వ్యవసాయదారులసంఖ్య 113 నుండి 100 కి తగ్గవలసియుండును. కావున శిస్తుకు భూమిని సాగుచేయు 54 రు రైతులలో 50 మంది మాత్రము ఆ 54 రును సాగుచేయు 340 యెకరముల భూమిని సాగుచేయుచుండవలెను. 4 ఎకరముల లోపుగ సాగుచేయు తక్కిన నలుగురు రైతులును ఇతరవృత్తుల నవలంబింపవలసి యుందురు. రెండెకరములకన్న తక్కువగ గల స్వంతభూమిని సాగుచేయు 9 గురు కూడ నిట్లే యితరవృత్తుల నవలంబించి తమ భూముల నమ్ముకొనుటగాని, యితరులకు కౌలుకిచ్చుటగాని మంచిది. 2-5 ఎకరముల సాగుచేయు 21 మందియు స్వంతభూమిని పాలికాపులచే సాగుచేయువారితో తమ భూములకు చేర్చికొని భాగస్వాములుగ జేరుట మంచిది. మొత్తముమీద నిపుడు వేరువేరు కమతములుగ సాగుచేయు 113 లలో నూరుమంది మొత్తపు భూమి నంతటిని 50 కమతములుగ సాగుచేయుచో తక్కువవ్యయముతో హెచ్చులాభమును దీయవచ్చును. ఇట్లు కమతముల సంఖ్య తగ్గుచో దుక్కి పశువుల సంఖ్యనుకూడ తగ్గించుకొని వానికి పెట్టు మేతతో పాడిపశువుల సంఖ్యను, దూడల సంఖ్యను హెచ్చింపవచ్చును. అందువలన పశువుల లెక్క నష్టమును చూపుటకు బదులు లాభమునే కనపరచును.

వ్యవసాయదారు డవలంబించదగిన యభివృద్ధి విధానము లిదివరలో నచటచట సూచింపబడెను. ఏ గ్రామమున కా గ్రామము నవ

## 16-వ పట్టిక-ఇతరవృత్తుల విభజన

| A కుటుంబ వృత్తులు | వీరలందరికి పనిదొరకుటకు వలయు కుటుంబముల సంఖ్య | వలయుపాటు పురుషులు | వలయుపాటు స్త్రీలు | మొత్తపు రాబడి | కుటుంబమునకు 1-కి రాబడి |
|---|---|---|---|---|---|
| 1. మేకలు, గొర్రెలు మేపుట (a) | 4 | 4 | 4 | 1000 | 250 |
| 2. నూనె (గానుగ) పరిశ్రమ (b) | 4 | 4 | 4 | 1088 | 272 |
| 3. తినుబండారపు వస్తువుల తయారు విక్రయం | 1 | 1 | 2 | 300 | 300 |
| 4. దంపుడు బియ్యపు వ్యాపారము (c) | 2 | 2 | 0 | 550 | 250 |
| 5. తాటి,ఈతచెట్లగీత, బెల్లపువంట (d) | 3 | 3 | 6 | 765 | 253 |
| 6. దూదియేకుట, ఏకులు చేయుట (e) | 4 | 4 | 8 | 1060 | 253 |
| 7. బట్టలనేత (f) | 14 | 14 | 42 | 3375 | 241 |
| 8. బట్టల కుట్టు | 1 | 1 | - | 250 | 250 |
| 9. కుమ్మరి | 1 | 1 | 2 | 250 | 250 |
| 10. తాపీపని (మగవానికి పనియుండును) | 1 | 1 | - | 188 | 188 |
| 11. తట్టల అల్లిక (g) | 1 | 1 | 1 | 160 | 160 |
| 12. కాగితముల చేత | 1 | 1 | 1 | 240 | 240 |
| 13. సున్నపురాళ్లి,లేక గుల్లకాల్పు (h) | 1 | 1 | 1 | 200 | 200 |
| 14. తోటపని (i) | 2 | 2 | 2 | 400 | 400 |
| తాటిఆకు,తుంగ వగైరా చాపలు,బుట్టలు అల్లుట | | | | | |
| 15. వడ్రం, కమ్మరం, క్రరసామానులతయారు | 3 | 3 | 3 | 900 | 300 |
| 16. చీనా రేకు పని, సైకల్ మరమ్మతులు | 1 | 1 | 1 | 240 | 240 |
| 17. రాగి, ఇత్తడి కంచుపాత్రల పని, | 1 | 1 | 1 | 240 | 240 |
| 18. బంగారపు పని, వెండిపని గడియారపు మరమ్మతు | 1 | 1 | 1 | 300 | 300 |
| 19. చాకలిపని (j) | 4 | 4 | 8 | 1050 | 250 |
| 20. మంగలిపని (k) | 4 | 4 | - | 750 | 188 |
| 21. బండ్లను అద్దెకు తోలుట (l) | 5 | 5 | 5 | 1000 | 250 |
| 22. తాటియేచల వ్యాపారము [ములు | 2 | 2 | 4 | 500 | 250 |
| 23. కిరాణా దుకాణ | 3 | 3 | 3 | 1125 | 375 |
| 24. కూరలు, పండ్లు, చేపలు అమ్మకం (m) | 3 | 3 | - | 750 | 250 |
| 25. గ్రామసిబ్బంది(n) | 8 | 8 | - | 2000 | 250 |
| మొత్తము | 75 | 75 | 99 | 18881 | |

ఒక్కొక్క మనిషికి సాలున 300 రోజుల పని చొప్పున

లంబింపదగిన యభివృద్ధివిధానములు వ్యవసాయ శాఖవారి సలహాతో కర్షకుల యనుభవమును మేళవించి నిర్ణయించుకొనదగును, అవలంబింపదగిన ముఖ్యవిధానములలో నుంచి పంగడేముల విత్తుల నుపయోగించుట, ఎరువును కూడబెట్టుటలో శ్రద్ధవహించుట, పసువుల మేత సస్యములను పెంచుట, పసువుల మేపుటలో శాస్త్రీయవిధానము నవలంబించుట నూతులను వానిక్రింగి సాగును వృద్ధిచేయుటయు నైయున్నది.

## V గ్రామమునందలి ప్రజల యితర వృత్తులు

పైని సూచింపబడినట్లు గ్రామములందు నివసించు ప్రతి 900మంది వయస్కులు, లేక 225 కుటుంబములలోను 100 కుటుంబములు మాత్రము వ్యవసాయమునే వృత్తిగాగలిగియుండుచో తక్కిన 125 కుటుంబములకును. జీవితములను సౌఖ్యముగ గడపుటకు తగిన వృత్తులను గల్పింపవలసియుండును.

విశాఖపట్టణపు జిల్లాలో నీ వృత్తి విభజన మీ క్రింది రీతిగ నుండదగియుండును.

వరా:—(a) ఈ జిల్లాలో ఇదివరలో వ్రాయబడినట్లు ప్రతి వేయిమంది వయస్కులకును 450 కంటె హెచ్చు మేకలను గొర్రెలను మేప వీలుపడదు. వీనిని మేపుటకు 4 కుటుంబములు చాలును. వీరలకు మంద కట్టుటవలన 180 రోజులకు రోజు 1 కి నూటకి 8 అణాల చొ॥ రు 405 లును, తక్కిన రోజులలో తయారగు ఎరువు 90 బండ్లకు రు 113 లును, జంతువుల అమ్మకము వలన రు 450 లును, పాల అమ్మకమువలన రు 45 రూపాయిలు మొత్తము రు 1000 లు లభించును.

(b) నూనెగానుగ పరిశ్రమ:—గాను గాడవలసిన 71 టన్నుల చమురుగింజలకు దినమునకు 140 సే. చొ॥ ఆడుచో 4 గానుగులకు సాలుకు సుమారు 200 రోజులు పనియుండును. గానుగ 1 కి దినమునకు 15 అణాల చొ॥ మొత్తపు ఆదాయము రు 1000 లు వచ్చును.

(c) 230 టన్నుల ధాన్యము, లేక 3000 బస్తాల ధాన్యము నుండి 2000 బస్తాల బియ్యమును దంచూరు చేయించి విక్రయించుటకు బియ్యపు బస్తా 1 కి పెట్టుబడిపై వడ్డీ వగైరాలుగాక 4 అణాలు లాభము చొప్పున రు 500 లు.

(d) 3 కుటుంబములు:— 30 రోజులు గీత రోజు 1 కి గీత రోజు 1 కి 12 అణాల చొ॥ 3 రు కుటుంబములకు రు 675 లు తాటిఆకు కుట్టు వగైరాలు...90-765.

(e) ఇందుకు 4 కుటుంబము లుండవలెను. 2 వ పట్టికలో అంచనా ప్రకారం కావలసిన ప్రత్తి $10\frac{1}{2}$ టన్నులలో నాల్గవవంతు అనగా 25 టన్నుల దూదిని ఏకుటకు మణుగు 1 కి 4 రూపాయల చొ॥ 940 రూపాయిలును, పరుపులు కుట్టుట వగైరా యితర పనుల వలన రు 120 లును మొత్తం రు 1060 లు.

(f) ఇందుకు 14 కుటుంబములు కావలెను. నేయవలసిన 18000 గజములకు గజము 1 కి 3 అణాల చొ॥ రు 3375 లు వచ్చును.

(g) ఈ కుటుంబము పందులను పెంచుట వలన కొంత ఆదాయము సంపాదించవచ్చును.

(h) ఈ కుటుంబము కొంతకాలము ఇతరపనులు చేసి కొంత సొమ్ము సార్జింతురు

(i) ఈ కుటుంబము మాంస విక్రయమువలన కొంత సంపాదింతురు.

(j) గ్రామములోనుండలి 225 కుటుంబములకు కుటుంబము 1 కి రు. 30 చొ॥ రు 775 లు బట్టలకు రంగువేతవలన రు 225 లు మొత్తం రు 1000 లు.

(k) 225 కుటుంబములకు కుటుంబము 1 కి రు 2 ల చొ॥ రు 450 సంవత్సరాలయి వగైరా లవలన. రు. 300-750 లు

ఆడువాండ్రు కూలిపనివలన మరికొంత సంపాదింతురు.

(l) 2 ఒంటెద్దు బండ్లు, 2 ఒంటెద్దుల బళ్లు, 1 జట్కా.

(m) కొన్ని కుటుంబములు కూలి వగైరాలు యితరపనివలన కొంత సంపాదింతురు.

(n) కరణము, మునసబు, ఇద్దరు ఉపాధ్యాయులు, ఒక పోస్టు మాష్టరు, ఒక గ్రామపురోహితుడు-ఇద్దరు గ్రామసౌకర్లు, గ్రామసేవకుల కుటుంబములు కూలిపనివలన కొంత గడింతురు. వ్యవసాయపు కుటుంబములు 100 నుగాక పై పట్టిక ప్రకారము గ్రామోద్యోగులను సమకూర్చుటలో 75 కుటుంబములకు పని దొరకును. 175 కుటుంబములనుగాక తక్కిన 50 కుటుంబములలోను 38 కుటుంబములు గ్రామము నుండి ఈ ప్రణాళికయైన వ్యవసాయము, లేక యితర కూలిపనివలన జీవించుట కవకాశము కలుగు. తక్కిన 12 కుటుంబములును పట్టణములకును, నగరములకును బోయి నూతన ప్రణాళికలు చేయబడు పెద్ద పరిశ్రమలందును, కొలువులందును పని జీవింపవలసియుందురు.

17—వ పట్టిక

| | మగవాండ్రు | ఆడవాండ్రు |
|---|---|---|
| 1. వ్యవసాయపు కూలి 55 పట్టికలోని ప్రకారము 6-వ పట్టికలోని సస్యములను సాగుచేయుటకు కలయుపాటులో సొంతదార్ల పని పోగా | 25 | 75 |
| 2. భూమి మరమ్మతులు, ఇండ్ల నిర్మాణము, మరమ్మతులు, రోడ్లు, చెరువులు, కొల్వలు మరమ్మతులు వగైరా | 19 | 13 |
| | 44 | 88 |

పైపట్టిక ప్రకారము కూలిపనివలననే జీవింపవలసిన 38 కుటుంబములలోను ఒక్కొక్క మగవానికిని, ఒక్కొక్క ఆడుదానికిని మాత్రమే గాక పైగా యితరవృత్తి లవలంబించువారలలో ఆదాయము చాలని 6 గురు మగవాండ్రకును 12 గురు ఆడువాండ్రులేక పిల్లలకును కూలి లభించును.

ఇదిగాక వ్యవసాయదారులును ఇతరవృత్తులవారును తీరిక సమయమున, నవలంబింపదగిన ఉపవృత్తులు ఈ క్రింద తెలుపబడినవి.

18—వ పట్టిక

| ఉపవృత్తులు | ఉపవృత్తులు పాటు | | రాబడి |
|---|---|---|---|
| | మగవాండ్రు | ఆడువాండ్రు లేక పిల్లలు | |
| 1. పాడిపరిశ్రమ | | 6 | 450 |
| 2. తేనెటీగలను పెంచుట | | 2 | 240 |
| 3. కోళ్ల పెంపకము | | 6 | 360 |
| 4. ప్రత్తిపట్టుట | | 14 | 840 |
| 5. నూలు వడుకుట (ఈ పని ప్రతి మనిషియు తీరిక కాలమున చేయనగును) | | 112 | 6300 |
| 6. నులకత్రాళ్లను నేయుట | 4 | — | 470 |
| 7. వడ్డీ వ్యాపారము | 5 | — | 600 |
| 8. పశువుల బేరము | 1 | — | 120 |
| 9. తోటల గుత్త | 3 | — | 360 |
| 10. బియ్యపు దంపు | 6 | 6 | 1125 |
| | 19 | 146 | :0845 |

మొత్తము మీద 213 కుటుంబములకును గలుగు పాటును, అందువలన గలుగు ఆదాయము ఈ క్రింద 19, 20 వ పట్టికలలో తెలుపబడెను.

19 వ పట్టిక

213 కుటుంబములకు గలుగు పాటు వివరములు

| | పాటు | |
|---|---|---|
| | మగవాండ్లు | ఆడువాండ్రు లేక పిల్లలు |
| వ్యవసాయ కుటుంబముల పాటు | 75 | 175 |
| ఇతరవృత్తులవారి పాటు | 75 | 99 |
| ఉపవృత్తులవలనిపాటు (నూలు వడకుట మినహా) | 19 | 34 |
| కూలివాండ్రపాటు | 44 | 91 |
| | 213 | 399 |

ఇట్లు గ్రామమునందలి 213 కుటుంబములందును పనిచేయ గలుగువారలకు కొంచెమించు అందరికిని పని గలిగియుండును. ఇది గాక తక్కినవారిలో గొందరికి నూలు వడకుట గూడ ఉండును.

స్వయంసమృద్ధ విధానముల ననుసరించి మాదిరికొరకు తయారు చేయబడిన యీ ప్రణాళికలో సూచింపబడిన విధానమునే గ్రామ మున కాగ్రామమునకు అచటి పరిస్థితుల ననుసరించి తయారుచేయ బడవలెను. వ్యవసాయ ప్రణాళికయే గాక వృత్తివిభజనము గూడ ఆ యా గ్రామములందలి పరిస్థితుల ననుసరించి యుం డును. రాయలసీమ జిల్లాలలో వ్యవసాయపు పాటు హెచ్చుగా వలసియుండును. తాటిచెట్లు లేకపోవుటచే దానికి సంబంధిం చిన పరిశ్రమలకుగాని, వడ్లు పండక పోవుట చే దంపుడు బియ్యపు పరిశ్రమకుగాని అవకాశము లేదు. కాని. ప్రత్తికి, వేరు సెనగకు సంబంధించిన పరిశ్రమ హెచ్చుగ నుండును. ఇట్టే డెల్టాలో

### 20 వ పట్టిక

[illegible] కుటుంబముల ఆదాయపు వివరములు

| | మొత్తపు ఆదాయం | కుటుంబము 1-కి |
|---|---|---|
| [illegible] ఆదాయము రు | 2799 | |
| [illegible] | 8700 | |
| [illegible] (75 [illegible] రు 112-8-0 [illegible] 75 [illegible] రు 75 [illegible] 100 [illegible] 600 [illegible]) | 20067 | |
| మొత్తపు [illegible] కుటుంబములు 100-కి | 31566 | 316 |
| [illegible] వృత్తులవారి [illegible] 75 కుటుంబములకు | 18881 | 252 |
| కూలిపనివారల రాబడి (44 + 6 కుటుంబములకు) | 11542 | 262 |
| ఉపవృత్తులవలన రాబడి | 10945 | ... |
| మొత్తము 213 కుటుంబములకు | 72934 | 342 |

[illegible] కావలసి [illegible] విషయము [illegible] వృత్తుల [illegible] మంచును.

మొత్తము మీద దేశమున నున్న జన సంఖ్యయొక్క వృత్తి విభాగము నొందవలెను.

### 21 వ పట్టిక

దేశపు మొత్తము ప్రజల వృత్తి విభజనము

| | ఉండవలసినరీతి | ఇంగువున్న రీతి |
|---|---|---|
| గ్రామ ప్రజలు కర్షకులు | 40% | 45 |
| ఇతర వృత్తులవారు | 30% | 20 |
| కూలీలు | 15% | 25 |
| మొత్తపు గ్రామ ప్రజలు | 85% | 90 |
| పట్టణ ప్రజలు, పెద్ద పరిశ్రమలవారు | 15% | 10 |
| మొత్తము | 100% | 100% |

ఇంతవరకు స్వయం సమృద్ధ విధానము ననుసరించి గ్రామ ముందలి ప్రజలు వృత్తి విభజన గావించబడి గ్రామ మొత్తముపై నున్న కుటుంబములకు సుఖజీవనము గడుపుటకు అవలంబించవలసిన ప్రణాళికను తయారుచేయుటను గురించి మాత్రమే వ్రాయబడెను. గ్రామ ప్రజల యైశ్వర్యాభివృద్ధికి అవలంబింపవలసిన విషయములలో సహకార సంఘాల రేర్పాటు చేయుటకు ప్రతి కుటుంబమును కొంత ద్రవ్యమును ప్రతిసేట జేయుట మొదలగు ఆర్థిక విషయములను గురించి గాని ఆరోగ్య విషయములను గురించిగాని, సంస్కృతిని పెంపొందించు విషయములను గురించి గాని ప్రణాళికను తయారుచేయు విధానములు సూచింపబడలేదు. ఈ వ్యాస మింతవరకే కడు దీర్ఘమగుటచే నీవిషయములను గురించిన ప్రణాళికను ముందు తయారుచేయబడవలసియున్నది.



Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras.

